# మృత్యువు నీడల్లో



★

రచన:

మహీధర రామమోహనరావు.



అవంతీ ప్రచురణలు,

434 A - 27 ప్రజాశక్తినగరు,

విజయవాడ - 2.

1

# ఒకటో ప్రకరణం

చేనిమూలలో పోగవేసిన పేడరాశిమీద తట్టని విసిరికొట్టి మహాలక్ష్మమ్మ కొడుకు పేర్చుస్తున్న గూడుపేపు కదిలింది. తనరాక అలికిడి తగిలి, అంత పక్కగా కొడుకుదగ్గిరనేవున్న వారెవరో హడావిడిగా వెళ్ళిపోతున్నట్టని పించింది. మాట స్పష్టంగా తెలియలేదు గాని "రాత్రి వస్తావుకదూ". అన్నట్టు వినిపించింది. అదేదో సంకేతంలావుంది. తన అనుమానం నిజమేనన్నమాట అనుకొంది. అయినా ఆ మనిషి తాను అనుకొంటున్న దేనా యని అనుమానం కలిగింది. గొంతుక ఆమెదికాదు. పక్కనున్న జొన్నచేనిలో కనుమరుగవుతున్న మనిషి ఎవరో అర్థంకాలేదు. మని షెక్కువదేచి పరికాయించింది. తెల్లగళ్ళ ఎర్రరుమాలు కట్టిన తలపాగా: ఆ పాగాక్రింద తల ఎవరిదో అర్థంకాలేదు. ఎవ్వరయినా ఆడదిమాత్రం కాదని అర్థంఅయింది. వారంరోజులుగా మనస్సును బాధిస్తున్న సందేహం తీరకపోయినా తాత్కాలికంగా మనస్సంతృప్తి కలిగింది.

అఖరుకొడుకు భాగ్యారెడ్డి అంటే మహాలక్ష్మమ్మకు ఎంతో ప్రేమ. ఆతడీమధ్య చాకలి మంగమ్మతో గుసగుసలు పోతున్నాడని వినిపెట్టింది. తన ప్రాణంతో ప్రాణంగా పెంచిన కొడుకు కొరివిపెట్టి తల గోక్కొం టున్నాడని భయపడింది. వ్యభిచారానికిదిగేదే యనే బాధకన్న మంగమ్మ పాదసిరి మంచిది కాదని ఆమెభయం. కాపురానికొచ్చిన ఏడాదిలోనే మొగణ్ణి పొట్టని పెట్టుకొంది. పోలీసులు కొట్టి చంపేసిన్నమాటేగాని అస

దాని అదృష్టంవుంటే పద్దాలుకి— అదే ఆమె మగడిపేరు— సంగంలో చేరాలనేబుద్ధి ఎందుకొస్తుందని మహాలక్ష్మమ్మ నమ్మకం. దాని వెంట బడ్డ సర్కిల్ ఇనస్పెక్టర్ రామిరెడ్డి కాపురం బుగ్గయిపోయింది. మగడూ పెళ్ళాం దెబ్బలాడుకొంటేమాత్రం అన్ని సంసారాలూ ఇల్లా పాడవుతున్నాయా? ఒక్కొక్క ఆడదాని పాదసిరి...అనిపించింది. బొబ్బిలికథలో మల్లమ్మ మాటలు అడుగడుగునా గుర్తొచ్చి వొణికిపోయింది.

"నీదెంత సిరిగల పాదమే మాయమ్మా!"

తుడుపుకాళ్ళ తల్లి అని తిట్టుకుంది. కాని ఆమెను ఏమి అనడానికి ధైర్యం చాలలేదు. తన కూతురు వియ్యమ్మ ఇంటికితెస్తున్న అప్రతిష్ఠ ఆమెనోటిని కుట్టేస్తూంది. ఒకరిని అనడంకన్న తన కొడుకుని జాగ్రత్త చేసుకోవడం బుద్ధి. ఒంటరిది; వయసులోవుంది; మగాడి వెంటబడిందంటే ఆశ్చర్యం ఏమిటనిపించింది. ఆమె కళ్ళు చెదిరిపోయేటంత మగసిరి తన కొడుకులో వున్నందుకు ఒకవిధంగా గర్వమే అనిపించినా, తన కొడుకు ఆ ఊలాడించినట్లున్న గంట్లమొగంలో ఏం చూచి వలిచేదో. భాగ్యరెడ్డి కింట్లో గుర్రంలాంటి పెళ్ళాంవుంది. చక్కనిచుక్క. అయినా కొడుక్కి ఈ దుర్బుద్ధిఏమిటి? మంగమ్మమీది కోపం కోడలిమీదికి తిరి గింది. మగణ్ణి కట్టుకోలేని ఆడది ఏం మనిషి అనుకొంది. పైగా ఆమె వుండగనే వాళ్ళు మాట్లాడుకొంటున్నారుకూడా. జాగ్రత్తగా వుండవే తల్లీ అని చెప్దామంటే కాపురం కాస్తా అల్లరిలో పడుతుందేమోననుకొని ఆమాట అనలేకపోయింది. ఇంక తానే ఆ కాపురం కాపాడ్డానికి పూను కొంది. రాత్రీ పగలూ కాపలా వేసింది.

* * * *

అస్సు రుస్సుఅంటూ చదికిలబడ్డ తల్లిని భాగ్యరెడ్డి సానుభూతిగా పలకరించేడు. "నీ కెందుకమ్మా ఈ శ్రమ?" అని సలహాఇచ్చేడు.

సమాధానంగా మహాలక్ష్మమ్మ సుదీర్ఘంగా నిట్టూర్చింది.

"కోడళ్ళేరి?"

ఆ బహువచనానికి ప్రయోజనం లేదు. ఓ అన్న పెళ్ళాం పురిటి పొద్దులది. మరొకాయన భార్య పుట్టింటి కెళ్ళింది. మరొకాయనకు భార్య లేదు. ఇంక వున్నదల్లా తనభార్యే. ఆ సంగతి తెలుసు. అయినా ఆమె రాలేదేమని అడగడానికి సిగ్గేసింది. తన భార్యని అడిగినట్లు కనిపించ కుండేందుకు బహువచనంలో అడిగేడు. కోడళ్ళమాట వచ్చేక మహాలక్ష్మమ్మ గృహచ్ఛిద్రాలన్నీ తలుచుకోకుండా వుండలేక పోయింది.

కోడళ్ళ స్వభావాలూ, ఇంట్లో గొడవలూ ఏకరువుపెట్టి ఆఖరు కోడలు బుద్ధిమంతుతనాన్ని మెచ్చుకొంటూంటే భాగ్యారెడ్డి పక్కున నవ్వేడు.

రోజూ ఇంట్లోజరిగే పేచీలను అతడు ఎరక్కపోలేదు. నిన్న రాత్రే తన భార్య గోలపెడుతూ చెప్పింది. ప్రొద్దున్న పంచినసరుకు సాయంకాలం వరకూ ఎత్తలేవంది. పొలాల వుద్దారుతో తల్లిని పోల్చింది. ఎండవేళ దాహంవేసి నలుగురితో తానూ బావిదగ్గరకెళ్ళింది. బావి కెళ్ళడం తన తప్పయిపోయిందంది. గూడుదగ్గర కుండలో నీళ్ళుండగా నూతి కెందుకెళ్ళేవని కోడంట్రికం. నే నేం కూలిదాన్నా. వెట్టికొచ్చేనా అని ఏడ్చింది.

తరుచుగా తల్లికూడా ఆలాగే ప్రశ్నిస్తూంటుంది. సంసారం తమ దనుకోరు కోడళ్ళంటుంది. ఏదో కూలికి వచ్చినట్లో వెట్టిచేస్తున్నట్లో చేస్తారు గాని మనదనుకోరని ఆమె బాధ.

ఇద్దరినీ వూరుకోబెట్టడానికి ఇదివరలో అతను ప్రయత్నించేడు. ఆ ప్రయత్నంలో ఇద్దరిచేతా చీవాట్లుతిన్నాడు.

"అప్రయోజక విసర్జనం—కుంటికోనమ్మ దర్శనం" అంటూ సంధి నాంచారమ్మదగ్గర పెట్టుబడ్డ శ్లోకాన్ని మహాలక్ష్మమ్మ చదివింది.

"పేలరాకపోతే ఊరుకో" అని వదినగారు గదమాయించింది.

తన నీ యింట్లో పడేసిన తల్లినీ, తండ్రినీ, తనను పుట్టించిన దేవుణ్ణీ— తన జన్మకారణం ఆమె ఆలోచన ప్రకారం దేవుడే— వరసపెట్టి తిట్టిపోసింది రెండో వదినగారు.

తన భార్య దగ్గరకూడా అటువంటి అనుభవం అంతే. కొత్తగా కాపు రానికి రావడంచేత బయటపడి గబగబ లాపించలేకపోయినా తనకి మాత్రమే వినిపించేలాగ రహస్యంగా ఏకరువపెట్టింది. గట్టిగా ఎదుర్కొం టుందా, మామగారి చెవిని పడుతుంది. ఆయనకు అక్కర్లేనిది లేదని ఆమె అభిప్రాయం. అందుచేత గదిలోకి పిలిచి మరీ చీవాట్లుపెట్టింది. భర్తకున్న మదుమదనపు అవసరాల తీవ్రత తనకు శ్రీరామరక్ష యని ఆమె కాపురానికి వచ్చిన మొదటిరోజునే కనిపెట్టేసింది. తన బలహీనత గుర్తించిన భాగ్యరెడ్డికూడా వెర్రిమొహంవేసి పక్కపక్కగా తప్పు కొన్నాడు.

తల్లి తన భార్య బుద్ధిమంతుతనాన్ని అభినందిస్తూంటే ఆ కథ లన్నీ గుర్తొచ్చి భాగ్యరెడ్డి పక పకా నవ్వాడు. ఆ నవ్వు అంతర్యాన్ని మహాలక్ష్మమ్మకూడా గ్రహించింది. మృదువుగా ఛూత్కరించింది.

"పోరా, సిగ్గుమాలినవాడా"

ఆ సమయాన్నుపయోగించుకొని భార్య తరఫున కొంచెం వకాల్తా నడపాలనుకొన్నాడు.

"మంచినీళ్ళకి నలుగురితో నూతికెడితే నిన్నంత రభసచే సెందుకమ్మా?"

తన ప్రశ్నకొచ్చిన సమాధానం విన్నాక తనకు ప్రపంచజ్ఞానం ఏమాత్రంలేదని గ్రహించేడు.

"అప్పుడే ఫిర్యాదుకూడా చేసింది."

మహాలక్ష్మమ్మకు కోడలిమీద మహాకోపం వచ్చింది. ఆమాట తెచ్చి తన్ను అడగడమా యని అహంకారపడింది. ఆకోపం, అహంకారంలో మిలమరించిన మిలమరింపులలో భాగ్యరెడ్డి కళ్లు చిక్కాయి. చాకలి మంగమ్మతో తాను సరసాలు సాగిస్తున్నాడన్న అనుమానం తల్లికి ఏర్పడిందని గ్రహించి విస్తుపోయేడు.

"మగణ్ణి చాకలి మంగమ్మ తప్పుచెప్పుకొన్నా, మంగలి పుల్లమ్మ తప్పుచెప్పుకొన్నా తనకి నష్టంగాని......"

తల్లి మాటలకు శాస్త్ర లడగట్టు వెయ్యాలని అనేకమార్లు ప్రయత్నించి భాగ్యరెడ్డి విఫలుడయ్యేడు. ఆవిడ అనుమానం అధారరహితమని వట్టినే చెప్పడంవలన ప్రయోజనం కలగదేమ. ఆ గుసగుసలకు మనేంవచ్చిందంటే? అసలు సంగతి బయటపెట్టాలి.

సంగం అన్నది తనకు కాదని తనయింట్లో అభిప్రాయం "ఏమి లేనివాళ్లేనా కావాలి, బాగా వున్నవాళ్లేనా కావాలి ఇల్లాంటి వ్యవహారాలు నెత్తినేసుకొనేటందుకు—" అన్నాడు తండ్రి ఓ రోజున. గవర్నమెంటుతో ఏదన్నా గొడవవస్తే లేనివాళ్ళదగ్గర వాళ్లు తీసుకొనేదేమిటి? బాగా వున్న వాళ్ళయితే ఇంతడబ్బు చల్లేసి బయటపడతారు. పలుకుబడి వుంటుంది. వాళ్ళనేంచెయ్యలేరు. ఎటొచ్చీ బాధ ఉండీలేనివాళ్ళకే. జైలులో పెడితే ఇంటిదగ్గర పనిజరిగే దారివుండదు. బస్తాడుగింజలు జప్తుచేస్తే ఆపూట గడిచే దారివుండదు. అందుచేత రాజకీయాలూ, సంఘాలూ మధ్యకుటుంబీకులకు పనికిరావని ఆయన నిర్ణయం.

తనతో చెప్పినమాట కాకపోయినా వారి అభిప్రాయం తెలిసేక భాగ్యరెడ్డి తాను సంగంలో చేరినట్లూ, దళంలో చేరినట్లూ చెప్పుకోడానికి సాహసించలేదు.

దళంలో చేరడానికి ఊళ్లోవున్న పడుచువాళ్ళందరికీ అనేక కారణాలచేత అవకాశం దొరకలేదు. కాని, చాలమందికి చేరలేకపోయామే యనే బాధవుంది. పోయి చేరాలనే ఉత్సాహమూవుంది. అల్లాంటివాళ్ళల్లో తానొకడు. తనకు కర్రసామూ, ఛడీ బాగా చేతనవును. తాను దళంలో సభ్యుడుగా లెక్కలో లేకపోయినా దానికి అత్యవసరమైన వాడుగా తయారయ్యేడు. తండ్రీ వాళ్ళూ ఒప్పుకోరు. కనక రహస్యంగా రాకపోకలు సాగిస్తున్నాడు.

ఇప్పుడు చాకలి మంగమ్మతో గుసగుసలకి కారణం చెప్పాలంటే తనకీ దళానికీవున్న సంబంధం బయటపడుతుంది.

తాను దళంలో చేరేడు. ఇంట్లోవాళ్ళకి ఆపని ఇష్టంలేదు గనుక మధ్యమధ్య అవసరం వొచ్చినప్పుడు కబుర్లు అందించవలసివస్తోంది. అనుమానం కలగకుండా ఆపని చేయడానికి చాకలి మంగమ్మ వార్తాహరురాలు.

ఈ విషయం కోడలికికూడా తెలుసునని విన్నప్పుడు మహాలక్ష్మమ్మ మ్రాన్పడిపోయింది.

ఆమెకు కొడుకుమీద కన్న కోడలిమీదనే కోపం వచ్చింది.

"ఎంతదయింది:"

తల్లి ఆశ్చర్యంనుంచి తేరుకోక పూర్వమే భాగ్యరెడ్డి తన కార్యక్రమమంతా చెప్పేసేడు.

రేపు ఘానుడిపేటలో పటేల్ మల్లారెడ్డి చేస్తున్న సత్యాగ్రహానికి ఇక్కడనుంచి ఇల్లాగేపోతానని చెప్తూంటే మహాలక్ష్మమ్మ నిర్వాక్కురాలయింది.

మీ నాన్న గుస్సా చేస్తాడన్నది తప్ప మరోమాట చెప్పలేక పోయింది.

ఇంట్లో గొడవలు వస్తాయనే భయంతోనే ఆలోచించనంతకు ఎదట పడలేకుండా వున్నాడు. మనస్సు ఎక్కడున్నా మామూలుగా పొలం పనులు చూస్తున్నాడు. ఇంటిపనులు చూస్తున్నాడు. ఎక్కడికేనా వెళు తున్నాడనే అనుమానమే కలగకుండా నడుచుకొంటున్నాడు. ఊరు దాటక తన మిత్రులతో పరుగెత్తి పోతున్నాడు. ఆ వూళ్ళోనే పొలాలు రెండు మూడు దిక్కులనుండడం ఆతని ప్రయత్నాలకు తోడ్పడుతూంది. ఎక్కు డన్నా తండ్రో, అన్నో తనకోసం వెతికితే వాళ్ళు చూసినచోట రెప్ప మిగిలిన ప్రాంతాలలో వున్నట్లు సున్నితంగా అబద్ధం ఆడేస్తున్నాడు.

దళం ప్రారంభం అయిన రోజుల్లో ఇంత అబద్ధం ఆడవలసిన పని వుండేదికాదు. పగలల్లా పనులు చేసుకొంటూ వుండేవాడు. రాత్రి సాము నేర్చుకోవడం, గస్తీవుండడం— ఇల్లాంటి పనులుండేవి. వూరు దాటక్కర్లేదు. కాని పటేల్ మల్లారెడ్డి సత్యాగ్రహానికి ఏర్పాట్లు ప్రారంభం కావడంతో ఊరుదాటి పనులు తగిలేయి. సత్యాగ్రహం జరగవలసిన ఘానుడిపేటవాళ్ళే తమవూళ్ళోకూడా దళాన్ని ఏర్పరచుకున్నారు. సత్యా గ్రహంగురించి చుట్టుపక్కల వూళ్ళల్లో ప్రచారంచెయ్యాలి. ఆరోజుకి జనాన్ని పోగుచేసి తీసుకొనిరావడానికి వంతులు వేసుకొన్నారు. ఈ పను లన్నీ తటస్థపడ్డది కొద్ది రోజులనుంచే, కనక గుట్టు చప్పుడు కాకుండా జరిగిపోతూంది. జరిగినన్నాళ్ళు జరగనివ్వాలనే వుద్దేశంతోనే రాత్రి పగలూ కదలడంలేదు, ఎంతో పనివున్నా.

కాని, ఇప్పుడింక బెదురెందుకు? తెలియకూడదను కొన్నదేదో తెలిసేపోయింది. ఇంక పనిచెరుపుకాడా ఎందుకు?

"మీ నాన్నతో చెప్పి పో."

ఆ సలహాని భాగ్యరెడ్డి చెవి సొకనియ్యలేదు. పోనీ ఇంటికొచ్చి బువ్వతిని పొమ్మంది తల్లి.

ఇప్పుడు ఇంటికి ఎందుకోసం వెళ్ళినా పెద్దరభస ప్రారంభం అవుతుంది. అక్కడకే పంపించమని చెప్పినా ప్రయోజనంలేదు. ఏపని మీదన్నా తండ్రో, అన్నో అటు వచ్చేలోపుస ఉడాయించెయ్యాలి.

ఉడాయించేడుకూడా.

"బువ్వకేంవొచ్చెలే. ఎక్కడో తింటాగా."

కొడుకు అదృశ్యం అయినవేపే చూస్తూ మహాలక్ష్మమ్మ వెనక నుంచి చాకలి మంగమ్మ రావడంకూడా గమనించలేదు.

# రెండో ప్రకరణం

చాకలిమంగమ్మ పలకరింపుతో మహాలక్ష్మమ్మ ఒక్కమారు భగ్గుమంది. మంగమ్మతో తనకు సంబంధం లేదని కొడుకుచెప్పిన సమాధానం ఆమెకు విశ్వాసం కలిగించలేదు. ఏ మగాడు, ఏ ఆడది మాత్రం తాను వ్యభిచరిస్తు న్నానని ఒప్పుకొంటారనేది ఆమెప్రశ్న. పడుచుతనంలో తన మగడు ఎవరింట్లోనో దూరితే ప్రాణావశిష్టంగా కొట్టేరు. అప్పటికీ ఇప్పటికీ ఆయన చెట్టుమీదినుంచి పడితే దెబ్బలు తగిలేయనే సమాధానం చెస్తాడు. రాత్రిపూట చెట్టెక్కవలసొచ్చింది? పడితే కాలో చెయ్యో విరగాలి, లేక పగలాలి గాని ఆ కర్రవాతలూ, కముకుదెబ్బలూ ఎందుకొచ్చేయి?— బోలెడుప్రశ్నలు వస్తాయి. ఆయనకా ఆలోచనేలేదు. అడిగినా బుకాయిం

# రెండో ప్రకరణము

చేదు. ఆ అనుభవంతో కొడుకు సమాధానంకూడా అల్లాంటి [illegible] గానే ఆమె జమకట్టింది. పెళ్ళాన్ని బుట్టలో పెట్టడానికి సం అడ్డు అనుకొంది.

కొడుకు చెప్పినప్పుడు కోడలుమీద కోపంవచ్చింది. మంగమ్మ కొడుకు పాకవద్ద కనబడగానే ఆమె ఆలోచనలు [illegible] మొదటిభయాలు మళ్ళీ తలెత్తేయి. తన దురదృష్టం ఊరందరికీ [illegible] చాలా? తన కొడుకును అంటుకొన్నదేగాక సంగంలోకి ఈడుస్తుంది కూడానాయని కసిపుట్టింది.

మహాలక్ష్మమ్మ తిడుతున్నది తననేయని మొదట మంగమ్మ వూహించలేదు. మహాలక్ష్మమ్మ చాలమేధకురాలనే పేరుంది. [illegible] తూలదు. పెట్టుపోతలలో ధారాళమైనచెయ్యి. కాని, ఆమె [illegible]గానే తిడుతూంది.

తర్వాత కొడుకు దళంలో చేరేడనే సంగతి తెలిసింద[illegible]. అదే తెలిస్తే తాను మధ్యన రాయబారాలు నడిపినట్లా [illegible]ది. అందుకే ఈకోపం అనుకొంది.

కాని, తనకూ భాగ్యరెడ్డికీ [illegible] పెడుతూందని అర్థ[illegible] ఆమెకు చాల కోపంవచ్చింది. మరొక మనిషైతే [illegible] చెప్పేదే; మహాలక్ష్మమ్మమీద ఆమెకు గౌరవంవుంది. రెండో[illegible] తమ దళంలో మంచి పేరు తెచ్చుకొంటున్న భాగ్యరెడ్డి [illegible].

నెమ్మదిగానే సమాధానం ఇచ్చింది.

"మాలో మారుమనువు తప్పువాదు దొరసానీ, [illegible]గా [illegible]గా ఏడవడం మా యిళ్ళల్లో అవసరంలేదు."

ఓనిమిషం ఆగి మళ్ళీఅంది.

"పెద్దలోగిళ్ళవాళ్ళకి ఏంచేసినా చెల్లుతుంది."

# మృత్యువు నీడల్లో

ఒ సాధారణమైన ఆమాటల్లో చాల తీవ్రమైననింద, ఎత్తిపొడుపు ద్రమ్మకి వినిపించేయి. పెద్దకూతురు వియ్యమ్మకథ దేశవ్యాప్తం. టలన్నా ఆ గాథలే ఎత్తిపొడుస్తున్నట్లు ఆమె అనుకొంటుంది.

మహాలక్ష్మమ్మ కళ్ళల్లో నీళ్ళుచూసి చాకలి మంగమ్మ చాల నొచ్చుది. ఏలా సర్దుకోవాలో అర్థంకాలేదు. ఖజానపున్న గుడ్డలమూట క్రింద పడేసుకొని కూర్చుంది. మాటలు మరిపించి మహాలక్ష్మమ్మను పూరుకోబెట్టడంకోసం చేలూ, పంటలూ, ఇల్లూ, చాకిరీ అనేకసంగతులు కదిపింది.

మహాలక్ష్మమ్మ దేనికీ సమాధానం ఇవ్వలేదు. మంగమ్మకి విసుపు వచ్చింది.

"ఇప్పుడు ఏమని ఏడిస్తే ఏం లాభం దొరసానీ."

మంగమ్మ వెళ్ళిపోయేక మహాలక్ష్మమ్మ తిన్నగా యింటికి పరుగెత్తింది. ఆమె మనస్సులో సుళ్ళు తిరుగుతున్న కోపం, అవమానం, అభిమానం, పెద్దరికం అన్నీ ఒక్కమారు శశిరేఖనెత్తిన బడిపోయేయి.

కొడుకు దళంలో చేరినట్లు ఇంట్లో తెలపకుండా దాస్తూనే, కోడలిని చీవాట్లు పెట్టాలని ఆమె ఆలోచన. ఎంత అమాయకురాలైన ఇల్లాలయినా కోడళ్ళనేసరికి ఒంటికాలిమీద భరతం ఆడుతుంది. నోట్లో నాలికలేదన్న మనిషికి కోడలిని చూసేసరికి నాలికమీద సరస్వతి ప్రళయ నృత్యం చేస్తుంది. మహాలక్ష్మమ్మ ఇందుకు భిన్నమేంకాదు.

శశిరేఖ కొంతసేపు ఓరిమిపట్టింది. తర్వాత నెమ్మదిగా ఒకటీ రెండు మాటలు సమాధానం ఇచ్చింది. నూటికి ఒకటే అయినా ఎదురు మాట వచ్చేసరికి మహాలక్ష్మమ్మ తన జాగ్రత్త మరచిపోయింది. ఆమె అంతవరకూ దాస్తున్నసంగతి కాస్తా క్షణంలో బయట పడిపోయింది.

భాగ్యరెడ్డి పోయి దళంలో చేరేడన్న వార్త వినగానే నరిసిరెడ్డి చరచరా వచ్చేడు. వియ్యమ్మ పరుగెత్తి వచ్చింది. పెద్దకోడలువచ్చి గుమ్మంలో నిల్చింది. అప్పుడే పొలంనుండివచ్చిన పెద్దకొడుకు కలుగ చేసుకోలేకా, వెనక్కి పోవడం ఇష్టంలేకా బుసలుకొడుతూ నిల్చున్నాడు. ఇంతమందిమధ్య ఏంచెప్పాలో అర్థంకాక శశిరేఖ నిలబడిపోయింది.

ఆమె నేరాలు బహుముఖాలు. అన్నింటికన్నా ముఖ్యమయినది దళంలో చేరేటందుకు మగనికామె అన్నివిధాలా తోడ్పడింది. వారికి మంగమ్మ కబుర్లు చేరేస్తూంటే ఊరుకొంది. ఒక్కొక్కప్పుడు ఆ కబుర్లు తానే అందించింది. పెందలకడనే బయటకి పోవాలనుకొంటే గప్‌చిప్‌గా గదిలో బువ్వపెట్టేసి సాగనంపింది. రాత్రి ఏవేళప్పుడొచ్చినా తలుపు తీసింది. ఓమారు దేనికో చందా కావలసివచ్చిందనుకొంటే తాను పుట్టింటినుంచి తెచ్చుకొన్నవి పదిరూపాయలు చేతిలో పెట్టింది.

నూరేసి ప్రశ్నలకి తాను ఇచ్చిన ఒకటీ, అరా సమాధానాలు ఈ విధంగా తనకే ఎదురు తిరిగి తననే నేరస్థురాలినిగా చేస్తూంటే శశిరేఖ స్తంభించిపోయింది.

అన్నీవిని నరిసిరెడ్డి అగ్గిపుంతయిపోయేడు.

"కష్టపడిపోతారని కడుపులో దాచుకుంటున్నందుకిది ఫలితం."

"వేరేపెట్టి నీ సంసారం నువ్వు చూచుకోమంటే తెలిసొస్తుం" దన్నాడు అన్నగారు.

"ఏం తిప్పలు వచ్చి చుట్టుకో బోతున్నాయో"— పెద్దకోడలు భగవంతుడినోమాటు స్మరించుకొంది.

నరిసిరెడ్డి తన ఆక్రోశాన్నంతనీ వెలిగక్కుతూ కుటుంబ బాధ్యతలు మీద పడెయ్యకపోతే కుర్రకారు చెప్పినమాట వినరని నీతి తేల్చేడు.

వియ్యమ్మ తండ్రిని వెంటనే బలపరిచింది. తన తమ్ముడు ఈ విధంగా దళాలనీ, సంఘాలనీ ఇంట్లోకి తెస్తూండగా చూస్తూ వూరు

కుంటే, ఇంటిపేరికీ మనకు కాస్త ఆసరాగావున్న పెద్దవాళ్ళని వ్యతిరేకం చేసుకొంటామని ఆమెబాధ. ఆ పెద్దవాళ్ళెవరో ఆమె నోటితో చెప్పలేకపోయినా అందరికీ అర్థం అయింది. ఖోటేజాన్ వచ్చి వెళ్ళిన రెండు మూడు రోజులదాకా వియ్యాప్మ దళాలూ, సంగం చేస్తున్న దుష్టు పనుల్ని తూర్పారబట్టడం, రజాకార్లు చేస్తున్న సాహసకృత్యాలూ, వారిని బలపరచడంవలన గవర్నమెంటునుంచి కలగగల లాభాలను వర్ణించడం వస్తే వింటున్నారు. ఈమధ్య గ్రామంలో దళం ఏర్పడ్డాక ఖోటేజాన్ ఇంటికి రావడానికి భయపడుతున్నాడు. ఆమె స్వేచ్ఛకు ప్రత్యక్షాటంకం దళంగా కనబడి ఆమె దానిమీద కక్ష నడుపుతూంది. ఇప్పుడు తన తమ్ముడే దళంలో చేరడం సహించరానిదిగా కనబడింది. ఆవిధంగా చేరడానికి సహాయపడిన శశిరేఖమీద తన కసినంతా చూపుతూంది.

ఖోటేజాన్ రాకపోకలూ, ఆతనితో కూతురు సంబంధాన్ని సూచించే మాటలూ కుటుంబంలో అవమానకరం గాకపోలేదు. పైవాళ్లు చెప్పిపొడిస్తే బాధ అనిపిస్తూనూవుంది. తమలోతాము మాట్లాడు కొనేటప్పుడు ఖోటేజాన్ ప్రసంగం రావడంకూడా సిగ్గు అనిపిస్తూనేవుంది.

అయినా కూతురు ప్రసంగాన్ని నరసిరెడ్డి ఆమోదించేడు. భాగ్యరెడ్డి దళంలోచేరి కుటుంబం పరువు మర్యాదలను మంటగలుపుతున్నాడని ఏకగ్రీవంగా కథోపకథనంలో తేల్చేసేరు. ముండలముఠాకోరని పేరుపడ్డ వెంకటయ్యే ఆ దళానికి నాయకుడు. అతడో వట్టిపాలేరు. వెట్టివాళ్ళూ, చచ్చుటాళ్ళూ తోడు. ఛెస్! బయిటికిపోయి నీపొయ్యి నువ్వు పెట్టుకోమంటే తప్ప సావాసం వదలడు......

ఈ తుఫానుమధ్య శశిరేఖ ఏడుస్తూ నిలబడిపోయింది. నోటమాట తొణకడంలేదు. ఒక ఆలోచన పాలుపోవడంలేదు.

మహాలక్ష్మమ్మ వ్యవహారంలో వచ్చిన తిరుగుడుచూచి దిగ్భ్రమ చెందింది. ఇంటిల్లిపాదికీ కావని కొడుకు ఇల్లాచెయ్యడం మంచిదికాదనే

ఆమె అభిప్రాయం. అయితే అంతమాత్రంచేత ఇంట్లోంచే తరిమేస్తా మనడం ఏమీ బాగాలేదని ఆమె అభిప్రాయం. ఆ సంగతి మిగిలినవాళ్లు వినకపోయేసరికి ఆమెకు భయం పట్టుకొంది. అందరూ కూడబలుక్కొని చినకొడుకును వేరేటికాపరం పెట్టించేందుకు కుట్ర చేస్తున్నారనిపించింది.

భాగ్యరెడ్డి అంటే ఆమెకు అమితమైనప్రేమ. భార్య కాపురానికి వచ్చినా ఆతడు ఆమెకళ్ళకు అన్నాలలోబిడ్డే. వేరేటికాపురం పెట్టిస్తే ఏం చెయ్యగలడు? ఎల్లా బ్రతుకుతాడని ఆమె ఆదుర్దా.

ఎలా బ్రతుకుతాడో, ఏం చేస్తాడో అనే భయం వాడికి లేనిది నీకెందుకని పెద్దకొడుకు అడ్డుతగిలేడు.

భాగ్యరెడ్డి దళంలో చేరడంవలన వచ్చే కష్టనష్టాలు అతదే భరించాలి. కుటుంబానికి చిక్కులు రాకూడదు. ఆ ఉద్దేశ్యంతోనే వేరే పెట్టడం అవసరం అని నరసింహారెడ్డి భార్యకు బోధించేడు.

అయితే అటువంటి పనిచేసేముందు అతడు లేని పట్టుదల మాన్పి స్తాడేమో ప్రయత్నిస్తాడు. రేపటి సత్యాగ్రహ ఉత్సవంలో వుండకుండా వచ్చేయ్యమని ఇప్పుడే మనిషిని పంపిస్తాడు. మాట విని వచ్చేసేదా మా బాగు. లేదా వాడిదారి వాడిది......

నరసిరెడ్డి పెద్దకొడుకును పిలిచి వెళ్ళమని పురమాయించేడు. కాని అతడు చిన్నాయన్ను పంపమన్నాడు.

చివరకు తండ్రి పిలుస్తున్నాడు వెంటనే బయలుదేరి రమ్మని పాలేరు ద్వారా కబురు పంపడానికి నిర్ణయించేరు.

ఈ రాయబారం ఫలితం ఎల్లావుంటుందో మహాలక్ష్మమ్మకు బాగా తెలుసు. తండ్రి వెడితే పని జరుగునేమో గాని అన్నలు వెళ్ళినా భాగ్య రెడ్డి వినడు. అతడు చిన్నతనంనుంచీ కొంచెంపెంకె. బహుశా గారాబం వలన వచ్చిందయి వుండొచ్చు. అన్నల నమ్మకం అదే. తమ తల్లి ఆస

రాతో వాడు చెడిపోతున్నాడని వాళ్ళ ఆరోపణ. అందుచేత అన్నదమ్ముల మధ్య సయోధ్యాలెన్నడూ లేవు.

ఇప్పుడు పాలేరుని పంపిస్తున్నారు. భాగ్యారెడ్డి అసలు లెక్క చేయడు. అతడి వేరేటికాపురం ఆలోచన స్థిరపడిపోయినట్లే ననిపించింది మహాలక్ష్మికి. ఆ ప్రమాదం తెలియబరిచి, వెంటనే ఇంటికి రమ్మని కబురు పంపడానికి తానే ప్రయత్నించాలనుకొంది. గబగబా చెప్పవలసిన మాటలు నెమరువేసుకొంటూ రంగయ్య ఇంటికి పరుగెత్తింది.

---

## మూడో ప్రకరణం

“ఏం కోడలా! అత్తగారులేదా!” అంటూ గుమ్మంలో అడుగు పెడుతున్న మహాలక్ష్మమ్మను ఎదురువొచ్చి సూరమ్మ ఆహ్వానించింది.

“రాండి, అత్తా, పొరుగింటి కెళ్ళేరు. వస్తారు. కూర్చోండి.”

లోపల అడుగుపెడుతూ మహాలక్ష్మమ్మ అటూ యిటూ చూసింది.

“అబ్బాయి కనిపించడేం.”

అబ్బాయి రంగయ్య. ఆతను చదువుకొన్నవాడు. వూళ్లో కుర్రవాళ్ళకి ఆతనిమీద మంచి గౌరవంవుంది. తండ్రి భయంవలన కాకపోతే రంగయ్యమీద వున్నభక్తేనా పనిచేసి తన కొడుకు ఇంటికివస్తాడనే ఆశలో మహాలక్ష్మమ్మ వచ్చింది.

సూరమ్మ చిరునవ్వు నవ్వింది.

ఆడపడుచు ఇంటికి రావడమే లేదా? యని కంఠస్వరం తగ్గించి రహస్యంగా అడిగినట్లు గొణిగింది. సత్తెమ్మమాట ఎత్తడానిక్కాదా

మహాలక్ష్మమ్మకు భయం. వెంకటయ్యను పెళ్ళిచేసుకొనే ఆలోచన మాన మని పెద్దరికం చేయవచ్చిన తన మగడికి ఆ రోజున జరిగిన అవ మానాన్ని ఆమె ఎన్నటికీ మరవలేదు. వియ్యాపమ్మ తెస్తున్న విలపింపులంటే సగం చచ్చివుంటే, ఈ విధంగా మాటలంటుందా యని వియ్యంకుడికీ కోపంవచ్చింది. ఆమె వూసుకుపోవడమే పొరపాటని చెంపలేసు కొన్నారు.

సంగతులెరిగిన సూరమ్మ ఈ మారు చిరునవ్వు నవ్వలేదు. నిశ్శబ్దంగా లేదని తల ఆడించింది.

మహాలక్ష్మమ్మ అస్సురుస్సురంటూ తిన్నెమీద కూర్చుంది. ఎప్పుడూరాని మనిషి ఎందుక వచ్చిందో అర్థంకాక, వచ్చినపని ఏమి టని అడగడం మర్యాదకాదని సూరమ్మ ఏవేవో లోకాభిరామాయణం ప్రారంభించింది. పొలాల్లో వేసినపైరూ, పొలం పనులూ వివరాలు అడిగింది. పెద్దకోడలు ఓపలేనితనం తెలుసుకొంది. రెండో కోడలు పుట్టింటినుంచి ఎప్పుడు వచ్చేదీ అడిగింది. ఆఖరుకొడుకూ, కోడలూ అన్యోన్యంగా వుంటారని తెలుసుకొంది.

అన్నీ చెప్పి మహాలక్ష్మమ్మ మారుప్రశ్న వేసింది.

"అమ్మాయి నెక్కడా వీధిలోకి కూడా వెళ్ళనియ్యడం లేదట్లే వుందే."

తన మేలమాటకు సూరమ్మ సమాధానం ఇచ్చేలోపునే మహా లక్ష్మమ్మ మనస్సులోని బాధనంతనూ వెలిగక్కేసింది.

"అట్లాగే వుండాలమ్మా, మా పెద్దమ్మావుంది. ఇంట్లో క్షణం వుండకుండా పెందరాళే అన్నంపెట్టి వీధిలోకి పంపేస్తోంది."

మహాలక్ష్మమ్మనోట శశిరేఖచేసిన, చేస్తున్న అపరాధాలను వింటూ సూరమ్మ తన భర్తక్కూడా తాను ఆలాగే పెందలకడనే అన్నంపెట్టి

పంపెయ్యవలసి వస్తూందని చెప్పలేకపోయింది. అయాచితంగా లభిస్తున్న అభినందనలను వదులుకొని శశిరేఖకు తగులుతున్న దీవాట్లు తన నెత్తిన కూడా వేసుకోడానికి ఆమె ఇష్టపడలేదు. కోడలి అపరాధ సహస్రాన్ని ఏకరువేసేక మహాలక్ష్మమ్మ తాను వచ్చిన పని చెప్పింది.

సంసారాలు భగ్నంపాడు కావడానికే ఈ సంగాలూ, సత్యాగ్రహాలూ వచ్చేయని మహాలక్ష్మమ్మ స్థిరీకరించింది. వాటినిగురించి ఒక ప్రత్యేకమైన అభిప్రాయంలేని సూరమ్మ ఏమీచెప్పలేక పోయింది. ఆమె తండ్రి గోపాలరావు కాంగ్రెసు నాయకుల్లో ఒకడాయె. అందుచేత సత్యాగ్రహాలోచనలూ, ఆంధ్రమహాసభ మీటింగులకి వెళ్ళడమూ ఆమెకి కొత్తకాదు. తమ యింట్లో అది మామూలు పనుల్లో ఒకటిగానే పరిగణన. ఖానుడిపేటలో పటేల్ మల్లారెడ్డి సత్యాగ్రహం చేస్తాడని చెప్పి, దానికి సంబంధించిన ప్రయత్నాల కోసం గడిచినవారం పదిరోజుల నుంచీ రంగయ్య ఓ పూటవున్నట్లూ లేనట్లూ తిరుగుతున్నాడు. అయినా ఆమెకు కష్టం కలగలేదు. కుటుంబం విచ్ఛిన్నం అవుతూందనే భయమూ కలగ లేదు. అందుచేత మహాలక్ష్మమ్మ భయం ఏమిటో ఆమెకు అర్థం కావటం లేదు. కాని ఆ మాట సరాసరి చెప్పలేదు.

"పాపం ఆమె మాత్రం ఏం చేస్తుంది? అన్నం పెట్టమంటే పెట్టననగలదా, పెట్టకపోతే తినకుండా వెళ్ళిపోతామంటారు. ప్రాణం వొప్పుతుందా? అప్పుడు మళ్ళీ మనకే బాధ. అడదానికి అన్నీ చిక్కులే......"

మహాలక్ష్మమ్మ ఆ మాట నిజమేనన్నా తన కొడుకు విషయంలో కోడలు సరిగ్గా ఆలోచించలేదనే అభిప్రాయాన్ని మార్చుకోలేదు. రంగయ్య అంటే వెనక్కాల ఔనూ, కాదూ అనేవారులేరు. అతడే యింటిపెద్ద. చదువుకొన్నవాడు. తనమంచీ చెడ్డ తాను చూచుకోగలడు. ఏవన్నాచిక్కు లొచ్చినా మామగారు వకీలు. కాచుకోగలడు.

కాని తన కొడుకు?.. మహాలక్ష్మమ్మ కొడుకు పనితనాన్నీ, తండ్రిపాటుదనాన్నీ వర్ణిస్తూంటే సూరమ్మకు నవ్వువచ్చింది.

"తల్లుల దృష్టిలో కొడుకులు పెద్దవాళ్ళవటం వుండదట్తా. మా అత్తగారు కూడా కొడుకును గురించి ఇల్లాగే మాట్లాడుతారు."

మహాలక్ష్మమ్మ వొప్పుకోలేదు. సూరమ్మ తల్లిప్రేమకొద్దీ అంటుందే గాని, తను అసలు వాస్తవవిషయాన్ని చెప్తున్నానంది. ఆమె మాటల ప్రకారం పునస్సంధానం నాటికి భాగ్యరెడ్డికీ పెళ్ళాన్ని ఏం చెయ్యాలో తెలియదు. కార్యానికి వెళ్ళేటప్పుడు తండ్రి అన్నీ చెప్పవలసివచ్చిందట. అంత అమాయకుడు!

అమాయకత్వానికి ఆమె చెప్పిన వుదాహరణ చూసా, కాని తన వానికి తీసిపోనిది. సూరమ్మ మాట్లాడక వూరుకొంది. తన మగడి విషయంలో అత్తగారూ ఇల్లాగే చెప్తుందేమో ననిపించింది. ఆయన కెవరన్నా ఏమన్నా బోధించేరేమో తెలుసుకోవాలి అనుకొంది.

"ఇంతకీ చెప్పొచ్చేది" తన అమాయిక పుత్రరత్నాన్ని ఇంట్లోంచి తరిమేయాలని తండ్రి ఆలోచిస్తున్నాడు. ఇంట్లో రామరావణయుద్ధం జరిగిపోతోంది. భాగ్యరెడ్డిని ఏలాగైనా ఈ వేళ రాత్రి గడవక పూర్వం ఇంటికి వచ్చేలా చెయ్యాలి.

*   *   *   *

రంగయ్య హడావిడిగా ఇంటికివచ్చినా మహాలక్ష్మమ్మ మాటలు సావధానంగానే విన్నాడు. సత్యాగ్రహం వుదయమే జరుగుతుంది. ఉత్సవానికి తను ప్రారంభించి చూడా చాలావుందని తీసుకెళ్ళాలని ఆతడు తిరుగుతున్నాడు. భాగ్యరెడ్డి వచ్చే ప్రయత్నంలో వున్నాడని ఆతనికి తెలియదు. అయినా వస్తున్నాడంటే ఆతని మొదల అభిమానమే కరిగింది. వద్దని ఇంటికి పంపెయ్యడం మంచిదికాదనుకొన్నా ఇంటివాళ్ళంతా గొడవ

చేస్తూంటే వచ్చి ఏం వారగబెడతాడులే యనిపించింది. తప్పక పంపిస్తా నని మహాలక్ష్మమ్మకు వాగ్దానం చేసేడు.

ఆమె వెళ్ళిపోయేక సంగంవాళ్ళు ఇల్లాంటి తండ్రిచాటు కుర్ర వాళ్ళని తెచ్చుకోవడంవలన వుద్యమానికి నష్టం కలిగిస్తున్నారే గాని ప్రతిష్ఠ తీసుకురావడంలేదని భార్యపద్ద విసుక్కొన్నాడు.

"సన్యాసం పుచ్చుకొనేవాడు తల్లిదండ్రులూ, బంధుమిత్రులా సమ్మతి తీసుకోవాలి. ఒక మహోద్యమంలో చేరడమన్నా సన్యాసం పుచ్చుకోవడం లాంటిదే. ఇందులో మరో విశేషం కూడా వుంది. సన్యా సాశ్రమంలో ప్రాణాపాయానికి సిద్ధపడనక్కర్లేదు. ఇక్కడ ఏ క్షణంలో ప్రాణంమీదికివస్తుందో చెప్పలేము. దినదినగండం దీర్ఘాయుష్యం! మరీ తప్పకుండా బంధుమిత్రుల అంగీకారం పొందాలి."

అతడు ఎవరి సమ్మతి తీసుకొన్నాడని అడగాలనుకొందేగాని అడగలేకపోయింది సూరిమ్మ.

## నాలుగో ప్రకరణము

తెలతెల్లవారేవేళకి కాలిబాటలవెంటపడి ఖానుడిపేటమీదుగా చుట్టుప్రక్కల వూళ్ళజనం కదిలేరు. ఏ వూరివాళ్ళకావూరివాళ్ళు డప్పులు, బాజాలు, బూరలు మ్రుందుపెట్టుకొని గుంపులుగుంపులుగా సాగివస్తున్నారు. ఏపుగా పెరిగిన జొన్నచేలమీద కొత్తరకం పక్షులేవో ఎగురుతున్నట్లు వారిది చేతుల్లోవున్న కాంగ్రెస్ జెండాలు రెపరెపలాడుతున్నాయి.

మొదటిజట్టు వూళ్ళోకి వచ్చేసరికి ఇంకా చుక్క పొడవనేలేదు. సాధారణంగా పొలం పనులకు బయలుదేరే అలవాటున్న వాళ్ళుకూడా

ఆ నాడింకా లేవలేదు. మరునాడుదయమే పటేల్ మల్లారెడ్డి సత్యాగ్రహం చేయడానికి ముహూర్తంపెట్టేరు. వారం, వర్జ్యంచూసి, పెట్టినముహూర్తం అది. ముహూర్తబలిమినిపట్టి సత్యాగ్రహం దిగ్విజయంగా జరుగుతుందని కాంగ్రెస్ నాయకుడు కిషన్‌రావుచెప్పేడు. దానిని దిగ్విజయం చేయడానికి ఆయన పొద్దోవుండి సన్నాహాలు చేస్తున్నాడు. దగ్గరుండి వేదిక వేయించేడు. ప్రజానీకం కూర్చుందుకు పందిరివేయించేడు. పందిరికీ, వేదికమీద అమర్చిన షామియానాకీ అలంకారాలు చేయించేడు. పొద్దోని పడుచువారు అంతా పనులుచేస్తూ అర్ధరాత్రి దాటిపోయేవరకూ అక్కడేవున్నారు. ఆ తర్వాత కూడా అలసిపోయి అక్కడే తలోమూలా తలగుడ్డలు పరచుకొని నిద్రకి పడ్డారు.

* * * *

నిప్పుసెగని వెచ్చబడిన డప్పులమీద మొదటిదెబ్బ పడేసరికి పందిరిదగ్గిరే చేరి పడకలేసిన ఊరకుక్కలు ఉలికిపడిలేచేయి. పారిపోవాలో, ఎదురువెళ్ళాలో వెంటనే నిశ్చయించుకోలేకపోయాయి. ముంగాళ్ళమీదలేచి, చెవులురిక్కించి ధ్వనిజాడని ఆలకించేయి.

ఊళ్ళో అరుగుపెట్టెముందు చల్లగాలికి మెత్తపడిన డప్పుల్ని నిప్పుసెగతో వెచ్చబెట్టుకొంటూ నాదంసరిచూచు కొంటున్నారు.

"టసటస్......"

అమ్మవారు సంబరాలకీ, పెళ్ళిపేరంటాలలోనూ పరిచితమైన ఆ ధ్వనివిన్నాక పందిట్లో ఒక్కకుక్కా మిగలలేదు. పనివున్నా లేకపోయినా, పదిమంది మధ్యవుండడం వాటికి సరదా. హడావిడిగా వొళ్ళుదులుపుకొని ఎదురెళ్ళి, ఊరేగింపును ముందావుండి తీసుకొచ్చేయి.

అరుగులమీద పడకలువేసినవాళ్ళు లేచివచ్చేసరికి ఊరేగింపు గవినిలోకి వచ్చేసింది. చీకట్లోకూడా అంతదూరం వరకూ జనం బారులు

తిరి నడుస్తూండడం కనిపిస్తూంది. వాళ్ళందరినీ చూసేసరికి శివాలెత్తేయి. ఆవేశంతో జై జై అంటూ చేతులు ఎగరేసి నినాదాలనిస్తూ ఎక్కడి కక్కడే పంక్తుల్లో దూరడానికి ప్రయత్నించారు. ఆ తోపిడిలో పంక్తులు చెదిరిపోయేయి. పాటలు నిలిచిపోయాయి. నినాదాలు ఆగిపోయేయి. సద్దుబాటుచేసి మళ్ళీ పంక్తులు తీర్చడానికి ఊరేగింపును నడిపిస్తూన్న రంగయ్య పరుగెత్తుకు వచ్చేడు.

ఊరేగింపు గలభా అయినా డప్పులవాళ్ళకి కొత్తజనాన్నీ, వాళ్ళ ఉత్సాహాన్నీ చూసేసరికి ఆవేశంవచ్చింది. ఒకళ్ళనొకళ్ళు కవ్వించు కొంటూ, తలలు ఒరగబెట్టి డప్పులమీద శక్తికొద్దీ బాదేస్తున్నారు. లయ గతులు చూపిస్తున్నారు. ఆ గతుల మేళవింపుతో అడుగు కలుపు తున్నారు.

ఊరేగింపు వీధిలోకి వచ్చేవరకూ గదిలోపల అరుగుమీద పడక వేసిన కిష్టారావుకు తెలియరాలేదు. గాఢనిద్రలో డప్పులు వినబడిఉలిక్కి పడలేచేడు. నిద్రమత్తులో ఆ చప్పుళ్ళేమిటో అర్థంకాలేదు. తెల్లవారి పటేల్ మల్లారెడ్డి సత్యాగ్రహంచేస్తాడు. ఆ వార్త తెలిసి రజాకారుమూక రాలేదుగదా యనిపించి ముచ్చెమటలూ పోసేయి. రజాకార్లు సత్యాగ్రహులమీద చేస్తున్నారన్న దౌర్జన్యాల వార్తల భయంకన్నా తాను దొరికి పోతానేమోనన్నభయం బాధించింది. కాంగ్రెసు ఆదేశించిన సత్యాగ్రహో ద్యమాన్ని వాడవాడలకూ వ్యాపింపచేయడంకోసం తాను రహస్యంగా పని చేస్తున్నాడు. తనమీద నిజాం ప్రభుత్వం వారంటు పుట్టించింది. తనను పట్టుకునేందుకు రజాకార్లు ప్రయత్నిస్తున్నారని ఎరుగును. గడచిన నెల, నెలా పదిహేను రోజులనుంచీ వీళ్ళందరికళ్ళుగప్పి తానుపనిచేస్తు న్నాడు. అల్లాంటిదీవేళ దొరికిపోతున్నానే అనిపించింది. కంగారుగా అలంగం తొక్కేడు. ఆ అదుర్దాలో వీధిలోంచి వినవస్తున్నపాట అర్థం కానేలేదు. చాకలి నరసాయ వెర్రిసంతోషంతో "వచ్చేసే"రంటూంటే

ఏమనుకోవాలో అర్థంకావేదు. వాడు మెల్లాలో పడుకొన్నాడు. దొరఇంటి ఎద్ద వంచు అతడదీ ఈ వారం. తానిక్కడున్న నాలుగురోజుల పరిచయంలోనూ నరసాయ నమ్మతగినవాడే అనిపించింది. రజాకార్లే వచ్చి వుంటే ఆతడీ సంతోషము చూపివుండడు. అతనిని చూడగనే మనస్సు కుదుటబడింది. ఆ వచ్చినవాళ్లు శీతారాంపురం జనం అని విన్నాక అమ్మయ్యా అనుకొన్నాడు. అప్పుడు వినిపించింది వీధిలోపాట.

రఘుపతి రాఘవ రాజారామ్ ।

పతీత పావన శీతారామ్ ।

ఈశ్వర్ అల్లా తేరేనామ్ ।

చాకలి నరసాయ ముందునడచి గడీతలుపులు తెరిచేడు. గుమ్మం ముందున్న కందిలి మసకవెలుతుర్లో జనం ముఖాలు కనిపిస్తున్నాయే గాని తెలియడంలేదు. కాని వాళ్ళనడకలో, భంగిమల్లో, గొంతుల్లో పని చేస్తున్న ఉత్సాహం చూస్తూంటే ఆయన మనస్సు నిండిపచ్చింది. ఆయనను చూడగనే ఊరేగింపు ఒక్కగొంతుతో నినదించింది.

కాంగ్రెస్‌పార్టీ

జిందాబాద్ ।

ఆ జనాన్నీ, వారివుత్సాహాన్నీచూసేక కిషన్‌రావుకు మరి పగక వెయ్య బుద్ధిపుట్టలేదు.

నరసాయ సాయంకాలమే పిరిచితెచ్చిన వేసపుల్ల అందించేడు. ఆతడు చేతిలో నీళ్ళుపోస్తూంటే మొగం కడుక్కున్నాడు. మొగంతుడుచుకొన్న తుండుగుడ్డ అతనికి తిరిగి యిచ్చేసేడు.

---

# ఐదో ప్రకరణం

సత్యాగ్రహం చేయవలసిన పటేల్ మల్లారెడ్డి ఇంకా లేవనేలేడే అనుకొంటూ కిషన్‌రావు వాకిట్లో అటూయిటూ పచారుచేస్తున్నాడు. ఊళ్ళో నుంచి వస్తూన్న ఊరేగింపుల సందడి అంతకంతకి ఎక్కువవుతూంది. చాకలి నరసాయ మధ్యమధ్య లోనికెళ్ళి చూసివస్తున్నాడు. పంగరికే కబురు వెళ్ళిందనో యేమో, దొర అభ్యంగనం చేస్తున్నారనో యేమో కబుర్లు చెప్తున్నాడు.

మల్లారెడ్డి సత్యాగ్రహానికి పెళ్ళికొడుకులా తయారవుతున్నాడు. పదిరోజులనుంచి తనకు ఒకటే తపన. ఆదుర్దా. మల్లారెడ్డికి అసలా ఉంటే వున్నట్లు కనబడదు.

మళ్ళీ అవకాశం దొరకదనుకొన్నాడో యేమో రాత్రి రత్తమ్మని చూచి రావడానికి యథావిధిగ వెళ్ళివచ్చేడు. రత్తమ్మ చిన్ననాటినుంచీ ఆయనకు అలవాటుపడిన మనిషి. మగనాలు రెడ్డిగారు వస్తున్నారంటే ఆ మగడు ఏ దావిదగ్గరకో వెళ్ళిపోవలసిందే. ఈ సంగతి తనకు తెలుసు. ఏనాడూ అది పెద్ద ఎబ్బెట్టనిపించలేదు. కాని, ఈ వేళ పనికట్టుకుని వెళ్ళటం ఏలాగోవుంది. ఈ వ్యక్తికి ఉద్యమం మీద విశ్వాసం కుదిరే సత్యాగ్రహానికి సిద్ధపడుతున్నాడా అనిపించింది. చిన్నప్పటి స్నేహం. చనువూకొద్దీ ఆ మాటంటే 'సత్యాగ్రహాలంతా ముందు...కోసేను కోపాలని నువ్వెప్పుడూ చెప్పవేం మరి' అని వేళాకోళం చేసేడు. ఆయనను ఆపలేకపోయినా సత్యాగ్రహులు అనుసరించవలసిన విధులను గురించిన ఆలోచనలను ఆపలేకపోయేడు. కాంగ్రెసు మద్యపానాన్ని నిరసిస్తుంది. అవినీతికర జీవితం గడపవద్దంటూంది. అవినీతి అంటే వ్యభిచారం ఒక్కటేనా? ఆ అభ్యంతరాలన్నీ అంగీకరిస్తే ఈ వేళ దేశంలో సత్యా

గ్రహంచేస్తున్నవాళ్ళు ఎందరా పనికి అర్హులు అని కిషన్‌రావు మనస్సు సరిపెట్టుకొనేటందుకు ప్రయత్నించేడు. తానుచెప్పిన నియమాలకు లోబడి ఆచరించగలవాడొక్కడేనా వాయనని గాంధీగారు అంటే అనవచ్చు. కాని, అది సాధ్యమా? మనం ఆదర్శంగా పెట్టుకొన్నవన్నీ ఆచరణ యోగ్యాలవుతవా?

గాంధీజీ సత్యాగ్రహులకుండాలన్న లక్షణాలదృష్ట్యా పటేల్ మల్లారెడ్డి నిలబడలేకపోవచ్చు. గాంధీజీ విధించిన నైతిక పరిమితుల్లో ఆయన ఏ విధంగానూ యిమడలేడు. ఆయనే ఏమిటి? అలా చెప్పాస్తే తనకు నమ్మకం వుండి వచ్చిందా? రహస్యంగావుండి పని చెయ్యడాన్ని కమ్యూనిస్టుల్ని చూచి ప్రారంభించేరు. సత్యాగ్రహికి రహస్యకార్యక్రమం, దాచేది ఏమీలేదని గాంధీజీ చెప్తారు. ప్రజలు ఎవరిని బాధించే వాళ్ళయిన ఐతే తరిగెయ్యమని తాము చెప్తున్నారు. గాంధీజీ అహింసావ్రతం బోధిస్తున్నారు. దీటికి పొంతనా ఎక్కడుంది? అసలు ఇక్కడి పరిస్థితులేమిటి. సత్యాగ్రహోద్యమంలో అనుసరించవలసి కార్యకలాపం తు. చ. తప్పకుండా జరపడం ఇక్కడ సాధ్యంకాదు. అనర్హుడే అనుకొన్న మల్లారెడ్డి చేసే సత్యాగ్రహం నిజాముపాలన కుంకటివేళ్ళని మట్టగించేస్తుంది.

సిద్ధాంతాలమాట ఏలావున్నా పటేల్ మల్లారెడ్డి సత్యాగ్రహం సమర్థించవలసిందే. దానిమీద చాలెన్నో ఆశలు పెట్టుకొని వున్నాడు. ఆయన సత్యాగ్రహానికి అంగీకరించడమే ఒక పెద్దవిజయంగా భావిస్తున్నాడు.

ఆ వూళ్ళోనూ, ఆ చుట్టుప్రక్కలేకాదు. ఆ తాలూకాలోనే మల్లారెడ్డికి చండశాసనుడని పేరుంది. నిజాము జూబిలీవుత్సవాల్లో ఆయన చూపించిన వుత్సాహానికీ, పోగుచేసిన ధనానికీ బహుమతీకూడా లభించింది. అలాంటివాడు కాంగ్రెసుజెండా ఎగరేసి, సత్యాగ్రహం చెయ్యడం...ఇదేం సాధారణమైన సంగతికాదు. దీనితో వుద్యమానికి

ఈ తాలూకాలో ఎంతోబలం వాస్తుందని కిషన్‌రావు ఎన్నోసార్లు వూహించుకొన్నాడు.

మల్లారెడ్డి మొదట ఈ ప్రస్తావన చెవిని పడనిచ్చేవాడా? ఆయనను వొప్పించడానికి తానెంతో కష్టపడ్డాడు. దేశభక్తిని గురించి ఎన్నో వుప న్యాసాలిచ్చేడు. లాభం లేకపోయింది. కాలమాన పరిస్థితులు చెప్పేడు.

"భారతదేశం స్వతంత్రం అయిపోయింది. ఇంగ్లీషువాడు తట్టుకో లేక బాబూ మీతంటాలేవో మీరుపడండి. మధ్యని నాకెందుకీ గులాటం అని చల్లగా తప్పుకొన్నాడు. మధ్యన నిజాముదో ఆవాహనా? విసర్జనానా? మీతో నాకుసంబంధం ఏమిటంటే వదిలేస్తారా? పెంకితనం సాగనిస్తారా? నిజాముతోపాటు ఆయన నమ్మిన బంట్లుగా బహుమానాలు పొందిన వాళ్ళ పని కూడా పట్టామంటారుసుమా"—అని బెదిరించబోయేడు.

మళ్ళీ అలా అనడవి హామీయిచ్చేడు......అయినా అని మళ్ళీ మెలికపేసేడు.

"కాంగ్రెసు కక్షలు సాధించదు. మన దేశంలో రెండువందలేళ్లు నానాధ్వంసంచేసిన ఇంగ్లీషు వాళ్ళతో కుమర్చుకొన్న ఒప్పందాలు చూడ రాదూ? అయినా......అన్నీ అనుకొన్నట్లే జరుగుతాయా? రోజులు ఒక్కలా వుంటాయా?

గత సంవత్సరం వెట్టికి వ్యతిరేకంగా వుద్యమం వచ్చింది. దానిని అణిచివెయ్యడానికి నిజాము తెచ్చిన సైన్యాలింకా గ్రామాలనుంచి కదలనే లేదు. సూర్యాపేట తాలూకాలో ఇంకా సైనికుల దాడులు జరుగుతూనే వున్నట్లు తెలుసు. కాని, రెండోవేపున అప్పుడే భూస్వాములకు వ్యతి రేకంగా ఘర్షణలు ప్రారంభమైనాయి. ఈ మధ్యనే శీతారాంపురంలో శివరామిరెడ్డి భూమిని స్వాధీనం చేసుకోబోతే ఊరంతా పోగడి ఉద్దారుని చితక్కొట్టేరు. ఆయన కొడుకు సర్కిలు. ఏదో పేరుచెప్పి ఆ రోజున

అల్లరి చేసినవాళ్ళని అరెస్టుచేసేడు. జనం భూరుకున్నాటా? సర్కిల్ మందె విరగ్గొట్టి, రివాల్వరు లాగేసేరు. కొంపకి చిచ్చుపెట్టి తమవాళ్ళని విడిపించుకు పోయేరు. నిజామును జనం లెక్కచేయడం లేదు. ఆయన పోలీసులూ, సైన్యాలూ వాళ్ళకి గడ్డిపరకల్లా కనిపిస్తున్నాయి.

కిషన్‌రావుకు తాను చెప్తున్న ఘటనలు మంచికే వొచ్చేయో, చెడ్డకేవొచ్చాయో తెలియదు. నిజాముమీద ప్రజల అయిష్టాన్ని నిరూపించడానికి ఆ ఘటనలనే ఆయన అనేక మార్లు ఎంతో ఉత్సాహంతో వర్ణించేడు. ఇప్పుడు కాలమానం మారిందనీ, ఈ పాటికి ఉద్యమంలో వచ్చి చేరకపోతే చాలా ప్రమాదాలు రాగలవనీ, భయపెట్టడానికన్నట్టా ఆయన ఆ ఘటనలనే భయోత్పాతంగా వర్ణించేడు. పెద్దకుటుంబాలవాళ్ళు వచ్చి ఉద్యమాన్ని తీర్చిదిద్దాలి. లేకపోతే నానాజాతులూ చేరిపోతారు.

దీనికి ఏ చిట్కా పనిచేస్తేనేం ఒక రోజున తెల్లవారేసరికి వచ్చి పటేల్ మల్లారెడ్డి తాను సత్యాగ్రహం చేస్తానన్నాడు. అంతవరకూ మల్లారెడ్డిని ప్రోత్సహించిన తనకే ఆశ్చర్యం వేసింది. ఈ మధ్యలో ఆయన అభిప్రాయాలు మారడానికి కారణం ఏమిటా అని పదిసార్లు ఆలోచించేడు. ఆయన నిర్ణయానికి మూలకారణం దేశభక్తికన్నా, స్వార్థమే అయివుంటుందనిపించకపోలేదు. అయితేనేం......?

కిషన్‌రావు ఆలోచనలధోరణే వేరుగావుంది. మల్లారెడ్డి కాంగ్రెసు ఉద్యమాన్ని తన స్వార్థానికి ఉపయోగించుకో గలిగేటన్నా ఉద్యమమే ఆయన రాకను ఉపయోగించుకోగలదని గట్టి నమ్మకం.

ఆయన సత్యాగ్రహం చేసేడంటే అంతవరకూ వూగిసలాడుతున్న పటేల్, పట్వారీలు ఒక నిర్ణయానికి వచ్చేస్తారు. నిజాంషాహీ కొనసాగుతూందంటే ఈ వతన్‌దార్ల పుణ్యమే. వాళ్ళే రాజీనామాలిచ్చేస్తే! గ్రామాలు విముక్తి పొందినట్లే. ఒక్క గ్రామాలేమిటి? తమ తాలూకా, తమ జిల్లా......

పటేల్ మల్లారెడ్డిని సత్యాగ్రహానికి ఒప్పించడం జాతీయోద్యమానికే ఒక విజయమని కిషన్‌రావు అంచనాలు వేసుకొన్నాడు. తాను చేసినకృషీ, పడినశ్రమా ఫలిస్తున్నాయి. ఒక్క తెలంగాణా విముక్తికే కాదు, హైద్రాబాద్ విముక్తికే పునాదిపడుతూంది......

పరిటాల రిపబ్లిక్ అయిపోయింది. దానికి తాము ఎంత సంతోషిస్తున్నారు? ఎంత గర్వం అనిపిస్తూంది? కాని, ఇప్పుడు తాను సాధించిన విజయంముందు అది ఏ పాటిదని కిషన్‌రావు పదిమాట్లు అనుకొన్నాడు. పరిటాల యూనియన్ గ్రామాల మధ్యవున్న చిన్నలంక. అక్కడికి నిజాము సేనలు వెళ్ళడానికి యూనియన్ ప్రభుత్వం అడ్డం చెప్పింది. అదీ కాంగ్రెసు ప్రభుత్వమేనాయె. పైగా ఓ రాత్రివేళ కమ్యూనిస్టులు పోలీసునాకా మీదపడి ఉన్న ఆయుధాలు నాలుగూ గుంజుకుపోయేరు. ఇంకెవరు వెళ్ళి జెండాపాతినా కాదనే నాధుడెవరు?

తాను సాధించబోతున్న విజయానికీ, దానికీపోలిక లేదనిపించింది. శత్రువు అధీనంలోవున్న ప్రాంతంలో, ఆతని మనుష్యుల్ని, శత్రువు అధికారానికి మూలస్తంభాలవంటి వాళ్ళను తాను తిరగ తీసేస్తున్నాడు.

తానే నిజాము పరిపాలనను నిర్మూలిస్తున్నట్లు భావించడం అతిశయం అనిపించి కిషన్‌రావు సిగ్గుపడ్డాడు. తాను చేస్తున్న సేవ ఒక మహోద్యమానికి దృఢమైన పునాదులు వేస్తుందనే గర్వం మాత్రం కనీసం మనస్సులోనైనా అనుభవించకుండా వుండలేకపోయేడు.

వీధిలోంచి మహోపూరివాళ్ళు వెడుతూ ఇచ్చిన నినాదాలతో కిషన్‌రావు ఆలోచనలు తెగిపోయేయి. నరసాయిని పిలిచి దొర ఏంచేస్తున్నార్రా యని మళ్ళీ ప్రశ్నించేడు.

సమాధానంగా ఈ మారు గుమ్మంలో మల్లారెడ్డే ప్రత్యక్షం అయ్యేడు.

---

# ఆరో ప్రకరణం

సభా స్థలానికి ఊరేగింపుతో తీసుకొని వెళ్ళడానికై గఢీముందు చేరిన ప్రజాసమూహాన్ని చిరునవ్వులతో ప్రోత్సహిస్తూ పటేల్ మల్లారెడ్డి గంభీరంగా మెట్లికలు దిగేడు. క్రింద సిద్ధంగావున్న కిషన్‌రావు పెద్దజెండా తగిలించిన కర్రనందించేడు. ఉభయులూ ముందుకు అడుగు వేస్తూంటే ఎదురుగా వచ్చిన గ్రామపెద్దలు వెనకవైపుగా సర్దుకొన్నారు. జనం మెదుగా జయజయ నినాదాలు ఊరు చివరికంటా పాకిపోయేయి.

మల్లారెడ్డి రెండడుగులువేసి గఢీ గుమ్మంలోకి రాగనే పదిపాతిక మంది పేరంటాండ్రతో పెద్ద కూతురు ఎదురు నిలిచింది. వెనుకనున్న పనిమనిషి చేతిలోనున్న బిందెనందుకొని. పసుపుచిలకరించిననీళ్ళు వారు బోసింది. మల్లారెడ్డి ఒక్క అడుగువేసి నీళ్ళలడిసినచోట నిలబడ్డాడు.

జనం అంతా ఉత్కంఠతో ఎదురుచూస్తుంటే రెడ్డి కూతురు తండ్రి నుదుట కుంకుమతో నిలువునా నామం దిద్దింది. పక్కనున్న ముత్తైదువ చేతినుంచి అందుకొని నిలువు పొడుగు పూలమాల వేసింది. కర్పూర నీరాజనంపట్టి నమస్కరించి పక్కకు తప్పుకొంది. మరల జనం నినాదాల నందుకొంది. బంతిపూల రేకులు ముసురుకొంటూంటే ఊరేగింపు కదిలింది.

ప్రతి పదిగజాలకీ పాతికగజాలకీ మెలికలు తిరుగుతున్న సన్నని వీథులగుండా నడుస్తుంటే ఎదురుగావున్న డప్పుల వాద్యాలు ఒక క్షణం దగ్గరపోసూ, మరో క్షణంలో కొన్ని వీథుల ఆవలా వినిపిస్తున్నాయి. ప్రతి వీథిలోనూ ఏదో ఒకటో, రెండో యిళ్ళవాళ్ళు హారతులిస్తూంటే మల్లారెడ్డి గుబురుమీసాలలోంచి చిరునవ్వులు చిలికిస్తూ పెళ్ళినడకలు నడిచేడు. బారులుతీరిన వలంటీర్లు సాగుతుంటే మిగిలిన జనం ఒకరి

నొకరు తోసుకుంటూ ఇరుకు వీధుల కడ్డంగా పారుతున్న మురుగునీటి కాలువలలో అడుగులుపడి దులపరించు కొంటున్నారు. తాము గెంతి దాటుతూ వెనకవాళ్ళని హెచ్చరిస్తున్నారు. ఆ సందర్భంలోనే ఒకర్నొకరు పోరాటం పనుల పరిస్థితిని ప్రశ్నించుకొంటున్నారు. ఇతర వూళ్ళల్లో ఎక్కడన్నా సత్యాగ్రహం జరిగినప్పుడు చూసినవాళ్లు నేటి వుత్సాహాన్ని దానినీ పోల్చి వర్ణిస్తున్నారు.

సభాస్థలానికి వూరేగింపు వచ్చేసరికే అక్కడ ఖాళీలేకుండా జనం నిండిపోయేరు. వూళ్ళ వూళ్ళనుంచి వచ్చిన జనం తీర్థంలో తిరిగినట్లు అటూ యిటూ తిరుగుతున్నారు. ఊరేగింపు రాగానే జనం కదలికలు నిలిచిపోయేయి. కొత్తగా వచ్చినవాళ్ళు ఖాళీలు నింపేరు. జనం జయ జయ ధ్వానాలమధ్య పటేల్ మల్లారెడ్డి వేదికవైపుగా అడుగేసేరు.

---

## ఏడో ప్రకరణము.

పటేల్ మల్లారెడ్డి ప్రభుత్వానికి అందచేయవలసిన రాజీనామా పత్రాన్ని ఆ నిండు సభలో ప్రజలకే అందజేసేడు.

భారతదేశానికే ద్రోహం తలపెట్టిన నిజాం ఉస్మానలీఖానును తానింక మన్నించబోవడంలేదని ఉపోద్ఘాతంతో ప్రారంభించేడు. ప్రజలే దేశానికి సర్వాధికారులు కనుక వారే తన రాజీనామాను అంగీకరించ వలసివుందని సూచించేడు.

ప్రజాతంత్ర భావాలకి అంత త్వరగా సర్దుకుపోగలుగుతున్న మల్లారెడ్డిని చూసి కిషన్‌రావు బ్రహ్మానందపడ్డాడు.

ఆ చిన్న ఉపన్యాసంలో మల్లారెడ్డి ప్రకటించిన ప్రజాభిమానానికి రంగయ్య పరవశుడై పోయేడు. తన ఆనందాన్ని వ్యక్తీకరిస్తూ చప్పట్లూ కొట్టేడు.

సభ అందుకొంది. ఆ మహోత్సవంలో పాల్గొనడానికి వచ్చిన పది పన్నెండూళ్ళ ప్రజలూ జేజేలు కొట్టేరు.

ప్రజల అభినందనలను తలవంచి స్వీకరిస్తూ మల్లారెడ్డి నెరసిన మీసాలు దువ్వుకొన్నాడు.

దువ్వుకొంటూనే గ్రామచావిట్లోంచి పూర్వ రికార్డులు నాలుగైదు దస్త్రాలు తెప్పించేసు. సభముందు గిరాటు వేయించాడు. నిజాము పాలన పది ప్రతిబింబాలు. వాటిని ధ్వంసం చేయడం ఆయన సంకల్పం.

ఆ సంకల్పాన్ని ప్రకటించినప్పుడు సభలో అన్ని వైపులా సమానమైన ఉత్సాహం కనబడ్డట్టులేదు. కొంతమంది ముఖముఖాలు చూచుకొని గుసగుసలాడుతున్నట్టు కూడా తోచింది, కిషన్ రావుకు.

దస్త్రాలకు నిప్పుపెట్టేందుకై మల్లారెడ్డి ముందుకు అడుగువేసేడు. ఆ విధంగా తనకు గతంలో వున్న సంబంధాన్ని ఒక్క అగ్గిపుల్లతో భస్మావశేషం చేసుకుంటాడు. ఆ మంటలే గ్రామాన్ని నిజాము దానిన దాస్యము నుంచి విముక్తిచేస్తాయి.

ఆయన ఉదాత్త భావాలకీ, ప్రజల మీదున్న ప్రేమకీ, దేశం మీదున్న భక్తిప్రపత్తులకీ, గంభీరమైన వాగ్ధోరణికీ రంగయ్య మనస్సు ద్రవించింది. హృదయం ఉద్వేల్లితం అయింది. అప్రయత్నంగా గొంతు విప్పేడు.

"మల్లారెడ్డిసాబ్......"

జనం కొందరు జై అన్నారు. కొందరు జిందాబాద్ అన్నారు. చాలామంది ఏమనాలో తెలియక మూలిగేరు, వాళ్ళ చేతకానితనాన్ని

చూచి రంగయ్య గదిమేడు. రెండుమూడుమాట్లు పొడిచి ప్రోత్సహించి ఏకకంఠంతో 'జిందాబాద్' అనిపించాడు.

ఆలని వుత్సాహాన్ని చూసి కిషన్‌రావు చిరునవ్వుతో తల ఎగరేసి ప్రోత్సహించేడు. ఈ వారం పదిరోజులనుంచీ సత్యాగ్రహం ఏర్పాట్లలో రంగయ్య తీసుకొంటున్న శ్రద్ధను ఆయన గమనిస్తూనేవున్నాడు. అయినా అతనికున్న రాజకీయ సంబంధాల్నిపట్టి తాను రంగయ్య విషయంలో విశేషశ్రద్ధ తీసుకోలేదు. రంగయ్య మామ గోపాలరావు వకీలు. కాంగ్రెసు వాదులలో స్వామీ రామానందతీర్థ మనిషి. వాళ్ళకి కమ్యూనిస్టులంటే ఓ విధరీగా మక్కువ. వాళ్ళసంఖ్యలు చూసో, తట్టుదలా, వుత్సాహమూ చూసోమరి. దానికి తోడు సీతారాంపురం వాడని తెలిసేక రంగయ్య నాయన కమ్యూనిస్టుగానే జమకట్టేసేడు.

* * *

సీతారాంపురంలో జరిగాయన్న ఘటనలను గురించి ఆయనా విన్నాడు. అదివిన్నప్పుడు అందరి కాంగ్రెసు వాళ్ళలాగే ఆయనా అదెంత వరకూ మంచిదో తేల్చుకోలేకపోయేడు. సర్కిల్‌ను కొట్టేరనీ, రివాల్వరును గుంజుకుపోయేరనీ, కచేరీచావడి తలుపులు పగలకొట్టేరనీ, ఖైదీల్ని విడిపించుకొని పోయారనీ విన్నప్పుడు నిజాము వ్యతిరేకధోరణిలో సంతోషమే కలిగింది. నాయకత్వం సంగానిదైతే మాత్రం? ఇవేమన్నా సాధారణమయిన పనులా?

రెండో పక్షం కూడా వుంది. ఇది వేలం వెర్రీ, ఏటికెదురీతా అనిపించింది. బలీయమైన ప్రౌరతనాన్ని ఎదిరించడం మాటలతో వుందా? అదేమన్నా పిల్లకాయల ఆటా? నిజాము సైన్యాన్ని గుప్పిస్తాడు. వాళ్ళకి ఆయుధాలున్నాయి. వాటినుంచి సంగం తమరినేమన్నా కాపాడగలదా? పెట్టగలదా? ఇదో మూఢవిశ్వాసంగాని...చదువుకొన్నామని విర్రవీగే

కుప్రకారంతా అపాయకర ప్రజని అగాధంలోకి ఈడుస్తున్నారని ఆయన అభిప్రాయం. రంగయ్య చదువుకున్నవాడు. సీతారాంపురంవాడే. శివరామిరెడ్డితో భూమి తగాదా పెట్టుకొన్న దితడేననీ, ఆ భూమిలోనుంచి వెలగనున్నాడని తెలిసింది. అన్నింటికన్నా ముఖ్యంగా రంగయ్య తన విధవ అప్పగారి పునర్వివాహానికి ఒప్పుకొన్నాడని ఆయనతో చెప్పేరు.

సంఘసంస్కరణ విషయాలలో కాంగ్రెసు సుముఖత చూపుతూనే వున్నా ఒక్క కమ్యూనిస్టులు మాత్రమే వాటివిషయంలో చాల పట్టుదల చూపుతున్నారు. ఈ వార్తలన్నీ రంగయ్యను ఆయన దృష్టిలో కమ్యూనిస్టునే చేసేసేయి.

కమ్యూనిస్టుల యెడ ఆయనకు ప్రత్యేక వ్యతిరేకత లేకపోయినా సద్భావంలేదు. సంభాషణకు అవకాశంవస్తే 1942 లో ప్రజాయుద్ధ నినాదం తీసుకొన్నారనో, ఏదో రోజున నిజాం సంస్కరణలను పనిచేసి చూద్దామన్నారనో జ్ఞాపకం చెయ్యకుండా వుండలేడు. కాంగ్రెసు నాయకులు జైళ్ళల్లోవున్న సమయంచూసి నాయకత్వం, అధికారం చేతజిక్కించుకోవాలని వారు ప్రయత్నించేరంటాడు. ఆ ప్రయత్నం విఫలం అయ్యేక సత్యాగ్రహోద్యమాన్ని చేతజిక్కించుకొని ఒక నాటకం ఆడాలని వారు ఎత్తులు వేస్తున్నట్లు ఆయన అనుమానం.

అందుకే మల్లారెడ్డిని ప్రత్యేక శ్రద్ధతో ఆహ్వానించగలిగినా, రంగయ్య విషయంలో ఉదాసీనతనే చూపేడు.

కాని, నేడుదయం ఊరేగింపులో ఆతనిపాత్రా, ఇప్పటి వుత్సాహమూ చూసేక రంగయ్య విషయంలో కిషన్‌రావు ఉదాసీనత కొనసాగించలేకపోయేడు. చిరునవ్వుతో ప్రోత్సహించేడు. తలవూపి వేదికమీదికి ఆహ్వానించేడు.

అదివరలో పటేల్ మల్లారెడ్డిని గురించి రంగయ్య అనేక కథలు విన్నాడు. ఆ కథలతో ఆయనయెడ ఒక విధమైన జుగుప్స యేర్పడింది.

తమ వూళ్ళో పడుచువాళ్ళందరూ వస్తూంటే తానొక్కడూ వెనకవుండి పోవడం యిష్టంలేక ఈ వారం పదిరోజులనుంచీ ఈ కార్యక్రమాలలో పాల్గొంటున్నాడేగాని మల్లారెడ్డిమీద అతనికేమాత్రం సద్భావం లేదు.

కాని, ఈ సన్నివేశంలో ఆ జుగుప్స నిలవలేదు. దారుణం అను కొన్న ఆ కథలన్నీ అడుగున పడిపోయేయి. ఆయన నోటవచ్చిన ప్రతి మాటకూ జై కొట్టేడు. అతనితోపాటు సభలోని జనమూ గొంతుకలిపింది.

* * *

కాని, అదేప్రజ, అదేసభ ఆయన ప్రభుత్వ దస్త్రాలను తగుల పెట్టేటందుకై వేదిక దిగేసరికి అభ్యంతరం చెప్పడం రంగయ్యకు ఆశ్చ ర్యం కలిగించింది. గ్రామరైతుల తరఫున వచ్చినట్లు నిలువు పొడుగు చాణాకర్రతో వెంకటయ్య దస్త్రాల కెదురుగా నిలబడడం చూసేసరికి చిర్రెపుట్టుకొచ్చింది.

కాళ్ళకడ్డుపడకుండా పంచెపైకిపట్టుకొని మల్లారెడ్డి తిన్నె దిగేడు. తలవంచుకొని రెండడుగులు వేసేడు. దారిలో మనిషి అడ్డం. తలెత్తి చూసేడు. పెద్దపిన్న తారతమ్యంలేకుండా దారికడ్డం నిలబడతావా అన్నట్లు కళ్ళల్లో నిరుపులు కనబడ్డాయి.

కాని, ఆ చూపు పనిచెయ్యలేదు. దారికి తాను అడ్డంగా వున్నాననే విషయాన్ని వెంకటయ్య గుర్తించినట్లు కూడా లేదు.

మల్లారెడ్డి సాభిప్రాయంగా తిన్నెవేపు తిరిగేడు. తనంతతానుగా దారి తొలగమనడం అవమానంకాదా? వేదికమీద ఆయన ఇద్దరు కొడుకులూ వలంటీర్లుగాచేరిన మరో ఇద్దరు ముగ్గురు యువకులూ నిల బడి వున్నారు.

తండ్రి చూపును గమనించి పెద్దకొడుకు కొండలరెడ్డి అక్కడ నుంచే గర్జించేడు.

"దారి తొలుగు......"

ఆ హుంకారానికి సభ అదిరిపడింది. అందరి దృష్టులూ అటే తిరిగేయి. పరధ్యానంగా కూర్చున్న కిషన్‌రావు సావధానుడయ్యేడు. కొండలరెడ్డి చూపుల ననుసరించి ఆయన కళ్ళు వెంకటయ్య మీదికి సాగేయి. అతనిని గుర్తించేడు. ఆశ్చర్యంవేసింది. వారం రోజుల నుంచీ అవూ ఊవూ అనకుండా, చెప్పిన చోటికల్లావెళ్ళి, చెప్పిన పనల్లా చేసుకు వస్తున్న మనిషిమీదేనా యీ కేకలు!

కేకలకు వెంకటయ్య ఏమీ అనలేదు. కొండలరెడ్డి ముఖం వంక చూసి తల తిప్పేడు. అంతే. కదలలేదు.

కిషన్‌రావు కిదేమీ అర్థం కాలేదు. జనంవంక చూసేడు. వెనకవైపున కదలికలు కనిపించేయి. కాని, ఒకరివెనక ఒకరు ఒదిగి తల దాచుకొనేటందుకు చేస్తున్న ప్రయత్నాలు హెచ్చుగా తోచేయి.

మళ్ళీచూస్తే వెంకటయ్య ఆలాగే అడ్డం నిలబడి కనిపించేడు. అతడు అడ్డం నిలబడడానికీ, వెనకనున్న జనం తలలు దాచుకోడానికీ ఏదో సంబంధం వున్నట్లనిపించింది. ఈ విధమయిన ఆటంకానికి ప్రోత్సాహకర్తలు వారే అనుకొన్నాడు. అయితే వారెందుకు ప్రోత్సహించేరో, వెంకటయ్య ఎందుకు ఒప్పుకొన్నాడో అర్థం కాలేదు.

వెంకటయ్య కదలలేదు, మల్లారెడ్డికి ముందడుగు పడలేదు. కొండలరెడ్డికి కోసంవచ్చింది. తన ముందున్న వారిని ఒత్తిగించుకొని చరచర వేదిక ముందుకు వచ్చేడు; వెనకనే అనుచరవర్గమూ.

పటేల్ ఇశారానూ, కొండలరెడ్డి ఆవేశాన్నీ, అతని వెనకనే మరో అరడజనుమంది కదలడాన్నీ చూసి జనం విస్తుపోతున్నారు. సభలో అక్కడా అక్కడా నిలబడి జనాన్ని సర్దుతున్న సీతారాంపురం దళసభ్యులు పదిమందీ తమ స్థానాలు విడిచిపెట్టి, వెంకటయ్యకు ఆసరాగా వచ్చేస్తు

స్తున్నారు. తమరిని సర్దుతున్నవాళ్ళే ఇల్లా పరుగెత్తడంతో సభయావత్తూ లేచింది. ఎవరికివారే ఏం జరుగుతూందోనని చూడడంతో కోలాహలం ప్రారంభమయింది. పటేల్‌సాబ్ మీదపడితే ఆయనకు కోపం వస్తుందని దగ్గరలోవున్నవాళ్ళు జనాన్ని ఒత్తుకొని రాకుండా నెట్టిపట్టడానికి తంటాలు పడుతున్నారు. లాభం లేకపోయింది. జనం తనను హొత్తెయ్యకపూర్వమే పటేల్ కంగారుపడుతూ తిన్నెఎక్కేసేడు.

కిషన్‌రావూ లేచేడు. ఇదంతా ఏమిటో ఆయనకూ అర్థం కాలేదు. మల్లారెడ్డి హడావిడిచూసి ఏదో ముసలం పుట్టిందనుకొన్నాడు. గబగబా వేదిక అంచుకువచ్చి నిలబడ్డాడు. చేతులుపైకీ కిందకీ వూపుతూ జనాన్ని కూర్చోమని సంజ్ఞచేసేడు.

"ఏమిటిది ? ఎందుకిది ?"

కాని ఆ ప్రశ్నలకు సమాధానమూ రాలేదు.. ఎవరూ ఆయన విజ్ఞప్తిని పాటించనూలేదు. తాను సాధించిన ఈ సత్యాగ్రహ మహోత్సవానికి ఆటంకం అనేదివస్తే రజాకార్లనుంచేనని ఆయన అనుకొంటున్నాడు. ఇప్పుడిది అప్రత్యాశితం. సభకు పదిమైళ్ళ అవలనుంచికూడా జనం ఉత్సాహంగా రావడమూ, ఊరేగింపులలో హుషారూ చూసేక ఇటువంటి పేచీ ఏదన్నా రాగలదనే ఆలోచనకూడా పోలేదు - కాని వచ్చింది.

అసలు సంగతేమిటని చాటుగా ప్రశ్నించేడు. మల్లారెడ్డి కళ్ళల్లో విషం కక్కేస్తు. ఆ చూపుల్లో అసలు సంగతి ఏమిటో ఆయనకు తెలుసుననే అనిపించింది.

"వాళ్ళంతా ఆంధ్రమహాసభ వలంటీర్లు".

మల్లారెడ్డి తన ప్రశ్నకు సమాధానం ఇవ్వలేదని కిషన్‌రావుకు అర్థం అయింది. ఆంధ్రమహాసభ వలంటీర్లు అయితే అడ్డువస్తారనా ?

ఈ పదిరోజులనుంచీ ఇంత కష్టపడి పనిచేస్తున్నవాళ్ళు అడ్డం ఎందుకు వచ్చేరు? ఆ ప్రశ్నకు సమాధానంలేదు. కాని, సరాసరి సమాధానం కోరడానికి ధైర్యం చాలలేదు. కాంగ్రెసు ఉద్యమాన్ని అపమానపరిచేటందుకూ, తమ పెత్తనం స్థాపించుకొనేటందుకూ మాత్రమే ఆంధ్ర మహాసభవాళ్లు ఈ పదిరోజులూ పనిచేసేరని మల్లారెడ్డి చెప్తాంటే తాను మళ్ళీ ఆలోచించవలసిన అగత్యం వుంటుందనీ అనుకోలేదు.

ఆంధ్ర మహాసభ కమ్యూనిస్టుల చేతుల్లోకి పోయేక దానిని గురించి తమ అభిప్రాయం అదే. స్టేట్ కాంగ్రెసు పోరాటం చేస్తూవున్నప్పుడు ఇది జరిగేదేనా యని వూరుకొన్నారనీ, అనుకోని విధంగా ఉద్యమం ప్రజల్లోకి పాకిపోతున్నకొద్దీ ఆ ప్రతిష్ఠలో తామకూడా వాటా సంపాదించేందుకే స్టేట్ కాంగ్రెసు, కమ్యూనిస్టుపార్టీలు కలిసి ఉద్యమాన్ని నడిపించాలన్నారనీ తమ అభిప్రాయం. ఉద్యమంలో పాల్గొంటున్నట్లే నటించుతూ కాంగ్రెసును బలహీన పరుస్తారనీ, వాళ్ళని దగ్గరకు చేరనివ్వరాదనీ లోపాయికారీగా తామంతా అనుకొనేమాటే. అదే మల్లారెడ్డి అన్నాడు.

నిజామును అసలు రాజ్యంలోంచే వెళ్ళగొట్టాలంటారు. వతన్‌దారీ పద్ధతిని నిర్మూలించాలంటారు. కాని, చివరికి వీళ్ళ పని ఇది అని తీసడింపు కలిగింది. అంతా కలిసి పనిచేద్దామంటారు. ప్రకటనలమీద ప్రకటనలు చేస్తారు. తీరాచేసి పనిలోకివస్తే ఇదీవరస — అనుకొన్నాడు.

ఈ వలంటీర్లతో గాకుండా అసలు నాయకులతోనే మాట్లాడాలి:

"ఆంధ్ర మహాసభ కార్యకర్త లెవరన్నావుంటే, ముందుకి రావాలని నా ప్రార్థన!"

సభలో ప్రతిఒక్కడూ తన చుట్టూవున్నవాళ్ళ మొగాలలోకి చూసేడు. కాని, ఒక్కరూ కదలలేదు. రాలేదు. దస్త్రాలముందున్న

వెంకటయ్య తలఎత్తి చూసేడు. ఆ ఆహ్వానం తనకేమో అతనికి అర్థం కాలేదు.

అందరి చూపులూ తనమీదనే వుండడం చూసి వెంకటయ్య కంగారు పడుతున్నాడు. దిక్కులు చూస్తున్నాడు. తమ సాయం కోరిన వాళ్ళెవరూ కనబడ్డంలేదు. అందరూ కాకపోయినా, కొందరయినా తాము అల్లరికే వచ్చేరనుకొనేటట్లుంది. తాము ఆంధ్ర మహాసభ నాయకత్వాన దళంగా ఏర్పడినట్లు అందరూ ఎరుగుదురు. తాము ఆంధ్ర మహాసభకే అప్రతిష్ఠ తెస్తామేమో ననిపించింది. చాల అసందర్భ పరిస్థితి. తప్పంతా తమదే నన్నట్లు మల్లారెడ్డి మాట్లాడుతూంటే అరికాళ్ళక్రింద మంట పెడుతున్నట్లనిపించింది. మధ్యన ఈ బెడదేమిటని విసుగూ పుట్టింది. కాని ఓరిమి కోల్పోదలచలేదు. ప్రక్కనేవున్న భాగ్యరెడ్డిని పిలిచి అతని చెవిలో ఏదో చెప్పేడు. ఆతడు తల ఎగరేసి, జనాన్ని ఒత్తిగించుకొని సభ వెనుకకు హడావిడిగా వెళ్ళేడు.

తన ఆజ్ఞని అంత నిర్లక్ష్యంగా ధిక్కరించడం చూసేసరికి మల్లారెడ్డి దిగ్భ్రమచెందేడు. భాగ్యరెడ్డి హడావిడిగా సభ చివరకూర్చున్న తన వూరివాళ్ళను కలుసుకొనేటందుకు వెళ్ళడం చూసేక దానినంత సులభంగా లోసెయ్యానికి వీలులేదనుకొన్నాడు. తన వూరివాళ్ళచెయ్యి వుందన్న మాటే. మొదట కేవలం అనుమానమాత్రంగావుంది. ఇప్పుడది ధృవపడింది. కాని దీని వెనక ఎంతమంది ప్రోద్బలంవుందో అర్థం కాలేదు. లేకపోతే ఇంకా చూస్తారేమని తన బలగాన్ని వుసికొల్పేవాడే. మాట నాలికచివరకంటా వచ్చింది కూడా. అయినా పస్తాయించేడు. రోజులు బాగాలేవు. తొందరపడకూడదని మనస్సు నిగ్రహించుకొన్నాడు.

నిశ్శబ్దంగా వుండమని హెచ్చరించడానికై బల్లమీద చప్పుడు చేసేడు. కాస్త సందడి తగ్గగానే తన ఎత్తు సాగించేడు.

"పొరుగూరి వాళ్ళొచ్చి ఇల్లా వూళ్ళో అల్లరిచేస్తూంటే అడిగే పనిలేదా? అందులోనూ దేశభక్తియుతమైన ఒక మహా కార్యానికి విఘ్నం కలిగిస్తున్నారు. ఇల్లాంటి దుష్టపనులు సాగనిస్తే గ్రామానికే అప్రతిష్ఠకాదా"—ఈ ధోరణిలో ఆయన వుపన్యాసం సాగిపోతూంది.

వేదిక ప్రక్కనే నిలబడ్డ పటేల్ కొడుకులూ, ఇతర వలంటీర్లూ బుస్సు బుస్సు మంటున్నారు. అమ్మ, ఆలి, వూతపదాలతో సీతారాంపురం వాళ్ళ వాళ్ళపొగరును గుసగుసలతో వర్ణిస్తున్నారు. సర్కిలినస్పెక్టరునే కొట్టిన జనం ఎంతకు తగదని పోలికలు తెస్తున్నారు.

ప్రక్కనేవున్న రంగయ్యాకి కష్టం అనిపించింది. తమ వూరి వాళ్ళని మాటలు అంటూంటే అదే శంక కలుగుతూంది. కిషన్‌రావుతో కాంగ్రెసు వలంటీర్ల అన్యాయారోపణలను గురించి ఫిర్యాదు చేసేడు.

"రజాకార్లువచ్చి ఓ అమాయకుణ్ణి చంపిపోయేరు. చంపినవాళ్ళని పట్టుకోవడంమాని సర్కిలినస్పెక్టరు ఊళ్ళోవాళ్ళని అరెస్టు చేసేడు. మడతబాదుడు సాగించేడు. వూళ్లోవాళ్లు విడిపించుకొని తెచ్చుకొన్నారు. కాంగ్రెసువారు మాత్రం ఏం చెప్తారు? చంపేస్తూంటే చావమంటారా?"

కిషన్‌రావు అవకాశం దొరికింది గనక కాంగ్రెసు అహింసా సూత్రాల్ని గురించి క్లుప్తంగానైనా చెప్పకుండా వుండలేకపోయేడు.

రంగయ్యాకు ఏమనాలో అర్థం కాలేదు. కిషన్‌రావు నిజంగానే అహింసా విధానాన్ని నమ్ముతున్నాడా అనిపించింది.

సర్కిలుకు దెబ్బలు తగిలినందుకూ, తమ వాళ్ళని విడిపించు కొన్నందుకూ తమ వూరి వాళ్ళని అందరూ అభినందించేరు. చుట్టు పక్కల వూళ్ళవాళ్ళు ఎంతో సంతోషించేరు. ఇప్పుడు రేః వాసుదేపేట వచ్చేరన్నా ఈ వూరివాళ్ళు నాలుగుమాట్లు తిరిగి తమ వూళ్ళో [illegible] దళం పెట్టమంటేనేరవ!

అయినా ఈ విధంగా తిట్లు తినడం తమ వాళ్ళదే తప్పు అనిపించింది. ప్రక్కవూళ్ళల్లో పేచీలు పెట్టుకొనేటందుకేనా తమ వూళ్ళో దళం పెట్టుకొన్నది? రజాకార్లనుంచి రక్షణకోసం వీళ్ళనిపోషిస్తున్నారు గాని, కాంగ్రెసుకూడా అడ్డం తగలమనా?

అసలు వెంకటయ్య ఆ విధంగా వస్త్రాలుతగలపెట్టకుండా ఎందుకు అడ్డువచ్చేడో తెలియదు. పక్కకు పిలిచి ఏమిటీ పని అని అడగడానికైనా అతనితో మాటల్లేవు. అక్కతో పెళ్ళిసమస్య వచ్చినప్పటినుంచీ వెంకటయ్యమీద అసహ్యం ఏర్పడింది. ఆ పెళ్ళి చెడిపోయినా అసహ్యం పోలేదు. కనక మిగిలిన వాళ్ళని పలకరించిచూసేడు.

వాళ్ళు అతని ఆరాటాన్ని గమనించలేదు. వస్త్రాలు నిజామువి, వాడి అబ్బసొమ్మేది తగలపెట్టడానికి వీలులేదన్నారు. వూరివాళ్ళు తమ సాయంకోరేరు. ఈ వూళ్ళో దళంలేదు గనక తమ సాయం అవసరమయింది. రాము సరే నన్నారు. అంతే. అంతకన్న వాళ్ళకెక్కువేం తెలియదు.

"మీ సాయంకోరిన వాళ్ళంతా ఏమయ్యేరు? పటేల్ ఆ మొయిని ఆలా మాట్లాడుతూంటే ముందుకురారేం?"

"తొందరపడక"ని వెంకటయ్యే మాటకలిపేడు. ఆ విధంగా వెంకటయ్యే సమాధానం చెప్పడం రంగయ్యకు చిరాకనిపించింది. కనుబొమ్మలు ముడేసేడు. కాని ఏమీ అనలేదు.

వస్తారు. వాళ్ళు వచ్చినా రాకపోయినా కొట్లాట తప్పదనిపించింది.

కాని, అతని భయం నిరాధారం. సరిగ్గా ఆ సమయానికి వూరివాళ్ళు నలుగురైదుగురు తెగింపుచేసుకొన్నట్లు ఒక్కవూపుతో ముందుకొచ్చేరు. చెప్పులు విడిచేరు. తలగుడ్డలు మెడలో చుట్టుకొన్నారు.

నడుములవరకూ వొంగి పటేల్ సాబ్‌కూ, కిషన్‌రావు దొరకూ అభివ చెప్పుకొన్నారు. వారి మాటలన్నీ ఎంతో వినయంగా చెప్పినదంతా విన్నారు. కాని, దస్త్రాలు తగులపెట్టడం మాటవచ్చేసరికి అంతవినయం గానే పనికిరాదన్నారు.

"మే మిచ్చిన రెవీగల్లా సంగతేమిటి?"

అదీ వాళ్ళ అభ్యంతరం. నిరుడిచ్చిన రెవీగల్లాకింతవరకూ డబ్బు రాలేదు. ఈ ఏడాది మళ్ళీ రెవీపట్టుకుపోయేరు. పటేల్‌సాబ్ వుండి పోతూంటే అదో పద్ధతి. ఎవరు రెవీఇచ్చిందీ, ఎంతఇచ్చిందీ. ఎవరెవరి కెంతడబ్బు ఇవ్వాలో ఆయనకు తెలుస్తుంది. ఆయన వుద్యోగం వదిలి వెళ్ళిపోతున్నారు. దస్త్రాలు లేకపోతే?...

దస్త్రాలు తగలపెట్టవలసిన అవసరాన్ని కిషన్‌రావు వాళ్ళకి బోధించడానికి ప్రయత్నించేడు. కాని, రైతుల మాటలు విన్నాక ఏం చెప్పాలో అర్థం కాలేదు. విస్తుపోయి పటేల్‌వంక చూసేడు.

అసంతృప్తిగానే అయితేనేం, అన్నీవిన్నాక రంగయ్యకూ రైతుల మాటలలో కొంతసబబు లేకపోలేదనిపించింది. కాని, కిషన్‌రావు ఇంత చిన్న విషయాని కింత రభసా అని ఈసడిస్తూంటే కాదనలేకపోయేడు. ఈ నాడు జరుగుతున్న మహోత్సవప్రాముఖ్యతతో పోల్చిచూస్తే ఆ ధాన్యం విలువ ఎంత? తీరాచేస్తే వీళ్ళిచ్చే రెవీ ఎంతవుంటుందేం?

అదీ నిజమే అనిపించింది. తనకీవూరివాళ్ళస్థితి ఎరికలేకపోలేదు. దగ్గిరవూరు. బంధుత్వాలరీత్యా తానిక్కడికి నాలుగైదుసార్లు వచ్చేడు కూడాను. వీళ్ళల్లో చాలామందిని తాను పేరుపేరు వరసన ఎరుగును; ఎవరికెంత ఆస్తుందో కుంటలలెక్కని చెప్పలేడేమో కాని, ఏపాటివాళ్ళో తెలియకపోలేదు. పైగా వాళ్ళకట్టూ, కట్టుబట్టా, వ్యవహారమూ వాళ్ళ ఆర్థిక పరిస్థితికి ప్రత్యక్షప్రమాణాలు, ఏఒక్కరికీ స్వంతభూమి వుండి

వుండదు. పెద్దకారు రైతులు అటూయిటూ చెప్పకుండా ముసిముసినవ్వులు నవ్వుతూ వెనకవెనకనే వుండిపోయేరు. ఈ రభసలో వాళ్ళచెయ్యి వున్నట్లు రంగయ్యకు అనిపించింది. అసలు లెవీవసూలిచ్చే జనం ముందుకు రావడం లేదు. బుడ్డెడూ, తూమెడూ కన్న ఇవ్వలేని రకం పేచీపెడుతున్నారు. వీళ్ళు నలుగురూ ఇచ్చింది ఓ అరబస్తాకిమించి వుండవు. పదిబస్తాలయితే మాత్రం? ఒక గ్రామంలో నిజాము పెత్తనానికీ, అధికారానికీ మూలస్తంభమే కదిలిపోతూంటే పదిబస్తాల ధాన్యం లెక్కతేలలేదని దానిని నిలబెడతామా?

కిషన్‌రావూ అదే అన్నాడు.

"నిజాము ఖజానా ఓ మొసలి. దానినోట పడినది ఏది ఎప్పుడు తిరిగొచ్చింది, ఈ ధాన్యం తిరిగిరావడానికి? ఆ మొసలిని సాగనంపవానికి పెద్ద ప్రయత్నం చేస్తూంటే, దాని కడుపులో తమ వస్తువేదో వుండిపోయిందని అడ్డం వెడతామా?"

కిషన్‌రావుమాట రంగయ్యకి సత్యం అనిపించింది, అయినా జనం స్వభావం ఎరిగి వుండడంచేత తొందరపడవద్దని పదేపదే హెచ్చరించాడు.

"...అడ్డంవచ్చిన వాళ్ళని గెంటేసి పనిజరిపించేస్తా." మరొకప్పుడైతే కిషన్‌రావు మల్లారెడ్డితో సై అనేవాడే. ఎదురాడడం అవమానించడమనుకొనే కుటుంబంలోనే ఆయనా పుట్టిపెరిగేడు, ఆయన నాలుగైదూళ్ళున్న దేశముఖుల కుటుంబములో వాడే. ఎంత కాంగ్రెసువాడైనా ఎదురుమాట సహించలేని మనస్తత్వం దేశముఖ్‌గిరీది. అయినా రాజకీయాల్లోకివచ్చేక బాగాఎరిగి బైఠాయించాలనే అభిప్రాయం పట్టుబడింది. ఇప్పుడదే వుపయోగించింది,

సీతారాంపురం దళంవాళ్లు జాగాఇచ్చేలాగలేరు. వూరిజనం చిత్తం బాబయ్యా అంటూనే మల్లారెడ్డి సంకల్పాన్ని ఖచ్చితంగా ఎదిరిస్తున్నారు.

ఈ వారంనుంచీ తమతోనేవుండి రాత్రీపగలూ కష్టపడి పనిచేస్తున్న తమ పాలేర్లు కూడా పోగిసలాటలో పడ్డారు. సైదులురెడ్డి రైతుల మాటలు నిజంగానే వున్నాయని చెవులు కొరుకుతున్నారు. అతని తండ్రిమీద కసికొద్దీ మల్లారెడ్డి రెండేళ్ళ క్రితం లెవీవసూలు పేరుతో ఇంట్లో రెండే రెండు మణుగుల ధాన్యంవుంటే జప్తుచేయించేడు, ఎక్కడన్నా దాచే దేమోననే అనుమానంతో ఊరగాయకుండలు పగలకొట్టించేడు, వా డిప్పుడు కసితీర్చుకుంటున్నట్లనిపించింది. కాని, ఏమీ అనలేడు. ఎవరి ధాన్యం వాళ్ళకిచ్చేస్తేనే మంచిదని వాళ్ళూ అనుకోవడం వినిపడ్డాక కిషన్‌రావు పటేల్ మల్లారెడ్డి గర్జనలను సమర్థించలేకపోయేడు.

## ఎనిమిదో ప్రకరణము.

పటేల్ గర్జనలు వింటూవుంటే రంగయ్యకు కంపరం పుట్టింది. వ్యవహారం గొడవలో పడుతూందనిపించింది. ఇదేమిటీ పీడ అనుకొన్నాడు. పొరుగూరువచ్చి ఈ విధంగా సభలో తమ వూరికి తిట్లుతెస్తున్నందుకు దళసభ్యులమీద రంగయ్యకు ఎంతో కోపంవచ్చింది. కాని తాను కూడా వాళ్ళని నిందించలేకపోయేడు. వాళ్ళు నెత్తిన వేసుకొన్న పని తనకు నచ్చకపోయినా వాళ్ళ పనిని సమర్థించకుండా వుండలేకపోయేడు. గ్రామాభిమానం అటువంటిది. ఆ అభిమానంతోనే కావచ్చు, పటేల్ వేస్తున్న రంకెలతో అంతకు పూర్వం ఆయనమీద ఏర్పడిన సద్భావం చెడి వెనుకటి అనుమానాలే మళ్ళీ తలఎత్తి వుండొచ్చు. ఏమయితేనేం ముందు గ్రామస్థుల అభ్యంతరం వినడం అవసరం అన్నాడు. దొంక తిరుగుడుగా తన వూరివాళ్ళచర్యనే సమర్థించడంచూచి కిషన్‌రావు ఏమీ అనలేకపోయేడు.

రంగయ్య మొదట్లో ఏదో సర్దుబాటుకోసమే గ్రామస్థుల అభ్యంతరం ఏమిటో వినాలన్నాడు గాని, తర్వాత జరిగిన వ్యవహారం చూసేక నిజంగానే ప్రజల అభ్యంతరాన్ని తోసిపారెయ్యడానికి వీలులేదనే అనిపించింది.

తాను వసూలుచేసిన లెవీఎంతో, ఎవరివద్ద ఎంతెంత వసూలు చేశాడో పటేల్ మల్లారెడ్డికి గుర్తులేదు. "ఇదే జ్ఞాపకమా. ఆ లెక్కలేవో ఆ పుస్తకాలలోనే వుంటాయి."

అల్లాంటప్పుడు ఆ పుస్తకాలు తగలబెట్టేస్తే ఎల్లాగ ?...ఆ ప్రశ్న రాకుండా వుంటుందా ?...వచ్చింది...

పటేల్ మల్లారెడ్డి మహాత్యణీకారంగా "ఈ మొహాలిచ్చే దెంతేం?" అన్నాడు.

కాని, అదీ లెక్క త్వరలోనే తేలిపోయింది. మణుగూ, రెండు మణుగులూ చొప్పునేనాయె వసూలుచేసింది నూరు పల్లాలకు పైగానే లెక్కతేలింది.

మరొకటి కూడా బయటపడింది...

వీళ్ళేమిస్తారనుకొన్న ఈ గోచిపాతరాయుళ్ళనుంచే ఆయనగ్రామం మొత్తం మీద వసూలుకావలసినదంతా వసూలుచేసేడు. అన్నిచోట్లా జరిగేది అంతే. ఇక్కడ జరిగిందీ అదే. పెద్ద ఆసాములు కొద్దో, గొప్పో ఇచ్చిలేదనిపించుకొన్నారు. అసలు ఇవ్వవలసింది వాళ్ళే. అయినా మల్లారెడ్డి చిన్నకారు రైతులనుంచీ, కౌలుదార్లనుంచీ తీసుకొన్నాడు. భూస్వాములు తాము ఇవ్వవలసినది కౌలుదార్లచేత ఇప్పించేరు.

* * * *

వూరిలో వసూలు చేయవలసిన ధాన్యం పరిమితిని ప్రభుత్వం నిర్ణయిస్తుంది, అంతవరకూ అధికారులు శ్రద్ధతీసుకొంటారు. తరువాత

పని ఇక వాళ్ళకేపటను. ఎకరానికెంత వసూలుచెయ్యాలి? ఎంతభూమి వున్నవాళ్ళనుంచి తీసుకోవాలి—అనేవి ప్రభుత్వనిర్ణయాలలోవున్నా వాటిని అసలు జరుపవలసింది ఈ పటేళ్ళూ, పట్వారీలే.

వాళ్ళకి పెద్దరైతులతో బోలెడు సంబంధాలుంటాయి. బాంధవ్యం, స్నేహం, మొగమోటం, అవసరం—ఆ సంబంధాలు అనేక రూపాలవి. వాళ్ళకి ఖానూను తెలుసు. దానిని బుట్టదాఖలుచేసే పద్ధతీ తెలుసు. వాళ్ళనుంచి గల్లావసూలవదు. చెయ్యలేరు. చేసినా రశీదులివ్వాలి. తాశీలునుంచి డబ్బు వాళ్ళే తెచ్చుకోగలరు.

సన్నకారుకు అటువంటి సంబంధాలుండవు. తమమీద భక్తి వుంటుంది. భయంవుంటుంది. రశీదు లడగలేరు. ఓ నెల ఆలస్యం అయినా అవసరంవచ్చి వాడుకొన్నానన్నా పేచీపెట్టలేరు.

పైగా లెవీగల్లా తాము కొలవాలా? అక్కర్లేదా? ఎంతకొలవాలి?... మొదలయిన సంగతులు ఏవీ వాళ్ళకి తెలియవు. పటేల్‌సాబ్ చెప్పేడు. బస్. ఇంట్లో గింజలులేకపోతే కొనన్నాతెచ్చి కొలవాలిసిందే. ఆలా కొలిచేస్తారు.

మల్లారెడ్డి పటేలు చేసిందింతే.

* * * *

అసలు కథంతా బయటపడ్డాక అరగంట క్రితం ఆయనమీద కొత్తగా ఏర్పడిన సద్భావం కాస్తాపోయింది. అన్నీ విని రంగయ్యా ఎవరి ఫాస్యం వారికి కొలిచెయ్యడమే మంచిదన్నాడు.

"అసలు వూళ్ళల్లో గింజదొరకడమే కష్టంగావుంది. ఇంకో రెండు నెలలుపోతే తప్ప కొత్త పంటలురావు. పైనుంచి రాకుండా రజాకార్లు అడ్డగిస్తున్నారని పత్రికలు చెప్తున్నారు. లెవీ ఏమిటిప్పుడు? అసలు ప్రభుత్వమే పోతూంటేను. ఎవరిగింజలు వాళ్ళకికొలిచి ఇచ్చెయ్యాలి..."

రంగయ్యమీద ఎటువంటి అభిప్రాయంవున్నా అతనివాదంవిన్నాక కిషన్‌రావుకు దానిలో సబబు వున్నదనిపించింది. నిజాం ప్రభుత్వాన్నీ, దాని అధికారాన్నీ నిరాకరించేటప్పుడు ప్రజల ధాన్యం ఆ ప్రభుత్వానికి దోచిపెట్టడం ఏమిటి? గోదాములు తెరిచేసి ఎవరి ధాన్యం వాళ్ళకి కొలిచేస్తే పేచీవుండదు. జనానికి అభ్యంతరంవుండదు. దస్త్రాలు తగులబెట్టేసినా; పైగా బ్రహ్మరథం పడతారు.

తాను తలపెట్టిన ఈ మహా యజ్ఞానికి ప్రజలలోంచివచ్చే ప్రోత్సాహాన్ని వూహించుకొని కిషన్‌రావు మళ్ళీ పొంగిపోయేడు.

కాని అది మల్లారెడ్డికి అంగీకారం కాలేదు. తల అడ్డంగా తిప్పేడు.

ధాన్యం వాడేసుకోవడమో, అమ్మేసి డబ్బుచేసుకోవడమో జరిగిపోయుండేమో. అందుకే గింజలు కొలవడానికి ఇష్టపడడంలేదేమో అనిపించింది. నిజస్థితి తెలుసుకొనేటందుకు కిషన్‌రావు ప్రయత్నించేడు.

మల్లారెడ్డి ఆయన ప్రశ్నను లెక్కచేయలేదు. బుకాయించేడు.

"నిజాం ప్రభుత్వంపోతే మరింకే ప్రభుత్వమూ రాదా? కాంగ్రెస్ అధికారంలోకి వస్తుంది. వాళ్లు మాత్రం లెవీ వసూలు చెయ్యరా? చెయ్యక్కర్లేదా? ఖజానా అంతనూ నిజాం వూడ్చిపెట్టేస్తే, గల్లా గోదాములు ఓళ్ళాడ్చిపెడితే కాంగ్రెసు సర్కారు నడిచేదెల్లాగ?" అదీ ఆయన వాదం.

అవును. అదీ నిజమే.

కాంగ్రెసే తమ రాష్ట్రంలో అధికారంలోకి వస్తుందనే మాట కిషన్‌రావును చాలా సంతోషపెట్టింది. నిజమే! తాను అంతవరకూ ఆ సంగతిని ఆలోచించనేలేదు. అంత దూరదృష్టిగల మల్లారెడ్డిలాంటి వాళ్ళని ఉద్యమంలోకి లాగగలగడం తన అదృష్టమే ననిపించింది, మళ్లీ ఇంకోమాటు.

మల్లారెడ్డి మాటలో సబబుంది. కాంగ్రెస్ సర్కారు వస్తుంది. అప్పుడు?...ఆయన రంగయ్య మొహం చూసేడు.

మల్లారెడ్డి వాదం అంతతో ఆగలేదు. ఈ మారాయన రంగయ్యను బెదరగొట్టడానికి పూనుకొన్నాడు.

"నిజామును గెంటెయ్యగల శక్తి కాంగ్రెసుకే వుంది. ఆ ప్రయత్నంలో అడ్డంవచ్చిన వాళ్ళని నలిపేసేశక్తి దానికుంది..."—అంటూ మల్లారెడ్డి రంగయ్యవేపు కొరకొరా చూసేడు. తానేదో నిజామును తన్నేస్తూంటే రంగయ్య ఆ కాలికి అడ్డంవస్తున్నట్లు.

మల్లారెడ్డి మళ్ళీ సాగించేడు.

"బ్రిటిష్ వాళ్ళని జితోస్మి అనిపించిన కాంగ్రెసుకి నిజాము ఓ లెక్కా? కాంగ్రెసు సర్కారు వచ్చితీరుతుంది. వచ్చినాక లెవీగల్లా ఏమయిందంటే ఏం చెప్పాలి. సమాధానం ఇవ్వవలసింది, తానా, రంగయ్యా?..."

రంగయ్య ఆ బాధ్యత తీసుకొనేటట్లయితే తనకేమీ అభ్యంతరం లేదన్నాడు పటేలు.

ఆ బుకాయింపు చూసేక మల్లారెడ్డి లెవీధాన్యాన్ని జాగ్రత్త చేసేడనిపించింది కిషన్‌రావుకి. దానిని బయట పెట్టదలుచుకోలేదని కూడా స్పష్టపడింది. అందుచేత ఇప్పుడు పనిజరగాలంటే జనాన్ని దిగదీయవలసిందే. తర్వాత ఒంటరిగా వున్నప్పుడు చెప్పి చూడొచ్చు. విన్నావా వింటాడు లేకపోలేదు. ప్రస్తుతం పనిజరగాలనుకొన్నాడు. మల్లారెడ్డి మాటలకు వత్తాసు ఇస్తూ రంగయ్యవంటివాళ్ళు తమ బాధ్యతలను ఎల్లా నిర్వహించాలో సన్నగొంతులో ఒక చిన్న ఉపన్యాసం ఇచ్చేడు.

బాధ్యతమాట వచ్చేసరికి రంగయ్య వెనకడుగు వేసేడు. లెవీగల్లా ఏమయిందని అడిగే ప్రభుత్వం దాని ఖరీదు ఇచ్చేవా లేదా యని అడగదా? పటేల్ చెప్పినదే నమ్మెయ్యడానికి ప్రభుత్వం అంత గుడ్డిగా

తయారవుతుందా ? ఒకీదులూ అవీ చూడదా ? ఏమంటే : చేల్ మల్లారెడ్డి సమాధానం చెప్పనక్కర్లేదా ? ఈ బాధ్యతల మాటేమిటి ?...అని ప్రశ్నించాలనే ఆలోచనే తట్టలేదు. తనమీద ఏదో పెద్దబరువు పడి పోతూన్నదనే భయం. ఈ వూరివాళ్ళ బాధ్యత తీసికొనేందుకు మధ్య రానెవరనిపించింది.

కాంగ్రెసు వలంటీర్లలోంచే ఒకరు ఆతనికి ఆసరావచ్చేరు. బాధ్యతమాట వచ్చేసరికి సైదులరెడ్డి ఊరివాళ్ళ విషయంలో ఎవ్వరూ బాధ్యత తీసుకోవలసిన అవసరం లేదన్నాడు.

"నిజాముకు లెవీకొలిచిన వాళ్ళు కాంగ్రెసుకు మాత్రం ఇవ్వరా ? వూరి జనంమీద ఈ అపనమ్మకం ఎందుకు ?"

నీ సంగతి గుర్తుంచు కొంటున్నానులే అన్నట్లు మల్లారెడ్డి చురుకు చురుకు చూసేడు.

సైదులరెడ్డికి రంగయ్య తన మనస్సులోనే కృతజ్ఞత తెలిపేడు. ఓ నిమిషం ఆలోచించి తానో సలహా యిచ్చేడు.

"పోనీ రైతులిచ్చిన ధాన్యానికి ధర ఇచ్చెయ్యొచ్చును."

మల్లారెడ్డి దానికీ అంగీకరించలేదు. ఒకటి—తనవద్ద డబ్బులేదు. డబ్బేవుండి ఇస్తాడే అనుకొందాం. నిజాం సర్కారింకా పోలేదుగా ? ఎప్పుడో వచ్చి ఆ ధాన్యంకాస్తా పట్టుకుపోతే ? మధ్యన నష్టపడేది తానా ? అట్లాంటివి తన వద్ద చెప్పవద్దన్నాడు.

కాని, అన్నింటికన్నా పెద్దదీ, ప్రధానమైనదీ అభ్యంతరం మరొ కటుంది. స్పష్టంగా అది మాత్రం తేల్చేసేడు.

తనంతవాణ్ణి ఈ మూక ఫలానిది ఏమయిందని నిలేసేపాటివాళ్ళ య్యేరా ? ఇదివరకెప్పుడన్నా అడిగేరా ? శీతారాంపురంవాళ్ళు నేర్పిపెడు తున్నారే గాని......

* * * *

వేదికమీద జరుగుతున్న రంవాగొంపి జనానికి వినిపించడంలేదు. వాళ్ళల్లో ఓర్పుతగ్గిపోతూంది. అందరూ పోగడి తన ధాన్యం ఎగవెట్టే టట్లున్నాడనిపిస్తూంది. మధ్యమధ్య తమదాకా వస్తున్న ఒకటి రెండు మాటలు అనుమానాన్నే బలపరుస్తున్నాయి. కదిల్చిన కందిరీగల తుట్టలా జనం ఘుమ్మంటున్నారు. ఏ మూలనుంచో ఒక కేక వినవచ్చింది.

"ఇంకీ ఆటలేం సాగవు. ధాన్యం బయటపెట్టు."

ఓ చిన్న బూతుమాట ఊతపదంగా వచ్చిన ఆ హెచ్చరికకు మల్లారెడ్డి తిరిగబడి చూసేడు. అసంఖ్యాకంగావున్న అనేక వూళ్ళ జనంలో ఆ మాట అన్నదెవరో, తన వూరివాళ్ళకే అయితే ఆ ధైర్యం వుండదు. చుట్టుప్రక్కల వూళ్ళనుంచి ఇంతమంది చేరడంతో వచ్చిన ధైర్యం కాబోలు. మునివేళ్ళమీద నిలబడి, ముందునిల్చున్న వాళ్ళవీపుల వెనక దాగిన ముఖాల్ని చూడ్డానికి ప్రయత్నించేడు. కాని ఏమీ అర్థం కాలేదు. ఆ మాట అన్నంతవరకే ధైర్యం నిలిచివుంటుంది. తరువాత భయంపుట్టి వెనక్కి జారిపోయివుంటాడు.

ఒక్కమాటు నిందాపూర్వకమైన మాట గొంతుపెగిలి బయట పడ్డాక జనంలోవున్న భయం కాస్తా ఎగిరిపోయింది, మల్లారెడ్డి చండ శాసనుడన్న బెదురు జారిపోయింది. ధాన్యం పంచవలసిందేనన్న ఒత్తిడి ఎక్కువ అయింది,

చూస్తూ చూస్తూండగానే తన కళ్ళముందరే జనంలో తనమీదవున్న భయభక్తులు జారిపోతున్నట్లు మల్లారెడ్డి గ్రహించేడు. మరో సమయం అయితే వానిని రక్షించుకొనేటందుకు తుపాకీ పుచ్చుకొని వుండేవాడు. కాంగ్రెసు తనచేత సత్యాగ్రహంచేయించి అస్త్రసన్యాసం ఇప్పించినట్లని పించింది. తన జీవితంలో ఎన్నడూ భయం అనేదెరగడు. ఆయుధం చేతిలోవున్నా లేకపోయినా తన పేరూ, తనమందీ, మార్బలమూ ఎంత

మందిలో ఎంతద్వేషంవున్నా దిగమింగుకొనేలాచేసేవి. కాని, ఈ వేళ కొరివితో తలగోక్కొన్నట్లు వూళ్ళవూళ్ళనుంచి జనాన్ని తెచ్చేరు. మంది బలం. తాను తొందరపడ్డానికూడా వీలులేదు. కొడుకు మొగంలో తుపాకీ తేవాలనే ఆలోచనను చదివి కనుసైగతో ఆపేడు.

* * * *

మల్లారెడ్డిని గదమాయిస్తూ మాటవినబడ్డాక కిషన్‌రావు రంగయ్యకు రాజకీయాల బోధ ప్రారంభించేడు. గ్రామగ్రామాలనుండి జనాన్ని పెద్దఎత్తున సమీకరించుదామని రంగయ్యచేసిన సూచనలో ఆయన పెద్ద కుట్ర ఆలోచనలున్నట్లు కనిపెట్టేడు. దానికి తానూ అంగీకరించి, ప్రతి రోజూ, పూట పూటా ఆ ప్రయత్నాలు ఎలాసాగుతున్నాయో కనుక్కొంటూవచ్చిన సంగతి మరిచిపోయేడు. ఆయన సాధింపు ద్విముఖం: కాంగ్రెసు వుద్యమాన్ని తమ పార్టీస్వార్థాలకే వుపయోగించుకోదలచి దానిలో పాల్గొనదలచేరనేది ఒకటి. రెండోది. కమ్యూనిస్టులు పొట్టా జనం, పీడిత తాడిత ప్రజా అంటూచేసే జపం ఎంతవనికి మాలిందో ఈ ఘటన రుజువుచేస్తూందనే దొకటి.

"పెద్దంతరం, చిన్నంతరం, అనేమాట అనవిమాట వాళ్ళకి తెలియదు. కమ్యూనిస్టులు పీడితతాడిత ప్రజలంటూ ఘజాన్ని వేసుకొనేవాళ్లు పీళ్ళమాట వినరు. అదుపులో వుండరు. అదుపులో పెట్టుకోలేని పెద్ద పులిని పెంచడానికి ప్రయత్నించకూడదు. అందుకే గాంధీజీ సత్యాగ్రహానికి, వ్యక్తిగత సత్యాగ్రహానికి ప్రాముఖ్యత ఇచ్చేరు."

కిషన్‌రావు కమ్యూనిస్టుల పంథా ఏవిధంగా తప్పో చెప్పడానికి ప్రయత్నిస్తూంటే రంగయ్య తాను కమ్యూనిస్టును కానని చెప్పుకోడానికి తంటాలు పడ్డాడు.

* * * *

వేదికనుంచి ఏ మాటా రాకపోవడం జనంలో మరింత ఉద్రేకాలకి కారణం అయింది. ఒక ప్రక్కగా వుండిపోయిన ఆడవాళ్ళు కూడా ఈమాటు లేచేరు. చంకల్లోవున్న చంటిబిడ్డలు గీగా అని చెవులు చిడకలు కట్టించేస్తున్నారు. వాళ్ళని సముదాయిస్తున్నారు. అలగం రొచ్చేస్తారు. వెనకా ముందరా సుళ్ళుపడ్డారు. తలోమాటా అన్నారు. ఈసత్యాగ్రహాలూ, చట్టుబండలూ మంది పంట మింగెయ్యడానికిగాని నిజమేనా అన్నారు.

"పెద్దపులి పేరంటాని కెట్టుకుందిట."

* * * *

ఎవరన్నారో తెలియకపోయినా ఆ మాటలు గునపం పోటులా తగిలేయి. వేదికమీది జనం తెల్లమొగాలు వేసేరు.

ఆ మాట రంగయ్యక్కూడా కష్టమే అనిపించింది.

ధాన్యం ఎగబెట్టడానికే అయితే సత్యాగ్రహం ఎందుకు? ఆ మాటకు అర్థంలేదనిపించింది. సుఖానవున్న ప్రాణం దుఃఖానపెట్టుకొని అరెస్టులకీ, జైలుశిక్షలకీ సిద్ధపడడం అవసరమా? ఈ బాధలు లేకుండా ఎగబెట్టలేడా? రెండేళ్ళనుంచి గ్రామాలలో వసూలుచేసిన పైకం లెక్కలో కట్టలేదని వింటున్నాడు. దానికి ఎవరేంచేసేరు? ఇదివరకల్లా వసూలు చేసిన ధాన్యమో, దాని ఖరీదో జనానికి సరిగ్గా ముట్టాయా? నిజంగా ఏ మూలనో రవంతదేశప్రేమవుంది గనకనే మల్లారెడ్డి సత్యాగ్రహం చేస్తున్నాడు. ఆ దేశప్రేమను సందేహించడం, అవమానించడం సరికాదనిపించింది.

అతడు జనం తరఫున క్షమార్పణ చెప్పుకొంటూంటే మల్లారెడ్డి కళ్ళురిమేడు. కిషన్‌రావు చిరునవ్వులో అవహేళన ప్రతిబింబించింది.

అయినా కిషన్‌రావు రంగయ్యమాట ఒప్పుకోక తప్పేదు. సత్యాగ్రహం విజయవంతంగా **జరగాలంటే** ఎవరి ధాన్యం వారిచ్చెయ్యడానికి సిద్ధపడవలసిందే.

"మీటింగు షురూ అయినప్పుడు మల్లారెడ్డికి జేజేలు కొట్టినవారే కదా ఇప్పుడు ఎదురుతిరిగేరు ? ఇదెందుకు జరిగిందో ఆలోచించవద్దా ? కాంగ్రెసు ప్రభుత్వం ఏర్పడ్డానికి తోడ్పడ్డవాళ్ళు దానిని బలపరచరా ? లెవీలివ్వరా ? పన్నులు కట్టరా ? ఈ ధాన్యంతో అయిపోతుందా ? ఇవ్వాము అంటే వసూలుచేసే పద్ధతి ప్రభుత్వానికి తెలియదా ?"

ఈ వాదాన్నంతనూ కిషన్‌రావు అంగీకరించేడు. ఆయన వెనకనేవున్న ఇద్దరు ముగ్గురు కాంగ్రెసు వలంటీర్లుకూడా అవునవునని తల ఊపుతూంటే రంగయ్య మరింత గట్టిగా తన వాదాన్ని సాగించేడు.

*    *    *    *

మల్లారెడ్డి పరిస్థితులు గమనించేడు. కిషన్‌రావుకూడా వాటికి తల ఒగ్గడం చూసి ఏమీ అనలేకపోయేడు. విసుక్కొన్నాడు. కాని, తప్ప లేదు. రంగయ్యను పక్కకు పిలిచేడు. సరే ఇచ్చేద్దామని చెప్పమన్నాడు.

వకాలతు చదివిన రంగయ్య తాను ఆ విధంగా ప్రకటించితేవుండే కష్టాన్ని అర్థంచేసుకోవడం కష్టమేం కాదు. ధాన్యం ఇస్తానన్నమాట మల్లారెడ్డి నోటరాదు, తర్వాత ఆయన ఇస్తాడు, ఇవ్వడు, మధ్యన తాను చీవాట్లు తినాలి. ఆయనతో కలిసి మోసగించేడనే అప్రతిష్ఠ తన కెందుకు ?

తన మనస్సులో మెదిలిన అనుమానాన్ని బయటపెట్టకుండా ఆ ప్రకటనేదో మల్లారెడ్డేచేస్తే హుందాగా వుంటుందని సలహా ఇచ్చేడు.

ఈ చర్చ కొనసాగనివ్వడం ఇష్టంలేక కిషన్‌రావు తానే ఆ సంగతి ప్రకటించేడు.

"ప్రజ లందరూ ధాన్యం పంచాలని కోరుతున్నప్పుడు మల్లారెడ్డి పటేల్ కాదని ఎందుకు అంటారు. దానిలోవున్న సాధకబాధకాలు చెప్పేరు. కాదూ కూడదంటే ఆయన అభ్యంతరం ఏం వుంటుంది. అలా అభ్యంతరం చెప్పడం ప్రజాతంత్ర పద్ధతులకు వ్యతిరేకం. కాంగ్రెసు ప్రజాతంత్ర అభిప్రాయాలు వృద్ధిపొందాలని కోరుతుంది,"

కిషన్‌రావు కాంగ్రెసు ధ్యేయం గురించీ, ప్రజల సహకారం అవసరం గురించీ సుదీర్ఘమైన ఉపన్యాసం ఇచ్చేడు.

ధాన్యం ఇస్తాడనే ప్రకటనచేసినా జనంలో మొదటి ఉత్సాహం కనబడ్డంలేదు. జేజేలు కొట్టించడానికి హరికథా కాలక్షేపంలో హరిదాసల్లే పొడిచి పొడిచి రప్పించవలసి వస్తూంది. అది గమనించి మల్లారెడ్డివంక చూసేడు. ఆయన అర్థంఅయిందన్నట్లు తలఏగరేసేడు. ముందుకు అడుగేసి సవినయంగా ప్రజాభిప్రాయానికి తాను తల ఒగ్గుతున్నానని ప్రకటించేడు.

ఆయన తలవొగ్గే ప్రజాభిప్రాయం ఏమిటికానీ, ఈ మారు సభాస్థలం అంతా విజయనాదాలతో మారుమ్రోగింది.

గ్రామరైతుల ఇశారా తీసుకొని వెంకటయ్య దస్త్రాలకు అప్పగించేడు.

---

# తొమ్మిదో ప్రకరణం

స్టానుడి పేటనుంచి భాగ్యరెడ్డి ఇంటికివచ్చేసరికి పెద్ద ఉపాసు రేగుతూంది.

ఓటింగుపద్దనే రంగయ్య తల్లికి బురు అందించేడు. అల్లరి కాకుండా ముందు ఇంటికి వెళ్ళమని సలహాఇచ్చేడు. ఆ రోజంతా కనపడ్డప్పుడల్లా ఇంకా వెళ్ళనేలేదాయని హెచ్చరించాడు కూడా.

కాని ఇంటికెళ్ళడానికి భాగ్యారెడ్డి తొందరపడలేదు. ఇంతమంది స్నేహితుల్నీ, ఇంత ఉత్సవాన్నీ విడిచి ఇంటికి పోవడం మనస్కరించలేదు. ఏట్లు ఏలాగూ తప్పవు. వెంటనే వెళ్ళినా ఒకటే. సాయంకాలం

వెళ్ళినా ఒకటే. కనక తొందరేంవుందిలే అనుకొన్నాడు. అందరితో పాటు సాయంకాలమే వెళ్ళొచ్చు ననుకొన్నాడు.

కాని, అనుకొన్నట్లు జరగలేదు. మీటింగు జరిగిపోయేక ధాన్యం రాదని గ్రామస్థులు భయపడ్డారు. అందరూపోయి అడిగినంతకు మల్లా రెడ్డి వెంటనే కొలిచేసేడు. పేచీపెట్టలేదు. కాని, తనంతతానుగా తీసుకోండని పిలవలేదు. గ్రామస్థుల కోరికమీద వూళ్ళనుంచి వచ్చిన జనంలో కొందరు ఉగిలిపోయి ధాన్యం దగ్గరుండి అందరికీ ముట్టేటట్లు చూసేరు. ఆ పని శీతారాంపురం దళం చేతిమీదుగానే జరిగింది. అందుకోసం దళం వాళ్ళు రెండురోజులు ఆగిపోయేరు. వాళ్ళతో భాగ్యరెడ్డి ఆగిపోయేడు.

ఊరిజనం అంతా తిరిగివచ్చినా భాగ్యరెడ్డి రాకపోవడంతో నరిసిరెడ్డి మరీమండిపడ్డాడు. రంగయ్యవచ్చి తనకు సర్దిచెప్పడానికి ప్రయత్నిస్తూంటే మరీ ఉగ్రుడైపోయేడు. ఒకనాడు తాను వాళ్ళింటికి పెద్దరికం నెరపడానికివెళ్ళి తలవొప్పికట్టించుకొన్న సంగతి గుర్తువచ్చింది.

"ఇన్నాళ్ళకి మా యింటి కౌకరువచ్చి తగవు చెప్పవలసిన స్థితి వచ్చింది"

నరిసిరెడ్డి మాటలు చురుక్కుమనిపించినా రంగయ్య కంగారుపడలేదు. ఆ చిక్కులలోంచి బయటపడేటందుకు తన్నుకులాడుతూ ఇంక ఇల్లాంటి తెలివితక్కువ రాయబారాలు నెత్తినవేసుకోరాదని మనస్సులోనే లెంపలు వేసుకొన్నాడు.

రంగయ్య వెళ్ళిపోయేక నరిసిరెడ్డి మహాలక్ష్మమ్మమీద విరుచుకుపడ్డాడు.

"ఆడముండా పెత్తనం ఇల్లాగే ఏడుస్తుంది..." వ్యవహారం చెడిపోతూన్నవన్న ఆదుర్దాతో కొడుకును కమ్ముకొనేటందుకు మహాలక్ష్మమ్మ మగణ్ణీ, కొడుకుల్నీ, హాటుర్నీ దయ్యబట్టింది. వాళ్ళూ వీళ్ళూ కలిసి కోడలిమీద పడ్డారు.

రెండు రోజులు అవిచ్ఛిన్నంగా సాగిన ఈ అంతర్యుద్ధంతో ఇంటిల్లిపాదీ శారీరకంగా అలసియున్న సమయంలో భాగ్యరెడ్డి ఇంట్లో అడుగు పెట్టేడు.

అన్నగార్లిద్దరూ ఇంటిపట్టున లేరు. ముసలి నరసిరెడ్డి అరుగుమీద కూర్చున్నవాడల్లా తన్ను చూడగనే ఒక్క మాటలో తన కోపం అంతా కక్కేడు.

"తీరిందీ, దొరగారికి" వాలకంచూస్తే ఆయన అభోజనంవున్నట్లే వుంది. ఆయన ఎదటపడ్డం ఎందుకని దొడ్డిదారిని యింట్లో అడుగుపెట్టేసరికి వసారాలో కొంగుపరచుకొని తల్లి మూర్తీభవించిన శోకదేవతలా వుంది. ఆమె తలగట్లు గుమ్మంలో నిల్చుని అక్కగారు వియ్యమ్మ ఝణం ఝణ లాడేస్తూంది.

ఇంత తుపానూ తన రాకమీదనే అయివుంటుందని భాగ్యరెడ్డి కలలో కూడా వూహించలేని విషయం. తోడికోడళ్ళ మధ్యనో, కోడళ్ళు ఆడపడుచుల మధ్యనో అత్తాకోడళ్ళ మధ్యనో ఏదో పెద్దరభసే జరిగివుంటుందనుకొన్నాడు. ఈ సందర్భంలో ఎవరిని కదిపినా తుపాను తన నెత్తిన పడిపోతుందనేది అతని అనుభవం. అందుచేత తల అటూయిటూ తిప్పకుండా, ఎవ్వరినీ చూడనట్లుగా తనకు కేటాయించిన గదిలో అడుగు పెట్టేడు. క్రీగంట మూలలో గోడని చేరబడి శశిరేఖ కూర్చుని వుండడం గమనించేడు. అసలు గొడవేమిటో తెలుసుకొంటే తన కర్తవ్యం తేలిపోతుంది. కాని ధైర్యం చాలలేదు. పట్టపగలు పెళ్ళాన్ని పలకరించడానికి సంకోచంమాట ఎట్లావున్నా మగనితో చాడీలుచెప్తూందని తన భార్యకేమన్నా మాటవస్తుందనే భయంకలిగింది. ఆవిణ్ణోరాసి రంపాన పెడతారు. ఆమె వాలకంచూస్తే ఆ మసకచీకట్లో కూడా రెండు రోజులుగా పచ్చిమంచినీళ్ళు ముట్టుకొని వుండదనిపించింది. ఆమె మీద జాలికలి

గింది. పేచీలు నిత్యం అయినప్పుడు అభోజనం వుండడం కూడా ఏమిటని విసుపూ కలిగింది. ఏమీచెయ్యలేనిస్థితి. సానుభూతియన్నా చూపలేని తన నిస్సహాయతకు తనమీద తనకే కోపం వచ్చింది. 'బాగుంది వరస' అనుకుంటూ మనసాలలోకి వచ్చేడు.

పడుకున్నదల్లా భర్త రాంగనే లేచి కూర్చున్న శశిరేఖ, భర్త విసుపువిన్నాక గోడవేపు ముఖం తిప్పుకొంది.

మనసాలలోకి వచ్చేసరికి ఎదురుగావున్న అన్నగారి గది గుమ్మంలో అన్నకూతురు కనిపించింది. చేయిచాచి పిలిచేడు. పదేళ్ళ ఆడపిల్లకి సహజంగా అలవడే గ్రహణశక్తితో ఆ పిల్ల రెండురోజుల నుంచి జరుగుతున్న కలహాలకి మూలం తన పినతండ్రేనని గ్రహించడం కష్టంకాదు. ఆ పినతండ్రి రణరంగ మధ్యంలో వున్నట్టు గది గుమ్మంలో కనబడగానే అపాయం వుందని హెచ్చరిక చేయకుండా వుండలేకపోయింది. అసలు విషయం నోటితో చెప్తే తనమీద పడతారని ఆమె మూకసంజ్ఞలతో ఆతనిని ఇంట్లోంచి వెంటనే తప్పుకోమని సూచిస్తూంది. ఆ చిన్నపిల్ల చేతులు తిప్పడం ఆదుర్దా చూసేసరికి భాగ్యారెడ్డి నవ్వు ఆపుకోలేకపోయేడు. ఆతనినవ్వు విని వాకిట్లోకి వచ్చిన వదినగారు కూతురు నెత్తిమీద గిద్దెడునూనె ఇంకేలాగ రెండు మొట్టికాయలు తగిలించి మరిదిమీద తనకున్న అసంతృప్తిని ప్రకటించింది.

తలమీద తగిలిన దెబ్బకు గిలగిలలాడిపోతున్న పిల్లను భాగ్యారెడ్డి ఒక్క ఉరుకులో వెళ్ళి ఎత్తుకున్నాడు. ఆమె చేయిపట్టుకులాగుతున్న వదినగారిని విదిలించి దూరం తప్పుకొన్నాడు.

ప్రాణాలకే ఎసరుపెట్టినవాడు చిన్న దెబ్బకింత ప్రేమ చూపడం ఆశ్చర్యకరం అని ఆమె తేల్చింది.

భాగ్యరెడ్డికి ఆ మాట అర్థంకాలేదు. కాని ప్రాణానికెసరుపెట్టేడన్న ఆరోపణ ఉన్నదేంకాదు. ఆ మాటకు సంజాయిషీ కోరుతూ వదిన గారి గడిగుమ్మంలో నిలబడ్డాడు.

"ఏమిటమ్మా! నువ్వన్నమాటకి అర్థం?"

"ఏమీలేదు. మమ్మల్ని ఎవరికేనా బ్రతకనిచ్చే ఆలోచనా, తిండి తిననిచ్చే ఆలోచనా వున్నదాయని."

వెనకనుంచి వినవచ్చిన అన్నగారి గొంతువిని భాగ్యరెడ్డి వెనక్కి తిరిగేడు. అన్నగారి ప్రశ్నకి వొళ్ళు మండింది. ఆ అడిగేది ఏదో తననే అడగవచ్చుగా. పిల్లదాని నెత్తిన మొట్టికాయేస్తే ఆ సమస్య తేలుతుందా? ఆడదానికి లేకపోతే ఆపాటిజ్ఞానం తన అన్నకుండొద్దా?

తన మనస్సులోని ప్రశ్నలన్నింటినీ ఒక్క అసంపూర్ణవాక్యంలో ఇముడ్చి భాగ్యరెడ్డి పరిస్థితులను విషమింపచేసేడు.

"ఇంత తెలివైనవాడివిగనకనే..."

వాక్యంలో తరవాయి భాగం పూర్తి చెయ్యనక్కర్లేదు. అది అందరికీ తెలిసినదే. అన్ని యిళ్ళల్లోనూ ఏదో ఒకప్పుడు వినిపిస్తూండేదే. ఆ మాట అనిపించుకొన్నవాళ్ళంతా అగ్గిబరాటాలయి ఎగిరిపడేవే.

తనభార్య తనని చవటనిచేసి ఆడిస్తూందనీ, అది ఎరగుండీనావా గుర్తించనట్లు ఆమెను సమర్థిస్తున్నాడనీ సూచన రావడంతో భాగ్యరెడ్డి ఒక్కక్షణం నిస్తబ్ధుడయ్యేడు. ముఖం వెల్లబడింది. మరుక్షణంలో ఆ ఆఘాతంనుంచి తేరుకొన్నాడు. కళ్ళు ఎర్రబడ్డాయి. ముఖం జేవురించింది. మనిషి వొణికిపోతున్నాడు.

"ఏమిటీ అన్నావు?"

భాగ్యరెడ్డి నిర్భయంగా కదలకుండా ఆలాగే నిల్చున్నాడు. అతని పెదిమల విరుపులో నిర్లక్ష్యం, ఈసడింపు తొంగిచూస్తున్నాయి. మళ్ళీ ఆ మాట వినాలనుందాయని అన్నగారిని ప్రశ్నించేడు.

అన్నగారికీ తనకూ మాటపట్టింపులు రావడం ఇవేం కొత్తకాదు. కాని ఇదివరకల్లేగాక ఈవేళ ఇంటిల్లిపాది అన్నగారి పక్షానే నిలబడ డంతో భాగ్యరెడ్డి మరీ రెచ్చిపోయేడు.

దానితో కథ అడ్డంతిరిగింది. ఆ క్షణంవరకూ ఇంట్లోంచి పొమ్మని బెదిరించి లొంగతియ్యాలని చూస్తున్న తండ్రీ వగైరాలు ఆతనిని ఇంట్లో వుంచడం ఎల్లాగని తాపత్రయ పడసాగేరు. ఈ గందరగోళాలు, పేచీలూ తనకిష్టంకావని భాగ్యరెడ్డి హుంకరించేడు. తనకొచ్చేవేదో పారేస్తే పోతానని ప్రతిపాదించేడు.

సిరిసిరెడ్డి ఈ ఎదురుదెబ్బలకు తట్టుకోలేకపోయేడు. తన చేతిలో వుందనుకొంటున్న ఆయుధం కాస్తా చేయి జారిపోవడమేకాదు, కొడుకు చేతికి చిక్కిందికూడా.

తన బెదిరింపుతో ఇంట్లో వచ్చిన కంగారును గమనించేక భాగ్య రెడ్డి దానిమీద మరింత పట్టుదల చూపడం ప్రారంభించేడు. ఆతనికి అదో ఆటలావుంది, బ్రతిమాలేవాళ్ళుంటే బిగబిగవడంలోవున్న సంతృప్తి వర్ణనాతీతం.

ఆ సంతృప్తి తీరిందనుకొనేసరికి వేరుపడడం తప్పనిసరి అయి కూర్చుంది. అది మంచికొచ్చిందో, చెడకొచ్చిందో తెలియలేదు.

తాను మెత్తపడేవేళకి అన్నగారూ, వదినగారూ సామాను సర్దె య్యడం ప్రారంభించేరు.

తానేనావుండాలి, తమ్ముడేనా వుండాలిగాని ఇద్దరూ వుండడం సాధ్యం కాదన్నాడు ఆతను. పోలీసుల గొడవలూ, రజాకార్ల గొడవలూ వచ్చిపడతాయనే భయం కూడా ఆ పోటీకి జోడించేక సమస్యాపరిష్కారం అయిపోయింది. తప్పదు.

భాగ్యరెడ్డే వేరుపోవాలి — అని తేలిపోయింది. అసలు సమస్య పైకి రాకుండానే వ్యవహారం ఈ విధంగా పరిష్కారం కావడం అతనికి

ఒక విధంగా సంతృప్తే కలిగించింది. తన భార్య ముఖంలో వచ్చిన కళ గమనించేక ఆతడింక విచారపడలేదు. గంభీరంగా జరగవలసిన పని చెప్పేసేడు.

"నాదేదో నాకు పారెయ్యండి,"

---

## పదో ప్రకరణము.

వీధిచివర అంతవరకూ పశువులకొట్టంగా వుపయోగపడుతున్న పెంకుటి సాలలోకి భాగ్యరెడ్డి కుటుంబం మారడానికి నిశ్చయం జరిగింది. అందులోనే ఒక ప్రక్కగావున్న గదిబాగుచేసేరు. పశువుల్ని మరోచోటికి మార్చి సావడిలో ఇంత మన్నుపోసి గోతులు పూడ్చేరు. గోడలు మెత్తి శుభ్రంచేసేరు. మిడతకట్టి దానిని కూడా ఒక గదిలాగ మార్చేరు.

తాను మారిపోయే ఇంటికోమారు శశిరేఖవచ్చి చూసుకుంది. ఆమె సలహా, కోరికమీద గదికిపైన పెండెకట్టి సరంబీ తయారుచేసేరు.

చిన్న చెల్లెలు భుజంమీద కూరాటకుండ మేళతాళాలతో బయలుదేరుతూంటే తనమీద పడనున్న కొత్తభారాన్ని తలచుకొని భాగ్యరెడ్డి ఒక్క క్షణం జంకేడు. ఇంతవరకు సంసారంలో ఇదివుంది ఇదిలేదని తానెరగడు. తండ్రో, తల్లో, అన్నగార్లో పురమాయించిన పనిచెయ్యడం, చేయడం, పనిలేనప్పుడు బలాదూరుగా తిరగడం. తన పద్ధతిచూసి తల్లి ఎల్లా బతుకుతావురా యని జాలిపడేది. తండ్రి తల్లి బతికివున్నప్పుడు అతనికి భార్యకాగల మనిషిని గురించి విచారం ప్రకటించేవి.

"ఎవర్తో జిల్లేడు పువ్వులు పూజచేస్తూంది. సుఖపడుతుంది."— అనేది. ఆ మాటంటే ఏదో అవమానంగా భావించి ఒక మాటు ఏడ్చేను

కూడా. ఇన్నాళ్ళూ పండిందో, ఎండిందో కూడా అతనికి పట్టలేదు. ఆ తాపత్రయం పడేటందుకు పెద్దవాళ్ళున్నారు.

ఇప్పుడల్లా వుండడం సాధ్యమా ? కాని వేరేటికాపురం ఏర్పాటు స్థిరపడ్డాక శశిరేఖ కళ్ళు మిలమిల లాడేయి. గది బయట ఆ వుత్సాహం కనబడకపోయినా గదిగోడలమధ్య వున్నప్పుడు ఆమె భవిష్యత్తు కోసం వేస్తున్న పథకాలు వింటూంటే ఆశ్చర్యచకితుడై పోయేడు. ఇంత చిన్న తనంలోనే ఇంతలోకవ్యవహారం ఎల్లాపట్టుబడిందో అనిపించింది.

కూరాటికుండ తెచ్చిన చెల్లెలిని సత్కరించాలనేమాట తనకు తెలియదు. ఆ సత్కారం సంగతేదో ఆమె చూసుకొంది. కడగొట్టు కొడుకును ఇవిలేవని అవిలేవని కోడలెక్కడ ఇబ్బంది పెడుతుందోనని తల్లి ఇంట్లోవున్నవన్నీ ఉప్పు, పప్పు, చింతపండు దగ్గరనుంచి వాటా పెట్టి ఇచ్చింది. పేరుపేరు వరసన ఏ వస్తువెక్కడుందో చూపిస్తూ కోడలి మీద కళ్ళురిమిచూసింది. ఈ విధంగా సంసారం వేరుపడ్డానికి ఆమేనే కారణమని ఆ చూపుల్లో స్పష్టంచేసింది. ఆ చూపు గమనించేక శశిరేఖ గడుసుతనంగా అక్కడనుంచి తప్పుకొంది.

"అవన్నీ చూపించాలా అత్తయ్యా ! కొత్తకాపరంలో ఏమేం వుండాలో మీకంటె నాకెక్కువ తెలుసునా ?"

ఆ సందర్భంలో "లోటుచేస్తా ననుకొంటానా" అనడం కూడా మహాపరాధం అవుతుందని ఆమె ఎరుగును.

* * * *

కొత్త కాపురమూ, కొత్త పరిస్థితులూ ఆ దంపతులకు కొత్త చిక్కులు తెచ్చి పెట్టేయి. ఆ సమస్యల్ని వాళ్ళింతవరకు వూహించనైనా లేదు.

రాత్రి భోజనం అయ్యేక భాగ్యరెడ్డి ధర్మారు ఖజానా తగిలించుకొంటూంటే శశిరేఖ ఆశ్చర్యంతో కళ్ళువిప్పింది. ఛానుపేట వెళ్ళాలనీ

నాలుగు రోజులవరకూ రాననీ చెప్తూంటే ఆమె నిస్తబ్ధురాలయింది. ఇంకా కొత్త యింటికివచ్చి ముప్పయి గడియలుకూడా కాలేదు. పెళ్ళాన్ని ఒంటరిగా వదిలేసి ఎక్కడికో పోతానంటే ఎల్లాగ? తనకి భయం వేస్తుంది. ఒంటరిగా ఉండలేదు.

భాగ్యరెడ్డికి భార్య అభ్యంతరం ఆశ్చర్యం అనిపించింది. గడచిన నాలుగు రోజుల గంద్రగోళంలోనూ ఆమెలో కనిపించిన ఉత్సాహమూ, తెగువ చూసేక ఇల్లాంటి ఆటంకానికి అవకాశం వుంటుందనిపించలేదు.

* * * *

ఘానుడిపేటలో దళం ఏర్పాటయింది. వాళ్ళకి బందూకు శిక్షణా, కర్రచేతా చెప్పడం బాధ్యత ఆతని మీదుంది...

అయితే ఇంటివద్ద తనకేం బాధ్యతలేవాయని శశిరేఖ చల్లగా ప్రశ్నించింది.

భాగ్యరెడ్డి నిరుత్తరుడయ్యేడు. తన బాధ్యతలలో ఏది ముఖ్యమో పైకిచెప్పడానికీ, నిరూపించడానికీ ఆతనికి భాషచాలలేదు. పదిమందీ అడిగినప్పుడు తాను వెళ్ళకపోవడం సరికాదనే దొక్కటే ఆతడు తన ప్రయాణానికి బలంగా చూపించేడు. కాని శశిరేఖ అంగీకరించలేదు. ఆలా వొదిలిపెట్టి పొయ్యేవాడు వేరేటి కాపురం ఎందుకు తలపెట్టేడు? ఆ ఇంట్లోనే కష్టమో సుఖమో పడివుండేదాన్నికాదా యంటూంటే ఏం చెప్పాలో భాగ్యరెడ్డికి అర్థం కాలేదు.

* * * *

తన స్వేచ్ఛకి ఆటంకం రాకూడదనే ఆతడు కుటుంబంతో విడిపోవడానికి పట్టుపట్టేడు. పక్కింటి ముసలయ్యొచ్చి తన్నువేరు పడవొద్దన్నాడు. తను బ్రతికి వుండగానే కొడుకులు వేరుపడిపోయేరనే అప్రతిష్ఠని తలుచుకొని తండ్రి కుమిలిపోయేడు.

ఆయన పెద్దవాడయ్యేడు. ఉన్నన్నాళ్లు ఉండబోయ్యేనా? తొందర పడవద్దన్నాడు. కాని తాను వినలేదు. ఎందుకు?

వాళ్ళు ఇంట్లోంచి విడబడడానికీ, దళంలో చేరడానికీ పోటీ పెట్టేరు. తనను వొప్పించడానికి ఒక్కొక్కళ్లు ఒక్కొక్క వాదం తెచ్చేరు.

—తండ్రి పెద్దవాడై పోయేడు. సలుగుటూ ఆదుకోకపోతే లంకంత కొంపలో రోజుగడిచే దెల్లాగ?...

—చిన్నవాడివా, చితకవాడివా? పెళ్ళాం కాపురానికివచ్చి ఏనాళ్ళయ్యె. కాస్త ఇల్లనీ, వాకిలనీ చూచుకోకపోతే పెద్దవాళ్ళెంత కాలం వుంటారు?......

—వెంకటయ్యకండే పెళ్ళా, పెళ్ళామా? ఇల్లా, వాకిలా? పుంపనా, దేవనా? వాడికి సాగినట్లు నీకెల్లా సాగుతుంది?......

ఎన్నో వాదనలు, ఎన్నో కారణాలు; అన్నీ కాదంటే, వాళ్ళ విడిపోవద్దన్నకొద్దీ తనవాళ్ళకి బందాలువేస్తున్నట్లే అనిపించింది. పంతం పుట్టింది. ఆ బంధనాలనుంచి బయటపడడానికే పట్టుపట్టేడు.

ఆస్తి పంచేదిలేదు. పోదేపో-అని బెదిరించబోయేడు. కాని, మళ్ళీ పొలం చాయలకి ఎవ్వరినీ చేరకుండా తుపాకి తీస్తాడని భయంపుట్టి ఆ బెదరింపు విరిపేసేడు.

చివరకు వియ్యమ్మ సిగ్గువిడిచిపెట్టి రజాకారు నాయకుడు ఖోజే జాన్ తన కుటుంబానికి చేస్తున్న ఉపకారాన్ని గుర్తుచేసింది. అనసూయమ్మవద్ద కౌలుకీసుకున్న భూమిని మళ్ళీ లాక్కోకుండా కాపాడుకోవడంలో ఖోజేజాన్ చాల వుపకరించేడు. కాని, వియ్యమ్మతో ఆతనికున్న సంబంధం మూలంగా ఆ విషయం తలచుకోవడానిక్కూడా ఆ యింట్లో సిగ్గుపడతారు. వియ్యమ్మ ఆతని ప్రసంగం తీసుకురాంగనే బుస్సుమన్నాడు, భాగ్యరెడ్డి.

"ఛోటేజాన్ గీటేజాన్ ఎవరన్నా దారికి అడ్డువస్తే బంమాకు సేస్తా-"

ఛోటేజాన్ మంచితనం సంపాదించుకోడానికి తాను యింటివద్ద అతుక్కుపోవడం అవసరం అనే మాట వినేసరికి ఆతడు మరీ పట్టుదల పట్టేడు.

భాగ్యశెట్టి ఇల్లువదలి పోయేముందు వియ్యమ్మ కెదురుగా నిల బడ్డాడు. చూపులతో ఆమెను పొడిచివేస్తూ హెచ్చరించేడు.

"మేము ఎవ్వరినీ బాధించం. మామీద ఎవ్వరూ చెయ్యెత్తవద్దు. ఆ గిరిదాటి అడుగుపెడితే......"

తరవాయి వాక్యాన్ని వియ్యమ్మ తమ్ముని కళ్ళల్లోనూ, అప్యాయంగా భుజానవున్న బందూకును దగ్గరికి తీసుకోవడంలోనూ చదివింది. ఆతడు నిమిరిన తుపాకీకి బంధుత్వాలు తెలియవు. తాను కూడా గిరిదాటి రాకూడదని వాళ్ళల్లోనిదే......

తమ్ముడి నోటవినిపించని ఆ మాటలకి వియ్యమ్మ హడలిపోయి రెండడుగులు పక్కకువేసింది.

* * * *

కాని......

ఇప్పుడు శశిరేఖ వాళ్ళెవ్వరూ సాధించలేని దానికి పూనుకోవడంతో ఆతడు చిరాకుపడ్డాడు.

---

## పదకొండవ ప్రకరణము.

శ్రీరాచేసి ఫరేడబాపురం పెట్టేక కథ అడ్డం తిరిగినట్లు కనిపించింది. భాగ్యశెట్టికి ఏం చెయ్యాలో అర్థం కాలేదు. ఇంతవరకూ, ఒంటరిగా కావ

రానికి ఉబలాటపడ్డ శశిరేఖ ఇప్పుడు భయం దాదో అంటూంది. పూరు చివరగా లేకపోయినా ఇల్లుకీవాడుగానేవుంది; అయితే మాత్రం?

మామూలు రోజులయితే భయం ఏం వుంటుందని శశిరేఖ. రజాకార్లు అనీ, పోలీసులు అనీ ఏ పూటా భయమేనాయె......

నిజమే అని వొప్పుకున్నాడు. కాని,...అని నిట్టూర్పు పెట్టేడు భాగ్యరెడ్డి.

తాను మాత్రం ఇంట్లో ఎల్లావుంటాడు? ఆమెకి భయం అని పిస్తున్న రజాకార్లనీ, పోలీసుల్నీ తాను తప్పించుకు తిరగవలసినవాడాయె. తానుండి ప్రయోజనం ఏంవుంటుంది? ఇంకా భయం ఎక్కువౌతుంది గాని....

శశిరేఖకు ఆ సంగతి తెలుసు. కాని ఎల్లాగ? మామగారూ వొక్కా చెప్పిందొక్కటే దారిఅనిపించింది. దళంవద్దు. గీళంవద్దు. ఒక్క నసు స్కారంపెట్టి దూరంగా తప్పుకోవడం మంచిది. కాని, ఆ మాటచెప్తే లాభం లేదని ఆమె ఎరుగును. అక్కడ మాత్రం తన మనసులోనుం భాగ్యరెడ్డిమీద పనిచేయగంలేదని ఆమె ఈ నెలరోజుల్లోనూ నడిపట్టింది. ఆరునెలలక్రితం తనతో పుట్టింటికి ప్రయాణం ప్టేడు. ఒక్కరోజు కూడా ప్రక్కనలేకుండా వుండలేనన్నమనిషి ఈ దళం వ్యవహారం వచ్చేక తన అవసరాన్నే గమనించడంలేదని గ్రహించేక మనిషిని అర్థం చేసుకో వడం కష్టమేం కాదు.

కనక శశిరేఖ తెలివిగా దళంలోకి పోవద్దనే అభ్యంతరాన్ని పక్కకె పెట్టింది. తాను ఇంట్లో ఒక్కత్తే వుండలేదు. భాగ్యరెడ్డి ఎక్కడికీ వెళ్ళ కూడదు. దానికామె చిన్నచిన్న సలహాలూ, చిట్కాలూకూడ ఇవ్వడానికి సందేహించలేదు.

దళంలో చేరితే చేరేడు. పూరుదాటి ఎందుకెళ్ళడం? పూళ్ళో వాళ్ళకి రక్షణ అక్కర్లేదా? ఆ రజాకార్లు తమ వూరేవస్తే ఏమవుతుంది?

పొరుగూళ్ళకి కావలసొస్తే ఏ వెంకటయ్యో వెళతాడు. భాగ్యరెడ్డివూళ్ళోనే వుంటే అరోఘైక్యం—శశిరేఖ చాల జాగ్రత్తగా తన సలహాలను ఎదుట పెట్టింది.

కాని, భాగ్యరెడ్డి వినిపించుకొనేటట్లులేదు. ప్రతివూళ్ళోనూ దళాలు ఏర్పడితేతప్ప నిజాం పోలీసుల్నీ, రజాకార్లనీ ఆపడం సాధ్యంకాదని తమ నాయకుడు సత్తిరెడ్డి చెప్పేడు. తనకి ఘనపురపేటలో దళాన్ని ఏర్పాటుచేసేపని వొప్పగించేరు. వెళ్ళితీరవలసిందే.

ఆఖరికో సదుపాయం చెప్పింది...శశిరేఖ తనను కూడా అక్కడికే తీసుకుపొమ్మంది.

"తిరిగి తిరిగి వచ్చేసరికి ఇన్నినీళ్ళు కాచిఇస్తా. వేళకింత తిండి దొరుకుతుంది. నాకు ఒంటరితనం బాధవుండదు."

కాని శశిరేఖ చెప్పిన సులువులు భాగ్యరెడ్డి బుర్రకెక్కలేదు. పని కట్టుకొని చేయబట్టాక కొన్ని కొత్త తగలాటాలు చుట్టుకొన్న సంగతిని అతడు మరచిపోలేదు. పొలం, పంట ఏం కావాలి? రాముడున్న పెంపుడుసాల నానుకొన్న ఎకరన్నర పొలంలోనూ మొక్కజొన్న వేసేరు. కంకిపాలుపోసుకొంటూంది.. చుట్టూగట్టి గోడవుండనే వుంది. కొద్దిపాటి శ్రద్ధతీసుకొంటే మూడు నాలుగు బస్తాల గింజలవుతాయి. కాని ఇద్దరూ వూరొదిలిపోతే ఒక్కగింజ దక్కుతుందా? ఏటికేడాదీ వచ్చే పంట పాడుచేసుకోవడం ఏమంత తెలివైనపని? అందులోనూ ఇలాంటి రోజుల్లోనా?

శశిరేఖ మరోవేపునుంచి కొత్తవాదం తీసుకొచ్చింది. పంటా, పొలమూ సంగతి చూడవలసిన అవసరం భాగ్యరెడ్డికి మాత్రం లేదా? అంత వెళ్ళక తప్పనిసరిఅయితే పంట ఇంటికిచేర్చి వెడితేసరి. అప్పటికి కొత్తకాపురం కొంతదారిన పడుతుంది. తనకీ కొంత అలవా

టవుతుంది. కొన్ని నెలలపాటు భాగ్యరెడ్డి ఎక్కడ తిరిగినా ఇబ్బంది వుండను.

భార్యతెస్తున్న వాగనలు మంచి పకడ్బందీగా వున్నాయి. సమాధానం చెప్పడం కష్టమే. కాని, తాను ఎత్తుకొన్న రెండోపని మాటేమిటి? పొలమూ, పంటా తమ యిద్దరికీ సంబంధించినది మాత్రమే. కాని, రెండోది తెలంగాణా గ్రామాలకు సంబంధించినది. ఆ బాధ్యతను వప్పచెప్పేటప్పుడు సత్తిరెడ్డి చెప్పిన వుపన్యాసాన్ని ఇక్కడ వర్ణించేడు.

"రజాకార్ల గుంపులూ, వాళ్ళబాధలూ పెరిగి పోతున్నాయి. గ్రామాలమీదపడి నానారంతూ చేస్తున్నారు. వాళ్ళ బాధలు పడలేక అప్పుడేకొస్త జరుగుబాటున్న జనం యూనియన్ ప్రాంతాలకు వలసపోతున్నారు. పేదవాళ్ళెక్కడికెడతారు? వాళ్ళకిక్కడ రక్షణ ఏమిటి? అందుకోసం ప్రతివూళ్ళోనూ ఆంధ్రమహాసభ దళాన్ని ఏర్పాటు చేయడానికై పూనుకొంది. జనంకూడా వూరూరికీ పిలుస్తున్నారు. అది ఎంత ముఖ్యమో చూడొద్దూ. ఒక. ఇంటిపనులకన్న ఇది ముఖ్యంకాదూ?"

శశిరేఖ ఒక్కమాటలో అంత వుపన్యాసాన్నీ కొట్టి పారేసింది.

తన్నుమాలినధర్మం, మొదలు చెడబేరం, ఇంటగెలిచి రచ్చగెలువు మొదలయిన సామెతలూ, నానుడులూ పుంఖాను పుంఖంగా తన వాదానికి బలం తెచ్చుకొంది.

భాగ్యరెడ్డికి ఏమి చెప్పడానికీ మాట తోణకలేదు, గదిమి, రెండు తిట్టి, నాలుగుమొత్తి లేచిపోవడం ఒక్కటే దారిగా కనబడింది. కాని ఇంకా భార్యను గట్టిగా గదిమెయ్యడంకూడా అలవాటుకాలేదు. తిట్టడం, కొట్టడం ఇంకా చాలదూరం. ఏం చెయ్యలేక రుంజుకుంటూపోయి చూరుక్రింద మంచం వాల్చుకూర్చున్నాడు.

తాను భర్తకి కోపం తెప్పించేసేయని నొచ్చుకొంటున్నా శశిరేఖ అతనిని సాగనంపడానికి ధైర్యం చేయలేకుండావుంది. తన పనివలన

తెలంగాణాకి ఏదో అపకారం కలుగుతున్నదని కాకపోయినా, కుటుంబంలో భర్తతోనే పేచీ పెట్టుకోవలసి వచ్చిందేయని ఆమెకు బాధగానే వుంది. అదీ మంచిదికాదనీ అనిపిస్తూంది, కాని ఎల్లాగ?

* * * *

ఆవరణలో అడుగు పెట్టేసరికి వెంకటయ్యకి చూరుక్రింద మంచం మీదొకరూ, గుమ్మం కీనీడలో మెట్టుమీదొకరూ ఆ దంపతులు నిశ్శబ్దంగా కూర్చుని కనబడ్డారు. వాళ్ళని చూడగనే ఆతడు అసలువిషయాన్ని పసికట్టేడు.

ఆతని రాకతో భార్యా భర్తల జగడం కొత్తరూపం ధరించింది. భర్త నిర్మమత్వాన్ని శశిరేఖ ఖండించింది. ఇల్లాంటివాళ్ళు అసలు ఎందుకు పెళ్ళిచేసుకోవాలని ఒక తాత్వికప్రశ్న వేసింది.

భాగ్యరెడ్డి తాను పెళ్ళికి ఎన్నడూ ఏడ్చిపోలేదని మదలకించేడు. శశిరేఖ తండ్రి వచ్చి తన ప్రాణానికీపురి తగిలించి పోయేడన్నాడు.

వాళ్ళ ఆరోపణలూ, ప్రత్యారోపణలూ విని వెంకటయ్య పక్కున నవ్వేడు. తన నవ్వుచూసి విస్తుపోయిన ఆ దంపతులకి వాళ్ళవాదం కేవలం నిరుపయోగం అని చెప్పేసేడు.

"ఎవరు వచ్చిముందు అడిగితే ఏం పోయింది? ఎందుకే చేసుకోనీ పెళ్ళి అయిపోయింది. ఇంక చేసేదేముంది?"

ఇప్పుడు పేచీపడడం ఎందుకో తనకి అర్థంకాదు. "గొడవలు రాకుండా సర్దుకోవడం మంచిది. ఆలోచించి ఒక మార్గం నిర్ణయించుకోవడం తప్ప ఇల్లా కైకురు బొయికురుమనడం బాగుండదు. అందులోనూ కొత్తకాపురం పెట్టిన మొదటి రోజునే ఎడమొగం పెడమొగం పెడితే జనం ఏమనుకొంటారు?"

ఇద్దరూ దానికి అంగీకరించేరు.

ఈ గంద్రగోళాలు తగ్గేవరకూ భార్యను పుట్టింటికి వెళ్ళివుండ మన్నాడు భాగ్యరెడ్డి.

శశిరేఖ ఆ ఆలోచననే చొరనివ్వ తలచలేదు. ఆమె అభ్యంతరాలు బహుముఖాలు. దానిలో ముఖ్యం భర్తకి దూరంగా వుండడం ఆమెకు సుతరామూ ఇష్టం లేదు.

అత్తవారింట్లో నలుగురిమధ్యా వుండిపోవడం అనే సమస్యేలేదు. అసలే ఇదివరకే వాళ్ళు ప్రాణాలు పిండేసేరని ఆమె కోపం. ఇప్పు డెడితే ఓమారు వీధిలోకిపోయి మళ్ళీ ఇంటికి వచ్చిందంటారు. గరిలేక వచ్చిందంటారు. ఆయన అక్కడుంటే అదోదారి. ఆయనాలేక, ఇంట్లో వున్నవాళ్ళు ఉండిపోయినట్లూగాక తానొక్కర్తే అక్కడవుంటే బాబో...

శశిరేఖ ఆ ఆలోచనకే మహాఅయిష్టం ప్రకటించింది.

మరెల్లాగ ?

మగడు ఎక్కడుంటే తానూ అక్కడే వుంటుంది. పంట పదట కలిస్తే కలియనీ, ఏమయితే అవుతుంది, పదమంది.

భాగ్యరెడ్డి నోరువెళ్ళబెట్టేడు. ఇంతవరకూ ఆమె మాటవరసకే తనతో ప్రయాణం అవుతూందనుకున్నాడు. కాని, ఆమెమాటలల్లా విని పించడం లేదు.

వెంకటయ్య వెంటనే అది జరిగే పని కాదన్నాడు.

తమరు ఒక వూళ్ళోవుంటున్నారా ? ఒక యింట్లోవుంటున్నారా ? అయిదారు నెలల క్రితంవరకు తమ నాయకులు పడ్డంతకష్టం ఇప్పుడు లేదు. వెట్టి వ్యతిరేకవుద్యమాన్ని అణిచెయ్యానికి నిజాము మిలటరీని వుపయోగించినప్పుడు ఆంధ్రమహాసభ నాయకులు ఆ గుట్టమీద ఈ రాయి వెనకా మునగదీసుకొని కూర్చుండవలసేవచ్చింది. హోరున వర్షం కురు స్తున్నా, ఫెళ్ళున ఎండకాస్తున్నా మోకాళ్ళకీ చేతులు మెలికేసి, తల

కాళ్ళమధ్య దాచుకొని కూర్చుండేవారు. నిద్రపోతున్నా ఓకన్నూ చెవుబూ బయటపడేసే వుండేవారు. తమ కెవరికో వీలుచిక్కినప్పుడింత కూడు పట్టుకెళ్ళి ఇచ్చేవారు. లేకుంటే రోజులతరబడి పస్తులే.

తమ నాయకులు ఎంతటి త్యాగమూర్తులో, తమ వుద్యమం ఎంత మహత్తరమో శశిరేఖ మనస్సుకు పట్టించడానికై వెంకటయ్య ఆ నాటి ఘటనలన్నీ కథలల్లే చెప్పేడు.

అల్లాంటి భయంకరస్థితి ఈ నాడులేను. కాని ఇప్పటికీ వారంలో చాల రోజులు వూళ్ళబయటే గడుపుతున్నారు. వెనకటల్లే ఒంటరితనం బాధలేదు. పదిమందిలోనూ ఓ బావిపక్కనో, ఓ చెట్టుక్రిందనో వుండడం అంతకష్టం అనిపించడం లేదు.

అయినా...వర్షం ఎండా, తమ వొంటిమీదనే వెలిసిపోతున్నాయి. నిద్రవస్తే కంబళీకొంగు నేలనిపరవడం, రెండోకొంగు ముసుగేసుకోవడం, పైన హోరున వర్షంకురుస్తూంటుంది. లోపల వుక్కకి చెమటలు కారిపోతుంటాయి. శీతాకాలం ఇంకా ప్రవేశించలేదు. వస్తే ఈ వర్షాలుండవు, ఈ ఉక్కవుండదు. కాని, ఇప్పుడీమె ఆ బాధలు పడగలదా?

ఈ బాధలల్లా వుండనీ, మరోమూల రజాకార్లూ, పోలీసులూ ఏక్షణాన కమ్ముకొంటారో అనేబెదురు వుండనేవుంది. జీపులూ, లారీలూ వేసుకొని చటుక్కున వూళ్ళమీద పడిపోవడానికి వీలులేకుండా వుంది గనక గాని లేకపోతే ఏక్షణంలో ఏ మూలనుంచి మీదపడి పోతారో ఎవ్వరూ చెప్పలేరు. వర్షాలు వెలిసేక ఫెయిర్‌వెదర్ రోడ్లు వేస్తారంటున్నారు. అదోరోడ్డు కాకపోయినా వాళ్ళ లారీలకు చాలు. వాటికోసం అప్పుడే కూలీల్ని తీసుకెడుతున్నారని చెప్పేరు. తమ వూరి మాలపల్లి పెద్ద శీనిగాడు ఈ పనిలో బాగా తిరుగుతున్నాడని కూడా తెలిసింది. వాళ్ళ ఎత్తులుసాగితే ఇంక రోజూ ఏ గంటా వూళ్ళమీదే వుంటారు. వాళ్ళని

ఆపేటందుకు తమ వద్ద ఆయుధాలా, బండలా ? పదిమందీ, పదిహేను గురూవస్తే తమ దగ్గిరున్న నాటుతుపాకులతోనే తరుముతున్నారు. చాల మందివస్తే తప్పుకొంటున్నారు. తమతోపాటు వూళ్ళల్లో జనం కూడా ఖాళీచేసేస్తున్నారు. దళాలభయంతో రజాకార్లు, చిన్న గుంపులుగా విడిపోయి వూళ్ళమీదికి రావడంలేదు. అది నిజమే. కాని, వాళ్లలేచిపోయే వరకూ పూటయినా, రోజయినా తిండీ, తిప్పలూ లేకుండా చెట్టూ పుట్టా పట్టివుంటున్నారు. ఆమె ఎక్కడుంటుంది ?

శశిరేఖ ఆ బాధలన్నిటికీ సిద్ధమేనన్నా ఆ గొంతులో మొదటి బింకం, పట్టుదలా వినిపించలేదు. భాగ్యరెడ్డి ఆ అవకాశం తీసుకొన్నాడు.

"ఒంటరిగా ఇంట్లో వుండాలంటేనే భయపదుతున్న మనిషి... అద్బే—లాభంలేదు"

చుట్టముట్టించి వెంకటయ్య నడివాకిట్లోకి మంచం ఈడ్చుకొని కూర్చుని దంపతుల వాగ్వాదం వింటున్నాడు. ఎంతకీ వాళ్ళచర్చ తేలే లాగలేదు. అదేదో తేలితే తప్ప తాము కదలడం సాధ్యంకాదు. కొంచెం విసుగనిపించినా ఓపికపట్టేడు.

"ఇప్పుడున్న రోజులల్లాంటివి. ఆడవాళ్ళు కూడా గట్టిపడాలి, వాళ్ళకివచ్చే కష్టాల్ని వాళ్ళే ఎదుర్కోవడం నేర్చుకోవాలి."

కష్టాల నెదుర్కోవడం అంటే ఏమిటో, అదెల్లాగనో వెంకటయ్య చెప్పలేకపోయాడు. సత్తెమ్మ, కోటమ్మ ఇంకొకళ్ళిద్దరూ ఆతని మనస్సులో మెదులుతున్నారు. కాని, సత్తెమ్మపేరు నోటపెట్టలేకపోయేడు. కొత్త పెళ్ళికూతుల్లే సిగ్గుపడ్డాడు. తమ వివాహ సమస్యవీధికెక్కి బెసిగిపోయినా, ఆతని హృదయం ఆమెమీద ఆశపడలుకోలేకపోయింది. ఇంత గంద్రగోళం తర్వాత కూడా ఆమెపేరు, ఆమె మాట మనస్సులో ఉద్వేగాల్ని సృష్టిస్తూనేవుంది.

కోటమ్మ వుదాహరణకి శశిరేఖ చప్పరించేసింది. ఆమె దృష్టిలో కోటమ్మ దండుముండ. మగాడి మొగుడూను. సత్తెమ్మ విషయంలో కూడా ఆమె అభిప్రాయం అదే. అయితే వెంకటయ్య ఎదుట ఆ మాట అనలేకపోయింది. వాళ్ళిద్దరూ పెళ్ళిచేసుకొందామనుకొన్నప్పటి రభస నామె ఎరుగును. కోటమ్మ విషయంలో అంతసదభిప్రాయం తెలియ పరుస్తున్న వాళ్ళ ముందర ఆమెను అంతగట్టిగా నిరసించలేకపోయింది. గడుసుతనంగా చెప్పింవంతే.

"నేనేమో కోటమ్మలాగ లేనంటే ఎల్లావుంటాను? మా తండ్రి ఎంతో భయభక్తులమధ్య పెంచేడు. ఇంట్లో గట్టిగా మాటవినబడితే పెళ్ళా మయ్యేది కూతురయ్యేది కర్రతీసేవాడు. గడపలో కాలు బయట పెట్టేటందు కుండా - ఏమన్నానా? అంత అదుపాజ్ఞలలో పెరిగిన మనిషిని కోటమ్మ లాగో, సత్తెమ్మలాగో లేవంటే ఎల్లాగ?"

ఆ మాటలలో నిగూఢంగావున్న నిందను వెంకటయ్య గ్రహించక పోలేదు. కాని, కోపగించుకొని ప్రయోజనంలేదు.

"తమకొచ్చే ఇబ్బందుల్ని ఎదుర్కోగల శక్తి లేనివాళ్ళంతా శశి రేఖ దృష్టిలో ఇల్లాళ్ళు. ధైర్యంగలవాళ్ళంతా దండుముండలు. కష్టాల్ని ఎదుర్కోగల వాళ్ళంతా మగాడిమొగుళ్ళు. మరెల్లాగ?"

ఆ ప్రశ్నతో శశిరేఖ సిగ్గుపడింది. అయినా తనవాదాన్ని సమ ర్థించుకొనే ప్రయత్నం మాత్రం మానలేదు.

సత్తెమ్మ పెద్దదొరనీ, దొరకొడుకునీ కూడా నిలబెట్టి భూమినుంచి పొమ్మనడానికి మీరెవళ్ళని అడిగేసింది. ఆ మాట తాననలేదు. అసలు వాళ్ళముందర నిలబడడానికే వొణుకు పుడుతుంది, తనకు. కోటమ్మ మగణ్ణి నువ్వెంతని గదిమేసి సంగం అంటూ తిరుగుతూంది. తాను చెయ్యలేదాసని.

..........

భాగ్యరెడ్డి నిలదీసేడు.

ఇప్పుడు శశిరేఖ మాత్రం చేసినపనేమిటి? ఆమె తన మాట ఖాతరుచేసిందా? తన మాట విననివాడు తన నెందుకు పెళ్ళిచేసుకోవాలని ఒక్క క్షణం క్రితమేకదా ప్రశ్నించింది?

తానామాట అనలేదనీ. తన మాటల అర్థం అదికాదనీ శశిరేఖ...

సమస్య పెడదారికి పట్టింది. శశిరేఖ ఏ మాట అన్నదో, దాని అర్థం ఏమిటో తేల్చుకోవడానికై చర్చపడింది. వెంకటయ్య వాళ్ళని అసలు పుంతకి తెచ్చేసరికి సమస్య పరిష్కారం అయిపూరుకుంది.

భర్తమాట వినలేదనేమాట వచ్చిందిగనక తానింకేమీ మాట్లాడనని శశిరేఖ ప్రకటించింది,

దానినే అర్ధాంగీకారంగా స్వీకరించి భాగ్యరెడ్డి భర్మార్ భుజాన వేసుకొన్నాడు.



## పన్నెండవ ప్రకరణము.

ఇంటి గొడవలు సర్దుకొని భాగ్యరెడ్డి ఖానుడిపేట వచ్చేసరికి పోలీసు అమీన్ ముకుందరెడ్డి తన బలగంతో గ్రామంలో అడుగుపెట్టేడు. సగం మందిని చితక్కొట్టేడు. మిగతా సగం తుపాక్కి దొరక్కుండాపోయేరు. వాళ్ళని వెతుక్కుంటూ వెళ్ళడంతప్ప భాగ్యరెడ్డికి మరోపని కనిపించ లేదు. పొలిమేరలలోకి వచ్చినమనిషి అక్కడినుంచి అలాగే పక్కవూరి దారిపట్టేడు.

ఎవరో భర్మార్ భుజానవేసుకున్న పడుచువాడు జువ్విక్రింగకు వచ్చేడని విన్నాడు. అమీన్ ముకుందరెడ్డి. చారముఖాన, భర్మారు పేరు విన్నాక ధైర్యస్థుల్ని ఏరడంలో కొంత ఆలస్యం అయినా పక్కాకట్టుదిట్టాలు చేసుకొని జీపులో ఆతడు జువ్విమీదికి త్రోసుకువచ్చేడు. అక్కడెవ్వరూ కనబడలేదు. భర్మార్ మనిషి తనరాకకోసం ఎదురు చూస్తూ నిలబడకపోవడం కేవలం పిరికిదనం తప్ప మరేమి కారణం కాదని కోప్పడ్డాడు. జీ హుజూర్‌ల, డాలువెనక అధికారి తాడునపు విసురును కాచుకుంటూ జవాన్లు అక్కడికో ఫర్లాంగు దూరంలో పశువుల్ని మేపుకొంటున్న ఒక పశులకుర్రాడిని పట్టుకొచ్చి నాలుగుదాదేరు. భర్మార్ మనిషికి హుషార్ ఇచ్చింది వాడేనని వాళ్ళఅంటారు. నాకు తెలియదన్నప్పుడల్లా ఏగ్రమీద లాఠీదెబ్బలుతగిలి వాడు తన అపరాధాన్ని దాఖలాలతోసహా అంగీకరించేడు. వాడిని తీసుకురావడానికి నలుగురు జవాన్లని వదలి ముకుందరెడ్డి చిరచిరలాడుతూ వచ్చేడు. కచేరీచావడియుందు వీధి గోడ ప్రక్కన బారులుతీర్చి కూర్చోబెట్టిన పదిమందినీ కసితీర పడ బాదించేడు. వాళ్ళని విడిపించడానికై భర్మార్లతోవచ్చిన దళాన్ని తరిమి పారేసేనని ప్రకటించేడు. కూర్చున్నవాళ్ళు పారిపోకుండా అప్పటికప్పుడు చేతులకూ, కాళ్ళకూ బేడీలువేయించి, మీసం మెలిపేసేడు.

తన చేతులకి బేడీలువేస్తుంటే పట్వారీ శీతారామారావు కొడుకు గొల్లున ఏడ్పు ప్రారంభించేడు. కొడుకు ప్రక్కనున్న మాలకొండణ్ణి చూసి పట్వారీ ముఖాన కండువాచెంగు కప్పుకొన్నాడు. ముకుందరెడ్డి తలపంకించేడు.

"మాలాళ్ళని ఉద్ధరించాలంటారుగా కాంగ్రెసువాళ్లు."

కొడుకు సుదర్శనానికీ, ఒక హరిజన యువకుడికీ కలిపి బేడీలు వేయడం పట్వారీకి తలకొట్టేసినట్లుంది. అసలు అరెస్టుచేయడనే మాట

రావడమే మహావమానం. పుట్టి, పెరిగి, తలలెప్పుకొంటున్నపూళ్ళో చేతు లకు బేడీలు వేయించుకోవడం! అంతకన్న తలతీసెయ్యడం సుఖం, సంతోషమూను. అల్లాంటిది మాలవానితో కలిపి సంకెళ్ళువేయడం! భోజనసమయంలో పేరు చెప్పడానిక్కూడా అంగీకరింపజాలని నీచ కులం వాడితో బేడీలు! శీతారామారావు దుఃఖాతిరేకంతో తలగోడనిపెట్టి కొట్టుకొన్నాడు. పిల్లచచ్చిన కోతిమాదిరిగా అంగలార్చేడు.

"ఈ అవమానం చూడవలసినతర్వాత నా నుదుట పెట్టేవా భగ వంతుడా?"

తలగోడకిపెట్టి కొట్టుకొన్నా ముకుందరెడ్డి జాలిపడలేదు. తిట్టినా, భూషించినా దేవుడు ఉలకలేదు, పలకలేదు. ప్రక్కనేవున్న హరిజనుడి వంకచూచి సుదర్శనం తలవంచుకొన్నాడు. ఆతని కన్నీటికి తడిసైనా బేడీయి మెత్తబడలేదు.

* * * *

సుదర్శనం ఆ రోజున మీటింగు దగ్గిరికి వెడతానన్నప్పుడే తండ్రి వద్దని ఆజ్ఞపెట్టేడు. పాతికేళ్ళ వయస్సులో కూడా తండ్రిమాటను ధిక్క రించలేని సుదర్శనం తండ్రి లేవకుండా చూచుకొని ఓ మాటూ, లేచి పుంతకిపోయినప్పుడోమారూ మీటింగు జరిగేచోటికి పరుగెత్తేడు. మళ్ళీ తండ్రి కోపాన్ని తలుచుకొని వెంటనే పారిపోయి వచ్చేడు. మీటింగులో వుపన్యాసాలు వినాలనీకాదు. సత్యాగ్రహంమీది భక్తీకాదు. ఊరంతా వెలు తున్నారు. ఊళ్ళఊళ్ళ జనంవస్తున్నారు. ఏమిటో ఆ వింత చూడాలని పించింది అంతే.

పటేల్ మల్లారెడ్డి సత్యాగ్రహం చేస్తాడన్నారు. సత్యాగ్రహం అంటే ఆతడికి అర్థంకాలేదు. కాంగ్రెసులో చేరిపోయేడన్నారు. కాంగ్రె సంటే ఆతనికి తెలియదు. ఆతడు ఆంధ్రమహాసభపేరు విన్నాడు. మల్లా

రెడ్డి పటేల్‌కి ఆంధ్రమహాసభ అంటే తగనికోపం. ఆ సంగతి తనకు తెలుసు. ఆ మల్లారెడ్డి చేరిన సంఘానికీ, ఆయన చేస్తున్నపనికీ ఆంధ్ర మహాసభవాళ్ళే అట్టహాసంగా ఏర్పాట్లుచేస్తున్నారని విన్నప్పుడు ఆశ్చర్యం వేసింది. ఆ తమాషా ఏమిటో చూడాలనుకొన్నాడు; పరుగెత్తేడు.

ఇంటికి వచ్చేసరికి తండ్రి తిట్టేడు. కొత్తగా కాపురానికొచ్చిన కోడలు ఇంట్లోనేవుండడంచేత కర్రతీయలేదుగాని, ఆ కోపంచూస్తే కొడతాడనే అనిపించింది.

"పెద్దరెడ్లు. ఏంచేస్తే చెల్లదు? మధ్యన మనకెందుకొచ్చిన గొడవలురా" అని మొత్తుకొన్నాడు.

* * * *

అతనికిముందు ఆ వూళ్ళో పనిచేసిన ఒక పట్వారీ హీనచరిత్రను తలుచుకొని తాను వొణికిపోయేడు. సుదర్శనాన్ని హడలకొట్టేడు.

అది ఎప్పుడో పాతికేళ్ళక్రితం కావచ్చు. ఇంకా అంతకుపూర్వమేనేమో కూడా...మల్లారెడ్డి తండ్రికాలంలో జరిగింది. ఆయనా పటేలే. గ్రామ పట్వారీమీద ఎందుకు కోపం వచ్చిందోమరి. వెట్టి మాదిగల్ని పంపించి పట్వారీనీ, ఆయన భార్యను, పిల్లల్ని, కొడుకుల్ని, కోడళ్ళని ఆడమగ అందరితోసహా పట్టికట్టితెప్పించేడు. మగవాళ్ళనందర్నీ సావడి స్తంభాలకంటదీసి కట్టించేడు. ఆడవాళ్ళని ముసలీ, పడుచూ అనకుండా గుడ్డలూడదీయించి, నడివీధిలో వెట్టివాళ్ళచేత చెరిపించేడు. ఆ దుర్మార్గానికి మనసు వొప్పక నిరాకరించిన ఒక వెట్టివాణ్ణి అక్కడే నరికేసేడు.

ఆ తర్వాత ఆ పట్వారీ మరిగ్రామంలో తలచూపలేదు. మహావమానంతో సర్వం వదులుకొని ఎక్కడికో వెళ్ళిపోయేడు. ఆ కుటుంబం ఏమయిపోయిందో కూడా ఎవరికీ తెలియదు. ఆయన ఆస్తుల్ని కూడ రెడ్డే స్వాధీనం చేసుకొని అనుభవించేడు. ఇప్పటికీ మల్లారెడ్డి అనుభవిస్తున్నాడు.

వాళ్ళయిల్లు కూలిపోయింది. వాళ్ళభూములు కూడా ఇప్పుడు రెడ్డి భూములుగానే చలామణీ అవుతున్నాయి. గ్రామప్రజలూ, చుట్టు ప్రక్కల వాళ్ళూ మరచిపోయారు. అయినా ఆ పట్వారీ స్థానంలోనే వచ్చిన సీతా రామారావు ఆ కథలలో ఒక్క అక్షరం కూడా మరచిపోగలడా ?

* * * *

ఆ కథలు వినీ, నట్టింట్లో మసులుతున్న పడుచుపెళ్ళాన్ని చూసు కొనీ సుదర్శనం వొణికిపోయేడు. తాను చేసినది అజ్ఞానకృతమని సమ ర్థించుకొంటూన్నా వినాశకాలంలో కలిగే విపరీతబుద్ధిగా నిశ్చయించు కొని దుఃఖపడ్డాడు. తన దుర్బుద్ధిఫలితంగా రాగలదనుకొంటున్న ప్రమా దంనుంచి తప్పించుకోవడం ఎల్లాగో తెలియలేదు. తాను వూళ్ళోంచి వెళ్ళిపోతే ప్రమాదం వుండదనుకొని వెంటనే నిల్చున్నపాటున దొడ్డి దారిని వూరుదాటేసేడు.

కాని, తాను పారిపోయి రావడం అర్థంలేనిపని అని అడంగుకి చేరేక రెండురోజులకిగాని అతనికి తోచలేదు. అసలు ప్రమాదమధ్యంలో తన భార్యవుండనే వుంది. తాను లేకపోతే ఏమయినట్లు ? వాళ్ళు తన కోసంవచ్చి ఆమెనే దొరకపుచ్చుకుంటే ? వెంటనే పరుగెత్తుకొచ్చేడు. వస్తూనే ముకుందరెడ్డి కంటబడ్డాడు.

* * * *

సత్యాగ్రహంచేసిన మల్లారెడ్డీ, ఆయనతోచేరిన వలంటీర్లూ వూళ్లో తాను వచ్చేసరికి లేకపోయినందుకు అమీను చిరచిరలాడుతున్నాడు. మల్లా రెడ్డి యింటికివెళ్ళి హంగామా చెయ్యడానికి ధైర్యంలేదు.

ఇంక ఊరుమీదపడి ఆ రోజున సభకు వెళ్ళినందుకు వరుసపెట్టి బాదడం ఒక్కటే సులువుగా కనిపించింది. వూళ్ళో సభ జరుగుతూంటే వెళ్ళని వాళ్ళెవరుంటారని ముకుందరెడ్డి నమ్మకం. ఆ నమ్మకం బలంతో

మనిషినికొట్టేముందు ప్రశ్నించవలసిన కనీసబాధ్యతకూడా తీరిపోయింది. పోలీసులూళ్ళో అడుగుపెట్టిన వార్తవినగానే అమీన్ ఆలోచనల్ని పసిగట్ట గలవాళ్ళు ముందే తప్పుకొన్నారు. మిగతావాళ్ళు కొందరికి తడితగుల్తాం దని విన్నవెంటనే జాగ్రత్తపడ్డారు. దురదృష్టం తోసుకువచ్చిన వాళ్ళు బోనులో ఎలకల్లా దొరికేరు. ఓపదిమందిని ఏరి అమీను కచేరీచావడి కెదు రుగా గోడప్రక్కనే కూర్చుండ పెట్టేడు.

సుదర్శనం దొరికినప్పుడు ముకుందరెడ్డి అతనిని కాస్సేపు ఆడించి, హడలకొట్టి వదిలేద్దామనే అనుకొన్నాడు. ఆ పిలక, బిళ్ళపంచెకట్టు, అమాయికపు చూపులూ చూసి వినోదం కోసం కొంతసేపు ఏడిపించా లనుకొన్నాడు.

అమీను ఏరిపట్టుకొన్న వాళ్ళల్లో అన్ని కులాలవాళ్ళూ వున్నారు. కొందరు హరిజనులూ వున్నారు. ముకుందరెడ్డి వాళ్ళందరినీ, అందరితో పాటు సుదర్శనాన్నీ బొడ్డురావి కెదురుగావున్న కచేరీచావడిముందు గోడ నానించి కూర్చోపెట్టేడు. హరిజనకుర్రవాళ్ళు పక్కపక్క ఒదిగి దూరంగా పోబోతూంటే కొట్టి సుదర్శనానికి రెండువేపులా ఒరుసుకూర్చుండేటట్లు చేసేడు. దూరం జరిగిపోకుండా ఈ మారు ముగ్గురికీ అంటదీసి బేడీలు వేసేడు.

మధ్యాహ్నం అయింది. ఎన్నిదెబ్బలు తింటేమాత్రం వాటితో ఆకలితీరుతుందా ; సుదర్శనానికి ఆకలేసింది. ఆకలికి వోర్చు కొన్నట్లు దాహానికి తట్టుకోవడం లభం సుఅనిపించడం లేదు. కానైతే తమ యిల్లు ఎదురుగానేవుంది. తన స్థితినిచూసీ, అడపా తడపా తగులుతున్న దెబ్బలుచూసీ దుఃఖంతో అవసిపోతూనే తన కుటుంబంలో వాళ్ళంతా ఎదురుగా చావట్లోనే చదికిలబడివున్నారు. కనిపిస్తూనేవుంది. ఓ మారు పెళ్ళామే ధైర్యంచేసి తనకు కనిపించేలాగ లోగుమ్మంలో నిల బడి చూసి ఏడ్చింది. చావడి మసకచీకట్లో వుండడంచేత ముఖం కనబడ

లేదు. కాని. ఆమె భంగిమచూస్తే ఏడుస్తూందనే అనిపించింది. ఆమెను చూస్తే తనకీ ఏడ్పువచ్చింది. ఆపుకోలేక బావురుమని ఏడ్చేడు. అది విన బడగానే అమీన్ టపాకాయలా పేలేడు. 'హరామ్‌జాదా' వగైరా ఎన్నికైన తిట్లతో ఆతడిని వూరుకోబెట్టేడు.

తిట్లతో ఏడుపు ఆగిందే గాని, ఆకలి ఆగలేదు. మరింత ఎక్కువైంది. నిజాము ప్రభుత్వ స్తంభాలు రాళ్ళతో తయారయినవి కావు. అవీ రక్తమాంసాల మూర్తులే. అటువంటి మూర్తులన్నింటికీలాగే వాటికీ ఆకలి దప్పులున్నాయి. ముకుందరెడ్డికి కూడా ఆకలివేసింది. వెంటనే భోజనానికి మల్లారెడ్డి ఇంటినుంచే వచ్చిన పిలుపును అంగీకరించేడు. తమ గృహయజమానిని అరెస్టుచేయ వచ్చినవానికి కోడిపులావుతో విందు చేయడం వాళ్ళకి వెక్కసంగా తోచలేదు. దానిని అంగీకరించడం ముకుందరెడ్డికి అభ్యంతరంగానూ తోచలేదు.

అమీను అల్లా వెళ్ళగా చూసి ఖైదీల బంధువులంతా పోలీసు వాళ్ళని బతిమలాడుకొనీ, ఓ పావలా బేడా చేతిలోపెట్టీ తమతమ వాళ్ళ కింత తిండిపెట్టుకొన్నారు. వాళ్ళదవడలు ఆడుతూంటే సుదర్శనం పేగులు తిరుగుబాటు చేసేయి. కొంతసేపు గుర్రుగుర్రుమని కోప్పడ్డాయి. తర్వాత మడతపడి కుంగదీసేయి. ఏంచేస్తే మాత్రం సుదర్శనం చేయగలదేముంది. తాను తిండి తినాలంటే......

తనకూ భోజనానికీ మధ్యనున్నదూరం తలుచుకున్నకొద్దీ ఆతని శరీరం శోషిల్లి పోతూంది. ప్రక్కనేవున్న మాలకొండడు లోకరీతులు తెలిసినవాడు. సానుభూతి తెలిపేడు. అమీన్‌సాబ్‌కి ఏమన్నా కట్నం ఇచ్చి బయటపడమని సలహా ఇచ్చేడు. జైళ్ళలో కష్టాలు వాడికి తెలుసు. ఏదో పనిమీద ఒకటి రెండు మాట్లు గోడల్లోపల ఏం జరుగుతూంటుందో కనుక్కొచ్చిన మనిషి. సుదర్శనంతో మాట్లాడినందుకు పోలీసువాడు

విసిరిన కర్రదెబ్బని లెక్కచెయ్యలేదు. వాడూ వీపు తిప్పగానే తన బంధువు నొకణ్ణి పిలిచేడు. ఆ విషయం పట్వారీచెవిని వెయ్యమని పంపేడు.

ఆ సంగతి తన కంతవరకు తోచనే తోచనందుకు సీతారామారావు తన్ను తానే తిట్టుకొన్నాడు. గబగబా ఇంట్లోకి వెళ్ళేడు. పది నిముషాల్లో తిరిగివచ్చి పటేల్ మల్లారెడ్డి యింటిదిక్కుగా పరుగెత్తేడు.

ఆ సాయంకాలానికే సుదర్శనం విడుదలయ్యేడు. ఇంటికి పొమ్మని గదుముతూ ముకుందరెడ్డి మరెన్నడూ ఇల్లాంటి పనులజోలికి పోవద్దని సలహాయిచ్చేడు.

రాత్రి పడకగదిలో తన్ను కౌగలించుకొని ఏడుస్తున్న పెళ్ళాన్ని ఓదార్చేటప్పుడుగాని తనను విడుదల చేయించిన చేమిటో సుదర్శనానికి అర్థంకాలేదు.

ఆమె మెడలో ఇంత వొత్తున కనిపించే కట్టకాసులపేరు అక్కడ లేదు. అనుమానిస్తూనే అడిగేడు. ఆమె కళ్ళు తుడుచుకొని మగడికి ధైర్యం చెప్పింది.

"మీరు విడుదలయ్యేరు. అంతేచాలు. రోజులు బాగుంటే అల్లాంటివి పది చేయించుకోవచ్చు."

కాని, మగని ముఖమూ, కళ్ళూ చూసేక ఆమెకే ఆ ధైర్యం మిగలలేదు. వాట్లలో కనిపించిన జ్వాలలు మిగిలిన నగల్నికూడా కరిగించేసేలాగే తోచేయి.

---

## పదమూడో ప్రకరణము.

ఒక వెయ్యి రూపాయలు చేసే నగను వదల్చుకొని పట్వారీ సీతారామరావు కొడుకు నిర్దోషిత్వాన్ని నిరూపించుకొన్నాక పోలీసుల

అనుమానం కేవలం వుసులుబాటున్న ఇళ్ళమీదకే మళ్ళింది. రాజద్రోహుల్ని పట్టుకోవడంలో తాము చూపిస్తున్న పట్టుదలను నిరూపించుకొనేటందుకై డబ్బూ దస్కం ఇవ్వలేని మాలకొండయ్యలాంటి వాళ్ళని జైళ్ళకి రవాణా చేసేసేరు. మిగిలిన వాళ్ళమీద కేసులు సాగారించడం ప్రారంభించేరు.

కలాలీ శేషయ్య తా నారోజున మీటింగు కెడితే వెళ్ళనే లేదన్నాడు. కాని పటేల్ కొలిచిన ధాన్యం తెచ్చుకొన్నట్లు పోలీసులకి తెలిసింది. దానిని కమ్ముకొనేటందుకు ఇంకోఅబద్ధం ఆడేడు. అబద్ధం ఆడడం మహాపరాధంగా పరిగణించే పోలీసు అధికారికి ఎంతోకోపం వచ్చింది.

"సర్కారుధాన్యమా, నీ తాత ముల్లా"

అమీను సాక్షాత్తూ నిజాంప్రభుత్వ ప్రతినిధి స్వరూపుడు. ఆయన ప్రభుత్వం తరపున ఆ ధాన్యాన్ని వసూలు చేసుకొన్నాడు. కనీసం ఖరీదన్నా ఇప్పించండి దొరగారూ అని ప్రాధేయపడాలని శేషయ్యమనస్సు పీడించింది. కాని సాహసించలేక పోయేడు. మీటింగుకే వెళ్ళలేదన్న అబద్ధం బయటికి వస్తుందనిభయం. పోతేపోయెలే అనుకొన్నాడు. కాని సమాజంలో నీతిని శాంతిని కాపాడడానికి ఏర్పడ్డశాఖ అధికారి అంత సులభంగా మరచిపోతాడా ? రెవీ కొలిచినధాన్యం మళ్ళీ తెచ్చుకొన్న అపరాధానికి శేషయ్య రెండు వందలుతెచ్చి అమీనుకు సమర్పించేడు. సమర్పించేముందు తాను ప్రత్యేకంగా చేసిన అపరాధం ఏమీలేదనీ, అందరిలాగే తానూ తెచ్చుకొన్నాననీ విన్నపం చేసుకొన్నాడు. తన మాటకు ఋజువుగా ఆరోజున తనతో ఎవరెవరు ఎంతెంత ధాన్యం కొలిపించుకొన్నారో పేరు పేరు వరసలన చెప్పేడు. తన కళ్ళముందు కొలిపించుకొనకపోయినా, కొలిపించుకొన్నట్లు తాను విన్నవాళ్ళపేర్లుకూడా వాదబలానికి చేర్చేడు.

అమీను సంతోషం పట్టలేక మళ్ళీ ఎప్పుడు ఇల్లాంటి బద్మాషీ చెయ్యబోకని హెచ్చరిస్తూనే రెండు లాఠీపోట్లు బహూకరించేడు. ఆదెబ్బలకు ప్రాణం జిలార్చుకుపోయి శేషయ్య డొక్కలు పట్టుకొని చదికిలబడి పోయేడు. అమీను కొత్తవాళ్ళని లాక్కురావడానికి బంట్రోతుల్ని తోలుతున్నాడు.

"...బులావ్రే."

కురువ పాపయ్య నాలుగు గొర్రెల్ని అమ్మేసుకొని బయటపడ్డాడు. కుమ్మరి లింగయ్యా, మంగలి బంగారం, మేరె రాముడూ అసలు వూళ్ళో కనిపించకుండా పోయేరు.

సాతాని రామచంద్రయ్యకి కాస్త వ్యవహారజ్ఞానంవుంది. వెంటనే నల్లగొండకి మనిషినితోలి వకీలుని మాట్లాడమన్నాడు. తనతోపాటు జైలులోపడ్డ నలుగు రైదుగురికి ధైర్యంచెప్పి నిలవబెట్టేడు.

మొదట్లో మంచి లాభసాటిగా కనిపించిన వ్యవహారం మొండిని పడ్డట్లనిపించింది. మల్లారెడ్డి సత్యాగ్రహం ధర్మమాయని ఓ పదిరాళ్ళు చేసుకోగలమనిపించి పోలీసులు సంతోషపడ్డారు. కాని, అది నలుగురు ముగ్గురుతోనే ఆఖరయింది. కొత్తవాళ్ళు దొరకరు. పాతవాళ్ళు చేపరు. ఇళ్ళల్లో జొరబడి అల్లరిచేసినా బుడ్డెడూ అరబుడ్డెడూ గింజలు దొరుకుతున్నాయి తప్ప డబ్బు కిట్టడంలేదు. ధాన్యం పోగుచేస్తేమాత్రం మోసుకుపోవద్దా ? డబ్బుకుమల్లే ధాన్యపుబస్తా జేబులో వేసుకోవడం సాధ్యంకాదు, నిరుత్సాహం కలిగింది.

అమీను తన కార్యకలాపాన్ని ఖానుడిపేటకే పరిమితం చేయలేదు. ఖానుడిపేటకు ఆరోజున చుట్టుప్రక్కల వూళ్ళవాళ్ళందరూ వచ్చేరు. ఊరేగింపుల్లో, సభల్లో పాల్గొన్నారు. వాళ్ళందర్నీ పట్టుకురమ్మన్నాడు. మళ్ళీ రెండురోజులు పని చురుగ్గా జరిగింది. ఎవరో కొందరు దొరికేరు. కాని, అదికూడా పెద్ద ప్రయోజనకారి కాలేదు. అవూళ్ళల్లో కావాలను

కొన్ని వాళ్ళల్లో చాలామంచి కనపడ్డమే మానేసేరు. తమతో దాగుడు మూత లాడుతారా అని కోపంవచ్చింది. కాని చెయ్యగలదేముంది ? ఎంత రహస్యంగావచ్చి పడాలనుకొన్నా తమవార్త తెలిసేపోతుంది. ఇంచుమించు వూళ్ళన్నిటా దళాలు చిన్నవో, పెద్దవో ఏర్పడ్డాయంటున్నారు. దళం ఏమిటో అర్థంకాలేదు. కాని ఏదో కొంచెం పేచీగానే వున్నట్లనిపించింది. తమ వూళ్ళకున్న దారుల్లో...గ్రామం నలువైపులా గుబురుగా పెరిగిన చెట్లకొమ్మల సందుల్లో దళాలు కాపలా కాస్తున్నాయని కర్ణాకర్ణిగా తెలిసింది. దూరాన కనిపించే దుమ్ము లారీలదని తెలుసు. కాపలా కాస్తున్నారని తెలిసేక ఒకళ్ళిద్దరెళ్ళడం అర్థంలేనిపని. లారీ కదిలితే దుమ్ము జెండా ఎత్తందే అడుగుపడదు. పెట్రోలయిపోయినా పదిగజాలేనా నడుస్తుందిగాని దుమ్ము రేపందే అరడుగుకూడా సాగదు. దుమ్ము కనబడేసరికి ఏ ఈలో వేస్తారు. మరి తుపాకి వేద్దామన్నా మనిషి కనబడ్డు; వూళ్ళో ఒక్కమగాడు కనబడ్డు.

ఎన్నాళ్ళు పారిపోతారో చూద్దామంటే పోలీసులు తాముమాత్రం ఎన్నాళ్ళు కూర్చోగలరు? పోనీ ఓ పోలీసు బంట్రోతుని వూళ్ళోవదిలి కనిపించినప్పుడే జనాన్ని తోలుకురమ్మందామంటే ఆ బంట్రోతే మళ్ళీ కనిపించదేమోనని భయం. వెనకటి రోజులా ? ఒంటరిగా దొరకపుచ్చు; కాని బాదేస్తే దిక్కేమిటి ?

---

## పద్నాలుగో ప్రకరణము.

ఉన్నట్లుండి తాటాకులపల్లిలో మంగలి నరసయ్యచేతిలోని భర్మారు నెవరో అర్ధరాత్రివేళ లాక్కుపోయేరని పోలీసుల్లో గగ్గోలుపుట్టింది. ఆవార్త విన్నాక పగలుకూడా పోలీసులు ఒంటరిగా వూళ్ళల్లోకి పోడా

నికి ఇష్టపడడంలేదు. కోడిపెట్టలూ, గొర్రెపోతులూ వాళ్ళకిప్పుడు ఆశలు కలిగించడం లేదు.

తాటాకులపల్లె ప్రక్కనేవున్న పల్లెలో ఎవరో ఇల్లాలు కష్టపడుతూ వుంటే పురుడు పోయడానికి బాలమ్మ వెళ్ళింది. ప్రసవం చాలా కష్టం అయింది. వెంటనే ఆమె మగడికి కబురువెళ్ళింది.

ఆతడో రెండు రూపాయలుచ్చుకొని పదినిముషాలు ఆలస్యంచేసి, ఓ అరడజనుమాట్లు బ్రతిమలాడించుకొన్నాడు. వచ్చినవాళ్ళు ఆదుర్దాకొద్దీ తమ భుజానవున్న కండువా ఆతనిమీద పడేసేరు. కండువాలేనిదే కదల డం అలవాటు లేదన్నాడు. ఆ చిన్న గుడిసెలో కూడా ఆతని కా కండువా అజదొరకడంలేదు. మరేం చేస్తారు? అప్పటికే ఆలస్యమయింది. ప్రతి క్షణం ఎంతో విలువ గల సమయమయ్యె.

బయలుదేరేక కూడా ఆతడు మధ్య మధ్యన ఆగిపోతూ తాను గతంలో ఎవరెవరి ఇళ్ళవద్ద సుఖప్రసవానికి తోడ్పడ్డాడో వర్ణిస్తున్నాడు. తాను ఆగడం గాక కూడావున్న వాళ్ళనికూడా చెయ్యిపట్టి గుంజి ఆపి మరీ చెప్తున్నాడు. ఆతని పెళ్ళినడకలుచూసి వచ్చినవాళ్ళు ఆదుర్దాచూపిస్తు న్నారు. తొందర పెడుతున్నారు. కాని, నరసయ్యకి ఆ ఆదుర్దా లేదు; తొందరాలేదు.

“గట్టిగాదట్టించేం. చెప్పులు అగాదెత్తిపోవాలి...” అని పదిమాట్లు చెప్పించుకొన్నాడు. ఆ మాట వినేసరికి ఆతని వాగ్ధోరణి మరింత విజృం భించింది. ఆ విషయంలో తాను ఎంత ఉదారంగా వుండేవాడో, దాని వలన ఒకమారు పటేల్ మల్లారెడ్డి చేతుల్లోపడి ఎంత కిష్టపడ్డాడో నర సయ్య వివరించేడు. ఘనుడిపేటనుంచి ఓమారు ఇల్లాగే పిలుపువచ్చి వెళ్ళేడు. తాను పేల్చిన భర్మార్ చప్పుడికి కష్టపడుతున్న మనిషి ప్రస వించటమే కాదు. రెండు వీధుల ఆవల ఓ దొడ్డిలోవున్న మేక ఒకటి ఈచుకుపోయింది. వెంటనే పటేల్‌సాబ్ మనుష్యుల్ని పంపేడు.

ఆ పిలుపు వినేసరికి తానెంత భయపడినదీ, ఏంచేసినదీ, ఏమన్నదీ సాభినయంగా చెప్తుంటే, తన నోట ఆ మాటజారినందుకు కూడా వున్నతడు చాల పశ్చాత్తాప పడ్డాడు.

ఏలాగయితేనేం నరసయ్య తాటాకులపల్లె చేరేడు. తన ప్రాముఖ్యాన్ని ప్రదర్శించేటందుకు మందు దట్టించడానికి మామూలుకన్న మరో నిముషం ఎక్కువ ఆలస్యం చేసేడు. దీనికి తెగూతెంపూ లేదాయని ఇంటివాళ్ళు బాధపడుతున్నారు. ఆ క్షణంలో బాలమ్మవచ్చి రెండుగడుములతో ఆతని నోరుకట్టేసింది, కాని, లేకపోతే ఆ పని తెల్లవారేవరకూ తెమిలేదే కాదు.

* * * *

తమ ఆడపడుచు సుఖప్రసవానికి సహకరించిన నరసయ్యకు ఆ ఇంటివాళ్ళు ఆప్యాయంగా ఓ లొట్టెడుకల్లు ఇచ్చేరు. అది తాగేసి, వాళ్ళిచ్చిన ఓ కోడిపెట్టకి కాళ్ళుకట్టి చేతపట్టుకొని లేచేడు. భర్మార్ భుజాన వేసుకొని తిరుగుముఖం పట్టేడు.

పల్లెనుంచి హుషారుగా పాటలుపాడుతూ బయలుదేరిన నరసయ్య వూళ్ళోకి ఏడుస్తూ పరుగెత్తివచ్చేడు. మొత్తుకుంటూ పోలీసునాకాకి పరుగెత్తేడు.

మొత్తుకోడానికీ, జుట్టుపీక్కోవడానికీ వీలులేకుండా చేతిలో ఆటంకంగావున్న కోడిని జమేదారు తీసుకొని పక్కవానికిచ్చి జాగ్రత్త పెట్టించేడు. అటుతర్వాతనే ఆ ఏడుపెందుకో చెప్పమన్నాడు.

భర్మారును ఎవరో ఎత్తుకుపోయేరన్న ఫిర్యాదును జమేదారు నమ్మలేదు. భర్మారు లాక్కున్న బందిపోట్లు నిక్షేపంలాంటి కోడిని వదిలేస్తారా ?... కోడినేకాదు, రొండినున్న రెండురూపాయలు కూడా వదిలేసేరు. ఇదంతా కల్పనతప్ప వేరుకాదని పోలీసుస్టేషన్ విశ్వాసం.

నరసయ్య తనఫిర్యాదును ధృవపరిచేటందుకు చెప్పిన ప్రతిమాటా పోలీసులకి అనుమానాన్నే కలిగించింది. వాగుదగ్గర మాటొగ్గి తుపాకీ లాక్కోడం అబద్ధం అని తేల్చేరు. ఆ చోటు చూపిస్తాననడం తమరిని అక్కడికి తీసుకెళ్ళి చంపించేటందుకువేసిన పధకంలో ఒక భాగంగా నిర్ణయం చేసేరు. అటువంటి ప్రమాదంలో చిక్కుకోకుండా తప్పించుకో గలిగిన తమ తెలివికీ, అదృష్టానికీ అభినందించుకొన్నారు.

"దొంగవేషం...బద్మాష్...మాకీ......"

నోటికివచ్చినన్ని బూతులుతిట్టి, కట్టేసి, చితకకొట్టేరు. భర్మా రెవ్వరో ఎత్తుకుపోయేరన్న నరసయ్యను అదెక్కడ దాచేడో చెప్పమని ఊర్చున్నారు.

* * * *

మంగలి నరసయ్యను జైలుకి పంపించేరే గాని, పోలీసులు వూళ్ళ ల్లోకి రావడం తగ్గించేరు. తుపాకీ లాక్కున్నా, దాచిపెట్టినా ప్రయోజనం ఒక్కటే. అది ఎవరికోసం జాగ్రత్తచేసేరో, తమకోసమే అయితే ? ...

ఒకడుకాదు, ఇద్దరు కాదు. నలుగురుండండన్నా పోలీసులూళ్ళల్లో రాత్రులుండడానికి సిద్ధంకావడంలేదు. పగలు వచ్చినప్పుడు కూడా సందు లకీ, గొందులకీ అడ్డపడడం లేదు.

అల్లకల్లోలంగావున్న పరిస్థితుల్ని అదుపులో పెట్టుకోవడం కోసం నిజాం ప్రభుత్వం సీతారాంపురానికి పోలీసునాకాను శాంక్షన్ చేసింది. స్టేషను కట్టేటందుకు వ్యవధిలేదు. కనక, వున్నపాఠశాల ఒక్కటీ మూసేసేరు. పాఠశాల భవనాన్ని పోలీసునాకాగా మార్చేరు.

ముకుందరెడ్డికి మళ్ళీచెయ్యి మునగా పని తగిలింది.

—ꙮ—

# పదిహేనో ప్రకరణము.

కాంగ్రెసు ప్రారంభించిన సత్యాగ్రహాన్ని ప్రజానీకం ఆహ్వానించింది. అభినందించినా కళ్ళురిమినవాళ్ళుకూడా లేకపోలేదు. నిజాము స్వాతంత్ర్య ప్రకటనకు సంతోషం తెలుపుతూ పూజలూ, పురస్కారాలూ, సభలూ, సమావేశాలూ, వూరేగింపులూకూడ జరిపేరు. ఏ కంట్రాక్టరు చేతిమీదు గానో హిందూ దేవాలయాలుకూడా వేయివత్తులతో నిజాంస్వాతంత్ర్య ప్రకటనకు కళ్లు చికిలించేయి.

మరోవేపున రజాకారు నాయకులు కదిలేరు. ఖాజీ వూళ్ళల్లో వున్న జాగీర్దార్లనూ, జమీందార్లనూ రోజూ పిలిపిస్తున్నాడు. మంతనా లాడుతున్నాడు.

ఖాజీ చేతిలోని రజాకారుదళాలు తమ శక్తికొలదీ నిజాంరాజ్య రక్షణకు పూనుకొన్నారు. నిజాంప్రభువుకు వ్యతిరేకంగా పనిచేస్తున్న వాళ్ళను ఖతం చేసేస్తామంటూ నల్లగొండవీధుల్లోనే రెండుమాట్లు ప్రద ర్శనలు చేసేరు. వాళ్ళచేతుల్లో ఇక్ష్వాకుయుగంనాటి బరిసెల దగ్గరనుంచి ఆధునికమైన స్టెన్‌గన్‌వరకూ అన్నిరకాల ఆయుధాలూ కొరకొరలాడేయి. వారి వూరేగింపు సమయంలో పాతకక్షలుకూడా పరిష్కారముఖానికి వచ్చేయి. ఏనాడో దుకాణంలోకి వచ్చినప్పుడు 'చా' అరువుపొయ్యడానికి నిరాకరించిన ఒక చిన్నదుకాణదారు రజాకార్ల ప్రత్యేకతను ఆపూట అర్థం చేసుకోక తీరిందికాదు. ఆతడు వేసుకొన్న పాక పీకేసేరు. బల్లమీద అమర్చిన తినుబండారాల పెట్టెను విసిరేసి పగలకొట్టేరు. విరిగిపోయిన కుర్చీల్నీ, కూలిపోయిన పాకనూ కలిపి మంటపేసేరు.

ఈ ఘటనలు జరిగేక నగరంలోని వకీళ్ళల్లో చాలమందికి దేశ భక్తి ఇంకి పోయింది. సాతాని రామచంద్రయ్య. ఖానుడిపేటనుంచీ

మరొకరు తాటాకులపల్లె నుంచీ పంపించిన కబుర్లతో వకీళ్ళల్లో పుట్టిన న్యాయ రక్షణవాంఛ అవిరయిపోయింది. దేశభక్తి కొంచెం తటపటా యింపులో పడింది. సత్యాగ్రహాయుధాన్ని ఉపదేశించిన గాంధీజీ కోర్టుల్ని బహిష్కరణను కనీసం సత్యాగ్రహులచేత, కాంగ్రెసు వుద్యమంలో కేసుల్లో ఇరుక్కున్న వాళ్ళచేతనైనా అమలు జరిపించాలనే కోరిక బలంగా ఏర్పడింది.

* * * *

సత్యాగ్రహులమీదా, వారికి సాయపడుతున్నవారిమీద కసితీర్చు కొనడానికై ఘాజీ అనుచరులు వూళ్ళమీదపడ్డారు. బుడన్ స్వయంగా అనసూయమ్మను కలుసుకొనేటందుకు ఫకీర్రావుపేట వెళ్ళాడు.

మొట్టమొదట అనసూయమ్మ ఆతనిరాకకు వుత్సాహం చూపలేదు. కాని తన భూమిని వదలనంటున్న నరసిరెడ్డిని సాధించేటందుకు సమయం వచ్చిందనే మాటవినేసరికి చెవులు దోరపెట్టింది.

నరసిరెడ్డి కొడుకు భాగ్యరెడ్డి దళంలో చేరేడు. ఆ కోపంతో కొడు కునూ, కోడల్ని ఇంట్లోంచిపంపేసినా చాటుమాటున సాయం చేయడం లేదనేదేముంది ? శీతారాంపురంలోనే ఇప్పుడు స్టేషన్‌పెట్టేరు. ఓ వంద రూపాయలు మనవి కావనుకుంటే పోలీసులు కుక్కల్లా నానాచాకిరీ చేస్తారు. నరసిరెడ్డిచేస్తున్న భూమిని లాక్కోడానికి అవకాశం కలిగిందనే మాటతో అనసూయమ్మ మనస్సులో ఆశలు తాచుపాముల్లాగ బుసలు కొట్టేయి.

ఆస్తిని చేతుల్లోకి తెచ్చుకోవడానికివున్న అవకాశాల్ని బుడన్ మరింత వివరించేడు.

వూళ్ళోనే పోలీసు స్టేషన్ వుండడం గ్రామరక్షణదళం ఆటలేం సాగడంలేదు. వాళ్ళు గ్రామంలోంచే అతేరాఎత్తేసేరు. వాళ్ళతో భాగ్య రెడ్డి పోయేడు. ఆ విధంగా దళం భయం పోయింది.

ఇంక ముసిలాడు. అమీన్‌సాబ్ చేతిలో ఓ వంద పెట్టేస్తే ఆయనే చూచుకొంటాడు. సత్యాగ్రహం రోజున ముసిలాదు అక్కడేవుండి ప్రోత్సాహం ఇచ్చేడని బొక్కలో తోస్తే అడిగేదెవరు? ఆ కేసులో రెండేళ్లశిక్ష పారేయిస్తే మళ్ళీ బయటికి వచ్చేసరికి అన్నీ అయిపోతాయి.

"అయితే అమీనుకు ఏభయిరూపాయిలిస్తే చాలదా?"

బుడన్ ఆ రాత్రి అక్కడే ఆగిపోయి వ్యవహారం సులువు బలువులు ఆమెకు బోధించేడు.

రెండోరోజున నరిసిరెడ్డిని పోలీసులు అరెస్టుచేసిన వార్తను స్వయంగా వచ్చిచెప్పేడు. అనసూయమ్మ ఆ వేడిలోనే భూమిమీదికి మనుష్యుల్ని పంపాలంది. బుడన్ స్వయంగా మాలపల్లి వెళ్ళేడు.

శీనయ్య పల్లెపెద్ద. వానికో రెండు రూపాయలిచ్చేడు. ఆతని ద్వారా పదిమందిని తలోఅర్ధా ఇచ్చి పట్టుకొచ్చేడు. వాళ్ళతోవెళ్ళి అనసూయమ్మ భూమినుంచి నరిసిరెడ్డి కామటాన్ని బేదఖల్ చేసేసేడు.

వీళ్ళంతా వెళ్ళినరోజున పొలంమీద ఎవ్వరూలేరు. కనక అడ్డం వచ్చేవాళ్ళూ లేకపోయేరు. చుట్టుప్రక్కల పొలాలవాళ్ళు చూస్తూన్నా ఏమీ అనలేదు. మాలపల్లి వాళ్ళనిద్దర్ని పిలిచి జానకి రామయ్య ఏదో మాట్లాడబోయేడు. బుడన్ సరవళ్ళు తొక్కేసరికి ఊరికేఅయిపోయేడు.

తర్వాత ఒకటి రెండు రోజులు బుడన్ వూళ్ళోనేవుండి తన బలగంతో పొలంమీదికి పోయివచ్చేడు. "ఎదిరివాళ్లు కనబడితే ఒక్క పరి బడితబాజా పట్టేస్తాను. అక్కడికి భూమి మనదని దఖలు పడిపోతుంద"ని బుడన్ అనసూయమ్మచేత వాళ్ళకి ఖర్చులిప్పించేడు. కాని, నరిసిరెడ్డి తాలూకు కుక్కపిల్లకూడా ఆ పొలం ఛాయలకి రాలేదు.

మూడోరోజున చేను చూసిరావడానికి వెళ్ళిన కూలివాడు మధ్యదారిలోనే వెనక్కి తిరిగేడు. బుడన్ ఎంత బెదిరించినా తా నింకా చేను సగాలకికూడా పోయేది లేదన్నాడు.

మొట్టమొదట్లో వాడు కారణం చెప్పలేదు. కాని, కారణంఏమిటో విన్నాక బుడన్ ఆ చేనుపేపు వెళ్ళడానికి తానే తొందరపడలేదు. బుడన్ శక్తిసామర్థ్యాలమీద అపారమైన విశ్వాసంతో అనసూయమ్మ అతనిని ప్రోత్సహించి పంపబోయింది. కాని, చేనుకాపలా బాధ్యతను గ్రామ రక్షణదళం తీసుకొన్నదన్న వార్తా, భర్మారుతో భాగ్యరెడ్డే స్వయంగా అక్కడున్నాడనీ విన్నాక బుడన్ ధైర్యం నీళ్ళ కారిపోయింది.

ఏడెనిమిదేళ్ళనుంచి ఎంతడబ్బు ఖర్చుచేసినా నరిసిరెడ్డిని భూమి నుంచి బేదఖల్ చేయలేకపోయింది. అట్లాంటిది చూస్తూండగా పంటతో సహా స్వాధీనం అయినదని ఈ వారంనుంచీ ఆమె మహానందపడింది. కృతజ్ఞతా సూచకంగా బుడన్‌ను పిండివంటలతో మేపింది. నూరురూపాయల ఖర్చుతో రెండు మూడువేల రూపాయలపంటనూ భూమినీ ఇప్పించేడు. అంతక్రితం సంవత్సరం పంటలు బాగాలేక తిండిగింజలు ధర పెరిగేయి. ఈ ఏడాదికూడా అన్నిచోట్లా చేలు బాగున్నా లేకున్నా నరిసిరెడ్డి చేలు బాగున్నాయి. పంటకి మంచిధరవస్తుందని అంచనావేసుకొంది. మంచి హుషారుతోవుంది. ఇప్పుడా ఆస్తిఅంతా కొల్లబోయినట్టు బాధపడింది. ఇప్పుడామె దుఃఖం ఆ నలభయ్యేభయి ఎకరాలకోసం కానే కాదు. వాటిమీది ఆశ ఇదివరకే వదలుకొంది. బుడన్ ఎన్నోకబుర్లు చెప్పినా శాశ్వతంగా వాటిని దక్కించుకోగలనన్న ధైర్యం ఆమెకు కలగ లేదు. నరిసిరెడ్డి జైలులోవున్న రెండేళ్ళో, మూడేళ్ళోనైనా కనీసం పంటలు దక్కుతాయనుకొంది. ముఖ్యంగా ఈయేటిపంటమీద ఎన్నో ఆశలు పెట్టుకొంది.

అనుకొన్నది రాకపోవడం సరికదా ఉన్నది పోయింది. ఈనాలుగు రోజులనుంచీ బుడన్ తానుపడ్డశ్రమకి ప్రతిఫలం ఎంతివ్వాలో స్పష్టం చేసేడు. దానిలో కొంతభాగం తీసుకొన్నాడు. అదిగాక ముందు ముందు

కూడా ఆతని సహాయం నికరం చేసుకోడానికై ఆమె తన యింట్లోవున్న చేతిగడియారాన్ని బహుమతీగా వానిచేతికి తగిలించింది.

భాగ్యరెడ్డి భర్మార్‌తో చేనుదగ్గర వుంటున్నాడన్నవార్త విన్నాక బుడన్ ముఖంలో కనబడ్డ భయంగమనించి అనసూయమ్మకు వానివలన పని కాలగదనే ధైర్యం పోయింది. వానికాగడియారం ఇవ్వడం దండుగే అయింది. వాడిప్పించేడన్న వస్తువు దేవతావస్త్రంలా వుండిపోయింది. రాబోయే పంటలో వాటాగా తానాతనిచేతిలో పెట్టిన ఏభయి రూపాయలూ గుర్తువచ్చి కళ్ళనీళ్లు తిరిగేయి. బుడన్ చేతినున్న గడియారం మిలమిల లాడుతూ ఆమె దుఃఖాన్ని అపహసించింది.

---

## పదహారో ప్రకరణము.

బుడన్ చిరచిరలాడుతూ బయలుదేరేడు. పేట్రేగిపోతున్న దళాన్ని నేలబెట్టి రాసెయ్యడానికై బలగాన్ని తీసుకువస్తానని అనసూయమ్మకు వాగ్దానం చేసేడు.

తీరా ఘాజీవద్దకు వచ్చేసరికి పరిస్థితులు తాను అనుకొన్నట్లు అనుకూలంగా కనిపించలేదు. తమ నాయకులలో ఒకడనుకొంటున్న తుమ్మలపల్లి జాగీర్దారు ఛోటేజాన్ ఘాజీని, ఆయన అను చరుల్ని దిగపీకేసేడు. ఇంకేముంది ?

"రజాకార్ అనేమాట చాల పవిత్రమైంది. ఒక ఉన్నతమైన ఆశయాన్ని ప్రతిబింబించేదీను. కాని, ఆశబ్దం ఇప్పటికీ అవమానం పాలయింది. కొద్ది రోజుల్లోనే అవమానకరమయిన తిట్టుగా, బూతుగా పరిణమించిందంటే ఆశ్చర్యంవద్దు"

ఖోటేజాన్ కంఠం ఆవేశంతో గద్గదికంఅయింది. రజాకారుపువ్య మాన్ని తెలంగాణాలో నిర్మించడానికి ఆయన చేసిన సేవను తలచుకొనీ, ఇప్పటి ఆవేశాన్ని గమనించీ ఖాజీ, ఆయన అనుచరవర్గమూకూడ సందే హంలో పడ్డారు. పైగా ఆయన చాల ఉన్నతకుటుంబీకుడు. ఈనాడు ఆర్థికంగా తమలో చాలమంది ఆయనకన్న చాల వుచ్చస్థితిలో వున్నారు. కాని ఆయన కుటుంబానికున్న మర్యాద? దానిని తలచుకొన్నప్పుడు ముసలిఖాజీకూడా ఖోటేజాన్ యెడ మర్యాదచూపకుండా వుండలేడు.

1857 లో ఖోటేజాన్ పెద్దతాత హైద్రాబాద్ సంస్థానం మీద ఇంగ్లీషు వాళ్ళకున్న పెత్తనాన్ని ధ్వంసంచేయడానికై విపరీతమైన కృషి చేసినవారిలో ఒకడు. జూన్ 17 న రెసిడెన్సీ మీద ప్రజలు ముట్టడి చేసి నప్పుడు దివాన్ సాలార్ జంగ్ విప్లవకారులను అణచివేయడం కోసం అరబ్బు సైనికదళాన్ని పంపించేడు. ఆ దళనాయకుడు సాదతలీ ఖోటే జాన్ పెదతాత. ఆయన తమ రాకను ముందే విప్లవకారులకు తెలియపర చేడు. వాళ్ళు తప్పించుకుపోయేవరకూ జాప్యంచేసేడు.

ఆ సంగతివి రెసిడెంటు నవాబువద్ద ఫిర్యాదుచేసేడు. కాని, ఆయన తన ప్రయత్నాలు మానలేదు. చివరకా ప్రయత్నాలలోనే ఆయన ఫిరంగికి కట్టి కాల్చివేయబడ్డాడు.

నిజాము సాదతలీ తన స్వాతంత్ర్యంకోసమే మరణించేడన్న సంగతిని మరవలేదు. అవకాశం దొరకగానే సాదతలీ తమ్ముడికి ఆయన జాగీరు నిచ్చివేసేడు. తన దర్బారులో మర్యాదాస్థానం ఇచ్చేడు. ఆనాటి రెసిడెంటూ, దివాను సాలార్ జంగూకూడ దానికి వ్యతిరేకించేరనీ నిజాము వాళ్ళమాటల్ని ఖాతరు చేయలేదనీకూడ చెప్తారు.

ఖోటేజాన్ మాటలలో ఆనాడు చూపిన ఉదారతయెడ చాలా విశ్వాసం కనబడుతూంటుంది. కాని, నిజాము స్వాతంత్ర్య రక్షణసమస్య

వచ్చేసరికి ఆయన ఆ బాధ్యత ముస్లిము లొక్కళ్ళదే అంటే ఒప్పుకోడు. హిందువుల్నికూడా ఆహ్వానించేడు. గ్రామాలలోని జాగీర్దార్ల బలగాలు ఆయన ప్రోత్సాహంతో రజాకార్లలో చేరేయి.

కాని, బలగం పెరిగేక ఆయనకళ్ళు విడ్డాయి. వుద్యమం వెర్రి తలలు వేస్తూందనిపించింది.

ఏకైక ముస్లింరాజ్యం అస్తిత్వాన్ని కాపాడ్డానికై సృష్టించిన రజాకారు బలగం శీతారాంపురంలో ఒక అభాగ్యుణ్ణి హత్యచేసిన వార్తకి ఛోటేజాన్ మనస్సు తల్లడిల్లింది. ఆ వూళ్ళోదళం ఏర్పడి తుపాకీ తీసిం దనేసరికి ప్రజల్ని నిందించాలో తన వుద్యమాన్నే నిందించాలో అర్థం కాకుండా పోయింది. పరిస్థితులు చూస్తూంటే అతి వేగంగా కదిలి పోతున్నాయి...

నిజాంసర్కారు అప్రతిష్ఠ పాలవుతూంది. ఇంతవరకు సర్కారుకు పెట్టని కోటలుగావుంటున్న వతన్‌దార్లు వుద్యోగాలు వదలి పారి పోతున్నారు. కొందరు నిజాముకు వ్యతిరేకంగా సత్యాగ్రహమే ప్రారంభించేరు.

ఛోటేజాన్‌కు భయమేసింది. కాని...

తనకున్న ప్రతిష్ఠ మిగిలినవారందరినోరూ కట్టేస్తూందేగాని, తన మాటలు వారెవ్వరికీ ఇష్టంకాలేదని గ్రహించేడు. వారి అభిప్రాయాలకు తానూ సర్దుకోలేకుండా వున్నాడు. తాను పెంచి పోషించిన వుద్యమానికి కీలకం తన చేతుల్లోలేదు. కనీసం తనమీద మర్యాద నిలపగలవాళ్ళ చేతుల్లోకూడాలేదు, కర్ణాటకంనుంచి వచ్చిన వకీలు దానిని గుప్పిటపట్టి కూర్చున్నాడు.

కాశింరజ్వీ ధోరణి తనకెరికే. అయినా పరిస్థితులుచూసి బుద్ధి మార్చుకొంటాడేమో ప్రయత్నించాలనిపించింది.

ఆమాటే అన్నాడుకూడా, ఖాజీ తలవూపేడు.

ఆ ప్రసంగాల్ని వింటున్న బుడన్ ముస్లింపతపక్షణరూ, నిజాం స్వాతంత్ర్యం కాపాడ్డానికీ ప్రతి ముసల్మానుడిమీదా ఎంతభారంవుందో పాఠం వప్పచెప్పినట్లు చెప్పేడు.

ఈ చప్పలను విననిచ్చినంతమాత్రాన బుడన్ వానితో కలగచేసుకోడం ఖాజీకే అయిష్టమనిపించి కనుబొమ్మలు ముడేసేడు. ఛోటేజాన్ ఈసడింపుతో వాని ముఖంవంక చూసి తల తిప్పుకొన్నాడు.

తన్ను పురుగును చూసినట్లు చూస్తూంటే బుడన్ రక్తం వుడుకెత్తి పోయింది. నలుగురి ముఖాలూ చూసేడు. తన్ను సమర్థించే లక్షణం ఎక్కడా కనబడలేదు. వూరుకొన్నాడు.

---

## పదిహేడో ప్రకరణము.

వందలు వేల సంఖ్యలో గ్రామాలనుంచి ప్రజలు యూనియన్ ప్రాంతాలకు పారిపోతున్నారనీ, అది ముస్లింరాజ్య ప్రతిష్ఠకీ, పరిపాలనా పటిష్ఠతకీ ప్రమాదమనీ ఛోటేజాన్ చెప్తూంటే రజ్వీకళ్ళు మిల మిల లాడేయి.

ఆయనకు సమాధానం మాటల్లో ఇవ్వడం రజ్వీ అనవసరం అనుకొన్నాడు. వెంటనే డ్రైవరును పిలిచి కారు తియ్యమన్నాడు.

మరునిముషంలో ఛోటేజాన్‌నూ ఆయన మిత్రుడు జహాంగీర్ ఖానునూ సమర్యాదకంగా ఆహ్వానించేడు. ఎక్కేక తానెందుకు ఎక్కడికి తీసుకుపోతున్నదీ చెప్పేడు.

"ప్రతిష్ఠఅనేది మన కొంపకేకాదు."

ముగ్గురూ కాచిగూడ స్టేషనుముందు కారుదిగేరు. రజ్వీని చూడగనే స్టేషను మాస్టరుతోసహా యావన్మందీ బిలబిలలాడుతూ బయటకు వచ్చేరు. ఆదబ్‌లు అందుకుంటూ రజ్వీ ప్లాట్‌ఫారంమీదికి నడిచేడు.

ఎదురుగా గుడ్సుషెడ్ ఆవల మైదానం అంతా జనంతో నిండి వుంది. వాళ్ళు భారతదేశం నలుమూలలనుంచీ వచ్చిన కాందిశీకులు. కొందరు బీరార్‌నుంచి వచ్చేరు. కొందరు బెజవాడనుంచి వచ్చేరు. అన్ని రాష్ట్రాలనుంచీ వచ్చిన ఆ జనం సంతలో పశువుల్లాగ ఆ పెద్ద మైదానంలో కిక్కిరిసి వున్నారు. అదివరకే అక్కడున్న షాదీఖానా కాందిశీకుల విడిదిగా మారిపోయింది. చుట్టూ గుడారాలు లేచేయి. అవి భర్తీ అయిపోయేయి. గుడిసెలు పడ్డాయి. వాటికీ చోటులేదు. వేసినవాట్లల్లో కూడా తలదాచుకొనేటందుకు అందరికీ చోటూలేదు.

వేలమంది మలమూత్రాలతో ఆ ప్రదేశమంతా గౌలుకంపుకొట్టిపోతూంది. ఒక్కరివొంటినీ బట్టా, పాతా లేదు. వట్టి పీలికలు.

ఆ వాసన భరించలేక, దృశ్యం చూడలేక రజ్వీ తన బృందంతో వెనుతిరిగి స్టేషనులోకి వచ్చేసేడు. ఇప్పుడేమంటావన్నట్లు ఛోటేజాన్ వంక చూసేడు.

ఛోటేజాన్‌కూడా వచ్చిన ఆయన మిత్రుడు జహంగీర్‌ఖాన్ ప్రశ్నించేడు.

"వీళ్ళకింతకన్న ఆశ్రయం చూపలేమా ?"

రోజూ కొన్ని వందలమందిని పల్లెటూళ్ళకు పంపేస్తున్నారనీ, కాని కొత్తవాళ్ళు వచ్చిపడుతూండడంచేత రద్దీఎప్పుడూ తగ్గడమే లేదనీ స్టేషన్ మాస్టరు మాటకలిపేడు. ఆయన మాటలకు సాక్ష్యంగా అప్పుడే ఒక లారీ అక్కడకువచ్చి ఆగింది. దానిలో వచ్చిన ఏజంటు కాశిం రైల్వే స్టేషన్‌లోవున్న వార్తవిని నమస్కారం తెలపడానికి పరుగెత్తి

వచ్చేడు. అక్కడ జరుగుతున్న చర్చలలో తనమాటారలిపేడు. ఎన్నెన్నో కష్టాలుపడి హిందువుల బాధలు తట్టుకోలేక పారిపోయి వచ్చినజనం నిజాం ప్రభువు ఆదుకోకపోతే ఏమయి పోయేవారో నని విచారం తెలిపేడు.

ఆలడు ఊరు, పేరు, వరసన ఆయన ఎన్నెన్నో కథలుచెప్పేడు. అన్నీ ఆస్తులు లాగివేయబడినవీ, భార్యల్నీ, చెల్లెళ్ళనీ, లాక్కుపోయినవీ కథలే.

ఛోటేజాన్ తన ప్రక్కనున్న ఒకరినివెళ్ళి లారీనుంచి ఒకరిని తీసుకురమ్మన్నాడు. అప్పటికే దానిలో ఓయిరవై మందివరకూ ఎక్కి పక్కనున్న కమ్ములు పట్టుకొని నిలబడి వున్నారు. డ్రైవరు తనతో రావలసిన ఏజంటుకోసం కనిపెట్టుకొని వున్నాడు.

పిలుపురాగానే చివరనున్న ఒక యువకుడు ఉరికేడు. ఆతనివెంట అందరూ బిలబిల్లాడుతూ తామూదిగేరు. ముందు నడుస్తున్న వాని వెనకనే తామూ స్టేషన్‌లోకి వచ్చేరు.

ఏజంటుకు వారి జీవితచరిత్రలన్నీ కరతలామలకం అనిపించింది, పిలుపు మీద వచ్చిన యువకుడు అంతదూరాన వుండగానే ఆలనికథను చెప్పేడు.

ఏజంటు కథనం ప్రకారం ఆ యువకుడికి వుస్తూరాదు. నాలుగో అయిదోబీఘాల భూమి వుండేది. దాన్ని లాక్కుని పటేల్ తరిమేసేడు. వూళ్ళో అంతవరకూ ఆతనితో ప్రాణస్నేహితుడుగా నటించిన హిందుపు డొకడు నమక్ హరామీచేసి, ఆతడి పడుచుపెళ్ళాన్ని లాక్కుపోయి తన యింట్లో పెట్టుకొన్నాడు. ఇంక చేయగలదిలేక ప్రాణభయంతో పారిపోయి వచ్చేడు.

ఆ దుఃఖమయ జీవితగాధవిని అక్కడున్న వాళ్ళంతా అనుతాపం తెలిపేరు. ప్రతిఒక్కరూ భయంకర శపథాలు తీసుకొన్నారు.

"హరేక్ గాంవ్ ఏకేక్ నవాఖలీ బనావేంగే."

ఆ జనంమధ్య ఛోటేజానూ, ఆయన మిత్రుడూ మాత్రమే ఏ మాత్రపు ఆవేశమూ ప్రదర్శించనివాళ్ళు.

జహంగీర్ ఖాన్ ఆ యువకుణ్ణి పిలిచేడు. ఆతడెక్కడి వాడో తెలుసుకో గోరేడు.

ఆ యువకుడికి ఉర్దూరాదు. "అటకపర్ చొప్పకట్ట భైంస్‌కో వార్‌రే" పాటి వుర్దూమాత్రమే వానికివచ్చు. ఇక్కడికొచ్చేక భాషనట్టు పడుతూంది. కాని ధారాళంగా మాట్లాడలేడు. తన్ను తెలంగీ వాడని చెప్పాలో, ఆంధ్ర అని చెప్పాలో వానికింకా స్పష్టంగా తెలియలేదు. ఛోటేజాన్ స్వచ్ఛమైన తెలుగులో తన్ను పలకరించేసరికి వాని ప్రాణం లేచి వచ్చింది. హైద్రాబాద్ తెలుగుదేశం మధ్యనున్నా తెలుగు మాట్లాడటం అమర్యాదగా అక్కడి ముస్లిములు భావిస్తారు. సంస్థాన ప్రభువు ముస్లిం. అందుచేత ముస్లిములంతా రాజవంశీకులమనే అనుకొనేవారు. వానిస తెలుగువాడి భాష నేర్చుకోవడం, మాట్లాడ్డం రాజవంశీకుని కెంత అప్రతిష్ఠ? కనక అంట్లుతోముకుని బ్రతికే బూబమ్మకూడా తెలుగులో ఏమన్నా ప్రశ్నిస్తే ఆముదం త్రాగినట్లు ముఖంపెట్టేది. ఆ భావం తెలుగు తప్ప మాట్లాడలేని సత్తార్‌కి చాల కష్టం తెచ్చిపెట్టింది. తప్పనిసరయి భాషను త్వరగానే నేర్చుకోగలుగుతున్నా అలవాటయినమాట వినబడక నోరుకుట్టేసినట్లే అనిపిస్తూంది.

ఛోటేజాన్ తెలుగులో ధారాళంగా మాట్లాడుతూంటే ఏజంటు వెర్రిమొగం వేసేడు. ఆతనికి తెలుగురాదు. తాను చెప్పినగాథలు తెలిసి వుండడానికి తెలుగురావలసిన అవసరం కూడా లేదు. రహబరే దక్కన్ ఒక వారం చదివితే చాలేడు కథలు ఇల్లాంటివి చెప్పెయ్యొచ్చు. హైద్రాబాద్‌లో బోలెడు ఉర్దూ పత్రికలున్నాయి. వానికి కావలసిన

కథలూ, వార్తలూ సేకరించి పెట్టడానికి బోలెడుమంది కవులూ వ్రాయసగాళ్ళూ వున్నారు.

ఏజంటు తానువిన్న కథల్లో ఒకటి చెప్పేడు. అదృష్టవశాత్తూ అతడు చెప్పినట్లు ఆ యువకుడికి ఉద్యోగం రాదు. అంతకంటె ఆతని కథ సత్యమేననడానికి మరోనిదర్శనం ఏంకావాలి? అక్కడున్న జనం తమ చూపులతోనే ఆతని ఏప్రతచేరు. కాని, ఏజంటుకు చెదురుపోలేదు. తాను చెప్పినది పట్టికథ మాత్రమేనని ఆతడెరుగును.

ఛోటేజాన్ తెలుగులో పలకరిస్తూంటే సత్తార్ మహానందపడ్డాడు. ప్రశ్నలన్నీ విన్నాడు.

"నిజం చెప్పమన్నారా?"

ఇదివరకు అబద్ధం చెప్పించేరని దాని అర్థమా? ఛోటేజాన్ ఆ అనుమానాన్ని బయటకు తేలలేదు. తమ మధ్యనున్న సన్నని గడ్డం మని షిని చూపించి ఆయనే కాశిం రజ్వీ యని ఎరుకపరచేడు. అబద్ధంలేకుండా నిజం చెప్పమన్నాడు.

సత్తార్ కాశిం రజ్వీకి సలాముచేసేడు. ఎక్కడైనా పదెకరాల కౌంట్రాక్ట ఇప్పిస్తే చాలునని తన దరఖాస్తు తెలియబరచుకొన్నాడు.

కాశిం రజ్వీ కనుబొమ్మలు ఎత్తి ఆతనిమాటల్లో ఆసక్తి కనబర చేడు. సత్తార్‌కు ధైర్యం చిక్కింది. తనకు గలిగిన ఆశాభంగాన్ని వివరించేడు.

సత్తార్‌ది తూర్పుగోదావరి జిల్లాలో పోతారం అనే చిన్న పల్లెటూరు. రైలుస్టేషనుకి ఇంచుమించు నలభయ్యేనయి మైళ్ళదూరం వుంటుంది. అక్కడి కెళ్ళాలంటే ఒక్క విమానం మినహాగా అన్ని ప్రయాణసాధనాలూ ఉపయోగించవలసిందే. లాంచి, బస్, గుర్రబ్బండి, నడక ఇందులో ఏదీ తప్పదు.

ఆతనికి ఆస్తి ఏమీలేదు. తండ్రి పశువులుకుట్టి బ్రతికేవాడు. తాను థర్డుఫారం చదివేడు.

ఏజంటు ఆ మాటను హైద్రాబాదీ భాషలోకి మార్చేడు.

"మిడిల్ ప్యాసయ్యేడు."

చుట్టూవున్న వాళ్ళంతా అభినందన సూచకంగా తలలాడించేరు. సత్తార్ కథ అందరికీ ఆసక్తి కలిగించింది.

మిడిల్ ప్యాసయ్యేక కుట్టుపని నేర్చుకొన్నాడు. ఇంతలో తండ్రి చచ్చిపోయేడు. కుట్టుపనే జీవనాధారం అయింది. తల్లీ, తానూను; ఇంకా పెళ్ళి కాలేదు. కుట్టుపని డబ్బులతోనే సుఖంగా బ్రతుకుతున్నాడు. తమ వూరికి ప్రక్కనే ముంగండ అనే పెద్ద వూరుంది. తమ వూరివాళ్ళే ఒకళ్ళిద్దరు అక్కడ కుట్టుపనిచేసుకుని సంపాదించుకొంటున్నారు. తానూ అక్కడకే మారాలనుకొన్నాడు. ఒక గది కూడా మాట్లాడుకొన్నాడు.

ఆ సమయంలో ఒక స్నేహితుడు తన పథకాన్నంతనీ తల్లక్రిందులు చేసేడు. ఆ స్నేహితుడిది ఆసమీపంలోనేవున్న అంబాజీపేట. తనతోపాటు ఆవూరి స్కూల్లో మిడిల్‌ప్యాసయి వున్నాడు; ఆతడు తన్నిక్కడికి తెచ్చేడు.

ఓ రోజున వాళ్ళయింటికి బెజవాడనుంచి ఓ బంధువు వచ్చేడు. చదువుకొన్న వాళ్ళకి ముస్లిము అయితేచాలు నిజాములో బోలెడు వుద్యోగాలు దొరుకుతున్నాయని ఆయనే చెప్పేడు. తాను చదువుకొన్న మూడో ఫారానికి ఏ తాసిల్దారీయో ఇస్తారన్నాడు. వుద్యోగాలమాట ఎల్లావున్నా బోలెడు భూమివుంది. ఎక్కడ కావాలన్నా పదెకరాలు దొరుకుతుంది. నడవమన్నాడు.

తన జిల్లాలో తమప్రాంతం అంతా పల్లపుభూములు. ఎకరానికి పదీ, పన్నెండుబస్తాలు రాలుతాయి. అక్కడ నాలుగెకరాలుంటే నవా

డిగ్రీ చలాయించవచ్చును. అట్లాంటిది పదెకరాలభూమి ఇస్తారంటే నిజమేనా అనిపించింది. నిజాము సర్కారు ముసల్మానులను పైకి తీసుకువచ్చేటందుకు ఇల్లా ఇస్తూందని చెప్పేరు. తాను ఎంతకాలం కుట్టు కుట్టుకుంటే ఎకరంభూమి సంపాదించగలడు? తల్లితో ఆలోచించేడు. కుట్టుమెషను అమ్మేసేడు. ఏదో చిల్లరఅప్పులుంటే తీర్చి ప్రయాణపు ఖర్చులకి కొంతపట్టుకొని, మిగతాది తల్లికిచ్చి బయలుదేరేడు; ఇక్కడికి వచ్చేడు.

ఉద్యోగాలూ, భూములూమాట వచ్చేసరికి చుట్టూవున్నవారు మొగ మొగాలు చూచుకొన్నారు.

"నీ స్నేహితుడేడీ?"

ఆతనితో వచ్చిన యూసపు ఒకనెల వుండి వెళ్ళిపోయేడు. ఇక్కడికి వచ్చేక వుద్యోగంకోసం తిరిగేడు. దొరకలేదు. వెళ్ళిపోయేడు. ఆతనివద్ద టిక్కట్టుకి డబ్బుంది. తనదగ్గిరలేదు. అందుకే నిలిచిపోయేడు.

* * * *

ఏజంటు ఊరికే అయిపోయేడు.

ఘోషేజాన్ మిత్రుడిమొగం చూసేడు. కాని, ఆయన ఏమీ విన నట్లూ పట్టనట్లూ సిగరెట్టు పీలుస్తూ ఎక్కడికో చూస్తున్నాడు.

రజ్వీకూడా పరిస్థితిని అర్థంచేసుకున్నాడు. కాని ఏమీ గమనించ నట్లే ముఖం పెట్టేడు.

ఘోషేజాన్ ఒక్క నిట్టూర్పు విడిచేడు.

"చలే!"

కారులో ఒక్కరూ నోరువిప్పలేదు. తాము చూచినవీ, విన్నవీ నెమరువేసుకుంటూ కూర్చున్నారు.

---

# పదునెనిమిదో ప్రకరణము

ఛోటేజాన్ నల్లగొండ తిరిగివచ్చేడు. నరిసిరెడ్డిని అరెస్టుచేసేరనేవార్త అక్కడి కొచ్చేక తెలిసింది. ఆయనమీద సత్యాగ్రహోత్సవంలో పాల్గొన్నాడని కేసుపెట్టేరని చెప్పేరు. ఆయింటిసంగతి తనకు తెలుసు. నరిసిరెడ్డిపై కేసుకు మూలం ఏమిటో కూడా తెలుసును. అటువంటి అన్యాయాలే నిజాం ప్రభుత్వపు ప్రతిష్ఠని మంటగలుపుతున్నాయి—అని రుసరుసలాడేడు.

ఛోటేజాన్ ఎకాయెకీని సీతారాంపురం వచ్చేడు. అమీను ముకుందరెడ్డి అన్నీవిని తాను ప్రభుత్వచట్టాన్నే అమలుజరుపుతున్నా నన్నాడు. సత్యాగ్రహం చేయడం, దానికి తోడ్పడడం ప్రభుత్వ ద్రోహం. అటువంటి ద్రోహచర్యలు జరగకుండా కాపాడ్డం తమవిధి. ప్రభుత్వం శాసన ధిక్కారంచేసినవారిని అరెస్టుచేయమని హుకుంజారీచేసింది. ఆ ప్రకారమే తాను నరిసిరెడ్డిని అరెస్టుచేసేడు.

అనసూయమ్మ భూములతగాదా చరిత్రనుచెప్పి, నరిసిరెడ్డికి కిట్టనివారెవ్వరో రిపోర్టునిచ్చేరు తప్ప, దానిలో నిజం లేదని ఛోటేజాన్ అమీన్‌కు నచ్చచెప్పడానికి ప్రయత్నించేడు.

ముకుందరెడ్డి ఆయన అభిప్రాయాన్ని కాదనలేదు. నరిసిరెడ్డిమీది రిపోర్టు అబద్ధమేకావచ్చు. కాని, దానిని తానెల్లా చెప్పగలడు? ఆయన కొడుకు దళంలో చేరేడు. ఆయనమీద కూడా రిపోర్టు వచ్చింది. ఆ పరిస్థితులలో తాను ఆయనను అరెస్టుచేయక ఏంచేసేది? నిజానికి నరిసిరెడ్డి నిరపరాధే కావచ్చు. తనకు ఛోటేజాన్ మాటలమీద పూర్తివిశ్వాసం వుంది. కాని, తాను ప్రభుత్వశాసనాన్ని ఎల్లాధిక్కరిస్తాడు? ఆయన

నిరపరాధులను తేల్చడానికి కోర్టులున్నాయి. వాళ్ళే ఏంచేసినా చెయ్యాలన్నాడు ముకుందరెడ్డి.

ఆ మాటలలో ఏ మాత్రం అసందర్భం కనబడలేదు. అమీన్‌కు శ్రమయిచ్చినందుకు క్షమార్పణ తెలుపుకొని బయటకు వచ్చేడు.

మేజస్ట్రేటు వద్దకూడా ఛోటేజాన్ అనుభవం అంతే. ఆయన ఛోటేజాన్‌ను ఎరుగును. పెద్దగా మర్యాద చేసేడు; పెద్దవిందుచేసేడు. దేశంలో రాజకీయ పరిస్థితులన్నీ చాల గంద్రగోళంలో వున్నాయని విచారం తెలిపేడు.

ప్రస్తుత పరిస్థితికి ప్రధానకారణం దివాను అయిన ఛత్తారీ నవాబ్ అని ఆయన అభిప్రాయం తెలిపేడు.

అయితే — అవి రాజకీయాలు, ఇంక న్యాయం విషయంలో నిజాం చట్టాలను అమలు జరపడం ?

ఈ నాడున్న పరిస్థితుల్లో న్యాయాన్యాయాలకీ దౌర్జన్య దాక్షిణ్యాలకీ సరిహద్దులు పెట్టబోవడం ప్రభుత్వానికి క్షేమమాయనే అనుమానాన్ని మేజస్ట్రేటు తెలియపరిచేడు. అయినా కొందరు చేస్తున్నట్లు కాశిం రజ్వీ వుపన్యాసాన్నో, రహబర్-ఏ-దక్కన్ సంపాదకీయాన్నో ఒక్క చట్టం అన్నట్లు వుదహరించి తీర్పుచెప్పడం సరికాదన్నాడు.

నిజాం ప్రభుత్వంలో న్యాయం నాలుగు పాదాలా నడుస్తున్నట్లు చూపించడం ఆయనకు ప్రతిష్ఠకలిగిస్తుందన్న విషయంలో ఇద్దరూ ఏకీభవించారు.

అయితే, మేజస్ట్రేటు ఖచ్చితంగా న్యాయచట్టాల్ని అనుసరిస్తున్నాడు. ప్రస్తుత పరిస్థితులలో మార్పువుండవలెనంటే వకీళ్ళు, ప్రజలూ కూడ ముందుకు రావాలి. కేసులు వాదించడానికి వకీళ్ళు సిద్ధపడడంలేదు. సాక్ష్యం ఇవ్వడానికి జనం ముందుకు రావడంలేదు. ఆ స్థితిలో తాను

చెయ్యగలదల్లా కేసుకాగితాలను చదవడం తీర్పుఇవ్వడమే. అందులో అన్యాయం జరుగుతూందంటే తనకెల్లా తెలుస్తుంది ?

ఆ విషయం విన్నాక అసలు కీలకం ఎక్కడుందో అర్థం అయిందనుకొన్నాడు. ఛోటేజాన్, వెంటనే నల్లగొండ తిరిగి వెళ్ళేడు. వకీలు గోపాలరావును కలుసుకొన్నాడు.

ప్రభుత్వ శాసనాలను ధిక్కరించేటందుకు ప్రజల్ని కాంగ్రెసువాదులు ప్రోత్సహిస్తున్నారు. ఆ సందర్భంలో వారిపైవచ్చిన కేసుల్లో కాంగ్రెసు వకీళ్ళు వాదించడం నైతికబాధ్యతఅని ఆ రజాకార్ నాయకుడే తనతో చెప్తూంటే గోపాలరావు కాదనలేకపోయేడు. అంతకుముందే ఆంధ్రమహాసభ నాయకు డొకరు కేసుల్లో డిఫెన్సు ఏర్పాట్లను గురించి తనతో మాట్లాడేడు. కాని, తాను లెక్కచేయలేదు. నిజామును తొలగతోయాలనే వాళ్ళకి నిజాము కోర్టులమీద ఆ విశ్వాసం ఏమిటని వేళాకోళం చేసేడు. ఈ కోర్టుల బూటకాన్ని బట్టబయలు చేయడానికైనా అది అవసరం అని ఆ నాయకుడు అన్నప్పుడు తాను, తమ నాయకుడు స్వామీజీ ఆదేశాన్ని ఉటంకరించేడు.

కాని, ఛోటేజాన్ తెచ్చిన నైతిక బాధ్యతవ్యవహారం అభేద్యంగా కనిపించింది. నరిసిరెడ్డి కేసులో వాదించడానికై ఛోటేజాన్ ఇచ్చిన మూడువందల రూపాయలూ అందుకొని గోపాలరావు న్యాయపాలన విషయంలో ఆయనకుగల శ్రద్ధను అభినందించేడు.

* * * *

కేసులు పట్టడానికి ఎవ్వరూ ముందుకు రాకుండా జంకుతూ వున్న సమయంలో నరిసిరెడ్డి కేసును ఛోటేజాన్ స్వయంగావెళ్ళి గోపాలరావు వకీలుకు వప్పచెప్పేడని విన్నప్పుడు బుడన్‌కి ఎంతయినా ఆవేశం కలిగింది. కేవలం తనమీద కసితో ఆతడీపని చేస్తున్నాడనే అహంకారం

కూడా అనిపించింది. రజాకారు యువకులలో బుడన్ నాయకుడుగా చలా మణీ అవుతున్నాడు. ఖాజీకి కుడిభుజమని ఆతనిని గురించి చెప్పు కుంటారు. కాని, ఖోజేజాన్ తనను పురుగుకన్న హీనంగా చూస్తాడని బుడన్ ఎరుగును. తననాయన గుర్తించడు. చూపుల్లో అసహ్యం, నిర సన కనబడుతుంది. దానికికారణం బుడన్‌కూ తెలుసును. తాను ఏకారణం లేందే వడ్డెరవాణ్ణి ఒకణ్ణి చంపిన విషయంమీదనే ఆయన తన్ను అంత నీచంగా చూస్తాడని తెలుసు. కాని, ఆమాట అనుకోవడంకూడా బాగా తోచలేదు. రజాకారు దళాలలో తనకువస్తున్న ప్రాముఖ్యతకు ఈర్ష్యపడు తున్నాడని సంతృప్తి కల్పించుకో బోయేడు. మొదట అబద్ధమని ఎరిగి వుండి ఆత్మసంతృప్తికోసం కల్పించుకొన్న కారణమే ఇప్పుడు ప్రధా నంగా కనిపిస్తూంది.

తనమీది కక్షకోసమే ఖోజేజాన్ ఈపని చేసేడనిపించేక బుడన్ ఒక్కనిముషం కూర్చోలేక పోయేడు. వెంటనేవెళ్ళి ముకుందశెట్టిని కలుసుకొన్నాడు. ఆయన తన ఆదుర్దాచూసి చిరునవ్వు నవ్వేడు. మేజ స్ట్రేటును కలుసుకొన్నాడు. అన్నీవిని ఆయన కసురుకొన్నాడు. అమీన్ చిరునవ్వుకీ, మేజస్ట్రేటు కసురుకోడానికీకూడా అర్థం ఒక్కటే. ఆసంగతి అర్థంఅయ్యేక బుడన్ పచ్చనిముఖం క్రోధంతో నల్లబడి పోయింది.

నిజాముప్రభువు ఆజాదీ యెడల అతనికి ఎక్కడలేని దిగులూ పట్టుకొంది.

ప్రభుత్వాన్ని ధిక్కరిస్తున్న వాళ్ళయెడ ప్రభుత్వమే దయాదాక్షి ణ్యాలు చూపిస్తే దాని మనుగడ దగ్గరపడ్డట్లే......నని ఆతడు అమీనుకు కర్తవ్యబోధ కుపక్రమించేడు.

తెలంగాణాను ఆనుకొనివున్న మునగాల పరగణాలో ఆనాడు జరుగుతున్న ఘటనల్నే వర్ణించేడు. పోలీసులూ, కోర్టులూ అధికార ధిక్కరణ నెంత నిర్దయగా అణచి వెయ్యాలో నిరూపించేడు.

కరివిరాల జమీందారు భూముల్ని కొంచరు రైతులు ఆక్రమించి కదలం అన్నారు. కొన్నితరాలు సాగుచేస్తేమాత్రం భూమి వాళ్ళదయి పోతుందా ? జూలై మూడోతేదీన—అంతాచేసి రెణ్ణెల్లు కాలేదు—పోలీసుల్ని తెచ్చేరు. వాళ్ళు వరసపెట్టి కుక్కలునాకేలా కొట్టేరు. నూరుమందికి వీపులు చిట్లిపోయేయి. ఆదెబ్బలకి జడిసి ఓఆడది నూతిలో వురికేసిందిట. పోలీసు తడాఖా అల్లావుండాలి. ఇక్కడ ముకుందరెడ్డీవున్నాడు. యూనియన్‌లోని పోలీసువాళ్ళని చూసేనా నేర్చుకోడు. ఒక్కతడి ఆమోతాదులో తగిలిస్తే ఈ నరిసిరెడ్డీ గిరిసిరెడ్డీ అనసూయమ్మ భూములనుంచి కదలనని మొరాయించేనా ? కోర్టుకెక్కేనా ?

ఆరోజున నందిగామ సర్కిలినస్పెక్టరు జమీందారు పక్షాన నిలబడ్డవాళ్ళని పిలిచేడు. తాము వెళ్ళేక వాళ్ళమీద చెయ్యి చేసుకొంటే కబురు పంపమన్నాడు. ఊరు ఆ మూలనుంచి ఈమూలకి తగలపెట్టివచ్చి చెప్పమన్నాడు.

ఏడీ అట్లాంటి మొనగాడు నిజాంపోలీసుల్లో.

బుడన్ నందిగామ సర్కిలినస్పెక్టరు మొనగాడి తనాన్ని వర్ణిస్తూంటే అమీన్ ముకుందరెడ్డి ఏమీ ఎరగనట్లు ఒకప్రశ్న వేసేడు.

"అక్కడి కాంగ్రెసు నాయకు లెవరన్నా సర్కిల్‌వద్దకెళ్ళి ఊరి వాళ్ళని వెనకేసుకొచ్చి మాట్లాడేరా ?"

ఫోర్టీజాన్ రాకకది ఎత్తిపొడుపు. బుడన్ ఆ ప్రశ్నకు నల్లబడి పోయేడు. ఆతని కంగారుచూసి ముకుందరెడ్డి మీసాలలోనే నవ్వు కొన్నాడు.

మేజస్ట్రేటువద్ద బుడన్ ఈ వుదాహరణ తీసుకోలేదు. అచే వరగజాలో కలికోవ ఘటనల్ని ఏకరువేసేడు.

బుడన్‌కు మాటలాడడం మహాసరదా. నిజాం స్వాతంత్ర్యరక్షణకు తెలంగాణాను పీనుగుపెంటలు చెయ్యాలనే విషయాన్ని మేజస్ట్రేటు మట్టి బుర్రకి పట్టించేటందుకై కలికోవ కాల్పులగొడవ ఆమూలాగ్రంవర్ణించేడు.

సత్యం, అహింసా గురించి రాత్రీ పగలూ వుపన్యాసాలుదంచే కాంగ్రెసు ప్రభుత్వం కలికోవలో తుపాకులు కాల్చింది. ఇద్దరు చచ్చిపోయేరు. మరో పాతిక ముప్ఫయిమందిని అరెస్టుచేసి జైల్లో పారేసేరు.

తీరాచేసి వ్యవహారం అయిదెకరాల భూమినిగురించి. ఆభూమి తగాదా ఇప్పటి కెనిమిది పదేళ్ళనుంచి నలుగుతూంది. ఆ భూమి నాదని మునగాల జమీందారంటాడు. మాదని వూరి మాలాళ్ళంటారు. 1939 లో ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సంఘాధ్యక్షుడు గొట్టిపాటి బ్రహ్మయ్య విచారణ జరిపి ఆభూమి మాలాళ్ళదే నన్నాడు.

అప్పటినుంచీ దానిని వాళ్ళే చేసుకొంటున్నారు. ఈ ఏడాదికూడా వాళ్ళు దాంట్లో విత్తనాలు వెయ్యడానికి వెళ్ళేరు. వెంటనే జమీందారు పోలీసుల్ని బులావ్ అన్నాడు. వాళ్ళొచ్చి వరసపెట్టి టప టప లాడించేసేరు. మనప్రక్కనే జరుగుతున్న ఇల్లాంటి విషయాలు చూసేనాపునం నేర్చుకోవాలంటూంటే మేజస్ట్రేటు నీళ్ళు నమిలేడు.

"గవర్నమెంటు ఏమంది ?"

"పల్లెవాళ్ళు తమరిని కొట్టవస్తే పోలీసులు కాచ్చేరని జిల్లాకలెక్టరు వ్రాసిపారేసేడు మరి నోరెత్తకుండా."

బుడన్ చెప్పిందంతా సబబేనని మేజస్ట్రేటు వొప్పుకొన్నాడు.

కాని, ఒక్క సందేహం.

...బుడన్ చెప్పిన ఆ కలికోవ ఘటనలో మాలలకు అనుకూలంగా తీర్పుచెప్పిన ఆ బ్రహ్మయ్యా వాళ్ళ కాంగ్రెసూ ఏ విధంగా వ్యవహరించేయి :

కాంగ్రెసూ, కాంగ్రెసువాదులూ, చివరకానాడు తీర్పుఇచ్చిన గొట్టి పాటి బ్రహ్మయ్యా కూడ దీనిమీద ఏమన్నాఅన్నట్లు బుడన్‌కు తెలియదు. ఆతడా సంగతి ఏ పత్రికల్లోనూ చదవలేదు. పైగా కమ్యూనిస్టుల 'ప్రజా శక్తి' మాత్రం కాంగ్రెసువాళ్ళు ఒకళ్ళు మాట్లాడరేమని వ్రాసిందట కూడా......

చటుక్కున మేజస్ట్రేటు పట్టుకొన్నాడు. ఇక్కడ ఘోటేజాన్ లాంటి రజాకారునాయకుడు వకీళ్ళని ప్రోత్సహించి తానుగా కలగచేసు కొంటూంటే......

తన గొంతుపట్టేస్తారు. ఏదన్నా అటు ఇటయితే, వకీలు వాది స్తాడు. సాక్షులు సాక్ష్యం ఇస్తారు. ఇవన్నీ కాగిరాల్లో వుంటుండగా తాను చట్టాన్ని అనుసరించక చేసేదేముంది? అనుసరించకపోతే నిజాం ప్రభు త్వానికే అప్రతిష్ఠకాదా?

తాను తీర్పులివ్వగలడు. కాని, గోపాలరావు వంటివాళ్ళు కేసులు పట్టడానికి వస్తున్నంతకాలమూ తన తీర్పులు పకడ్బందీగా వుండవు.

బుడన్ ఆలోచించేడు.

"రాకుండా నే చూస్తా"

---

## పందొమ్మిదవ ప్రకరణము.

ఇతరులు తన్ను చటుక్కున గుర్తుపట్టకుండేటందుకు గోపాలరావు మొట్టమొదట తీసుకొన్న జాగ్రత్త తొడుక్కున్న కోటుతీసెయ్యడం. ఊళ పౌరుగూళ్ళో తన్నుచూచిన వాళ్ళంతా కోటువుండగా చూపినవాళ్ళే. కనక ముందది తీసేసేడు. వణుకుతున్న చేతులతోనే దానినిమడతపెట్టి, తనతో తెచ్చిన కోర్టురికార్డుల పెట్టెలోపెట్టేడు. మూతనొక్కి తాళంవేసేడు.

ఇంక దానిని వొదుల్చుకోవాలి; ఎక్కడికి పంపడం? ఎల్లా పంపడం?

తాను కోర్టుకి వచ్చేక పొద్దుటే తానుదిగిన ఇంటిమీద అరబ్బులు దాడిచేసేరని తెలిసింది. పట్టాకత్తులు తిప్పుతూ, బరిసెలు ఎగరేస్తూ పది వళ్ళు తొక్కేరట. వాళ్ళహడావిడిచూచి, ఇంట్లో ఆడవాళ్ళు పారిపోయి పక్కయిళ్ళల్లో దాంకున్నారట. తరవాత ఒకడు లోపలికొచ్చి తనకోసం కబురుచేసేడనీ, ప్రస్తుతం వీధిలో కాపలా వేసేరనీ, ప్రాణాపాయంవుంది జాగ్రత్తపడమనీ ఆ యింటి యజమాని కబురంపేడు.

ఆతడు తన మిత్రుడు. వూళ్ళో మంచి పలుకుబడి గలవాడు కనక ఆతనిమీద చెయ్యిచేసుకోలేదు కాని,......

బస్సు దగ్గరినుంచి ఆ మిత్రునియింటివరకూ తన పెట్టే, పెడ్డింగూ తెచ్చిపెట్టిన కూలివాణ్ణి పోలీసు నాకాకి లాక్కుపోయి కుళ్ళపొడిచేరట. వాడుచేసిందేమిటింతకీ? కూలికి మూటలు మోసుకొనేవాడికి రాజకీయా లేమిటి? కాని, ఇక్కడ ఒక్కటి తేలిపోయింది. రజాకార్లతోపాటు పోలీసులు కూడా......

ఆ మాట గుర్తురాగనే గోపాలరావు మనస్సు స్తంభించినట్లయి పోయింది. ఆ సంగతే మరిచేడు. సర్కిల్ వెంటబడి పోలీసు స్టేషన్‌లో తలదాచుకోవచ్చునని ఇంతవరకూ ఆలోచిస్తున్నాడు. ఛోటేజాన్ ఇచ్చిన వాట్లో ఓ నోటు పడేస్తే సర్కిల్ సాయపడతాడనే ఆతను అనుకొంటు న్నాడు. కాని కూలివాడిని కొట్టిన వార్త తెలిసేక అటువంటి ఆశకేశం కూడా వుండదనిపించింది.

మరి......

ఆఖరుకి తాను పాన్ తీసుకొన్న కిల్లీకొట్టువాణ్ణీ, తనకాలిమీది పడుచు దెబ్బకి మందువేసికట్టుకట్టిన డాక్టరు రాఘవుల్నీకూడా రజాకార్లు వదలలేదు.

రజాకార్లు దుకాణం కూలగొట్టబోయేసరికి పాన్ దుకాణంవాడు బడ్డీదిగివచ్చేడు. దుకాణం మూసేసేడు. ఓ దుడ్డుకర్ర చేతబట్టుకొని తాను కూడా నిజాము స్వాతంత్ర్యరక్షణకు నడుంకట్టేడు. లేకపోతే అతడు కూడా సరుకుతోపాటు పక్కనున్న మురికికాలపలోతు పరీక్షించవలసి వచ్చేది.

డాక్టరు రాఘవులు వాళ్ళ హడావిడిని లెక్కచేయలేదు.

ఎవ్వరోరోగిని కూర్చోబెట్టి రోగవృత్తాంతం తెలుసుకొంటుండగా బుడన్ పదిమంది పరివారంతో హాస్పిటల్‌లోకి వచ్చేడు.

"కాంగ్రెస్‌వాడికి మందేసింది నువ్వేనా ?"

రాఘవులికి మొదట ఈప్రశ్న ఏమిటో, వీళ్ళంతా ఎవరో అర్థం కాలేదు. కాంగ్రెసువాడు అన్న అగౌరవపదానికి కోపం వచ్చింది. ఎదుట కూర్చున్న ఆతని ముఖంలోని ఆదుర్దానూ, ఆయన కన్ను గిలపడాన్నీ చూచి ఏదోవుందనుకొన్నాడు. "ఎవరు నువ్వు" అన్న ప్రశ్న నాలిక చివరనుంచే మింగేసేడు.

"ఏం వేస్తేనేం ?"

తన ఎదటనున్న రోగి కళ్ళతో ఏదోచెప్తున్నాడు. అర్థం కాలేదు. కాని తన ప్రశ్నలోని పెంకెతనాన్ని సర్దుకోవలసి వుంటుందనుకొన్నాడు. సర్దుకొన్నాడు.

"వీడు కాంగ్రెసూ, వీడు రజాకారూ అని ఎవడి మొగానా వ్రాసి వుండదు. వచ్చినవాడికి మందెయ్యడం మాపని."

బుడన్ ఎదురుచూసి వుండని సమాధానం అది. తన మాటకి ఎదురుచెప్పేవాళ్ళే వుండరనీ, వుండకూడదనీ ఆతని అభిప్రాయం. నమ్మకమూను. అందుచేత డాక్టరు రాఘవులు సమాధానం ఆతడిని నిరుత్తరుణ్ణి చేసింది. చాలసేపటివరకూ గుక్కతిరగలేదు.

"ఎవడి మొగానా వ్రాసివుండక్లేం ? పెంకెవెగరకకొడితేగాని ఆ వ్రాత కనిపించదులే."

బుడన్ రుంజుకుంటూ పరివారంతో నిష్క్రమించేడు. వెళ్ళే ముందు డాక్టరుకో హెచ్చరిక యిచ్చి మరీదిగేడు గుమ్మం. ఆ హెచ్చరిక కార్యరూపం ధరిస్తుందసుమా యన్నట్లు బుడన్‌తోవచ్చిన వారిలో ఒకడు చేతిలోని బల్లెంతో వీధిగోడకున్న డాక్టరు సైన్‌బోర్డును ఊడతీసి రోడ్డు ఆవలకు పారేసేడు. 'ఆ పనికి డాక్టరు ఏమంటాడో అన్నట్లు వెనక్కి తిరిగి చూసేడు.

డాక్టరు ఏమీ అనలేదు. తనను చూడవచ్చినవాళ్ళ ప్రయత్నం ఏమిటో అర్థం అయింది. వాళ్ళెవరో తన క్లయింటు రెండు మాటల్లో చెప్పి, దొడ్డిగుమ్మానికి తోవ యెటో వాకబు చేస్తున్నాడు.

డాక్టరు అంతవరకూ పైకి మేకపోతు గాంభీర్యం వహించినా లోపల గుండెలు పీచుపీచు మంటూనేవున్నాయి. వారం పదిరోజుల క్రితం పట్టణంలోని మరో డాక్టరు రామదాసును రజాకార్లు భయంకరంగా కొట్టిన విషయం అతడు మరచిపోలేడు. ఆ డాక్టరు ఆంధ్ర మహాసభ వాడుగా ప్రసిద్ధివుంది. నిరుడు వెట్టివ్యతిరేకోద్యమ సందర్భంలో ఓ ఆరు నెలలపాటు జైలుకూడా వెళ్ళివచ్చేడు. ఆయన వీధినపోతూంటే పది మంది ముస్లిం కుర్రాళ్ళు పట్టుకొన్నారు, కొందరు వెనకనుంచీ, కొందరు ముందునుంచీ గుండెలమీద, వీపుమీదా గుద్దిగుద్ది పారేసిపోయేరు. ఆయన నేటివరకు మంచందిగలేదు, ఊపిరిపీల్చలేదు, మాట్లాడలేదు. అదిరిపోయి బెజవాడకి లేచిపోయేడు. తానంతకన్న గొప్పవాడా ? ఈ మూక వాళ్ళకి తీసిపోతుందా ?

అంత భయపడుతున్నా రాఘవులు రజాకార్ల రాకను కోర్టులో వున్న గోపాలరావుకు చెప్పిపంపడం మరవలేదు. ముందు జాగ్రత్తస

తన యింటిమీద నిఘా వేసేరనీ, ఆ వేపుగా కూడా రావద్దనీ కబురు చేసేడు. గోపాలరావు తలదాచుకొనేటందుకు తనయింటికి రావాలను కొంటే? తీరావచ్చేక పొమ్మనలేడు. అసలు ఆపేపే రాకుండాచేస్తే సరి పోతుందనుకొని ఆ భయం పెట్టేడు.

ఇవన్నీ వింటూంటే పొద్దుటినుంచీ తానుగమనించివుండని ప్రమాద సూచనలు ఓ అరడజను గుర్తువచ్చేయి. వాటన్నింటినీ కలబోసిచూస్తే తనను చంపడానికి జరిగిన ప్రయత్నాల నంపరూ ఎరుగుమరనే అని పించింది. కాని, ఇంతప్రయత్నించి చంపవలసిన అగత్యం ఏమిటో అర్థం కాలేదు. కాంగ్రెసువాది కావడమేమో ననుకొంటే అదికాదనే చెప్పాలి. వాళ్ళని ప్రభుత్వం జైళ్ళల్లో వేస్తూంది. ఈ లోపున పోలీసు వాళ్ళు రెండు కొట్టినా చంపడం......

వెంటనే సూర్యాపేటలో చిల్లంచర్ల నారాయణమూర్తి అనేషావు కారునూ, ఆయన భార్యనూ పడుకొన్నవాళ్ళని చంపినవార్త జ్ఞాపకం వచ్చింది. ఆయన కాంగ్రెసువాడే. ఆ హత్యలో పోలీసులకూ చెయ్యి వున్నట్లే విన్నాడు. ఇక్కడా అదేనేమో......

అందుకేనేమో తాను వచ్చింది మొదలుకొనీ ఒక్కరూ తన ముఖంలోకి చూడడంలేదనిపించింది. పబ్లిక్ప్రాసిక్యూటరు ఇదివరలో తాను వచ్చినప్పుడల్లా ఎంతో స్నేహంగా వుండేవాడు. ఈ వేళ ఆయన మొగం చాటుచేస్తున్నాడు. సర్కిలూ అంతే. తప్పుకు తిరుగుతున్నాడు. ఒకళ్ళూ ఇది సుమాయని ఒక్కమాట చెవినివేయలేదు. అయినా ధుమ ధుమ లాడుతున్నాడు. పెట్టినకేసులూ, తెచ్చినసాక్ష్యాలూ తన క్రాస్పరీ క్షలో ఛిన్నాభిన్నం అయిపోయూంటే, సర్కారువలన మాటవస్తుందనే భయముతో తనమీద కోపంగావున్నారనుకొన్నాడు. అలా అనుకొన్న ప్పుడు తన క్రాస్పరీక్ష తీవ్రతకి ఎంతో గర్వపడ్డాడు కూడా. ఇప్పుడది తెలుసుకొంటే సిగ్గేసింది.

అసలు రహస్యం మొదట ఓ పోలీసువాని సూచననుపట్టి బయట పడిందేకాని, ఈపాటికి తాను ఖతం అయిపోయేవాడే. ఆ పోలీసయినా ఇదమిత్థమనలేదు. తాను టిఫిన్ కోసం బయటకు పోబోతున్నాడు. వాడు ఆపేడు. అరబ్బువాళ్ళేదో తాగి అల్లరి చేస్తున్నట్లున్నారు వెళ్ళకండన్నాడు. ఇన్ని మురుకులూ చాయీ హోటలు కుర్రవాడిచేత తెప్పించియిచ్చేడు. అంత వుపకారం చేసినవానిని తాను తెలివితక్కువదనంగా ఇరుకున పెట్టేడు. అయితే తన కప్పటికేమీ తెలియదు.

ఏతప్పూ చెయ్యనివాళ్ళని ఇల్లాగ కోర్టులవెంట తిప్పి, జైళ్ళల్లో పెట్టి ఇబ్బందులు పాల్జేసేబదులు పోలీసు శాఖవారు వీధుల్లో తాగి అల్లరి చేస్తున్నవాళ్ళని అదుపులో పెట్టేటందుకు ప్రయత్నిస్తే బాగుండేదన్నాడు తాను. ఆ ఎత్తిపొడుపుతో వాళ్ళని నేల కరిపించేననుకొన్నాడు. కాని, ఆమాటలు అనగానే వాళ్ళెంత ఎగిరిపడ్డారు? ఇంకానయం. పోలీసు బంట్రోతుపేరు చెప్పలేదు. నిష్కారణం చిక్కుల్లో పడేవాడు. మొదట తన స్నేహితుడి యింటిమీద అరబ్బువాళ్ళు దాడిచేసేరని విన్నప్పుడు తనకింతదూరం దృష్టి పోనేలేదు. వీళ్ళంతా కుమ్మక్కయి చేసిన పనన్న మాట!

తనప్రాణం తియ్యడానికి ఎంత ఏర్పాటు చేసేరో అనుకొంటూంటే వొళ్లు జల్లుమంది. పుచ్చెమటలూ పోసేయి. ఈమారుమూల వూళ్ళో కేసు పేషీపెయ్యడంలోనే అసలు కుట్రవుందికాబోలు.

ఆ ఆలోచన తోచేక ఆ రోజున తాను బయలుదేరకపోయినా బాగుండే దనిపించింది. తెల్లవారగట్ల బస్సువాడు తాను వచ్చేసినట్లు చూసి కూడా బస్సు ఆపకుండా తోలుకుపోయేడు. అదో శకునమేనేమో. పెట్టె తీసుకొని బస్సుదగ్గిర పాలేరు నిలబడి వున్నాడు. ఖాసు వీధి మలుపు లోకి వచ్చేడు; గబగబా నడిచినా అందేదే, కాని, వీధిలో ఏదో ముంచుకు

పోయినట్లు నడవడం, పరుగెత్తడం నామోషీ అనిపించింది. తానో వకీలాయె. లాకాలూకాయిమనిషా ? హోదా, ప్రతిష్ఠావుంది. పరుగెత్తితే చూసేవాళ్ళేమను కుంటారు ? గంటల తరబడి పడేసి అట్టేపుంచే బస్సు ఆగకేంచేస్తుం దనుకొన్నాడు. పెళ్ళినడకలు నడిచేడు. పదడుగుల దూరం లోంచి తాను వేస్తున్న కేకకూడా వినిపించుకోకుండా బస్సును నడిపించుకు పోయేడు. ఆఖరుక్షణంలో తాను పరుగూపెట్టేడు. కాని లాభం లేకపోయింది. బస్సు స్టాండులో మూటలుమోసే కుర్రవెధవ తన పరుగు చూసి పకపక లాడేడుకూడా. తనకెంతో కోపం వచ్చింది.

ఇంత జరిగినా శకునం బాగులేదన్నా తాను ప్రయాణం మానేడా ? లేదు. తనకు బస్సు దొరక్కుండా చేయడానికి రజాకార్లే కుట్రపన్ని, డ్రైవరును తొందరపెట్టి వుంటారనిపించింది. తన పరుగుచూచి నవ్విన కుర్రవెధవ రజాకార్ల పూరేగింపుల్లో గంతులు వేస్తుంటాడు. బహుశా ఆ ఆలోచన కలగడమే తన పట్టుదలకి కారణమయి వుంటుంది. బస్సు నాపకపోవడంలో రజాకార్ల దురాలోచన వుండి వుంటుందనిపించి నప్పుడేనా వాళ్ళింతపనికి తలపెట్టగలరనే ఆలోచనపోలేదు. పట్టుదల పెరిగింది. తర్వాత బస్సువేళదాకా ఆగేడు. వచ్చేడు.

వస్తే ఏముంది ? వీళ్ళు తననిక్కడ ఖతం చేసెయ్యడానికి ప్లాను వేసుకు్కూర్చున్నారు. సత్యాగ్రహులూ వాళ్ళ కేసులూమాట దేవుడెరుగు. ఇప్పుడు తన ప్రాణానికే మోసం వచ్చేలాగుంది.

తనను ఈ ఆపదలో పడేసింది ఈ సత్యాగ్రహులే ననిపించింది. ఒక్కమారు మనస్సు రవిలిపోయింది. గాంధిగారు కోర్టుల్ని బహిష్కరించాలని చెప్పేరు. ఎప్పుడో. ఈమధ్యనే స్వామీజీ కేసుల్లో డిఫెన్సు వద్దన్నారు. ఒక్కళ్ళు విన్నారా ? నరాలమీద కురుపులల్లే ఒక్కటే నస. ఒకటే గందరగోళం. స్టేట్ కాంగ్రెసు కమిటీ సమావేశాన్ని బొంబాయిలో వేసుకొంటే చివరకి అక్కడకూడా మనుష్యుల్ని తోలేరు.

రాష్ట్రంలో ఉద్యమం స్థాయి పెరుగుతూంది. స్వామీజీ జైలులో వున్నారు. బూర్గుల రామకృష్ణారావు, రంగారెడ్డి వగైరా మితవాదనాయకు లంతా జైళ్ళల్లో పడ్డారు. నిర్బంధ విధానం పెరిగిపోతూంది. సంస్థానం హద్దులలోవుండి పని చేయగల అవకాశంలేదు. యూనియన్‌లోకి ఒక్కొ క్కరే వెళ్ళిపోతున్నారు. బెజవాడలో ఆఫీసు తెరిచేరు. తననుకూడా అక్కడకు వచ్చెయ్యమని తన మిత్రులు చెప్తున్నారు, తనా ప్రయత్నంలో వుండగనే ఈ ఉప్పెన వచ్చిపడింది.

ఆంధ్రమహాసభవాళ్ళు తనను సంస్థానంలోనే ఉండిపొమ్మన్నారు. ప్రజలమీద వస్తున్న కేసుల్లో డిఫెన్సు నడపమన్నారు. తాను ఒప్పుకో లేదు. పోయిన సత్యాగ్రహుల ముద్ది గిర్లేరనిపించింది. నిజాంశాహీలో న్యాయస్థానాల అవసరం తక్కువని తాను చెప్తే విన్నారా ? అరబ్బులూ, రజాకార్లూ చేస్తున్నఅల్లరి నాగరిక ప్రభుత్వంలో జరిగేదేనా ? అని చెప్పినా ఒక్కడూ వినలేదు. అవకాశం వున్నంతవరకు న్యాయచట్టాల్ని వుపయోగించుకోవాలని కొందరు ధర్మపన్నాలు చెప్పేరు. మాచాడు జైలుమొగం ఎరగడు. వాణ్ణి బయట పడెయ్యకపోతే వాళ్ళమ్మ చచ్చి పోతుందని మరొక డన్నాడు. ఇప్పుడు తాను ఇరుక్కున్నాడు. ఇప్పుడే చట్టం, ఎవరిసాయం తనను కాపాడుతుంది ?

కొంతసేపు తననీ ప్రమాదంలో పెట్టినది ఆంధ్ర మహాసభవాళ్ళూ సత్యాగ్రహులూ ననిపించినా గోపాలరావు వెంటనే తన ఆలోచన లను మార్చుకొన్నాడు. ఆంధ్రమహాసభవాళ్ళు చెప్తే తాను వినలేదు. స్వయంగా ఛోటేజాన్ తనను కుదిర్చేడు.

అతడు రజాకారునాయకుడు. నిజాము స్వాతంత్ర్యం కోరేమనిషి. కాంగ్రెసు వుద్యమానికి వ్యతిరేకి......

అయినా ఆయన చెప్పినదాంట్లో సబబున్నదని తానే స్వబుద్ధితో ఈ పనిలో దిగేడు. రజాకార్ నాయకుడే ప్రోత్సాహం ఇస్తున్నప్పుడు ఇటువంటి ప్రమాదం వుండదనే అనుకొన్నాడు.

కాని, ఈనాటి పరిస్థితులుచూస్తే ఛోటేజాన్ మాటలు ఎందుకు విన్నానా అనిపించింది.

ఇందులోంచి బయటపడ్డం ఎల్లాగ?

---

## ఇరవయ్యో ప్రకరణము.

మేజస్ట్రేటు ఒకటో రెండో కేసులుంటే వాయిదాలు వేసేసి నిందితుల్ని పంపేసేడు. వాళ్ళని తీసుకొని పోలీసు బలగం వెళ్ళిపోయింది. వచ్చిన సాక్షులుకూడా వెళ్ళిపోయే సన్నాహంలో వున్నారు.

కోర్టున్నంత వరకన్నా తనకు రక్షణ వుటుందనీ, ఈలోపున ఏదోదారి కనబడక పోతుందాఅనీ గోపాలరావు ఇంతవరకూ మొండి ధైర్యతో వున్నాడు. రజాకార్ల అల్లరంతా వూళ్ళో రోడ్లమీదనే. తానీ కోర్టులో వున్నట్లు వాళ్ళకి తెలుసు. పోలీసు వుద్యోగులు వాళ్ళతో కుమ్మక్కయినవాళ్ళే. అయినా వాళ్లు ఈ చాయలక్కూడా రావడంలేదు. దాని అర్థం ఒక్కటే. రజాకార్లకు ప్రభుత్వం ఆయుధాల నిస్తున్నా చాటు మాటుగానే ఇస్తూంది. ప్రభుత్వోద్యోగులు వాళ్ళని సమర్థిస్తున్నా బహిరంగంగా వాళ్ళకి సాయపడేటందుకు సిద్ధంగాలేరు.

తన కాళ్ళక్రింద గోతులు త్రవ్వి సిద్ధంగా వుంచేరు. కాని మేజస్ట్రేటూ, సర్కిలూ, అమీనూ అక్కడుండగా తన్ను ఆ గోతిలోకి తోసెయ్యరు. అంతవరకూ ఖచ్చితం.

కాని వాళ్ళుండేదెంతసేపు ? కోర్టులేచేవరకూ. చీకటిపడేవరకూ ఎల్లాగో నెట్టెయ్యొచ్చు అనుకొన్నాడు. కాని, వాళ్ళే తనను నెట్టేసే ప్రయత్నంలో వున్నారు.

ఎవ్వరూ దగ్గరలేని సమయంచూసి పబ్లిక్ప్రాసిక్యూటరు గోపాలరావు పరిస్థితికి విచారం తెలిపేడు.

"అన్నీ తెలిసి ఇల్లా ఎందుకు చేసేరు ?"

గోపాలరావు అంతవరకూ మనస్సులో కంగారుగావున్నా పైకి గాంభీర్యం నటిస్తున్నాడు. ఎంత పరాకుగా కనిపిస్తున్నా పరాచికాలాడు తున్నాడు. అటువంటివాడీ సానుభూతి ప్రకటనతో ఢీలాపడిపోయేడు.

ప్రాసిక్యూటరుకు తాను అనేక కేసుల్లో సాయంచేసేడు. తనకు స్నేహితుడే. ఆయన్ని అడ్డంపెట్టుకు బయటకు పోవచ్చుననిపించింది. గ్రహుల్వొచ్చి గుబ్బంచగా రకాకొట్టు చెయ్యిచేసుకొనేటందుకు సిద్ధపడడం లేదు గనక అలా ఎందుకు చెయ్యగూడదు ?

మరో ఆశకూడా లేకపోలేదు. బహుశా అదే బలీయమైనదేమో. పబ్లిక్ ప్రాసిక్యూటరు హిందువు. తాను హిందువు. సాటివారికి ఆ పాటి సాయం చెయ్యడా ? అయినా అనుమానం లేకపోలేదు. ఉదయంనుంచీ ఆయన తప్పించుకు తిరుగుతున్నాడు!

కాని, అవసరం. అవసరం అభిమానాన్ని చంపుతుంది. అయినా గమ్భీరంగానే మాట్లాడేడు. తన కోరికను చూచాయగా ప్రకటించేడు.

ఆ ప్రతిపాదన వినగానే పబ్లిక్ప్రాసిక్యూటరు వణికిపోయేడు. ఆ వణుకుచూస్తే గోపాలరావుకు ఈసడింపు కలిగింది. అంతవరకూ తానూ వొణుకుతూనేవున్నమాట మరచిపోయేడు. ఎదటివాని పిరికితనం అసహ్యం అనిపించింది. దేశంకోసం ఎంతమంది ప్రాణాలు బలిపెడుతున్నారో చెప్పేడు. ఎంతో ఆవేశంతో ఎన్నికథలో చెప్పేడు. చరిత్ర

కొన్నవాళ్ళు చేయనలసిందేమిటి? ఒకే గమ్యంకోసం పోరాడిన వాళ్ళకి జైళ్ళలో హెచ్చుతగ్గులు చూపడం అన్యాయమని జతీంద్రనాథదాసు ప్రాయోపవేశమే చేసేడు. అన్యాయం జరిగిపోతూంటే పట్లెటూరిబైరు కూడా నాకేమని కూర్చోదే. ఇదేమిటీ అన్యాయమని మాటవరసకేనా అన కుండా వుండదే; ఛ!

ఆ ధూత్కారానికి పబ్లిక్ ప్రాసిక్యూటరు సిగ్గుపడ్డాడు. మొదట తాను తెలిపిన సానుభూతి వాక్యాన్ని సవరించుకొన్నాడు.

"మీకు సంగతులన్నీ తెలియవు."

పబ్లిక్ ప్రాసిక్యూటరు పిరికిదనాన్ని ధూత్కరించడంలో కలిగిన ఆవేశంలో గోపాలరావు సరాసరి వీధిలోకి వెళ్ళాలనుకొన్నాడు. హంతకుల ఎదుట నిలబడి తన సాహసాన్ని చూపదలిచేడు. లజపతిరాయి అటువంటి సాహసం చూపేడు. సైమన్ కమీషన్ మద్రాసు వచ్చినప్పుడు వ్యతిరేక ప్రదర్శనలముందు నిలబడి ప్రకాశం పంతులుగారు అల్లాంటి త్యాగసాహసాలు చూపించేరు. తుపాకీ ఎత్తిన పోలీసు సార్జెంటు కెదురెళ్ళి, చొక్కాగుండీ లూడదీసి రొమ్ముచూపేరు. "కాల్చిచూద్దాం." అన్నారు. జాతీయోద్యమం ప్రతిఘట్టంలో ఇల్లాంటి వీరత్వం కనబడుతూనేవుంది. హైద్రాబాద్ సంస్థాన కాంగ్రెసు వుద్యమంలో బహుశా సంస్థాన కాంగ్రెసు వుద్యమంలోనే మొట్టమొదటిమారుగా ఆ గౌరవం తనకు దక్కుతుందనిపించి గోపాలరావుఛాతీ విస్తరించింది.

ఆ సమయంలో గది గుమ్మంలో చెన్నయ్య కనిపించేసరికి ఆ ఆలోచనలన్నీ మరచిపోయేడు. సంస్థాన కాంగ్రెసు వుద్యమంలో అస మాన త్యాగాదర్శాన్ని ప్రతిష్ఠాపించాలనే అభిప్రాయం వెనకబట్టింది. తాను బయటపడడానికి ఈతడు ఏమన్నా సాయం చెయ్యగలడనే ఆశా కలిగింది. దుందుడుకు ధోరణిలో నడుస్తూందని తామంతా వదలిన ఆంధ్ర మహాసభలో ఆయన ఇప్పుడు పనిచేస్తున్నాడు. ఇప్పుడు పార్టీలు వేర

యినా తామంతా సహకార్యకర్తలే ఒకప్పుడు. తమకంటె చిన్నవాడైనా దేశసేవకుడుగా పేరున్నవాడుగాని మరొకటిగాదు. చిలుకూరు సభలో రావి నారాయణరెడ్డి నాయకత్వంక్రింద వీళ్ళంతా వెట్టిచాకిరీ పనికిరా దంటూ తీర్మానం చేసేరు. ఆ నిర్ణయాన్ని అమలు జరిపితీరాలని భువన గిరి సభలో పట్టుపట్టేరు. అమలుజరిపే మార్గం ఏమిటీ? పోరాటాలి. పోరాటం అంటే యేం చెయ్యాలి? అక్కడే వచ్చిందిపేచీ. ఇద్దరూ చెరో అర్థంచెప్పేరు. వెట్టిచేయించుకోవడం తప్పనిచెప్పి ప్రబోధం చెయ్యమంటారు తాము. ప్రభుత్వం వెట్టివ్యతిరేక చట్టంచేయనే చేసింది. అయినా అధికారుల్లు మానలేదు. ఆ సంగతి ప్రభుత్వానికి దృష్టిలోకితెచ్చి అవి అమలు జరిపేటట్లు తీర్మానాలద్వారా కోరడమూనన్నారు తాము. అంత మాత్రం చాలదంటారువాళ్లు. ప్రజలకుచెప్పి, వాళ్ళువెట్టి చెయ్య కుండా ప్రోత్సహించాలన్నారు. ఇల్లాంటితగాదాలే రాజకీయాల్లోనూ వచ్చేయి. హైద్రాబాద్‌లో జరిగిన ఆంధ్రమహాసభ అధ్యక్షుడు కొండా వెంకటరెడ్డిగారు కాంగ్రెసువాళ్ళని కాంగ్రెసులోకీ, కమ్యూనిస్టుల్ని కమ్యూ నిస్టుపార్టీలోకీ పొమ్మని ఆదేశించారు. ఆంధ్రమహాసభ తమదన్నారు. పాపం మరుసటి సభలోనే ఆయనతోసహా తామంతా ఆంధ్రమహాసభ నుంచి లేచిరావలసి వచ్చింది.

కాని, చెన్నయ్యా తదితరులూ దానినంటిపెట్టుకొనే వున్నారు. వాళ్ళు చెప్పినట్లే జనాన్ని లేవగొట్టేరు. ఆ రోజుల్లో ఉద్యమనాయకు డుగా జైళ్ళకు వెళ్ళినవారిలో చెన్నయ్యొకడు.

జైళ్ళకూ, గంజ్ శిక్షలకూ ఆయన జంకలేదు. బయటకు వచ్చేక మద్దికుంటలో కాపురంపెట్టేడని తెలిసింది. పట్వారీజగన్నాధరావు తమర్ని మంచేడని విన్నాక మద్దికుంట గౌండ్లు నిరుత్సాహపడిపోయి కేసులూ, కోర్టులూ వదులుకొన్నారు. వెంకయ్య కుంటక్రింది ఈదులూ, చేనూ కేసులు ఫలితంతో నిమిత్తం లేకుండానే చేతికివచ్చిందని సంతోషపడ్డాడు.

కాని, చెన్నయ్య వూళ్లో అడుగుపెడుతూనే గౌండకి ఆసరానిల బడ్డాడు. గౌండ్లు సంగం పెట్టుకొన్నారు. భూముల్ని మళ్ళీ దున్నుకోవడం ప్రారంభించేరు.

సంగం ఏర్పడ్డాక వెంకయ్య వెనకటల్లే బింకంగా లేడనీ, జరిగిందేదో జరిగిపోయింది. అంచరం పంచిపోదామన్నట్లు వ్యవహరిస్తున్నాడనీ చెప్పేరు. తాను పదేళ్ళపాటు ప్రయత్నించి చెయ్యలేని పనిని చెన్నయ్య సంఘంపెట్టించి సాధించేడు. సంఘం బెదురుచూపి పనులుజరిపించడం అవినీతి యని బాధపడ్డా ఆ విషయంలో మనస్సుకి సంతోషమే కలిగింది.

ఇప్పుడా చెన్నయ్యే తన ఎదటవున్నాడు. మద్దికుంట గౌండ్లకి పట్లే తనకీ ఏమన్నా దారి చూపగలడేమో. ఆతనిని చూడగనే ఆప్తుణ్ణి చూసినట్లనిపించి ప్రాణంలేచివచ్చింది. గభీమని కుర్చీలోంచిలేచేడు.

"మంచిసమయానికే వస్తివయ్యా :" అని ఆహ్వానించేడు.

చెన్నయ్య గదిలోకి తొంగిచూసేడు. "మీరా !"

అటూయిటూ చూసి గదిలో అడుగుపెట్టేడు.

"మీ కోసమేనా ఇన్ని ఏర్పాట్లూ ?"

అన్ని సంగతులూ తెలిసే వచ్చేడన్నమాట. ఇంతవరకు వచ్చినవాడు తనకు సాయపడకుండాపోడని ధైర్యం కలిగింది.

కాని, ఆతని ధైర్యానికి అభినందించే లోపుగనే ఇదిగోవస్తున్నానని చెన్నయ్య అక్కడినుంచి వుడాయించేడు. ప్రాణం చచ్చిపోయింది. మొదటినుంచీ కలిసిపనిచేసేమన్న విశ్వాసంకూడా లేకపోయిందే అని దిగాలుపడ్డాడు. ఆతనికిమాత్రం ప్రాణభయంవుండదా అని మళ్ళీసంతృప్తి పడ్డాడు. తనకోసం ఎందుకు చావాలి? తామొక్క పార్టీవాళ్ళయినాకాడు. నిరుడు వెట్టివ్యతిరేక వుద్యమం రోజుల్లో నిజాము బలగాల దాడంతా

వాళ్ళ నెత్తిమీదుగా సాగిపోతూంటే తామేం చేసేరు? వాళ్ళు ఈ నాడు తన సాయానికెందుకు రావాలి అనుకొన్నాడు.

కాని, చెన్నయ్యా వచ్చేడు. ఆతని సమాధానం విన్నాక తన మనస్సులో కలిగిన ఆలోచనలకు సిగ్గుపడ్డాడు, గోపాలరావు.

చెన్నయ్యా మరో పదిమందీ లెవీధాన్యం తోలుకువచ్చేరు. ఊళ్ళో అరబ్బులు మహాహడావిడిగా తిరుగుతూంటే ఏమిటో అనుకొన్నారు. ఇంతలో డాక్టరు కనిపించి ఏదో గంద్రగోళంగా చెప్పేడు. అసలుసంగతి అర్థమయిందిగాని, ఇక్కడ చిక్కుకొన్నది గోపాలరావనుకోలేదు. డాక్టరు మాటలువిన్నాక తాను కొన్నిపనులు పురమాయించి తనతో వచ్చినవాళ్ళని ఏర్పాటు చేసేడు. మళ్ళీవెళ్ళి ఏర్పాట్లు సరిగ్గా వున్నట్లు చూసి వచ్చేడు.

"ఇంకేమిటాలస్యం?"

చెన్నయ్యా రాకా, మాటలూ గోపాలరావుకు ఎక్కడలేనిబలం కలిగించేయి. ఆతని ఆలోచనలకూ, ఏర్పాట్లకూ ఎంతో సంతోషం ఆశ్చర్యం కలిగింది.

తాను కూర్చున్నగది కిటికీలోంచి చూస్తే ఎదురుగా రెండు ఖాళీ స్థలాలు, వాని ఆవల వేపచెట్టు కనిపిస్తున్నాయి. ఆచెట్టు వీధిలోది. ఆ చెట్టుక్రింద వెల్లగిత్తలుకట్టిన బండీ సిద్ధంగావుంది. తాను పోయి దాంట్లో కూర్చోవడం తరవాయి. అందులో వెళ్ళిపడిలే మిగతా బాధ్యతఅంతా చెన్నయ్యది. అంతాతానే చూచుకొంటానన్నాడు, ఆతడు.

అక్కడికి వెళ్ళాలంటే వీధితిరిగి వెళ్ళాలి. వీధిలోకెడితే అక్కడా యముళ్ళాళ్ళున్నారే, ఎల్లాగనిపించింది.

దానికి చెన్నయ్యా సమాధానం సిద్ధంగానేవుంది. ఖాళీదొడ్లకీ వీధికీ మధ్యన ఒక కూలిపోయిన మట్టిగోడవుంది. దానిమీదుగా దాటి బండిలోకి దిగడమే పనల్లా అన్నాడు.

గోడలురకడం అంటే గోపాలరావుకు ఎల్లాగో అనిపించింది. అంత ఆదుర్దాలోనూ వేళాకోళం ఆడేడు.

"ఎప్పుడూలేని దింతవయస్సు వచ్చేక గోడలురకమంటే చేత నవుతుందటయ్యా !"

చెన్నయ్య నవ్వేడు.

"ఉరికేవాళ్ళంతా చేతనయ్యేనా ? ఒకమారు కొత్తగావుంటుంది. రెండోమారు అలవాటవుతుంది. ఇంక వీధిదారిని నడపడమే అనవసర మనిపిస్తుంది."

ఇద్దరూ కొంతసేపు నవ్వుకొన్నారు. తరవాత గోపాలరావే వెళ్ళిపోతున్న చెన్నయ్యను పిలిచి తన కోరికను వెలిబుచ్చేడు.

"ఒక్క కత్తయినా సంపాదించిపెట్టలేవూ ?"

చెన్నయ్య నవ్వేడు.

"కత్తితో నరికితే హింసలోకి రాదా ?"

గోపాలరావు ఏదో సమాధానం చెప్పుకొనే లోపుగనే చెన్నయ్య క్షమార్పణ చెప్పుకొన్నాడు.

"ఏదో హాస్యానికన్నా క్షమించండి."

హాస్యానికే అన్నా, నిజంగానే అన్నా ఆ మాట బల్లెపుపోటులా తగిలింది. వెట్టి చెయ్యవద్దని ప్రజలచేత కట్టు కట్టించడం హింసావిధానాన్ని అవలంబించడమేనని తామంతా ఉపన్యాసా లివ్వడం గుర్తువచ్చింది. సిగ్గనిపించింది. చెన్నయ్య అదేమీ గమనించలేదు. బండిలో బోరెంక్రింద అడుగున గడ్డిలో ఒక కత్తివుందని చెప్పేడు.

తమవాళ్ళు బళ్ళన్నీ ఈపాటికి వూరి పొలిమేరలకు చేరిపోయి వుంటాయి. గోపాలరావు రావడంతడవుగా బండి మేఘాలమీద వెళ్ళి

పోతుందని చెప్తూంటే ఆయన తానప్పుడే అపాయాని కంతదూరం వెళ్ళిపోయినట్టే సంతోషపడ్డాడు.

చెన్నయ్య మళ్ళీ ఇంకోమారు జాగ్రత్త చెప్పేడు.

"తలుపు లోపల గడియ వేసెయ్యండి. కిటకీలోంచి గంతలోకి దిగండి."

గోపాలరావు వెనుతిరిగి చూసేడు. అంతవరకా కిటికీకి వూచలు లేవనే విషయాన్ని తాను గమనించనేలేదు. చెన్నయ్య ఇవన్నీ ఎప్పుడు చూసేడాఅనిపించి ఆశ్చర్యం కలిగింది.

ఆ ఆశ్చర్యాన్ని ప్రకటించే లోపుగానే చెన్నయ్య అక్కడినుంచి జారుకున్నాడు.



# ఇరవైఒకటో ప్రకరణము.

చెన్నయ్య వెళ్ళిపోయేక గోపాలరావు ఒక్కమారు కోర్టుఅంతా చుట్టి వచ్చేడు. వరండాలో నిలబడివున్న ఒక పైరవీకారు అటూ యిటూచూసి "బాబూ! ఇంకా ఇక్కడే వున్నారా?" అన్నాడు.

పక్కగదిలో కూర్చున్న సర్కిలినస్పెక్టరూ ఆమాటే అన్నాడు. కాని, ఆ పలకరింపులో సానుభూతికన్న ఇంకా బ్రతికేవున్నావా---అన్న ధ్వని ఎక్కువగా వినిపించింది. ఆఫీసర్లు మొహం చాటుచేస్తున్నా తన్ను కనిపెట్టే వున్నారు.

రెండుమార్లు అటూ యిటూ పచారుచేసేడు. చల్లగా ప్రొద్దుటి నుంచీ తాను కూర్చున్న గదిలో చేరేడు. పైరవీకారులకోసం కేటాయించిన గది అది. ఆరోజున తాను అక్కడకు రావడంతోనే మిగిలిన పైరవీ

కార్లంతా వరండాలు పట్టుకొని తిరుగుతున్నారు. తానున్నచోట కూర్చుంచేనూ, తనతో మాట్లాడితేనూ తమ ప్రాణానికి ఏం ముట్టుకొంటుందో యని వాళ్ళ భయం. అదీ ఒక విధంగా వుపకారమే అయిందిప్పుడు. వారి భయాలుచూసి వుదయంనుంచీ తిట్టుకొన్నా, ఇప్పుడుమాత్రం అభినందించేడు.

గదిలోకి వస్తూనే నెమ్మదిగా తలుపులు మూసేడు, కిటికీలోంచి బయటకు చూసేడు. అదొకసందు. అక్కడికి పదిగజాలదూరంలో మలుపుతిరిగి గోడలమధ్య అంతర్ధానం అయింది. మలుపు మూలలో ఒక ఖాళీ పెరడుంది. బహుశా చెన్నయ్య చెప్పినదారి అదే అయివుంటుందను కొన్నాడు.

సందులో ఎవ్వరూలేరు. వెనక్కి వచ్చేడు. తలుపుతీసి బయట అటూ ఇటూ రెండుమార్లు పచారుచేసేడు. కోర్టంతా జరగవలసిన హత్యాకాండకోసం ఎదురు చూస్తున్నట్లే కనిపించింది. మళ్ళీ గదిలోకి వచ్చేడు. నిశ్శబ్దంగా తలుపులు గడియపెట్టేడు.

కిటికీలోంచి దిగి సందులో అడుగుపెట్టేడు. దిగేటప్పుడు ఎవరన్నా చూడలేదుగదాయనిపించింది. గుండె లొక్క క్షణం నిలబడిపోయేయి. అటూ ఇటూ చూసేడు. ఎవ్వరూ కనబడలేదు, అలికిడికూడా వినబడలేదు. ఒక గుటక వేసేడు. గుండెలు కుదుటపడ్డాయి. మామూలుగా నడిస్తే అడుగులచప్పుడు ఎవరికేనా వినిపిస్తుందేమోనన్నట్లు మునివేళ్ళమీద విద్దెలుచేస్తూ ముడుచుకొని సందు మలుపుదాకా వెళ్ళేడు. ఆ మలుపునుంచి సందు రాజవీధివరకూ తిన్నగావుంది. సందు మొగదల తూముమీద ఇద్దరు ముగ్గురు కూర్చొని వున్నారు. వాళ్ళు ఎవళ్లో ఏమో, రజాకార్లే అయివుంటారనిపించింది. దొంగా మనిషే అంటారు. రజాకారు మాత్రం కాడా ? మళ్ళీ గబ గబ కిటికీవద్దకు తిరిగి వచ్చేడు.

తాను వదలివచ్చిన గదిగుమ్మంలో అలికిడేమీ వినరాలేదు. మళ్ళా ధైర్యం పుంజుకొంది. చెన్నయ్య తొందరపెట్టినమాట గుర్తువచ్చింది. తానెంతకూ రాకపోతే బండిని తోలుకుపోలేదుకద? ఆ ఆదుర్దాలో ఒక్క క్షణం గంటలా కనిపిస్తూంది. బండి వెళ్ళిపోయిందేమో ననిపించడంతో గుండెలు భయానికి పట్టుకుపోయేయి. గబగబా ఖాళీ పెరటిచేప్పుగా నడిచేడు.

కాని, తీరా వెళ్ళేసరికి ఖాళీ పెరళ్ళలో అడుగు పెట్టడానికి మనస్కరించలేదు. అవి పెరళ్ళుకావు. పెద్ద పెద్ద పాటిసుట్టిగోతులు. గుండాలుపెట్టి పాటిమన్ను తీసేసేరు. అట్టే దూరం పోనక్కర్లేకుండా మరుగుగా ఉన్నచోటు దొరకడంచేత ఆ చుట్టుప్రక్కల యిళ్ళ వాళ్ళంతా వాటిని మరుగుదొడ్లుగా వుపయోగిస్తున్నారు. పరమాసహ్యంగావుంది. దుర్వాసన: కాలుపెట్ట శక్యంగాలేదు. నిగనిగలాడుతున్న తన బూట్ల వంకా, తెల్లగా చలవచేసిన తన బట్టలవంకా చూచుకొన్నాడు. చుట్టు తిరిగి పోవడాని కేదన్నా దారి వుందేమోనని చూసేడు. మరో దారిలేదు. ఆ నిప్పుల్లోంచి నడవ్వలసిందే—

తాను వదలివచ్చిన గుమ్మందగ్గిర ఏదో చప్పుడయినట్లు తోచక పోతే గోపాలరావు ఎంతసేపన్నా అక్కడే నిలబడి పోయేవాడే. వెనక మాటలు వినబడేసరికి బూట్లనిగనిగలూ, చలవబట్టల ధళధళలూ, గోతుల అసహ్యమూ అన్నీ మరిచిపోయేడు. ముక్కుమూసుకొని, ఎత్తెత్తి కాలు వేస్తూ ఒక్క పరుగులో గోతులు దాటేసి గోడదగ్గిరికి చేరేడు. అది ప్రధానమైన వీధికాదు ఒక సందు. జనసంచారం కనబడలేదు. రజాకార్లూ, అరెస్టువాళ్ళూ చేస్తున్న హడావిడికి జడిసేనేమో ఉన్న నాలుగు మూడు గుమ్మాలూ మూసేసి వున్నాయి. అదీ ఒక విధంగా తన పలాయనానికి సహకారమే. గోపాలరావు గోడమీద కాలువేసి, బండి వసి

కొయ్యలమీదుగా బోరెంలో కురికేడు. అందులో దట్టంగా పరిచిన గడ్డిలో బోరగిలా పడుకొని రొప్పేడు.

చెన్నయ్య వాగ్దానం చేసినట్లు బండి మేఘాలమీద కదిలింది.

---

## ఇరవైరెండో ప్రకరణము.

గిత్తలు పరుగు లేస్తున్నాయి. ఆ విసురుకి ఎగిరెగిరి పడుతూ దొర్లు తున్న చక్రాల క్రిందనుంచి దుమ్ముతెరలాలేచి మేఘంలా కమ్ము కుంటూంది. దుమ్ము ముక్కులోదూరి గులగులపుట్టింది. తుమ్మువచ్చేలా అనిపించింది. ప్రయాణారంభంలో తుమ్ము అపశకునం అనే భయంతో గోపాలరావు ముక్కునలుపుకొని తుమ్మునువాయిదా వెయ్యడానికి తంటాలు పడుతున్నాడు.

వీధి దాటింది. వూరు దాటింది. గిత్తలు దుమ్ముతెరముందు తోక మట్టలెత్తుకొని తలలాడిస్తూ పరుగులెడుతూనేవున్నాయి. అయినా నొగల లోవున్న పడుచువానికి తృప్తిలేదు. "ఎహెహ్హేయ్" "పపప్పా"-అని అదిలిస్తున్నాడు. ముక్కులమీద గిలిగింతలుపెట్టి మరింతగా పరుగెత్తే టట్లుచేస్తున్నాడు. అది కూడా చాలక ఓ క్షణం వెలపలెద్దుమీద, మరో క్షణం దాపలెద్దుమీద వొంగి తెగముక్కుతున్నాడు.

వూరుదాటిపోయినా గోపాలరావుకి బండిలోని బోరెంలో కూర్చునే టందుకు ధైర్యం చాలలేదు. బండి అతనూ ఒప్పుకోలేదు. తనకు వప్ప చెప్పినపనిని మధ్యలోనే పాడుచేసుకోవడం ఆతనికిష్టంలేదు. అందుకనే మధ్యలో ఓమారు ఎంతదూరంవెళ్ళేరో తెలుసుకొనేటందుకు గోపాలరావు తలఎత్తేసరికి ఆపడుచువాడు తేలుకుట్టినట్లు వులికిపడ్డాడు.

గోపాలరావు మళ్ళీ అటువంటి ప్రయత్నం చెయ్యలేదు. గడ్డిలోనే అణిగిపడుకొన్నాడు. కాని, అదీసుఖంగాలేదు. రాళ్ళమీద బండిఎగిరెగిరి పడుతూవుంటే ఆ అదురుకి అతని ప్రక్కనేవున్న నిలువు పొడుగు పట్టా కత్తి నాట్యంచేస్తూంది. ఒరలోనేవున్నా దానినిచూస్తే భయంవేస్తూంది. ఆ ఆదురుకి కత్తి తనమీదపడ్డా, తాను కత్తిమీదపడ్డా రక్తం కళ్ళ చూస్తాడు. అటువంటి ప్రమాదం జరుక్కుండా కాచుకోవడానికి మహా శ్రమపడిపోతున్నాడు. తన జీవితంలో ఎన్నడూ కత్తిపట్టుకోలేదు. అల వాటున్నవాడికైనా ఆస్థితి దుర్భరం. దానిని చూస్తూంటే తానే కత్తి కావా లని చెన్నయ్యను అడగడం గుర్తువచ్చింది. నవ్వూవచ్చింది. కత్తితో వ్యవహారం తనకి అనుభవంలేని ప్రక్రియ. ఇంకావొస్తే తుపాకి పట్టుకోగలడు. స్నేహితులంతా తనను మంచి గురికాడంటారు. తనసత్తా తన కెరికే. ఏదో కాలుస్తాడు. స్నేహితులది భ్రమయేయని ఎరిగివున్నా కనీసంభయం లేకుండా తుపాకీ పట్టుకోవడమనీ, కాల్చడమనీ అలవాటుంది. స్నేహి తులతో కలసి పది పదిహేను పర్యాయాలు తానూ వేటకెళ్ళేడు. తానూ బందూకు కాల్చేడు. తాను గురిపెట్టిన పిట్టఏదీ నేలబడలేదని అతనికి జ్ఞాపకం. పైగా హేళనచేస్తున్నట్టు రొదచేస్తూ అవినెత్తిమీదుగా ఎగిరి పొయ్యేవి. ఒకమారు మాత్రం ఒకపిట్ట టపీమని నేలబడింది. మిత్రు లందరూ వున్నక్షణంలో అదినేలబడిందేమో తనకి మంచి గురికాడనే పేరువచ్చేసింది. కాని, తనకు తెలుసు. తానాపిట్టకు గురిపెట్టలేదు, నిజా నికి ఏపిట్టకూ గురిపెట్టలేదు. ఖర్మంకాలి, ఆ పిట్టస్వయంగావచ్చి గుండును గుద్దుకొని చచ్చిక్రిందబడింది. అయినా తానారహస్యం బయటపెట్టలేదు. అయాచితంగా లభిస్తున్న అభినందనలను వొదులుకోలేక పోయేడు. ఆప్రతిష్ఠనిలబెట్టుకొనేటందుకు ఇంటివద్దనే సాధికచేసేడు. తన సాధనకు చిహ్నాలుగా ఇంటిదొడ్డివేపు వసారాలోని తనాబీ దూలం వేయినోళ్ళు తెరుచుకొని మూకభాషలో మాట్లాడుతూ ఇప్పటికీ వచ్చినవాళ్ళ ముఖాలు

చూస్తూంటుంది. అందుచేత అడుగుతూ అడుగుతూ బంహూకు కోసం ఆడిగినా మాటదక్కేది. కనీసం ఇప్పుడు వచ్చిన ఇబ్బంది తప్పేది.

ఇంకా ఈ ఆలోచనలనుంచి బయటపడకపూర్వమే బండి వాగు దగ్గరకొచ్చి నిలబడింది. చెన్నయ్య పిలుపు వినబడి గోపాలరావు లేచి కూర్చున్నాడు. బళ్ళన్నీ విప్పివున్నాయి. కొందరు ఎడ్లకు నీళ్ళుపెడు తున్నారు. కొందరాపని పూర్తిచేసి ఎడ్లని తోలుకొచ్చి నొగలకి కట్టేసి, గడ్డిదులిపి వేస్తున్నారు. అంతా హడావిడిగా వున్నారు.

అంతమంది మధ్యచేరేక గోపాలరావుకి ప్రాణంలేచివచ్చింది. తానూ బండి దిగేడు. చెన్నయ్య సలహామీద చొక్కాతీసేసేడు; పంచె ఎగ్గట్టేడు. కండువా తలకుచుట్టి ఓ బండిపక్క నీడలో కూర్చున్నాడు. మనిషి నల్లనివాడు గనక ఎండదెబ్బ కలవాటుపడిన వాళ్ళనుంచి పెద్ద తేడా కనబడ్డం లేదు. గాని, రైతుయువకుల కావిబట్టలూ, మాసి నలిగిన తలపాగాలూమధ్య గోపాలరావు కట్టినతెల్లపంచె, మడతలు నలగని జరీ కండువా నన్నుచూసేవా అన్నట్లు మరీపట్టిచ్చేస్తున్నాయి. అక్కడికీ చూడీదార్ పైజామా పొడుగుకోటూ మార్చేయడం మంచిపనయింది.

గోపాలరావు ఇకముందు ఏం చెయ్యాలి ?

నలుగురూ గుండ్రంగా కూర్చుని ఆలోచన కుపక్రమించేరు.

గోపాలరావు కోర్టు భవంతినుంచి తప్పించుకు పోయినట్లు రజా కార్లకు తెలిసింది; తెల్లగిత్తలబండిలో తప్పించుకొని వుంటాడని కూడా వూహించేరు. ఆ బండి ఎటుపోయిందీ తెలియదు. సైకిళ్ళమీద మను షుల్ని నాలుగుమూలలకీ వురికించేరు. వాళ్ళల్లో ఒకడు ఇప్పుడే ఇదే దారిని ముందుకుపోయేడు. తెల్లగిత్తలబండి కనబడలేదాయని వాకబుచేసి వెళ్ళేడు. చెన్నయ్య చెప్పిన ప్రకారం బండి పుంతలదారిని పడివచ్చింది కనక వాళ్ళకంట బడలేదు.

ఈ వృత్తాంతం వినగానే గోపాలరావుగుండె జేజారిపోయింది. కాళ్ళు చచ్చుడిపోయేయి. ఏమిటి చెయ్యడం ?

బళ్ళలో తమతోపాటు రోడ్డువెంబడే తీసుకెడితే అపాయంవుందనే విషయంలో అందరూ ఏకీభవించారు. ఈ వేళ గోపాలరావుకోసం వూళ్ళో వెతుకులాడిన అరబ్బులూ, రజాకార్లూ ఖాజీమనుష్యులు. ఖాజీప్రియ భృత్యుల్లో ఒకడైన బుడన్ వాళ్ళకి నాయకత్వం వహించేడు.

గోపాలరావు బుడన్ ఎవరో ఎరగడు. బళ్ళవాళ్ళంతా వానిని గురించి భయోత్పాతంగా మాట్లాడుతూంటే ఎవరా అనిపించింది. ప్రశ్నించేడు.

బుడన్‌సు ఎరగరా అన్నట్లు బళ్ళవాళ్లు ముఖాల్ని ఆశ్చర్యార్థకాలు చేసుకొన్నారు. అందరూ తలోవేపునుంచీ వాని ఘాతుకాలు వర్ణించేరు. చెన్నయ్యకు గోపాలరావు అల్లుడిది సీతారాంపురం అని తెలుసు. కనక ఆ వూరుతో బుడన్‌కున్న బాంధవ్యం చెప్పేడు. చటుక్కున జ్ఞాపకం వచ్చింది. తన అల్లుడు వీనిని గురించి చాలమార్లు చెప్పేడు. వాడిచేతిలో పెళ్ళాంపడిన బాధల్ని తన కూతురూ వర్ణించింది.

"వో, వాడిక్కడి కొచ్చేడూ ?"

బుడన్ ఒక్కడేకాదు వచ్చింది. వస్తూ ఓ లారీ జనాన్ని వేసు కొచ్చేడు. వాళ్ళంతా వచ్చిన లారీకూడా అక్కడేవుంది. గోపాలరావు రోడ్డుప్రయాణం చేయడం ప్రమాదం. వాళ్ళువెంటబడ్డారంటే తామింత మందీవుండీ ఏమి చెయ్యలేరు. ఆయన తమతో లేకపోతే ఒకవేళవచ్చినా అనుమానించి ఆపవచ్చు. కొడితే రెండుకొట్టవచ్చు. ఫరవాలేదు. అంత కన్న జరిగేదేమీవుండదు.

తమ చర్చలు వింటున్న గోపాలరావు ముఖకవళికలను చెన్నయ్య కనిపెడుతూనే వున్నాడు. సందేహిస్తూనే సలహా అడిగేడు.

వాగుకి ఆవల ఒక దిశగావెడితే ఓ ఆమడదూరంలో సీతారాం పురంవుంది. మరోదిక్కుగావెడితే నాలుగుమైళ్ళల్లో ఖానుడిపేటవుంది. ఆ రెండూళ్ళల్లో ఎక్కడికెళ్ళదలచినా మనిషినిచ్చి పంపిస్తానన్నాడు.

సీతారాంపురం వెడితే కూతుర్నికూడా చూడవచ్చునని ఒక్క క్షణం గోపాలరావు ఊగిసలాడేడు. కాని వాళ్ళమాటలు విన్నాక జంకు పుట్టింది. చెన్నయ్యకూడా ఖానుడిపేట వెళ్ళడం మంచిదన్నాడు.

గోపాలరావు సీతారాంపురంలో వియ్యం అందేడని బుడన్ ఎరిగే వుంటాడు. లేకపోతే అమీన్ ముకుందరెడ్డికేనా తెలిసివుంటుంది. అందు చేత ఆయన అక్కడకుగాని వస్తాడేమోననే ఆశతో ఆ వూరిదార్లు కాస్తే? కనక ఖానుడిపేట వెళ్ళడం మంచిది. ఆవూళ్ళో ఈమధ్యనే దళం ఏర్ప డింది. వాళ్ళు సాయపడతారు.

ఆమాట సరేననిపించింది. కాని, దళంవాళ్ళకి తెలియడం ఎల్లాగ ?

చెన్నయ్య ఆ భారం తన భుజాన వేసుకొన్నాడు,

"నేను ఆ ఇంతజాం చేస్తాను."

అయితే బాధేముంటుంది ? బండి కట్టేస్తే తాను తయ్యార్ ?

కాని, చెన్నయ్య ఆ ఆలోచనకు అంగీకరించలేదు. బళ్ళదారి చుట్టు. చేలరోజులు. ఇష్టం వచ్చినట్లు చెలకల కడ్డుపడి పోడానికి వీలులేదు. నడిచిపోతే దగ్గరకు దగ్గర. చెలకగట్లమీద లారీలూ జీపులూ రాలేవు. కనక అదే మేలన్నాడు.

తన ఆదుర్దా భయమూలో గోపాలరావు ఆ సలహాకు మరో అర్థం వూహించుకొన్నాడు. ఇంతదూరంవచ్చి ఇక్కడ భయపడుతున్నారేమో ననిపించింది. డబ్బిస్తానంటే ఏమంటారో - అనుమానిస్తూనే అనేసేడు.

"పోనీ బండీ ఒకటిచూడు. డబ్బిచ్చేద్దాం."

డబ్బుమాట అనేసేక గోపాలరావు విచారపడ్డాడు. తాను ఏమిచ్చే దని ఇంతవరకూ తీసుకొచ్చేరు. తనను పెద్దపులి గుహలోంచి బయట పడేసేరు. ఆ పనిలో అపాయంవుందని ఎరుగుదురు. అయినా వెనుతియ్యలేదు. రజాకార్లువచ్చి నాలుగు కొడతారు గాని అంతకంటె ఏం చేస్తారులే యని వాళ్ళిప్పుడే అనుకోవడం తాను వింటూనే వున్నాడు. తనకోసం అంత త్యాగం చెయ్యగల వాళ్ళని తాను చవకచేస్తున్నట్లనిపించింది. నడిచి వెళ్ళడం తనకు భయం అనిపించి బండి కావాలనుకొన్నాడు. తన్ను తీసుకెళ్ళడానికి భయం అనిపించి వెనక తగ్గుతున్నారని వాళ్ళను అన్నాడు, అన్యాయంగా. చెన్నయ్య ఏమనుకొన్నాడో......

ఏమన్నా అనుకొన్నాడో లేదో కాని, పైకిమాత్రం ఏమీ అనలేదు. తనమాటను లెక్కచెయ్యలేదు. బూట్లు తీయించి బండిలో వేయించేడు. ఆకారికి సరిపడే జోడు దొరకడం చాలకష్టం అయింది. ఆయనది వెంక టేశ్వరుడి పాదాలు. దానికి సప్పెజోడుకోసం మార్చి మార్చి చూసేరు. చివరకొకటి చారీ చాలకుండావున్నది దొరికింది. అదే తొడిగించేడు. తనతో వచ్చినవాళ్ళల్లో గట్టివాణ్ణొకణ్ణి తోడిచ్చి వాగు దాటించేడు.



## ఇరవైమూడో ప్రకరణము.

గోపాలరావు చేల మరుగున అదృశ్యమైపోయేక పది నిముషాలు ఆమాటా ఈమాటా చెప్పుకుంటూ బళ్ళవాళ్ళు వాగులోని ఇసుక తిప్పల మీద కాలక్షేపం చేసేరు. నెమ్మదిగా లేచి గడ్డిపరకలుసహా ఏరి బళ్ళల్లో వేసుకొన్నారు. బద్ధకంగానే బళ్ళుకట్టేరు. ఒక్కొక్కటే రోడ్డుఎక్కించి నెమ్మదిగా కదిలేరు.

ఒక అరగంట గంటక్రింతం తెల్లగిత్తల బండీకోసం వాకబు చేస్తూ రోడ్డు ముందుకుపోయిన రజాకారు సైకిలుమీద అంతదూరాన కని పించేడు.

"అడుగో..."

"వాడేనా..."

వాడేనని స్థిరపడ్డాక ఇంక వాడికేసి చూడ్డం మానేసేరు. ఏమీ ఎరగనట్లు కబుర్లు చెప్పుకుంటూ, మధ్యమధ్య అదిలిస్తున్నారు. తల తిప్పకపోయినా ఓరగంట సైకిలును కనిపెడుతూనే వున్నారు.

బళ్ళదగ్గిరకొచ్చి రజాకారు సైకిలు దిగేడు. పరకాయించిచూసేడు. ఈమారు వరసలో తెల్లగిత్తలబండి కనబడింది. ఇందాకా తనకది కన పడలేదే. ఇప్పు డెక్కడినుంచి వొచ్చింది. ఇందాకా తా నడిగినప్పుడు ఎందుకు చెప్పలేదు? ఎవళ్ళూ ఎరగమన్నారే.

తనంతవాడిని ధోఖా తినిపించేరనిపించి వానికి మహోగ్రం కలి గింది. గబగబ సైకిల్ వెనక్కితిప్పి బళ్ళను ఆపమని ఆజ్ఞాపించేడు.

చెన్నయ్య తన ముఖంకేసి చూస్తున్న తోడివాళ్ళకి తల ఎగరేసేడు.

"జానేదో."

బళ్ళు ఆగలేదు.

రజాకారు ఒక్క ఎగురు ఎగిరి సైకిలుమీద కూర్చున్నాడు. గబ గబా తొక్కి బళ్ళనుదాటి ముందుకు వెళ్ళేడు. బండ్లకు ముందు పదిగజాల దూరంలో సైకిలుదిగి రోడ్డు కడ్డంగా స్టాండ్ వేసి నిలబెట్టేడు. ఈమారు బళ్ళు ఆగక తప్పలేదు. ముందడుగు పడాలంటే మనిషినీ సైకిల్‌ని తోసుకుపోవాలి. చెన్నయ్య కనుసంజ్ఞతో వారిని ఆపేడు.

రజాకారు వంద ప్రశ్నలేసేడు. ప్రతి ప్రశ్నకీ ఛాంఛోత్, మాదర్చోత్, తేరీమాకీ... వగైరా బూతపదాల నుపయోగిస్తూ తన గొప్పదనాన్ని వాళ్ళ మనస్సుల్లో హత్తుకొనేలాగ చెయ్యాలని ప్రయత్నిస్తున్నాడు.

బళ్ళవాళ్ళకి విసుగేసింది. కొన్నింటికి సమాధానాలిచ్చేరు. చాలవాని కివ్వలేదు. ఇవ్వనిదానికి ప్రత్యామ్నాయంగా "నీ యమ్మ..." అనే ఆశీర్వాదం ప్రసాదించేరు. వానికి తెలుగు రాదనేమాట ధృవపడినకొద్దీ తిట్లు యధేచ్ఛగా వుపయోగించేరు.

నిజాంప్రభువు వారసుడైన తనను బళ్ళకట్టుకు బ్రతకవలసిన రైతువాళ్ళు నిర్లక్ష్యం చేయడం చాల ఆగ్రహం తెప్పించింది. అందులో తెలంగీవాళ్ళు నిర్లక్ష్యంచేయడం ! తమ రాజ్యంలో...ఎంతపొగరు...

సైకిల్వాలాకు ఎంతో తామసం వచ్చింది. చొక్కాచేతులు పైకి తోసుకుంటూ రోడ్డు కావేపునుంచి ఈవేపుకి రెండుమార్లు పరిక్రమించేడు. వాళ్ళసంగతేదో తేలుస్తానని వాగ్దానం చేసేడు.

చెన్నయ్య చూసేడు. విసుగేసింది. బండిలో వసికర్రల ప్రక్కనుంచి ఒక కర్రలాగి గభీమని బండి వురికేడు. ఆతనిని చూడగానే పదిమందీ బళ్లు దిగేరు. తలోకర్రా తీసేరు. కన్నుమూసి తెరిచేలోపున సైకిల్వాలా చుట్టూ వలయంగా ఏర్పడి నిలబడ్డారు.

మహమ్మద్—సైకిల్వాలా పేరది—తెల్లమొహం వేసేడు. బిత్తరపోయి చుట్టూ నిలబడ్డ మొహాలు చూసేడు. వాళ్ళ కళ్ళల్లో తనను తినేసేటంత ఆకలి చూసేడు.

భయంపుట్టింది. అంతవరకూ ఈ ముస్లిం రాజ్యంలో రూమీటోపీ పెట్టినవాడిదే పెత్తనం అన్నారు. తానువచ్చినప్పటినుంచీ చూస్తున్నాడుగా. అందులో తభావతు కనిపించలేదు. అల్లాగేసాగుతూంది. ఆ ధైర్యంతోనే రకరకాల ఉర్దూతిట్లను యధేచ్ఛంగా ఒకటికి పదిరెట్లుపయోగిస్తున్నాడు.

తానుపుట్టి పెరిగినవూళ్లో తనకింత పెత్తనంలేదు. ఏ మాత్రం మాటజా రినా హిందూభయ్యాలూ, పండిట్ జీలూ దుడ్డుకర్రలు తీస్తారు. తరుచుగా కత్తులూ, బల్లేలూ తమ గుండెలలోతు చూస్తాయి. కనక ఒళ్ళుదగ్గర పెట్టుకొని వుండడం అవసరం. తమరుకూడా అంతక్రూరంగానూవున్నా ఎవరూ తద్దినం కొనితెచ్చుకొన్నట్లు పేచీకొనితెచ్చుకోరు. అందుచేత తన నోటికీ, చేతికీ ఇక్కడున్నంత స్వేచ్ఛలేదు. నిజాంసంస్థానంలో అవి రెండూ పుష్కలంగా లభించేయి. వాటిని చిత్తంవొచ్చినట్లుపయోగిస్తూ నూవున్నాడు. వానిని అదుపులో పెట్టవలసిన అవసరం కనబడలేదు. ఇక్కడకూడా ప్రదేశాల్నిపట్టి తేడాకనిపిస్తూందన్నారు. మరాత్వాడాలో అయితే చాలవరకు, కర్ణాటక భాగంలో కొంతవరకు జాగ్రత్తగానేవుండా లని అక్కడికెళ్ళొచ్చినవారుచెప్పేరు. కాని, తెలుగువాళ్ళు వట్టి మేకలూ, కోళ్ళూ అనిపించేరు. ఏ జంతువన్నా గొంతుకోసేటప్పుడు అల్లరిచేస్తుంది. ప్రాణరక్షణకోసం కనీసప్రతిఘటననిస్తుంది. కాని కోడీ, మేకా వెర్రి గుడ్లేసుకొని తమగొంతుకోసే కత్తివేపు చూస్తుంటాయి. మహమ్మదుకి తెలుగువాళ్ళతో వ్యవహారం ఇంతవరకు నిర్బాధంగానే కనబడింది. కాని హఠాత్తుగా వ్యవహారం ఎదురుతిరిగింది. నోటమాట రాలేదు.

"ఏమిర్రా అంటావు?" చెన్నయ్య వాకబుచేస్తూనే కర్రఎత్తేడు. అతనితో వున్నవాళ్ళకి ఆ వాకబు అనవసరం అనిపించింది.

"మారో బద్మాష్‌కో"

ఒకరి కొకరు ప్రోత్సహం సలహా కర్తవ్యోపదేశం ఒక్క మాటలో ప్రతిధ్వనించేయి. వాళ్ళలో ఒకని కర్ర సరాసరి గుండెలపద్దకు వచ్చేసరికి మహమ్మదు జడత్వంవదలిపోయింది. కొత్తగా నేర్చుకొన్న తిట్టుబోతుతనం మరచిపోయేడు. ఇంక చెన్నయ్య మొలలోంచి కైజారే లాగుతూంటే బాపుమని ఏడ్చేసేడు.

అంతమనిషీ బారుషని ఏడుస్తూంటే, నడిరోడ్డుమీద మోకరిల బడి ఏడుస్తూ సలాములు కొడుతూంటే బళ్ళవాళ్ళ చేతుల్లో కర్రలు దిగి పోయేయి. తన ఏడుపూ, ప్రార్ధనలూ దెబ్బతగలకుండా కాపాడేయని గ్రహించడంతోనే మహమ్మదు మరింత బిగ్గరగా ఏడుపు ప్రారంభించేడు. మనిషి మనిషికీ తిరిగి సలాములు కొట్టేడు.

అన్ని గంతులు వేసినవాడు ఒంటిమీద ఒక్క దెబ్బకూడా పడ కుండానే అంతల్లా ఏడవడం చూస్తే అందరికీ అసహ్యం వేసింది. అంతకుపూర్వం ఒక్కక్షణం క్రితమే 'పౌడవండెహే' అని యిచ్చిన సలహాలను ఎవరికివారే ఉపసంహరించుకొన్నారు.

తనమీద ఇంక దెబ్బపడే ప్రమాదంలేదని తోచేక మహమ్మదు వాళ్ళల్లో జాలి పుట్టించేటందుకు తోచినట్లల్లా కధలు చెప్పడం ప్రారం భించేడు.

తానీ ప్రాంతాలవాడు కాడు. ఏవో భూములిస్తామనీ, పుట్రలిస్తామనీ ఆశలు చూపించి తీసుకొచ్చేరు. వీళ్ళమాటలునమ్మి తల్లినీ, కుటుంబాన్నీ ఎత్తి పెట్టుక వచ్చేడు. అక్కడి కొచ్చేక భూమి ఇవ్వలేదు. రజాకార్లలో పనిచేస్తే......

పనిచేస్తే తనకిస్తూన్నదేమిటో, ఇస్తానన్నదేమిటో మహమ్మదు చెప్పలేక పోయేడు.

ఓ రైతు వాని దుఃఖగాథకి సానుభూతి కనబరిచేడు.

"భూము లివ్వలేదా ?"

మహమ్మదు దిగాలుగా తల అడ్డంతిప్పేడు. చెన్నయ్య వానివేపు తీక్షణంగా పరిశీలించేడు. వాని ధోరణిమీద వ్యాఖ్యానం చేసేడు.

"భూమిస్తే మెహనత్ చెయ్యాలి. తీరాచేస్తే ఎండుతుంది. పండు తుంది. ఎందుకొచ్చిన తిప్పలు ? ఆసానీగా దోచుకు తినడానికి దారి కని పిస్తూవుంటే కష్టం చెయ్యడం ఎందుకు ?"

అక్కడున్న నలుగురూ తుబుక్కున ఉమ్మేసేరు. చెన్నయ్యా మాటలన్నీ అర్థం కాకపోయినా, ఆతడుపయోగించిన రెండు మూడు ఉర్దూపదాలతో అభిప్రాయాన్ని కొంతవరకు మహమ్మదు ఊహించేడు. ఆ మాటలు విన్నాక నలుగురూ, ఊయడమూ, తనకేసి కొరకొరా చూడ్డమూ గమనించేక ఇంక అనుమానమే లేకపోయింది. భయంవేసి మళ్ళీ కళ్ళనీళ్లు తిరిగేయి.

"మాఫ్ కరో, భాయిసాబ్ !"

వంగివంగి సలాములు కొడుతూ చేతులు నలిపేడు.

వాని నంగినంగి వ్యవహారమూ, వొంగివొంగి దండాలూ చూసే సరికి నలుగురికీ అసహ్యంవేసింది. ఒకనికి తామసం పుట్టుకొచ్చింది. సాగదీసి ఒక్క లెంపకాయ తగిలించేడు.

"బూతులుతిట్టి, చొక్కాచేతులు పైకి తోసేవే అప్పుడేమయిందీ తెలివి :"

ఒకడు దారితీసేక మిగిలిన వాళ్ళకికూడా చేతులు సలిపేయి. చెన్నయ్య వారించి వుండకపోతే తలో ఒకటీ, రెండూ గుద్ది వాణ్ణి ప్రాణావశిష్టుణ్ని చేసేవారే.

"ఏం చెయ్యిందే, అరువేడుస్తావేరా. నీయమ్మ..."

అని ఆ దోసందులో ఎవరో ఒక్కపోటు పొడిచి ఏడవడానికి ఓ కారణం అంటూ కల్పించేరు. ఇంతలో చెన్నయ్యా స్వయంగా అడ్డు వెళ్ళి కొసరుదెబ్బలు తగలకుండా నిలిపేడు. కాని, ప్రతిఒక్కరూ వాడిని కాళ్ళూ చేతులూ కీళ్ళు తిప్పేసి పక్కనున్న వాగులో పారెయ్యాలని దృఢసంకల్పాన్ని వెలిబుచ్చేరు.

తగిలిన పోటుకు ఏడవాలో జరగబోయే ప్రమాదానికి ఏడవాలో మహమ్మదుకి అర్థంకాలేదు. అంతమందిలో తన్ను రక్షించగలవాడొక్క

చెన్నయ్యేనని నిశ్చయించుకొని ఆయన కాళ్ళకు చుట్టుకొన్నాడు. ప్రాణ భిక్షపడేస్తే ఎకాయెకి బీహార్‌లోని తమ వూరెళ్ళిపోతానని చెప్పుకున్నాడు.

వానిని తన్నేసి చెన్నయ్య కాళ్ళు విడిపించుకొన్నాడు. పురుగును విదిలించుకొన్నట్లు విదిలించుకొన్నాడు.

"లేవండి, పోదాం."

"వీడుపోయి తన మూకను తీసుకొస్తే?"

ఆ భయం అందరికీ నిజం అనిపించింది. చెన్నయ్య ఒక్క క్షణం ఆలోచించి కైజారు తీసేసరికి మహమ్మదు నీరవుడై మ్రిచూపులు చూసేడు.

కాని వానివేపుకూడా చెన్నయ్య చూడలేదు. చరచరా వెళ్ళి సైకిల్ చక్రాన్ని ఒక్కపోటు పొడిచేడు. బుస్సుమని గాలిపోయింది. ఇంకో వూపులో కైజారును పైనుంచి క్రిందకు విసిరి లాగేడు. ఆ విసురుకు ట్యూబూ, టైరూకూడ ఒక అడుగుమేర పైగా చీరుకుపోయేయి.

బళ్ళవాళ్ళంతా ఆ చర్యను ఆమోదించేరు. మరో పోటుతో రెండో టైరూ, ట్యూబూ చీరుకుపోయేయి. వాళ్ళల్లో ఒకడు బండిని చేతులమీద పైకి ఎత్తి ఒక్క విసురులో పక్కనున్న పల్లంలోకి విసిరేసేడు.

తన సైకిల్ టైర్లు కోసెయ్యడంవలన ఈ ఆరేడుమైళ్ళూ తాళ్ళీడ్చు కుంటూ వెళ్ళాలనే బాధ మనస్సుని ఓమూల పీకుతూవున్నా, టైర్లకు బదులు తన గొంతు కోయనందుకు మహమ్మదు సంతృప్తిపడ్డాడు.

వాళ్ళంతా తమ బళ్ళు ఎక్కిపోతూంటే చూస్తూ వాడు రోడ్డు కడ్డుగా అలాగే కూర్చుండిపోయేడు. బళ్ళు బయలుదేరుతూంటే ఒకళ్ళు లెమ్మనకుండానే చటుక్కున లేచి రోడ్డుపక్కకు తొలగి నిలబడ్డాడు. వాని ఆదుర్దాచూసి అంతా నవ్వేసేరు.

బళ్ళు తన్నుదాటి ముందుకు పోతూంటే మహమ్మదు ఒక్కొక్కరికే సలాములు కొట్టేడు. చెన్నయ్య తన ముఖంకేసికూడా చూడకపోవడం కష్టం చేసింది.

"సలాం భాయిసాబ్ !"

దుమ్ముతెరమధ్య బళ్ళన్నీ కనుచూపుమేర దాటిపోయేవరకూ అక్కడే నిలబడ్డాడు. తన సలాములు వినబడే అవకాశం లేదని తోచి నాక రోడ్డు పల్లంలో పడున్న సైకిల్ లేవనెత్తి రోడ్డుమీద నిలబెట్టేడు. నడిపించుకొంటూ వచ్చినదారి పట్టేడు.

కాని, పదడుగులు వొర్లేసరికి పీలికలయిపోయిన టైర్లూ ట్యూబులూ జారి చక్రాల్నిచుట్టేసుకున్నాయి. బండికదలదు. వెనకనుంచికూడా నెట్టేడు. బండి దొర్లడంలేదు. దేకడం ప్రారంభించింది. బండి వొదిలేసేడు. ఆయాసంతో రొప్పుతూ ప్రక్కనేవున్న ఒక ఎండిపోయిన చెట్టునీడలో చతికిల బడాడు.

సైకిలు రోడ్డుకడ్డంగాపడి ఆతని అవస్థని వెక్కిరిస్తూంది.

---

## ఇరవై నాలుగో ప్రకరణము.

వాగుదాటి, చేలగట్ల మరుగున చెరువుగట్టు చేరేవరకూ గోపాలరావుకి ధైర్యం చిక్కనేలేదు. జొన్నచేలూ, మొక్కజొన్నచేలూ మధ్యనుంచి కుమ్మరికుంట అలుగుమీదుగా పుంతలో అడుగుపెట్టేడు. ఎండ మంచి జోరుగావుందేమో దాహంవేస్తూంది. అది ఆదుర్దావలన కలిగిన తపన కాని నిజమైన దాహం కాదన్నాడు కూడావున్న మట్టయ్య. నిజమైనదైనా అబద్ధమైనదైనా దాహం అనిపిస్తూంది. మంచినీళ్ళుకావాలి. కుంటలో పసుల పిల్లగాడొకడు బర్రెల్ని కడుగుతున్నాడు. పశువుల్ని కడుగుతున్న

అసహ్యంకన్న పశులపిల్లగా దక్కడున్న భయంతోనే గోపాలరావు కుంటలో నీళ్ళవేపు పోలేదు.

మళ్ళీ పుంతలోకి తిరిగేరు. ఇరుప్రక్కలా నిలువుఎత్తు పెరిగిన చేలమధ్య నడుస్తూంటే గోపాలరావుకు ధైర్యంగావుంది. కొంతదూరం వెళ్ళేసరికి దారికి అంత దూరంలో నల్లగా చింతలతోపు కనిపించింది. అక్కడ బావిపుంటుంది. గుర్తే. గోపాలరావు అటు వెడదామన్నాడు. దాహం తీర్చుకోవాలన్న అవసరంకన్న, కొంతసేపు జాప్యంచేయడం ముఖ్యమవే ఆలోచన కలిగింది.

ఘానుడిపేట ఇంకో మైలు మైలున్నరకన్న హెచ్చుదూరంలేదు. చూస్తే నాలుగ్గడియల పొద్దుపుంది. ఎంత పెళ్ళినడక నడిచినా చీకటి పడే వరకూ కాలక్షేపం చెయ్యడం సాధ్యమేకాదు. కనక ఎక్కడో కూర్చో వాలి. అకూర్చునేది బావిదగ్గరే కూర్చుంటే సరిపడుతుందని అభిప్రాయం.

పట్టయ్య ఆ భయం అనవసరం అన్నాడు. ఊళ్ళోకి ఏ పోలీసా ళ్ళన్నావస్తే వూరిజనం మూడొంతులు పొలాలమీదే చేరేవాడు. ముఖ్యంగా మగాళ్ళంతాను. ఇప్పుడింతవరకు తమకల్లాంటిదేమీ అగతగలలేదు. కనక గ్రామం నిరాటంకమే నంటాడు.

అయినా గోపాలరావు అంగీకరించలేదు. తానువచ్చి అక్కడెవ రింట్లోనో మకాంచేసిన సంగతి కూడా మూడోమనిషికి తెలియనివ్వడం ఆయనకు ఇష్టంలేదు. తన సంగతి ఎవరిన్నా చూడొచ్చు. అది పోలీసుల దాకా పోవచ్చు. వాళ్ళొచ్చి ఆ యింటివానిమీద పడిపోతారు. పుణ్యానికి పోతే పాపం ఎదురైనట్లవుతుంది. అందుచేత చీకటిపడేవరకూ ఇక్కడే జాప్యం చేయడం, అప్పుడూళ్ళోకి వెళ్ళడమూ ఉత్తమమన్నాడు.

ఆ యువకుడి కభ్యంతరము ఏమీలేదు. ఆ దారులన్నీ తనకు కొట్టినపిండి. కళ్ళకు గంతలుకట్టి వదిలేసినా దారి తప్పుతాడనే భయం లేదు.

ఇద్దరూ బావిగట్టు ఎక్కేరు. మోట కాళ్ళప్రక్కనుంచే మెట్లమీదుగా నూతిలోకి దిగేరు. నీళ్ళలోకే వున్నరాయిమీద నిలబడి కాళ్ళూ, చేతులూ, మొగం కడుక్కున్నారు. ఇన్ని మంచినీళ్ళు త్రాగి, ముఖం తుడుచుకుని మట్టయ్య పైకెక్కేసేడు.

గోపాలరావుకు తనివి తీరలేదు. నీళ్ళు చల్లగా మంచిల్లా వున్నాయి. ఉద్వేగంతోనూ, ఎండలో నడకతోనూ ఉడికిపోతున్న శరీరానికి నీరు తగిలేసరికీ హాయి అనిపించింది. అక్కడేలాగూ కాలక్షేపం చేయాలి. కనక స్నానం ఎందుకు చేయకూడదూ? బట్టలు ఆరగట్టుకోవడం పేరుతో ఆ గంటా గడిపెయ్యొచ్చు ననుకొన్నాడు. చొక్కా తీసి పైన పెట్టేడు. ఒక్కగెంతులో పిల్లిమొగ్గవేసి నూతి అడుగుకంటా పోయి పైకి తేలేడు. గట్టుమీద కూర్చున్న సహాయకుడు ఓ హెచ్చరిక చేసేడు.

"బండ లుంటాయి".

గోపాలరావు నీటిలోంచి వచ్చి బట్టలు పిండుకొన్నాడు. గట్టు ఎక్కబోతూ అటూ ఇటూ చూసేసరికి గుళ్ళల్లో మనుష్యులు కనిపించేరు. ఒక్కమారు ఒళ్ళు ఝల్లుమంది. గుండెలు పీచుపీచు మన్నాయి. ఎవ్వరూ లేరనుకొంటున్నచోట హఠాత్తుగా మనుష్యులు కనబడడం భయమే అనిపిస్తుంది. వాళ్ళు తాము వచ్చేదానికి పూర్వమే అక్కడుండి వుండాలి. ఈ అరగంటలో ఒక్కమారైనా తమరున్న అలికిడినికూడా వాళ్ళు తెలియనివ్వలేదు. ఇద్దరూ కదల మెదలకుండా పడుకొని తనచర్యలను గమనిస్తున్నారు. దిగ్భ్రమ చెందినట్లు గోపాలరావు మెట్లమీదనే నిలబడిపోయేడు.

గోపాలరావు తమ్ము గమనించి నట్లనిపించగానే గుళ్ళల్లో వారిలో ఒకడు లేచి గబగబా ముందుకు వచ్చి పలకరించేడు. ప్రాణం కుదుట

పడింది. ఖానుడిపేట మల్లారెడ్డి కొడుకు కొండలరెడ్డిని తాను రెండు మూడు మార్లు చూసేడు. మరొక చోటనైతే గుర్తు పట్టలేక పోయేవాడేమో. కాని, తాను వాళ్ళవూరికి దగ్గర్లోనే వుండడంచేత చటుక్కున ముఖం గుర్తు తెలిసింది. మల్లారెడ్డి సత్యాగ్రహం చేసిన విషయం ఎరుగును. అందుచేత కొండలరెడ్డినుంచి భయపడనక్కర్లే దనిపించింది. వెడనవ్వు నవ్వేడు.

మాటల సందర్భంలో తాను ఖానుడిపేటకే వ్యవహారంమీద వస్తున్నానని గోపాలరావు చెప్పేడు. దానికి కొండలరెడ్డి ఏమీ అనలేదు. తాను కట్టుకొన్న బట్టలవంకా, కాలినున్న జోడువంకా ఎగాదిగా చూసి వూరుకొన్నాడు. ఆతడు తనమాటను నమ్మలేదని అర్థం అయింది. తాను ఆడిన అబద్ధానికి తనకే నవ్వు వచ్చింది.

"నా వ్యవహారం ఏమిటో తెలుసా ?"

కాని అంతలోనే కొత్తవారెవరో వస్తున్నట్లు అలికిడయింది. ఇద్దరూ వెనక్కి తిరిగిచూసేరు. పట్వారీ శీతారామారావు.

వస్తూనే ఆయన తన చేతిలోవున్న చీటిని కొండలరెడ్డికి చూపిస్తూ పలకరించేడు.

"రెడ్డిసాబ్ ! ఇదేమిటి ? పిల్లలవాడిని ఇల్లా అయితే బ్రతగ్గలనా ?"

మనస్సుని ఆవేగపడుస్తున్న ఆ మాటలు రెండూ అనేసేకగాని శీతారామారావు అక్కడ వేరోమనిషి వున్నాడనిచూడలేదు. చూడగానే కాగితం వెనక్కిపట్టుకొన్నాడు. గోపాలరావుని పలకరించేడు.

"తమరు వచ్చేరని చెప్పలేదే."

అంతలో ఆలోచనలు పరుగులెత్తేయి. తన చేతిలోవున్న చీటిని కొండలరెడ్డి ద్వారా పంపినది గోపాలరావే ననిపించింది. ఆయనను కాంగ్రెసు నాయకుడుగా ఎరుగును. కొండలరెడ్డీ, ఆతని తండ్రీ కాంగ్రె

సులోచేరి ఇంకా నెలకాలేదు. వారి పలుకుబడి నుపయోగించి తనకీ చీటి పంపించేడనిపించింది. అటుతిరిగేడు.

"పట్వారీ పనిచేసుకు బ్రతుకుతున్న నాబోటిగాడే తమకి కనిపించేడా ?"

సీతారామరావు అభియోగం ఏమిటో గోపాలరావుకి అర్థంకాలేదు. మొగాలు చూసేడు.

సీతారామారావు తనుపంపిన చీటీనిగురించి గోపాలరావు వద్ద ఫిర్యాదుచెయ్యడం చూసేసరికి కొండలరెడ్డికి కోపంవచ్చింది.

"అమీన్‌సాబ్ కివ్వడానికైతే వెయ్యిరూపాయిలనగ కానీలా పారేసేరు. దేశం కోసం ఇవ్వడానికి బీదఅర్పులేమయ్యా !"

ఆ ఇద్దరి వాదోపవాదాలనూవింటూ నిల్చోడం తప్ప గోపాలరావు ఏమీ చెయ్యలేకపోయేడు. ఏమీ అననూలేకపోయేడు.

కాంగ్రెసు ఉద్యమానికి ధనం కావాలి. ఆ ధనాన్ని కొండలరెడ్డి వసూలుచేస్తున్నాడు. ఇంతడబ్బు విరాళం ఇవ్వమని పట్వారీకి వ్రాసేడు. తనకొడుకు సత్యాగ్రహంలో పాల్గొనలేదని అమీనుకు నచ్చచెప్పడంకోసం వెయ్యిరూపాయల నగ మీద పారేసేడని విన్నాక ఆయన మీద గోపాలరావుకు సానుభూతి కలగలేదు. అల్లాంటి జంగలీ ప్రభుత్వాన్ని తరిమివేసేటందుకై జరిగేవుద్యమానికి తోడ్పడ్డం ఆయనకే క్షేమమని హితోపదేశం చేసేడు.

గోపాలరావు తనను సమర్థిస్తున్నా డనిపించగానే కొండలరెడ్డి అగ్గిపుంతలా విక్రమించేడు. తామంతా ఇల్లూవాకిలీవిడిచి, రోడ్లంపటా పుంతలంపటా తిరుగుతున్నారు. పెళ్ళాం పిల్లల్నీ, ఆస్తిపాస్తుల్నీ వదలిపెట్టేరు. ఎవరికోసమనీ ? ఈ బాధలుపడితే తమకేమన్నా పొలుకుతుందా? వాళ్ళమీదపడి దోచుకుతింటున్న నిజాము సర్కారును తీసేస్తేతప్ప జనా

నికి సుఖంవుండదని తమరు ఆ పనికి తలపెట్టేరు. తమ కార్యం సాగితే ప్రజలకే లాభం. తమరు ఆలాగ కష్టపడుతూంటే సాయపడ్డానికి బదులు శత్రువుకి డబ్బిచ్చి వాళ్ళఆటలు సాగనిచ్చేడు సీతారామారావు. పోనీ కష్ట పడలేక ఆలాగచేసేడనుకొన్నా వుద్యమానికి సాయపడవద్దా? కొండల రెడ్డి అదేం కుదరదని ఖచ్చితంగా చెప్పేడు.

గోపాలరావుకి రెండుపక్షాల వాదనల్లోనూ సబబున్నట్లే అనిపిం చింది. పోలీసువాడికి లంచం ఇచ్చేవాలేదా, తే రెండువేలంటే ఒక సాధా రణ సంసారి ఎక్కడనుంచితెస్తాడు? పీకమీదికొచ్చింది గనక బయట పడ్డానికివ్వాలిసొచ్చింది. నాకూ ఇవ్వమంటే ఎక్కడలేవడం? ఇల్లా అడిగినవాళ్ళకల్లా ఇస్తూపోడానికి తామేమన్నా డబ్బుపోగేసుకూర్చు న్నారా?...అని సీతారామారావు గోలపెడుతూంటే జాలివేసింది. కాని, అడిగినవాళ్ళకల్లా డబ్బిస్తూపోడానికి తమవద్ద ఏమిలేదంటూంటే కష్టం అనిపించింది. కొండలరెడ్డి ఆలాఒత్తిడిపెట్టడమూ బాగులేదనిపించింది. కాని అదిసర్దుబాటు చెయ్యడం ఎల్లాగో తెలియలేదు. కూర్చుని ఏదో ఒక నిశ్చయానికి రమ్మని సలహాఇచ్చి తాను బయలుదేరేడు.

పుంతలోకి వచ్చేక మట్టయ్య తన అభిప్రాయం ప్రకటించేడు. ఇవ్వలేను మొర్రోఅంటే బాకీవున్నట్లు ఆ వసూలు చెయ్యడం బాగులే దన్నాడు.

గోపాలరావు కొండలరెడ్డిని సమర్థించేడు, పోలీసువాళ్ళకి లంచా లివ్వడానికి డబ్బుంది ఒక వుద్యమాని కివ్వడానికి లేకపోయిందేం అని గోపాలరావు ఎదురుప్రశ్న వేసేసరికి అతడు మాట్లాడలేదు, ఇల్లాంటి వాళ్ళవద్ద వసూలు చెయ్యాలంటే కొండలరెడ్డిలాంటివాళ్ళే వుండాలన్నాడు. "లేకపోతే వీళ్ళొక్కకానీ చేస్తారా?"

---

# ఇరవై ఐదో ప్రకరణము.

సోతాని రామచంద్రయ్య గోపాలరావునిచూసి ఎంతో సంతోషంతో ప్రత్యుత్థానం చేసేడు. ఆయనకు అన్నిఏర్పాట్లూచూసి తాను పనిమీద వెళ్ళ వలసివుందని వెళ్ళిపోయేడు. రాత్రి తెల్లవార్లూ వస్తూపోతూ ఏదో హడా విడిగానే వున్నాడు. మధ్యనోమారు తెలివి వచ్చినపుడు 'ఏమిటా హడా విడి' అని ప్రశ్నించేడు. రామచంద్రయ్య ఇచ్చిన సమాధానం అర్థంకాలేదు.

"ఏదో సంసార్లంకదా ? మధ్యమధ్య ఏదో వస్తూనే వుంటుంది."

సమాధానం అర్థం కాకపోవడంతో ఆలోచనలు సాగేయి. మధ్య మధ్య వినబడుతున్న గుసగుస మాటలలో అసలుసంగతి గ్రహించడానికి ప్రయత్నించేడు. కాని, ఫలితం లేకపోయింది.

తెల్లవారబోయేముందు రామచంద్రయ్యవచ్చి లేపేడు. వూరు చివరవరకూ సాగనంపడానికి వెంటనడిచేడు. దారి పొడుగునా గోపాల రావు ఏదో అడగాలనుకొంటూ సందేహిస్తూనే వున్నాడు. ఇంక విడి పోయేముందు ఉండబట్టలేక పోయేడు.

"రామచంద్రయ్యా"

వెనక్కి తిరిగినవాడల్లా రామచంద్రయ్య తిరిగి వచ్చేడు. గోపాల రావు ప్రశ్న వెయ్యడానికి ఎంత తటపటాయించేడో సమాధానం చెప్ప డానిక్కూడా రామచంద్రయ్య అంతగానూ తటపటాయించేడు.

కాకపోతేమాత్రం ఏమనిచెప్పగలడు? మల్లారెడ్డి కాంగ్రెసుకు వెయ్యి రూపాయలు విరాళం ఇవ్వాలని చీటి వ్రాసేడనీ, అది ఇచ్చి పంపకుంటే కొంప అంటుకుంటుందనేభయంతో రాత్రంతాతిరిగి కొంతయిచ్చి పంపేననీ ఎల్లాచెప్తాడు? గోపాలరావూ కాంగ్రెసువాడేనాయె, డబ్బు ఇవ్వక పోవడం అపరాధం అయితే. ఒడిరించి పుచ్చుకొన్నారని చెప్పడం అపరాధంకాదా ?

గోపాలరావు నొక్కి-నొక్కి అడుగుతూంటే చేసేదిలేక మొల నున్న చీటీతీసి చేతిలోపెట్టేడు. టార్చి వెలుగులో గోపాలరావు దాని మీదవున్న ఒక్క పంక్తీచూచి ఆశ్చర్యపడ్డాడు. అంత సున్నితంగా విరాళాలు వసూలవుతాయని ఆయనెన్నడూ అనుకోలేదు. తామూ విరాళాలకు తిరగక పోలేదు. కాని అది విరాళాలు వసూలు చెయ్యడంగాక విరాళాలు వెయ్యడంగా మాత్రమే వుండేది. ఎప్పుడేనా కొత్త జరుగువాటున్న క్లయింట్లు దొరికితే ఓ వందో ఏభయ్యో పుచ్చుకొనేవారు. మిగతాది ఇంచు మించు చేతిచమురు భాగోతంగానే వుండేది. ఎవరినో ఇచ్చి చీటీ పంపితే వందలూ, వేలూ మాట్లాడకుండా ఘల్లునరాలడం ఆతదెరగడు. ఎందుకు పంపాలి ? రశీదియ్యమనడంకూడా వుంటుందో, వుండదో...

"రశీదు ఏది ?"

రామచంద్రయ్య గోపాలరావువంక ఆశ్చర్యంగా చూసేడు.

"మల్లారెడ్డిసాబ్ మీద ఆమాత్రం నమ్మకం మాకులేదనా ?"

రామచంద్రయ్య తన జాగ్రత్తలో తానున్నాడు. ఈ ప్రశ్నలన్నీ తన్ను పరీక్షించడానికేనో ఏమో. ఇచ్చేడబ్బూ ఇచ్చుకోవాలి. కుళ్ళు నెయ్యితాగడం, కొరడాదెబ్బలుతినడం ఎందుకు ? చల్లగా మాటదక్కించుకొనేదానికి......

ఆ మనస్తత్వాన్ని గోపాలరావు అర్థం చేసుకొన్నాడు.

" ఈ డబ్బు కాంగ్రెసుకే చేరుతుందని మీ నమ్మకం ఏమిటి ?"

కాంగ్రెసుకు నేడు ఎన్నిఖర్చులున్నయ్యో వాటిని సరిపుచ్చుకొనేటందుకు దేశం ఎంత త్యాగం చెయ్యవలసివుందో రామచంద్రయ్య చిన్న ఉపన్యాసం ఇచ్చేడు.

సంస్థానం వెలపల కాంగ్రెసువారు చాలచోట్ల కార్యాలయాలు పెట్టేరు. వాటికి ఖర్చులుంటాయి. వలంటీర్లకు ఖర్చులున్నాయి. కత్తులూ,

కటార్లూ చేయిస్తున్నారు. వాటికి డబ్బురావాలి. రజాకార్లనుంచీ, పోలీ సులనుంచీ రక్షించుకొనేటంధుకూ గ్రామాల్ని కాపాడుకొనేటందుకూ తుపాకులు కావాలి. చేతిబాంబులుండాలి. అవసరంచూసి ధరలు పెంచే సేరు. రెండువేలకువచ్చే రైఫిల్‌కు పదివేలడుగుతున్నారు. పరిస్థితులు ఇంత నిక్కచ్చిగా వున్నప్పుడు వుసులుబాటున్నవాళ్ళు గుప్పిడి విప్పక పోతే ఎల్లాగ ?—అన్నాడు.

గోపాలరావు నిరుత్తరుడయ్యేడు. ఒక మహోద్యమం సాగిపో తూంది. దానికి ఎంతఖర్చేనా అవుతుంది. ఆశ్చర్యమేంలేదు. ఇంత ఉత్సా హంతో డబ్బువిరాళాలు ఇవ్వడం ఎంతో సంతోషకరమే

కాని...రామచంద్రయ్య మనస్పూర్తిగానే ఆ వుత్సాహం చూపు తున్నాడా అనే అనుమానం కలగకపోలేదు. కాని ఆ ప్రశ్న అడగడానికి అవకాశమే కలగలేదు. కనుక సంతృప్తిపడి వూరుకోదలచేడు.

రామచంద్రయ్య అన్నివిధాల సమర్థించినతర్వాత చల్లగా ఒక చిన్నమాట అంటించేడు.

"వసూళ్ళ పద్ధతులు అలవాటయిపోయి మానలేకున్నారుగాని,...."

అధికార్లకు సప్లయిలు చేయవలసివచ్చినా, తమయిళ్ళల్లోకార్యాలూ కరామత్తులూవచ్చినా ఖాష్టీకంచేసి తెప్పించుకోవడం పెత్తందార్లకి ఓ అల వాటు. అందులోనూ ఆ ఖాష్టీకం కొందరి స్వంతగుణంగా తయారయింది. ఈ వేళ ఒక్కమారుగా అదిమారాలంటే మారుతుందా ? ఉద్దేశం మంచిదే కావచ్చు. కాని, దానిని అమలుజరిపేటందుకు మంచిపద్ధతి మరొకటున్న దని తెలియాలి. తెలిసినా దానిని అమలు జరపగల శక్తివుండాలి. అల వాటు కావాలి. ఇవన్నీ ఒక్కరోజుతో వచ్చేవా ? కాలంపడుతుంది. కాలం......

గోపాలరావుకు ఆ మాటలు విశ్వాసంతో, మనస్ఫూర్తిగా అంటు న్నట్లనిపించలేదు. కాని ఏమనడానికీ తోచలేదు. ఒక్క నిమిషం ఇద్దరూ వూరుకున్నారు.

తర్వాత మళ్ళీ రామచంద్రయ్యే ప్రారంభించేడు. సంకోచిస్తూ, మరో ఆలోచనతో చెప్తున్నట్లుగా భావించవద్దని ఉపోద్ఘాతంతో "ఈ వసూలుచేసే పద్ధతులు మానిపించలేరా?" యని అడిగేడు.

కాంగ్రెసుకు, అది తలపెట్టిన మహోద్యమానికీ డబ్బుకావాలంటే అందరూ ఇస్తారు. తమరు ఇవ్వగలరనుకొన్నంత ఇవ్వలేకపోవచ్చు. తృణమో పణమో యిస్తారు. చేయి నిక్కచ్చిగాపుండే ఆరోజున ఏమి ఇవ్వలేకపోవచ్చు. తరువాత ఇస్తారు. అవన్నీ ఆలోచించాలి. కాని మొస కటి మాదిరిగానే వసూళ్లు ప్రారంభిస్తే తన బోటిగాడికి అన్నీ తెలుసు గనుక బాధపడడు. పద్దాలెక్కచెయ్యడు. అందరూ అల్లాగే వుంటారా? వాళ్ళగొడవచేస్తే కాంగ్రెసుకి అప్రతిష్ఠకాదా?

రామచంద్రయ్య ఆంధ్రమహాసభవాళ్ళ వసూళ్ళ పద్ధతి ఉదాహ రించేడు. ఆయుధాలు సంపాదించడంకోసం వాళ్ళు ప్రయత్నిస్తున్నారు. కార్యకర్తలు పదిమందీ తమ చేతుల్లోవున్నది కాస్తా ఇచ్చేసేరు. నిజం చెప్పాలంటే వాళ్ళల్లో ఒక్కడూ రెండో పూటకేమి మిగుల్చుకోలేదు. మామూలు పాటకజనం వాళ్ళనిచూచి, మొలతాడుసహాకోసి చేతిలోపెట్టేరు.

మల్లారెడ్డి సత్యాగ్రహంనాడు జరిగిన ఘటన దేశంఅంతా తెలిసింది. గోపాలరావూ విన్నాడు. రామచంద్రయ్య ఆ కథకు పోటీగా ఈవృత్తాంతం చెప్తున్నాడనిపించింది. కాని పైకి ఏమీ అనలేదు. రామచంద్రయ్యకూడా తన కథనం నిలపలేదు. తన దగ్గరకు వాళ్ళు ఎల్లావచ్చేరో, తనొక పాతికరూపాయలిస్తే వందరూపాయలు వసూలు చేయడానికి ఎన్ని కబుర్లు చెప్పేరో వివరించేడు.

"వాళ్ళిక్కడ భాగ్యరెడ్డిఅంటూ ఓ పదుచువాడిని పెట్టేరు. దేవాంతకుడు. తాటాకుల పల్లెలో పోయిందనే భర్మార్‌ను అతడే లాక్కున్నాడని చెప్తారు. పదుచుకారు నందర్నీ కూడగట్టేడు. ఒక్కక్షణం కూర్చోడు. తనతో వున్నవాళ్ళని కూర్చోనివ్వడు. అప్పుడే చుట్టూవున్న వూళ్ళల్లో దళాలు తయారవు తున్నాయి. మీరు చండుబాట ఎక్కేవరకూ నిర్భయంగా నడిచి పోగలరనుకొంటూంటే ఆతడిపేరే చెప్పుకోవాలంటాను. వాళ్ళవద్ద ఒక్కరైఫిల్ లేదు. వున్నవేమన్నా మనకాంగ్రెసువారి వద్దనే వున్నాయి. కాని తీరా పనిలోకి వచ్చేసరికి వాళ్ళభర్మార్లు కనిపిస్తున్నాయి గాని, మన రైఫిళ్ళు కనబడ్డంలేదు."

తాను ఉద్వేగంలో చాలదూరం పోయినట్లనిపించి రామచంద్రయ్య చటుక్కున సర్దుకొన్నాడు.

"కాంగ్రెసుకి ఇప్పుడిప్పుడే బలగం చేరుతూంది. కనక అదో సమస్య కాదనుకోండి."

గోపాలరావు ఏమీ మాట్లాడలేదు. సమయోచితంగా తలవూపి హాఁ. హాఁ. అనడంతప్ప మరేమీ చెప్పలేకపోయేడు. ఈవసూళ్ళు సాగిస్తున్నపద్ధతి సరికాదని తాను ఎరుగును. నిన్న సీతారామారావును చూసేకా, నేడు రామచంద్రయ్యను విన్నాకా ఇంక సందేహం మిగలలేదు. కాని...

వుద్యమానికి కావలసినడబ్బు ఏలాతేవడం ? పదీ పరకాచొప్పున వసూలుచేస్తే ఏమవుతుంది ? డబ్బు వసూళ్ళకే జీవితం సరిపడితే మరి పని జరిగేదెల్లాగ ? పెద్దమొత్తాలు కావాలంటే ఏ బ్యాంకులో, సర్కారు ఖజానాలో దోచుకురావాలి. కాని, అదంత సులభంగా జరిగేపనా ?...

అనేక ఆలోచనలమధ్య కొట్టుకుపోతూ గోపాలరావు నిశ్శబ్దంగా సాగిపోయేడు.

# ఇరవై య్యారో ప్రకరణము.

వెన్నెక్కజొన్న పెరట్లోంచి సాలలోకి సరాసరి అడుగుపెడుతున్న మగణ్ణిచూసి శశిరేఖ నిర్విణ్ణురాలయింది. ముందుకు రావద్దని సంజ్ఞ చేస్తూంటే భాగ్యరెడ్డి చటుక్కున కూర్చున్నాడు. చేతిలోని థర్మార్ సర్దు కొంటూ మునివేళ్ళమీద గోడప్రక్కకు సర్దుకొన్నాడు.

వీధిలోకి పరుగెత్తి తిరిగివచ్చింది శశిరేఖ. ఆమెచేయి వూపుననుస రించి భాగ్యరెడ్డి లేచేడు. అటు ఇటు చూసుకొంటూ వొంగివొంగి ఒక్క ఉరుకులో సాల ప్రవేశించి గదిలో అడుగుపెట్టేడు. అతనిచేయి పట్టుకొని లోనికి లాక్కుంటూ శశిరేఖ తలుపు జేరేసింది.

"ప్రాణాలు ఎగిరిపోయేయి."

పోయిన ప్రాణాలను కౌగిలింతలో భాగ్యరెడ్డి పునరుజ్జీవింపచేసేడు. శశిరేఖ ఆ కౌగిలింతలో ఒదిగి చాలసేపు అలాగే నిలబడిపోయింది. తన గుండెలపై చేర్చిన తలను నిమురుతూ భాగ్యరెడ్డి ఆమెను దగ్గరగా చేర్చు కొన్నాడు.

"ఎందుకంత కంగారుపడ్డావు?"

"మంగపతి ఇప్పుడే కదిలేడు. వాడిని వొదుల్చుకోలేక ప్రాణం ఇడైపోతూంది."

"ఏమంటాడు ?"

ఈమారు శశిరేఖకోపం ప్రకటించింది.

"మదపిచ్చి లంజ......"

కోటమ్మ మగడు మంగపతి గ్రామంలో చేస్తున్న అల్లరి భాగ్య రెడ్డికి తెలుసు. తన భార్య ఇంటికి రావడంలేదని కొన్నాళ్ళు, తన

మాట వినడంలేదని కొన్నాళ్ళు గొడవచేసేడు. ఇప్పుడు ఆమెతో ప్రతి వానికీ ఎంకుకడుతున్నాడు. గ్రామంలో వానిగొడవపట్టి హాస్యాస్పదంగా తయారయింది.

"ఇప్పుడామె కొత్త సరసుడెవరు?"

ఆమె సమాధానం విన్నాక భాగ్యరెడ్డి నవ్వాపట్టలేకపోయేడు. చాలసేపు పక్కలుపట్టుకు నవ్వుతూంటే శశిరేఖ విస్తుబోయిచూస్తూ కూర్చుంది. చివర కామె మందలించకుండా వుండలేకపోయింది.

"ఏమిటా నవ్వు ?"

"పరాయి ఆడది నీతో వుంటూంచనిపించుకో గలిగినందుకేనా ఆ నవ్వు—" అని శశిరేఖ అంటూంటే భాగ్యరెడ్డి అతికష్టంమీద నవ్వునాపు కొన్నాడు.

"ఆ లంజ...క్కి సిగ్గులేమా, ఆ మాట అనడానికేనా ?"

"ఇల్లాంటి మాటలనిపించు కోరాదని సిగ్గు మీకుండాలి."

ఎంతసేపు వాదించుకొన్నా సిగ్గుపడవలసిందిఎవరో ఆ దంపతులు తేల్చుకోలేకపోయేరు. వాడితోనూ, వీడితోనూ పోతూందని యాగీచేస్తే కోటమ్మ ఇంటిపట్టున పడివుంటుందని మంగపతి ఆలోచన. అందుచేత తన పెళ్ళానికి సరసుల్ని అంటగట్టడానికి ఆతడు సిగ్గుపడడంలేదు.

అమీన్ ముకుందరెడ్డి వెనకవుండి వీడిచేత ఈ అల్లరి చేయిస్తు న్నాడు. లేనిపోని యాగీలకు సిగ్గుపడడం, భయపడ్డం అనవసరం అని భాగ్యరెడ్డి.

సిగ్గుపడవలసింది ఎవరో తేలకుండానే శశిరేఖ తనవాదనను ఆపే సింది. రాకరాకవచ్చిన మగడితో వాదంవేసుకోడం బాగులేదనుకొంది.

"ఏమోబాబూ! నేచెప్పలేను. లేనిమాట లనిపించుకొనేటందుకు మీకు భయంలేకపోతే నాకా?" అని చర్చను తుంపేసి లోనికి పరుగెత్తింది.

భాగ్యరెడ్డి వీధిలోకి వెళ్ళడానికి వీలులేకపోవడంచేత గదిలో మంచం వాల్చుకొని పడుకొన్నాడు. క్షణానికోమారువచ్చి శశిరేఖ పలకరించి పక్కలో కూర్చుంటూంది. మళ్ళీ ఏదో పని గుర్తువచ్చి పరుగెత్తుతూంది.

"పాచిపని పూర్తికానేలేదు."

"బర్రెకి నీరు పెట్టాలి."

"పాలుతెస్తా."

ఒక్క క్షణంలో పనిపూర్తిచేసి మళ్ళీ హాజరవుతుంది. రాత్రి నిద్రలేదేమో పడుకోమని పదిమాట్లు చెప్పింది. ప్రతిమారూ తిరిగివచ్చి మరచిపోయిన సంగతేదో అడుగుతూనే వుంది.

శశిరేఖ మహాఆప్యాయంతో భర్తను విడవలేక విడవలేక విడుస్తూంది. వేరేటి కాపురంపెట్టేక ఆమెకు మగడి ముఖం కనబడనేలేదు. ఎప్పుడూ ఓ రాత్రివేళ వస్తున్నాడు. ప్రొద్దున్నే పోతున్నాడు. అతడింట్లో వున్నంతసేపూ దీపం ఆర్పేయవలసివస్తూంది. దంపతుల గదిలో దీపం వుంచి తీరుతారు. చీకట్లో పిల్లలు కడుపునపడితే దొంగలూ, మ్రుచ్చులూ అవుతారని భయం. కాని, ఆ ఆచారాలకూ, భయాలకూ పరిస్థితుల ప్రాబల్యంలో సెలవివ్వవలసివచ్చింది. దీపం వెలుతురు లోపలున్న మనిషిని పట్టిస్తుంది. కనక అతడింట్లో అడుగుపెట్టక పూర్వమే దీపం ఆర్పవలసి వస్తూంది. భర్తను ముట్టుకొంటూంది. మాట్లాడుతూంది. కాని, అతనిని నిన్నాళ్ళూ చూడనేలేకపోయింది.

నేడు తెల్లవారివచ్చేడు. ఆమెకెంతో సంతోషంగావుంది. కాని, రెండోవేపున భయమూవుంది. పోలీసుస్టేషను పూళ్ళోనేవుంది. ఏ అనుమానమేనాతోచి వాళ్ళువచ్చిపడితే. క్షణానికోమారు సంతోషం, భయం, ఉత్సాహం, ఆదుర్దా ఆమె మనస్సుని అల్లుకుపోయి ఉక్కిరిబిక్కిరి చేస్తే

స్తున్నాయి. అల్లావెళ్ళివచ్చి భర్తవద్ద కూర్చుంటుంది. రెండు కబుర్లుచెప్పి పరుగెడుతుంది. నాలుగు చేతమొక్క జొన్నపొత్తులు విరిచి తెచ్చింది. ఇన్ని పచ్చిమిరపకాయలు కోసితెచ్చింది. కబుర్లు చెప్తూనే బాణలిఎక్కించింది. మొక్కజొన్న ఉరుబ్బింది. ఎప్పుడు తయారుచేసిందో, ఎప్పుడు తెచ్చిందోకూడ అర్థంకానంతవేగంగా పళ్ళెం ఆతనిముందు హాజరయింది. ఆవిర్లు ఎగుస్తున్న వడల్ని తింటూంటే సంతృప్తివెలార్చే చూపులతో ఆతని శరీరం నిమిరింది. కొసిరి కొసిరి వడ్డించింది. సమిష్టి కాపురంలో ఇల్లా కూర్చోడానికీ, కబుర్లు చెప్పుకోడానికీ, ఏకాంతంలో తమకు తామే సర్వస్వంగా ఆనందించడానికీ ఎప్పుడూ అవకాశమే చిక్కలేదన్న మాటను పదిమార్లు జ్ఞాపకం చేసింది. ఆ ఆనందాన్ని ఉద్వేలంగా అనుభవించింది.

భాగ్యరెడ్డికీ అనుభవం కొత్త. కొత్త కాపురం పెట్టేక తాను ఇంటికి నాల్గయిదుమార్లు వచ్చేడు. ఇంట్లోవున్న రెండుమూడు ఘంటలూ ప్రతిమారూ భార్యను ఊరడించడంతోనే సరిపోయేది. తాను ఇంట్లో వుండడంలేదని విచారం. రహస్యంగా రావలసి వస్తున్నందుకు విచారం. వచ్చేటప్పుడు ఎవరన్నా చూస్తారేమో, పట్టుకొంటారేమోనని విచారం. విచారపడ్డానికి అనేక కారణాలు. ఆమె నూరుకోబెట్టడానికి సతమతమై పోయేవాడు. ఏడ్చిఏడ్చి తనను కానట్లు నిర్లిప్తంగావున్న భార్యతో కాపురమూ చేసేడు. కాని, అదేదో మొక్కుబడి తీర్చుకొన్నట్లుండేది. ఆమె ఆలింగనంలో ఆవేశంవున్నా తల్లిని కరుచుకొన్న పిల్లలా వుండేది. ఆ ఆలింగనంలో కామంలేదు. అది కామాన్ని కలిగించనూలేదు. భార్యను కలపడానికి భాగ్యరెడ్డి తన యౌవనాన్ని జ్ఞాపకం చేసుకోవలసి వచ్చేది.

ఈనాటి అనుభవం ఆతనికి తన సాంసారిక జీవితంలోనే కొత్త. తన రాక విషయంలో తల్లికూడా ఇంత ఆప్యాయం చూపుతుంది.

కొసిరి కొసిరి తినిపిస్తుంది. కాని తన భార్యచూపే ఆప్యాయం, ఉత్సాహం దానికి భిన్నం. తల్లిచూపిన ప్రేమ తన అల్పత్వాన్ని గుర్తు చేస్తుంది. ఆమె ముందు తా నెప్పుడూ చంటిపిల్లగాడే. ఆమె చూపే వాత్సల్యంలో అతడు మునిగిపోయేవాడు. కాని ఇక్కడ అనుభవంవేరు. శశిరేఖ ఉత్సాహం తనలో ఉత్సాహాన్ని రెచ్చగొడుతూంది. ఇదో ఆనందం, ఇదో అనుభవం.



# ఇరవైఏడో ప్రకరణము.

తన మోకాలిమీదవున్న భార్యచేతిని రెండు చేతుల్లోకి తీసుకొని భాగ్యరెడ్డి ఆమెను దగ్గరకు తీసుకొన్నాడు. సంతృప్తి దీపిస్తున్న ఆమె ముఖంలోకి చూస్తూ బుగ్గలు నిమిరేడు. భార్య ముఖంలోని దీప్తి, ఈ ఏకాంతమూ తనకి కొత్తగా అనిపిస్తున్నాయి. తాను అనుక్షణమూ అక్కడే వుండి ఆ ఆనందాన్ని అనుభవించడం లేదనిపించింది. ఏదో పోగొట్టుకొంటున్నట్లే అనిపించింది. తన రాకకు ఇంత సంతోషపడుతున్న శశిరేఖ తాను లేనప్పుడు ఎలావుంటూందో...

అలవాటయిపోయిందంది ఆమె. వెళ్ళిపోయేక ఒంటరిగా వుండడం అలవాటయిపోయినా భర్త వెళ్ళిపోవలసి వుంటుందనే అభిప్రాయం తోచినప్పుడల్లా ఆమె కళ్ళల్లో ఆకులపాటు కనబడుతూనేవుంది. చివరకు మనసు వుండబట్టలేక అనేసిందికూడా.

"అందరూ వెళ్ళిపోతున్నారు. మనంకూడా పోదాం."

ఆ ప్రయాణం ఎక్కడికో ఎరిగివున్నా భాగ్యరెడ్డి ఎరగనట్లే నటించేడు.

"ఎక్కడికి ?"

"అందరూ వెడుతున్నారు, బెజవాడ."

"వెళ్ళి ?"

దానికి సమాధానం శశిరేఖవద్దలేదు. వెళ్ళి ఏంచెయ్యాలి? ఆమె ఒంటిమీది నగలు రెండు మూడువేలొస్తాయి. వాటిని మార్చుకుతినడం ప్రారంభిస్తే ఎన్నాళ్ళొస్తాయి? మహాఅయితే రెండేళ్ళు. ఇక్కడినుంచి జనం హెచ్చుగా రావటంతోనే బెజవాడలో అన్నీ మహాప్రియం అయిపో తున్నాయట. ఇళ్ళఅద్దెలు పెరిగేయట. వస్తువులధరలు పెంచేసేరట.

భర్తప్రశ్నకి సమాధానం ఇవ్వలేక, శశిరేఖ ఈ మధ్యరోజుల్లో బెజవాడకు కాపురాల నెత్తేస్తున్న వాళ్ళపేర్లనీ తానెరిగినంతవర కిచ్చింది. వాళ్ళంతా పెద్ద ఆస్తిపరులు:

"ముత్యాలరావుగారి పెళ్ళాం పిల్లల ఒంటిమీద ఎన్నెన్ని నగలున్నాయో నీకు తెలుసా ?"

ఒక్కొక్కరి ఒంటిమీదున్న బంగారాన్ని శేర్ల లెక్కలో చెప్పు కొంటున్నారని శశిరేఖ ఎరుగును. వాళ్ళవద్దనున్న రొక్కం, నగలు, ఎక్కడైతే మాత్రం వాళ్ళకేం పోయింది.

శశిరేఖ ఈమారు తమకంటె చాల బీదదశలో బ్రతుకుతూ ఈ అల్లర్లలోంచి బయటపడడానికి బెజవాడ చేరినవాళ్ళ పేర్లుచెప్పింది. వెట్టి వ్యతిరేక ఉద్యమాలు అణచివేయబడ్డాక తెలంగాణా పూళ్ళల్లోంచి చాలామందే పడుచువాళ్ళు యూనియన్ ప్రాంతాలకు వలసపోయేరు. సీతారాంపురం నుంచికూడా ఇద్దరో ముగ్గురో వెళ్ళేరు. శశిరేఖ కురమ రాములిని జ్ఞాపకం చేసింది.

కురమ రాములులా రిక్షా లాక్కుని బ్రతకడానికి శశిరేఖ ఇష్టపడదని భాగ్యరెడ్డికి తెలుసు. ఈ చర్చలన్నీ ఇదివరకే రెండు మూడు మార్లు

జరిగిపోయేయి. రిక్షాలాక్కుని బ్రతకడం తమలాంటివాళ్ళకి హీనం అని శశిరేఖ విశ్వాసం. ఆ విశ్వాసాన్ని వుపయోగించుకొని ఆమెను ఆట పట్టించడానికై భాగ్యరెడ్డి పూనుకొన్నాడు.

"ఔను. రోజుకో రూపాయి దొరుకుతూందట. బాగానే వుంటుంది. ఇక్కడ రెండెడ్లబండి తోలడంలేదా ?"

భర్త తన్ను అపహాస్యం చేస్తున్నాడని శశిరేఖ మొదటనే అర్థం చేసుకొంది. వూరినుంచి లేచిపోవడంవరకే కురమ రాములు ఆదర్శం: చెయ్య మనగా డబ్బులేకపోయినా అక్కడికి వెళ్ళిపోవచ్చుననడానికి ఆమె అతనిపేరు చెప్పింది.

"ఇక్కడ చేసుకొనే వ్యవసాయం అక్కడ చేసుకోలేరా ?"

భాగ్యరెడ్డి నవ్వేడు.

"సర్కారు జిల్లాల్లో మనం వెళ్ళి వ్యవసాయమా ?"

తెలంగాణాలోకన్న కోస్తా జిల్లాలలో వ్యవసాయం బాగా వృద్ధి పొందింది. ఎకరానికి ఇరవయి ముప్పయి బస్తాలుకూడా పండిస్తారట. ఆకుతోటలు, అల్లం, పసుపు, పొగాకు, కాయగూరలు – ఒకటేమిటి? – సెంటు భూమివుంటే ఏదో వుపయోగం చేస్తారని భాగ్యరెడ్డి విన్నాడు. బెజవాడ దగ్గర్లో 10 సెంట్ల భూమివుంటే ఏడాదికి నాలుగు వందలవరకూ అద్దె చెల్లిస్తారని ఎవరో చెప్పినమాట నాతేడు భార్యకు బోధించేడు. వాళ్ళతో తాను పోటీ చేయడానికైనా తనకేంతెలుసు ? ఉన్న రెండువేలూ ఆరిపోడానికి అదోదారి. అంతే.

వ్యవసాయం చేతకాదు. రిక్షాలాక్కు బ్రతకడం నామోషీ. ఏవుద్యోగమున్నా చేసుకొనేందుకు చదువులేదు. మరి ఎవరివద్దనో పాలేరు పనికి కుదరాలి.

శశిరేఖ ఆమాట వినిపించుకోలేదు.

"దగ్గరున్నదాంతో రెండేళ్ళు గడుస్తాయికదా ?"

రెండేళ్ళలో పరిస్థితులు చక్కబడతాయని శశిరేఖనమ్మకం.

"ఎప్పటికీ ఇల్లాగే వుటుందేమిటి ?"

ఇల్లాగే వుండదు; నిజమే. కాని, బాగుపడుతుందనే ఆశేముంది ? తామందరూ వూళ్ళొంచి లేచిపోతే అనసూయమ్మ చల్లగా ఆ ఏభియ్యెకరాలూ తీసుకొంటుంది. మిగిలింది ఉజాడిపడిపోతుంది. వచ్చి ఏంపెట్టుకు తింటారు ? ఇన్నేళ్ళనుంచీ బాగుచేసి ఫలానికి తెచ్చిన భూమిని పోగొట్టుకొనేటందుకేనా ఈ నాలుగైదేళ్ళనుంచీ అనసూయమ్మతో దఫ్తర్‌లో పోరాడుతున్నది ?

శశిరేఖ అనేక వాదనలు తెచ్చింది.

"ప్రాణం వుంటేగదా ఏభూములయినా ?"

"అంతా మనతోటేవుందా? నిజాముతో కత్తికట్టేటందుకు తెలంగాణాలో మరెవ్వరూ లేరా ?"

"ఏడ్చేదాని మగడొస్తే నామగడురాడా ?"

ఈ వాదనలను భాగ్యరెడ్డి అంగీకరించలేదు. ఎవరికివాళ్ళే తలో చెయ్యీవేస్తేతప్ప నిజామును కదపడం మాటలా ? నిజాము సర్కారులో మనం బతకలేము. ఈ రౌడీమూకలముందు మళ్ళీ నిలబడగలమా ? వాళ్ళని తుపాకినెయ్యాలి మనం బతకాలి.

కాని, తుపాకీలు కాల్చుకొన్నప్పుడు రౌడీలే చావరు. మనకీ తగులుతాయంటుంది శశిరేఖ. మళ్ళీ వాదం మొదటికి తెచ్చింది.

"తుపాక్కి దొరక్కుండా పోదామంటావు ?"

పారిపోవడం అర్థంఇచ్చే ఆ వాక్యానికి అంగీకారం తెలపడానికి శశిరేఖమనస్సు ఒప్పలేదు. వూరుకొంది.

# ఇరవై ఎనిమిదో ప్రకరణము.

భాగ్యరెడ్డికి తాను వచ్చినపని ఏమిటో, ఎల్లా చెప్పాలో, అర్థంగాక లట పటా యిస్తున్నాడు. ఒక నిమిషం మంచంమీద పడుకుంటాడు. ఉన్న ట్లుండి లేచి కూర్చుంటాడు. అలాగా ఎంతోసేపుండలేడు. అక్కడనుంచి లేచి గదియంతా కలయతిరుగుతాడు. ఆ గూడు వెతుకుతాడు, ఈ గూడు వెతుకుతాడు; మళ్ళీవచ్చి పడకేస్తాడు. ఓ నిమిషం పోయేక మళ్ళీ ప్రారంభం.

శశిరేఖకు అతని ఆదుర్దా, తటపటాయింపూ అర్థంకాలేదు. ఎంత సేపూ ఏవేవో కబుర్లు చెప్తూంది. కొంతసేపు భాగ్యరెడ్డి పుట్టింటివాళ్ళు తనయెడ యెల్లా వ్యవహరిస్తున్నారో చెప్పింది. భాగ్యరెడ్డి ఆ, అహా హాఁ అనకపోయేసరికి ఓమారు కోప్పడింది.

"మీరు మొదటనుంచీ ఇల్లాగేవున్నారు. పెళ్ళాం వస్తుందనగానే సంబరంకాదు; వాళ్ళకి కావలసిందేమిటో చూడ్డంకూడా—"

భాగ్యరెడ్డి ఆ పరధ్యానంలోనే సమాధానం ఇచ్చేడు.

"అయితే కొత్తకోడలికి ఇంటిల్లిపాదీబరాబరులుచేస్తూ కూర్చోడం తప్ప మరోపని వుండకూడదంటావు."

తన సాధారణమైన మాటకు పెడర్థంతీసినందుకు శశిరేఖకు కోపము వచ్చింది.

"సదే. సంబరం."

భాగ్యరెడ్డి ఆమె ముఖంవంకచూసి పకపక నవ్వేడు. తోడుకోడలి కూతురు ఇదివరకు పిన్నీపిన్నీఅంటూ ఎంతో ఇదిగావుండేది. ఇప్పుడు కబురంపినా రావడంలేదు.

దానికి శశిరేఖచేసిన వ్యాఖ్యానం అతనికి నవ్వుతెప్పించింది.

"ఈ పేరింటి కాపరానికి కారణంనేనని చిన్నపిల్లలకిసహా నేర్పి పెట్టేరు. పిల్లలు సహాకక్ష కట్టేరు."

"మా వొదిన పోవద్దని వుంటుంది. చిన్నపిల్ల దానికేం తెలుస్తుంది. రానంది. ఓహో అనుకొని వూరుకోవాలేగాని......"

"వూరుకోక నేనిప్పుడన్నదేముంది ? మీ వాళ్ళ మనస్సు లెల్లా వున్నాయో చెప్పేను. వాళ్ళెవళ్ళూ రాకపోతే పొద్దుపొడవడం మానడం లేదు." వాళ్ళు ఎల్లా ఎల్లా వస్తున్నారో, వాళ్ళు ఏ విధంగా సాయపడు తున్నారో శశిరేఖ వర్ణిస్తూంటే భాగ్యరెడ్డికి సంతోషమే కలిగింది. తమ యింటికి ఊళ్ళోవాళ్ళు, ముఖ్యంగా చిన్న కులాలవాళ్ళు వచ్చికూర్చుని కబుర్లుచెప్పే అలవాటు తక్కువ. తన తండ్రికది అభ్యంతరం. ఆయనకు కుటుంబమర్యాద నిలబడ్డానికి అలగాజనంతో కలియకుండా మారంగావుండడం అవసరమని అభిప్రాయం. తల్లితోగాని, వదినతోగాని, సాధారణమైన ఇరుగుపొరుగు మర్యాదలు నెరపడానికి వచ్చినవాళ్ళు ఓ నిమిషం ఎక్కువకూర్చున్నా ఒకటికి రెండుమార్లువచ్చినా ఆయన ఎఱ్ఱ బారిచూసేవాడు. అందుచేత మామూలుగా తమ యింటికెవరూ వచ్చేవారు కారు. శశిరేఖకూడా దూరదూరంగానేవుండే స్వభావం. అందుచేతనే ఆతనికీవార్త ఆశ్చర్యమూ, సంతోషమూకూడా కలిగించింది. కాని వాళ్ళు ఏం కబుర్లు చెప్పుకొంటారో అర్ధంకాలేదు. ఒకరి మొఖాలొకరు చూస్తూ కూర్చుంటారా ? మాటామంతీ వుంటుందా ? వుండబట్టలేక అడిగేడు.

"విరాటపర్వం పాటపాడుతూంటే వింటూకూర్చుంటారు. ఈ మధ్య ఇద్దరు పిల్లలు వచ్చిపాట చెప్పుకొంటున్నారు."

మధ్యతరగతి కుటుంబాల స్త్రీలలో చాలామందికిలాగానే శశిరేఖ కూ్కడా పాటలతోనే విద్యాభ్యాసం. కంఠంమంచిదీ. కొద్దిపాటి భాషా

జ్ఞానంకూడా వుందేమో చాల రసవంతంగాపాడగలదు. ఉత్తరగోగ్రహణంకథ పాడుతూంటే తన్మయులై తల్లీ, వదినా, ఇరుగుపొరుగులూ కూర్చుండి పోతూవచ్చిన రోజులు జ్ఞాపకంవచ్చేయి. కొత్తగా కాపురానికి వచ్చిన నాటి కథ అది. ఈ మధ్య తమయింట్లో రోజూ పేచీలతోనే సరి పోతూవచ్చింది. వెనుకటి ఆనందమయ జీవితం మరల ప్రారంభం అయినందుకు సంతోషం కలిగింది.

ఒక్క విషయం తెలుసుకో దలిచేడు.

"రంగయ్య భార్య ఎప్పుడన్నావస్తుందా ?"

ప్లీడరీ చదువుకొన్నవాని భార్యననీ, వకీలు కూతుర్ననీ అతిశయంపోతుందా, సాయిలా ఫాయిలాగా వుంటుందాయనేదాతడు తెలుసుకోగోరేడు. ఆమెకటువంటి గర్వంలేదని తెలుసుకొని సంతోషించేడు.

"ఆమెకు వదినగారంటే మహాఅపేక్ష. ఎందుకో డబ్బురావాలనుకొందిట. మెళ్ళో కాసులపేరు తీసిఇచ్చింది."

భాగ్యరెడ్డికి ఆశ్చర్యం వేసింది. రైఫిల్‌కొనడానికి వెంకటయ్య మూడువేలు తెచ్చియిస్తే ఎక్కడిదాయని తామంతా ఆశ్చర్యపడ్డారు. "ఇల్లా పోగుచేసిందన్నమాట"—అనుకొన్నాడు.

ఆ అవకాశాన్ని వుపయోగించుకొని తానువచ్చిన పని జరుపుకోవాలనుకొన్నాడు. అంత డబ్బు ఎందుక్కావలసి వచ్చిందో చెప్పేడు.

"ఇప్పుడు రుపాకులు కొనడంకోసం డబ్బుకావలసొచ్చింది."

అంతడబ్బు పోగుచెయ్యడం మాటలాయని శశిరేఖ మనస్ఫూర్తిగానే సానుభూతి తెలిపింది.

భాగ్యరెడ్డి అందరితోపాటు ఆమెకూడా ఇవ్వవలసి వుంటుందనేసరికి ససేమిరా సాధ్యం కాదంది. సూరమ్మ తండ్రి వకీలు. సంపాదిస్తున్నాడు.

"పెద్దకాంగ్రెసు నాయకుడు. సత్యాగ్రహం చెయ్యమని జనాన్ని పురెక్కించేడు. తీరా వాళ్ళమీద కేసులొస్తూంటే బాగా డబ్బుపిండుతూనూ వున్నాడు. ఆ సంపాదనంతా ఏంచేస్తాడు? నూరమ్మలా ఇవ్వాలంటే మా నాన్న పోగుచేసుకున్నాక్కొలేదు."

మొదట గోపాలరావు తనవద్దకువచ్చిన సత్యాగ్రహుల్నీ, వారి తరఫున రాయబారం వచ్చినవారినీకూడ కేసులు నడుపుకోవద్దని తిప్పే సేడు. తర్వాత ఛోటేజాన్ చెప్పినమీదట మరల తన మనస్సు మార్చు కొన్నాడు. కాని, ఆ మార్పునెవ్వరూ లెక్కచేయలేదు. ఛోటేజాన్ నచ్చ చెప్పడంతోపాటు మూడువందల రూపాయలిచ్చేడు. అదే అందరికీ కన బడింది. తర్వాతవచ్చిన కేసుల్లో కొందరు డబ్బు ఇచ్చేరు. చాలమంది ఇవ్వలేదు. అయినా గోపాలరావు డబ్బుకోసమే కేసులలో వాదనసాగిస్తు న్నాడని ఓ మాటపడిపోయింది. డబ్బు ఇవ్వరేమోనన్న భయంతోనే మొదట కేసుల్లో వాదనకొప్పుకోలేదని ఊహించేరు. శశిరేఖ ఆవూహల్నీ ఆ మాటల్నే చెప్పింది.

భాగ్యరెడ్డి ఆ అభిప్రాయాన్ని కాదనలేదు. డబ్బుతీసుకొని అయినా కోర్టులో నిలబడేమనిషి దొరికినందుకు సంతోషం కలిగినా మొదట్లోనే ఆ మాట చెప్పకపోవడమేమని ఆతని మనస్సులోవుంది. ఇంకా చాల మంది మనస్సులోవుంది.

అయితే దానికీ దీనికీ సంబంధం ఏమిటి? తండ్రి సంపాదిస్తూంటే కూతురు పంచిపెట్టాలనుందా? ఆమె పంచిపెడితే తండ్రి తిరిగి ఇస్తాడ నుందా? పని అవసరం అని తోచినప్పుడు వుందా, లేదా చూసుకోరు. ఏముంటే అది ఖర్చుచేస్తారు. ఆ అవసరం తీరేకనే మిగిలినవి. ఈ పూళ్ళోంచి బెజవాడవెడితే మార్చుకుతినడానికి ముక్కుపుల్లసహా ఇచ్చే స్తానని తాననలేదా?

శశిరేఖ ఆ వాదనకు అంగీకరించలేదు. బెజవాడలో వుండవానికి ఖర్చుచేయడమూ, ఇల్లా పంచిపెట్టడమూ వేరంది.

ఇట్లాంటి వాటిల్లో డబ్బు నలుగురూ ఇస్తారనే నమ్మకం ఆమెకు లేదు. తా మిచ్చేదేదో అంతేగాని పైగా ఏగాణీ చేరదని ఆమె అభిప్రాయం.

ఇంతవరకు అవుతున్న ఖర్చులకు మనం ఎంత ఇచ్చేమో చెప్ప మన్నాడు భాగ్యరెడ్డి.

దళాలకు కావలసిన ఆయుధాలు కత్తులూ-బరిసెలూ అయిలే మాత్రం ఊరికే అవుతుందా ? ఇనుముకివ్వాలి. చేసిన కమ్మరికివ్వాలి. వాటిని వూళ్ళల్లో అందించాలి.

ఫర్మాక్లకి నల్లమందూ గోలీలూ వూరికే వస్తున్నాయా ? దళాలలో చేరినవాళ్ళకి అందరికీ కాకపోయినా కొందరికేనా ఇళ్ళ గడుపు కొనేటందుకు పావలో, అర్ధో ఇవ్వాలి.

వీటన్నింటికీ ఏలాగు సర్దుబాటవుతూందో...

ఆ విషయంలో శశిరేఖకు కొన్ని నిశ్చితమైన అభిప్రాయాలున్నాయి. ఇల్లాంటి ఊరుమ్మడిపనుల్లో ఏగాని ఎవరూ ఇవ్వరనీ, ఆమరద పట్టించు కొన్నవాళ్ళు తమ మొలనున్నడబ్బు వదలించుకొంటారనీ ఆమె అంటుంది. గతంలో తన మగడు అప్పుడూ, అప్పుడూ తన చేతిలోని ఏభయి-అరవై రూపాయలు ఖర్చుచేసేడు. అందులో ఒక్కటీ తిరిగి తేలేదు. దళంలో చేరినవారంతా డబ్బు తెచ్చివుంటే భాగ్యరెడ్డి ఒక్కడూ అంతడబ్బు ఎందుకు ఖర్చు చేయవలసి వస్తుంది?

ఈమాటనే ఆమె ఎన్నోమార్లు అంది. ఇప్పుడూ అంది. వెనక టల్లేనే భాగ్యరెడ్డి దానికి ప్రత్యాఖ్యానం చేసేడు. కాని, ఫలితం అంతే. అతనికి ఏమనాలో తెలియలేదు.

భార్యాభర్త లిద్దరూ చాలసేపు మౌనంగావున్నారు. చివరకాతడే ఆ మౌనాన్ని భంగపరచేడు.

"మనుష్యుల ప్రాణాలకన్న నగలు ఎక్కువవా ?"

శశిరేఖ సమాధానం ఇచ్చేలోపుగనే వీధిలో మనిషి అలికిడై శశిరేఖ పరుగెత్తింది. కొంతసేపు వాగ్ఘర్షణ జరిగింది.

ఎంతసేపూ శశిరేఖ దబాయింపే వినిపిస్తూంది. అవతలిమనిషి గొంతుక వినరావడంలేదు. భాగ్యరెడ్డికి ఆవలివారెవరో తెలియటేదు. తన కోసం వచ్చేడా ? ఒక వ్యక్తికోసం తానక్కడికి వచ్చేడు. కాని, ఆమాటను భార్యతో చెప్పడం మరిచేడు. ఇప్పుడీమె గొడవచేస్తూంది. నిష్కారణం గొడవ చేసుకొన్నట్లవుతుందే !...భార్యను పిలవడం ఎల్లాగో తెలియ రాలేదు. బయటవున్న మనిషి తా ననుకొన్నవాడు కాక, మరొకడైతే తన పిలుపు ప్రమాదం తెచ్చిపెడుతుంది.

కాని మరుక్షణంలో ఆతడి అనుమానం తీరింది. తాననుకొన్న మనిషి కాకపోయినా వచ్చినవానిని అనుమానించ నక్కర్లేదు. సత్తెమ్మ బోళ్ళపాలంలోకి రాకపూర్వంనుంచీ నూజివీడు సరయ్యను తామంతా ఎరుగుదురు. ఆపొలంలో చేరేక ఆతడు మరింత బాగా పరిచయం అయ్యేడు. గుమ్మంలో ఆతని మొగం కనపడింది.

సరయ్య లోపలికిపస్తూ, శశిరేఖ జాగ్రత్తనూ, పట్టుదలనూ ప్రశం సించేడు.

"మీ రిక్కడున్నట్లు తెలియనోణ్ణయితే ఆమెమాటల కల్లాగే పోయుండేవాడిని."

తర్వాత సరయ్య రెండుమాటలు నెమ్మదిగా భాగ్యరెడ్డికి మాత్రమే వినబడేలాగ చెప్పేడు. అది వినగానే ఆతని ముఖం వెల వెల బోవడం చూసి శశిరేఖకూడా అదుర్దా తెలిసింది.

"ఏమయింది."

చాల సేపటివరకూ భాగ్యరెడ్డి తేరుకోలేదు. సరయ్యా తనకు తెలిసినది చెప్పనూలేదు. శశిరేఖ వూరుకోలేదు.

"ఏమయింది ? పోలీసాళ్ళుగాని వస్తున్నారా ?"

తనకు వస్తున్నభయం ఏమీలేదనీ, జరిగిన ప్రమాదంమరోవూళ్ళోననీ భాగ్యరెడ్డి ఆమెకు ధైర్య చెప్పేడు.

"ప్రొద్దుటే మద్దికుంటమీద రజాకార్లు పడ్డారట."

"మనవాళ్ళెవరన్నా దొరికేరా ?"

భాగ్యరెడ్డి ఆప్రశ్నకు సరాసరి సమాధానం ఇవ్వలేదు.

"ఊరందర్నీ దొడ్డినేసేరట."

ఆమాట చెప్పేక భాగ్యరెడ్డి తాను రహస్యంగా వుంచుతున్న మాటలు మరిచేడు.

"దొరికినవాళ్ళల్లో చెన్నయ్యా వున్నట్లు చెప్పేడా ?"

"అతడు చూడలేదు. కాని బయట పడినవాళ్ళ అనుమానం అదే. తప్పుకొని వచ్చినవాళ్ళెవరూ ఆయన్ను చూడలేదు."

భాగ్యరెడి చాల విచారంతో కూర్చుండిపోయేడు. ఒక్కక్షణం వూరుకుండి మళ్ళీ ప్రశ్నించేడు.

"వచ్చినతడింకేమి చెప్పలేదూ ?"

సరయ్యా తలతిప్పేడు.

"ఓమ్మల్ని కలుసుకోవాలన్నాడు."

"పేరేమిటన్నాడు ?"

"మట్టయ్య."

మరల ఒక్కక్షణం అందరూ వూరుకున్నారు. సరయ్యాప్రశ్నించేడు.

"బందూకులు బేరంతెచ్చింది ఆయనేనా ?"

భాగ్యరెడ్డి నిరసనగా ముఖంవంక చూస్తూంటే సరయ్య క్షమార్పణ చెప్పుకొన్నాడు;

"ఆనుర్దాలో ఏదో వాగేసేను."

భాగ్యరెడ్డిగొంతులో విసువు ప్రతిధ్వనించింది.

"ఈ వాగుడే కొంపముంచేది."

మరల అందరూ ఒక్కక్షణం వూరుకొన్నారు. కొంతసేపున్నాక భాగ్యరెడ్డి మళ్ళీ ప్రారంభించేడు:

"నీలాంటి ఆదుర్దా ఎందరికి పుట్టిందో, అదెంతవరకు వెళ్ళిందో ఇప్పటికి తెలియడంలేదు. చాలమారమే వెళ్ళివుంటే చెన్నయ్య ప్రాణం దక్కదు."

భాగ్యరెడ్డి కనుకొలకుల్లో రెండు నీటిచుక్కలు మిల మిల లాడేయి.

---

## ఇరవైతొమ్మిదో ప్రకరణము.

గోపాలరావును కోర్టువద్దనే ఖతం చెయ్యడానికి ప్రయత్నించేరన్నవార్త విని వెంకయ్య సంతోషపడ్డాడు. ఆయన తప్పించుకు పోయేడని తెలిసినప్పుడు ఆయనకు విచారమేకలిగింది. పదేళ్ళపాటు గొండ్లభూమి తన చేత చిక్కకుండా నానాతిప్పలూ పెట్టేడు. ఆ కక్షను ఆయన మరిచి పోలేడు.

ఆ గోపాలరావును తప్పించినది తమ వూరివాళ్ళేనని విన్నప్పుడు ఆయన ముఖం మరింత వికసించింది. అంతమంచిపని తమవూరువాళ్ళు చేసేరనే గర్వంతో కలిగిన సంతోషం కాదది. వాళ్ళు అలాచెయ్యడం

తాను కసితీర్చుకొనేటందుకు దారిదొరికిందని ఆయన సంతోషం. గొండ్లు కోర్టుల్లో పేచీలు నడిపినంతకాలమూ, సాక్ష్యాలూ, సంపన్నాలూ రూపంలో వాళ్ళకి తోడ్పడిందొకయెత్తూ, ఈ ఏడాదీ, ఆరునెలల్లో వాళ్ళకిచ్చినపత్రాసు ఒక యెత్తూనూ.

పట్వారీ జగన్నాధరావుకు ఏర్కొలు ఎడ్లజతా, మంచి కచ్చడం బండీ, పాడి గొడ్డూ, ఐదువందల కరుకులూ ఇచ్చుకొని అతనిని తిప్పేసుకొన్నాడు. ఇంక గొండ్లకి ఆసరాలేకపోయింది. కోర్టులవెంట తిరగలేకా, డబ్బుఖర్చుపెట్టుకోలేకా గొండ్లు ఆ భూమిమీద ఆశలు వదిలేసుకొన్నారు. ఆ ఏడాది తానే పిత్తనాలు వేయడానికి అన్నీసిద్ధం చేసుకొన్నాడు. అరకలు కట్టించేడు కూడా. ఇంతలో చెన్నయ్య గిజిగాడల్లే వచ్చిపడ్డాడు.

"దొరికేవురా"_ అనుకొని వెంకయ్య సంతోషం పట్టలేక చేయి దులిపేడు.

ఆంధ్రమహాసభ గొడవల్లోపడి చదువూ, సంధ్యామానుకొని ఆగమ్మ కాకిలా తిరుగుతున్నాడని జాలిపడి సాయంచేస్తే పనకే ఎసరు పెట్టేడేయని ఎంతో అక్కసుగావుంది. జ్ఞాతివాడికూతురు గోదుచూడలేక చెప్పి మామగారిచేత ఓ పాతికెకరాలభూమి ఇప్పించేడు. ఇల్లరికం వుండడానికి మొరాయిస్తే తనకు చేతనైనంతలో అప్పూ సప్పూ ఇప్పించి ఇల్లేసుకొనేటందుకు సాయంచేసేడు. వ్యవసాయం వచ్చచెప్పమని మామగారితో సిఫారసుచేసి ఇప్పించేడు. ఇంతసాయంచేసినందుకు పీసం అంతేనా విశ్వాసంచూపేడా? వూళ్ళోకివచ్చిన మరునాడే మేకుఅయి కూర్చున్నాడు. గొండ్లని పోగుచేసేడు. సంగం పెట్టించేడు. భూమిఖర్జా వదలవద్దన్నాడు. తాను దున్నించినచేలో వాళ్ళచేత విత్తనాలు చల్లించేడు. ఆ కథలన్నీ జ్ఞాపకం వచ్చేయి. ఒక్కమారు గుండెలు కొట్టుకొన్నాయి.

"హాయ్‌రే! నమక్ హరామ్"

మరోరోజు మరోనాడు అయితే పోలీసుల్ని పిలిచి ఓ తడి తగిలింపించేవాడు. ఓ పాతిక కేసులుపెట్టి ఉక్కిరిబిక్కిరి చేయడానికి తల పెట్టేవాడు.

కాని....రోజులుమారేయి. గ్రామాలన్నింటా సంఘాలు, రెండో మూల కాంగ్రెసువాళ్ళ సత్యాగ్రహాలు, మధ్యన తమ విషయం కనుక్కొనేటందుకు నిజాం సర్కారుకు అవకాశమే చిక్కడం లేదు. పోలీసులు చాలలేదు. చివరకు రజాకార్ల బలగం కూడా చాలడం లేదు. వెంకయ్యకు నిజంగా దుఃఖం కలిగింది. కాని, లాభం ఏమిటి ?

సంగం వచ్చేక గొండ్లకి కొమ్ములు మొలిచే యనిపించింది. గతములో తాను వాళ్ళమీదపెట్టిన కేసుల్లో కోర్టుకువచ్చేటప్పుడు వాళ్ళచేతనే అధికార్లకి తాను పంపే నజరానాలు మోయించి పట్టించుకెళ్ళేవాడు. కోర్టులంట తిప్పి ఏడిపిస్తున్నాడన్న అక్కసు మనస్సులోవున్నా తాను చెప్పిన పనిచెయ్యననడానికి వాళ్ళకి దమ్ములుండేవికావు. మనస్సులో కోపం వుండదూ ? వుంటుంది. కాని పైకి అనవల్లనా ?

కాని చెన్నయ్య రాకతో అంతా తల్లక్రిందులయింది. సంగం రాకతో అంతా ఎదురు తిరిగేరు. ఈమారైనా వాళ్ళు పనిచెయ్యము అనడంలేదు. ఏమిస్తావని కూర్చుంటున్నారు. మొన్నటికిమొన్న కూతుర్ని తీసుకురావడానికి వెడుతున్న కొడుకుతో మనిషికావలసొస్తే, రోజుకు రూపాయిస్తేగాని పోనన్నాడు మడేలు. వాళ్ళబాబులనాడు ఎరుగునా ? ఓ అర్ధశేరు జొన్నలిస్తే ఇంత సంకటి వొండించుకు పట్టుకెళ్ళేవాడు. మూడు ఆమడలున్నా, నాలుగామడలున్నా అల్లాగే బండిముందు నడిచేవాడు. అక్కడ వాళ్ళింత కూడుపెడితే తిని మళ్ళీ తిరిగివచ్చేవాడు. అల్లాంటివాడికి కూలి కావలసివచ్చింది. మేనాకూడా అడిగేడుకాదు. చివరకు కొడుకునొక్కడినే పంపించుకోవలసివచ్చింది. కూడా ఎవరూ రాలేదాయని

కూతురు మామగారు అడిగారని విన్నప్పుడు తనకే ఎంతో చిన్నతనం వేసింది. కొడుకెంత సిగ్గుపడ్డాడో...

చెన్నయ్యచేసిన వుపకారం ఇది. ఒక్క మనిషి మాటకు పల క్కుండా చేసేడు. ప్రతి చిన్నపనికీ, వాళ్ళడిగినట్లు కూలిస్తూపోతే సంసా రాలునిలుస్తాయా ?...జనం తెనుగుమీరిపోయేరు. సమయంరాదా ? ఈ ముల్లుని తీసెయ్యలేమా యని కూర్చున్నాడు. ఇప్పుడా సమయం వచ్చి నట్లనిపించింది.

వెంటనే లేచేడు. లేడికి లేచిందే ప్రయాణం. రెండో కంటివాడికి తెలియకుండా ఖాజీని కలుసుకొన్నాడు.



## ము ప్ఫై యో్య ప్ర క ర ణ ము.

మూడో రోజు తెల్లవారగట్ల ఉన్నట్లుండి ఒక పెద్ద రజాకార్ల మూక మద్దికుంటను చుట్టుముట్టి నిలబడింది. పొలాలకు వెడుతున్న వాళ్ళనూ, పుంతలోకి వచ్చినవాళ్ళనూ ఎక్కడకక్కడే ఆపేసేరు. తెల్లవారేసరికి ఇళ్ళళ్లోంచి జనాన్ని తోలుకొచ్చేరు. ఆడ, మగ, పిల్ల, పెద్ద అనకుండా అందర్నీ వూరిమధ్యనున్న ఖాళీజాగాలోకి చేర్చేరు.

ఈ ప్రమాదం తమకు కూడా ఎక్కడ చుట్టుకొంటుందో అని ఖాళీజాగాకు ప్రక్కనేవున్న వెంకయ్య ఇంటి తలుపులు మూసేసు కొన్నాయి.

జనాన్ని ఒక చోటికి చేర్చేక రజాకారు దళనాయకుడు బుడన్ ముందుకు వచ్చేడు. కాళ్ళు ఎడంగా నిగడతన్ని నిల్చున్నాడు. నడుమున చేతులు పెట్టుకొని, తీవిగా జనాన్ని ఆ మూలనుంచి ఈ మూలకు పరిశీ లించి చూసేడు. బిగించిన పళ్ళమధ్యనుంచి మొదటి ప్రశ్న విసిరేడు...

"చెన్నయ్యా ఎవరు ?"

ఆ ప్రశ్నరాంగనే ఈ దాడికి కారణం అందరికీ అర్థం అయింది. వారం క్రితం కోర్టువద్ద గోపాలరావును ఖతంచేయవచ్చినదీ బుడనే. వాడే ఇప్పుడు చెన్నయ్యకోసం వెతుకుతున్నాడంటే కారణం తెలుస్తూనే వుంది. అయితే ఆ రోజున గోపాలరావును ఊరుబయటకు దాటించిన దొక్క చెన్నయ్యేనా ? మరో పదిమందికూడా వున్నారు. అందర్నీ చుట్ట పెట్టి పట్టుకొంటారేమో. పట్టుకొని ఏంచేస్తారో ? కొడతారా ? జైళ్ళల్లో వేస్తారా ? చంపుతారేమోనన్న భయం ఓ వేపున లేకపోలేదు. కేసుల్లో వాదిస్తున్నాడన్న మాత్రాన గోపాలరావునే చంపసిద్ధం అయినవాళ్ళు ఏమన్నా చెయ్యొచ్చు. కాని, మరోధైర్యం, ఆ నాటివరకు రజాకార్లు హింసలు పెడుతున్నారేగాని, మనుష్యుల్ని వెతికి చంపడం జరగడం లేదు. కాని...

అయినా, అదివరకే గ్రామంలో అందరూ కూడబలుక్కొని వున్నారు. గోపాలరావును తప్పించింది తామేనని ఎక్కడాచెప్పుకోవద్దని చెన్నయ్య మొదటనే కట్టడిచేసేడు. కాని ఆగలేరు. కనీసం ఆ రోజున బళ్ళలోవున్న వారిపేర్లన్నా దాచేటట్లు చేద్దామనుకొన్నాడు. అదీ విఫలం అయింది. తాను చేసిందేదో చెప్పుకోకుండా వుండగలశక్తి మనుష్యుడిలో చాల తక్కువ. చేసినపనినికూడా జరిగింది జరిగినట్లుగా మనుష్యుడు చూడలేడు. తనను కేంద్రంచేసుకొని చూస్తాడు. తను అనుకొన్న ప్రకారంగా జరుగుతున్నట్లే భావిస్తాడు. మనుష్యునిలోవున్న ఈ సహజ స్వభావ ఫలితంగా ఆ రోజు నెక్కడో రోడ్డుమీద రజాకారును హడలకొట్టిన వృవంతం చిలవలు పలవలుగా గ్రామంలో ప్రచారం అయిపోయింది.

చెన్నయ్య మరల ఇంకోపద్ధతి సూచించేడు. ఎవరన్నావచ్చి ఫలానా మనిషి ఎక్కడున్నాడని అడిగితే, ఆ సమయంలో ఆమనిషి

లేన ప్రక్కనేవున్నాసరే చెప్పవద్దన్నాడు. కొద్దిమంది సహచరులకే ఈబోధలు జరిగినా అవికూడా వూరంతా పాకకపోనలేదు.

ఏపోలీసులోవచ్చి అరెస్టుచేసి పట్టుకుపోతారనీ, వాళ్ళకి దొరక కుండా లేను వాళ్ళని కాపాడుకోవాలనే ఆలోచనలే ఈ ఏర్పాట్లకు మూలం. కాని, ఇప్పటివరసేం బాగున్నట్లనిపించలేదు. రజాకార్లలో సగం మంది దగ్గర పాతవో, కొత్తవో తుపాకులున్నాయి. అరచేతివెడల్పు పట్టాకత్తులతో అరబ్బీవాళ్ళు చూస్తేనే భయంకలిగిస్తున్నారు. అరబ్బు రోహిల్లా బందిపోట్లనుగురించీ, ధగ్గుల్నిగురించీ తమ తాతలు చెప్తూ వచ్చిన కథల్ని ఈ అరబ్బువాళ్ళు జ్ఞాపకంచేస్తున్నారు. ఈ రాక్షసిమూక నాయకుడు బుడన్‌ను గురించి వాళ్ళంతా ఎరుగుదురు. వాడో ప్రసిద్ధ హంతకుడు. ఇప్పటికప్పుడే ఏమీ ఎరగని వాళ్ళనిద్దర్ని చంపేడు. చేతిలో గ్రైడర్ మరతుపాకీ, మిసమిసలాడుతూంది. ముఖంలో క్రౌర్యం మూర్తీభ వించివుంది. వాళ్ళనందర్నీ చూస్తూంటే తమచేతిలోంచి గోపాలరావు తప్పిపోయేడనే కసి ఇక్కడే చూపించేలా వున్నారు అనిపించింది.

ఆ మనుష్యుల్నీ, బుడన్‌నోట చెన్నయ్యని గురించిన ప్రశ్ననీ విన్నాక గ్రామస్థులెవ్వరికీ చెన్నయ్యముఖం గుర్తురాలేదు. ఆ రోజున ఆయనతో బళ్ళుకట్టినవాళ్ళ పేర్లుకూడా ఎవరికీ గుర్తురాకుండా పోయేయి.

ఇంక ప్రారంభమయింది, హింసాకాండ. ఎవ్వరూ మాట్లాడ లేదని ఓవరస అందరినీ పడబాదేరు. ఇంక ప్రశ్నలు ప్రారంభించేరు. గుక్క తిప్పుకోకుండా ప్రశ్నలువేసేరు. తడుముకోకుండా వాటికి సమా ధానాలు తామే ఇచ్చుకొన్నారు.

"చెన్నయ్య ఆరోజున బళ్ళుకట్టిన వాళ్ళల్లో వున్నాడా ? లేడా ?"

... ... ...

"మీరు దాస్తే దాగుతుందను కొన్నారేమో తెల్లగిత్తలబండీ వాడిదే నని మాకు తెలీదనుకొన్నారా ?"

దానికీ సమాధానంలేదు. ఔను, లేదు. కాదు, లేదు. బుడన్‌కు ఆగ్రహం ఆగింపకాదు. ఓ అరడజనుమందిని వేసినప్రశ్నే వేసి వేసి అంకెళ్ళు నొప్పిపుట్టేయి. వాళ్ళు సమాధానం ఇవ్వనందుకు కొట్టించేడు. ఇంక సమాధానం కోరకుండానే బాధించేడు.

రెండోవరస దెబ్బలతో చాలమంది శరీరాలు కదుములు కట్టిపోయేయి. స్పర్శజ్ఞానం తగ్గింది. రక్తాలు కారుతున్నా గాయాలుకూడా సలుపు అనిపించడంలేదు. కర్రదెబ్బలు తగులుతున్నది ఎవరికో సనిపిస్తూంది.

ప్రజలమీద సాగుతున్న ఈ హింసాకాండ చూస్తూ వెంకయ్య ఇంట్లో కూర్చోలేకపోయేడు. గబ గబ తలుపులు తీసుకొని పరుగెత్తి వచ్చేడు. గిడ గిడ లాడేడు. తమ వూరివాళ్ళు దేశం అంతా అంత గందరగోళంగా వున్నస్థితిలోకూడా లెవీధాన్యం తోలిపెట్టినసంగతిని వారి ప్రభుభక్తికి వుదాహరణగా చెప్పేడు. అటువంటి వాళ్ళని కొట్టడం ...

బుడన్ చటుక్కున ప్రశ్న వేసేడు.

"లెవీధాన్యం తోలుకెళ్ళిన వారెవరు ?"

వెంకయ్య ఒక్కక్షణం తటపటాయించినట్లు జనంముఖంచూసేడు. అంతా ప్రాణాలు బిగపట్టుకొని వున్నారు. వెంకయ్య అందర్నీ చూపించ గలడు. గతంలో ఆతనిచరిత్ర నెరిగినవారెవ్వరికీ ఆతడీమారు కసి తీర్చుకోకుండా వూరుకుంటా డనిపించలేదు. కాని వారి భయాలు అకారణం అనిపించింది. వెంకయ్య ఏమీ చెప్పలేదు. ఎవరెవరు వెళ్ళిందీ ఆతడు చూడలేదు.

"చెన్నయ్య వెళ్ళేడా ?"

"తెలియదు."

"చెన్నయ్య ఇక్కడున్నాడా ?"

అడిగిన ప్రశ్నకు సమాధానం రాలేదనే మాటకూడా తోచకుండా వెంకయ్య కబుర్లు ప్రారంభించేడు. ఎండ చురుకుగా వున్నందుకు సంతాపం తెలిపేడు. తెల్లవారింది మొదలు నాస్తాయేనా లేకుండా అలా హజ్రత్ సేవలో వారు పడుతున్న శ్రమకు సానుభూతి తెలిపేడు.

వెంకయ్యధోరణి బుడన్‌కి అర్థంకాలేదు. తనను రమ్మని పదే పదే ప్రార్థించిన మనిషి ఇల్లా వ్యవహరించడం కోపం కలిగించింది. కాని, ఇంటికి వచ్చేసేటప్పుడు తన చేతిలో పేదుగా ఓ పది రూపాయల నోటు పెట్టినవిషయం గుర్తుచేసుకొని ఓర్పు వహించేడు. ఏమీ అనలేదు.

తమమీద కక్షవహిస్తాడనుకొన్న వెంకయ్య బుడన్‌ను మరిపించడానికీ, తమనుంచి దృష్టి తప్పించడానికీ ప్రయత్నిస్తూండడం గమనించి ఊరివాళ్ళంతా కొండెక్కారు. ఎవరికి వారే తామున్న చోటినుంచే వంగి దండాలు పెడుతూ వినతులు చేస్తున్నారు.

"మాకేం తెలీదుదొరా!"

"మమ్మల్నిడిపించు పదేలా!"

ప్రార్థనలు కొన్నింటికి వెంకయ్య తిరిగి చూసి సంజ్ఞలుచేస్తున్నాడు. కొన్నింటిని విననట్లూరుకొంటున్నాడు. కాని బుడన్‌తో కబుర్లు చెప్తూనే వున్నాడు.

కబుర్లు చెప్తుండగానే ఇట్లోంచి పిలుపువచ్చింది. దాని వెనకనే కళాయిలో ఉపాహారం తీసుకొని కొడుకు హాజరయ్యేడు. వెంకయ్య తన పెద్దరికంకూడా ప్రక్కనపెట్టి రజాకార్ల నాయకుడికో ప్లేటు అందించేడు. అతని ప్రక్కనే నిలబడి మారుపెట్టేడు. 'చా' రావడం ఆలస్యం అయ్యేసరికి రంకెలేస్తూ లోనికి పరుగెత్తి స్వయంగా కటోరాతో తీసుకు వచ్చేడు.

కడుపులో ఇంతతిండి పడ్డాక బుడన్ శాంతించేడు. వెంకయ్యగారి ముఖంచూసి, మిమ్మల్ని బాధకుండా వదలుతున్నానన్నాడు; జనం సంతోషపడ్డారు. ఎవరికివారే ఇళ్ళకి పోడానికి పై గుడ్డలు మలుపుతున్నారు.

కాని, వెనకనుంచి బుడన్ రాక్షసిగొంతు పళ్ళీ వినబడింది. నిలబడి పోయేరు,

"కహాఁ జాతేరే?"

బుడన్ ఒక ప్రతిపాదన చేసేడు.

ఆరోజున రెవీధాన్యం తోలుకెళ్ళిన చెన్నయ్య వగైరాలు ముందుకు వస్తే మిగిలిన వాళ్ళందర్నీ పోనిస్తాడు.

ఎవ్వరూ కదలలేదు. మాట్లాడనూలేదు.

బుడన్ ముఖంనుంచి నవ్వు మాయంఅయింది. దానికితోడు "చా" లో చక్కెర లేకపోవడం చిరాకుపుట్టించింది. ఒక్కరంకె. ప్యాలా నేలబెట్టి కొట్టేడు. వెంకయ్య తనవాళ్ళు 'చా' లో పంచదార వేయడం మరచినందుకు క్షమార్పణ చెప్పుకుంటూ గున గున ఇంట్లోకి పరుగెత్తేడు.

బుడన్ తాను కూర్చున్న కుర్చీనుంచిలేచి నాలుగడుగులు ముందుకు వేసేడు.

చెన్నయ్యా, మిగిలినవాళ్ళూ ముందుకు రాకపోతే...బుడన్ పంక నున్న గైడర్ ఎత్తేడు.

ఒకమారు గర్జించేడు.

"చెన్నయ్య ఎవరు?"

వూరు చివరవున్న గుట్టల్లోంచి "ఎవరు?" అని ప్రతిధ్వని వినబడింది. అది మినహా మరో సమాధానమేలేదు.

దోసిట్లో పంచదారపొట్లం పట్టుకొని వెంకయ్య పరుగెత్తివచ్చేడు. తిపాయిమీద దానిని విప్పిపెట్టి ఎగిరిపోకుండా ఒక ప్రక్కన ప్యాలా పరొకటి పెట్టేడు.

జనానికి ఆలోచించుకొనేటందుకు వ్యవధినిస్తూ బుడన్ తిరిగివెళ్ళి కుర్చీలో కూర్చున్నాడు. తదేకదృష్టితో చాలా పంచదార కలుపుకుంటూ మద్దికుంటవాళ్ళు వట్టి బద్మాషులనే అభిప్రాయం తెలియపరిచేడు.

వాళ్ళంతా అమాయికులనీ, సర్కారంటే భయభక్తులు గలవారనీ ప్రత్యాఖ్యానం చేసేడు.

ఖాళీచేసిన కప్పును ప్రక్కన పెడుతూ బుడన్ లేచేడు. తనను దేవకూఫ్ క్రింద జమకట్టవద్దన్నాడు. పిల్లిలా వెంకయ్య ప్రక్కకి సద్దుకున్నాడు.

బుడన్ ముందుకు వచ్చేడు.

"చెన్నయ్య కోన్ ?"

సమాధానంలేదు.

తాను మేపిన టిఫినూ, త్రాపిన చా వ్యర్థమేనా అన్నట్లు వెంకయ్య జాలిగా ప్రజలవంక చూసేడు.

బుడన్ ప్రశ్న ఒక్క చెన్నయ్య కోసమేకాదు.

హనుమంతు ఎవరు ?

శీతారామయ్య ఎవరు ?

ఇంతవరకు చెన్నయ్య పేరుతప్ప బుడన్‌కు మరేవీ తెలియవనే ధైర్యంతో ప్రజలున్నారు. కాని, ఇప్పుడు మరో రెండుపేర్లు వినబడ్డంతో విస్తుపోయేరు. పైగా శీతారామయ్య లెవీధాన్యం తోలుకు వెళ్ళినవాళ్ళల్లో లేడు. అయినా అతనిపేరు బుడన్‌కు ఎందుకు జ్ఞాపకం వచ్చింది. అతను సంగం కార్యకర్త కనకనా ? అయితే బుడన్‌కు కావలసింది లెవి

తోలుకువెళ్ళినవాళ్ళా ? సంగంవాళ్ళా ? ఇద్దరూనా ? ఇంకా మరెవరు కావాలో ? ఇంతవరకు తాము ఎవ్వరినీ చూపకపోవడమే మేలయింది...

ఒక్కరూ సమాధానం ఇవ్వకపోయినా బుడన్ సంతృప్తి, హేళనా దీపించే విషపునవ్వు ఒకటి నవ్వేడు. నాటకరంగంమీది వేషధారిలా రెండడుగులు ముందుకు వేసేడు.

"బోల్తే నహీఁ"

ఈమారూ సమాధానంలేదు. బుడన్ కోరుతున్నది తమ వూరి బిడ్డల్ని, తమ నాయకుల్ని. అజాగ్రత్తలో పట్టుబడిపోయేరేగాని...ఎన్ని బాధలు పడవలసి వస్తేమాత్రం...వాళ్ళని ఈ యముడికి వప్పచెప్తారా ? తమకు వ్యతిరేకంగా వుంటాడనుకొన్న వెంకయ్యే మాట తప్పిస్తూంటే ...తామేనా చెప్పడం ?...

బుడన్ ఇద్దరు అరబ్బువాళ్ళని జనం మధ్యకు పంపేడు. తాను గైడర్ చేతికి తెచ్చుకొన్నాడు.

"అదిగో, చెవినికాడ, గళ్ళ మొలగుడ్డ, భుజాన కంబళీ ... వాడిని లాక్కురా."

ఆ వర్ణన వింటూంటే గ్రామస్థు లందరికళ్ళూ అప్రయత్నంగా చెన్నయ్య వున్న వేపు తిరిగేయి. బుడన్ అపహాస్యంచేస్తూ నవ్వుతూంటే మళ్ళీ అప్రయత్నంగానే అందరికళ్ళూ వానిమీదికి తిరిగేయి.

"వేషం మారుస్తే నా కళ్ళు కప్పొచ్చు ననుకొన్నావేరా ?"

రజాకార్లు గ్రామాన్ని చుట్టుముట్టేరని తెలియగానే చెన్నయ్య వేషం మార్చుకొని వూరు దాటపోడానికి ప్రయత్నించేడు. కాని, సాధ్యం కాలేదు. ఇద్దరు అరబ్బు లాతడిని తరిమి పట్టుకొని కొట్టి లాక్కువచ్చేరు. వొడ్డి నేసేరు. ఆ జనంమధ్య చెన్నయ్య కలిసిపోయేడు. ఆ వేషంలో అతడిని గుర్తుపట్టడం కష్టం. కాని బుడన్‌వి డేగకళ్లు.

జనం చూస్తుండగనే రజాకార్లు హనుమంతుని లాక్కొచ్చేరు. శీతారామయ్యనీ పట్టుకొన్నారు.

వాళ్ళని గుద్దుతూ లాక్కుపోతూంటే ఏం చెయ్యాలో, ఏం చేస్తున్నారో కూడా తెలియని స్థితిలో జనం పాయ విచ్చిపోయి దారి ఇచ్చేరు. తమ స్థితినీ, భవిష్యత్తునూ కూడ ఎరగని, వూహించలేని దశలో ఖైదీలు మగ్గుతూ నలిగిపోయిన గుడ్డపీలికలు మాదిరిగా రజాకార్లు ఎటుగెంటుతే అటువేపు పోగుపడ్డారు. నిర్నిమేషంగా, తమవైపు తిరిగిన తుపాకి గొట్టంలోకి చూసేరు.

బుడన్ హుంకరించేడు.

అయ్యో ! అనేటందుక్కూడా వ్యవధిలేదు. ఏమి జరుగుతూందో అర్థం చేసుకొనేటంతటి సమయంలేదు. జనం దిగ్భ్రమచెంది, నోళ్లు తెరచి, కళ్లు అప్పగించి చూస్తున్నారు.

బుడన్ చేతిలోని ట్రిగ్గర్ లేస్తూంటే వెంకయ్య చెవులు మూసుకొన్నాడు. "శివా శివా" అంటూ ఇంటివేపు పారిపోయేడు.

వరుసగ మూడుమార్లు తుపాకీ మృత్యువు మ్రోసింది. చెట్టులంత లేసి మనుష్యులూ మొదళ్ళు నరికినట్లు కూలిపోయేరు.

దిగంతాలు మూలిగేయి — "హో".

---

## ముప్ఫయ్యొకటో ప్రకరణము.

కళ్ళముందర, కొద్ది క్షణాలలో జరిగిపోయిన ఈ ఘోరహత్యలతో ప్రజల మనస్సులు చైతన్యాన్నే కోల్పోయాయి. ఆ మూర్ఛనుండి తేరుకొనేసరికి రజాకార్లు రంగంనుంచి నిష్క్రమించేరు. వారు వచ్చివెళ్ళిన

చిహ్నంగా తిని పారేసిన ఆకులు గాలిలో దొర్లుతున్నాయి. వారు చేసిన దురంతానికి చిహ్నంగా మూడు కళేబరాలు పడివున్నాయి.

వికారాకారాలలో కుప్పలుగా కూలిపోయివున్న తమ ప్రియ పుత్రుల నిర్జీవదేహాల్నిచూసి, జనం ఒక్క కంఠంతో హాహాకారాలు చేసింది. ఒక్క శరీరంగా పరుగెత్తింది. వికారాకారాలతో, రక్తపు మడుగుల్లో, గాజుపడినకళ్ళతో నిస్సహాయంగా తమవైపు చూస్తున్నట్లున్న ఆ శరీరాలచుట్టూ మోకరిలబడిపోయేరు. నూరుగొంతుల్లో దేవుడు గొల్లుమన్నాడు.

చెన్నయ్యభార్య గర్భవతి, తల్లి ఏకపుత్రిక, వృద్ధ. అశవానికిరు పేపులా వాలిపోయి, కుంగిపోయి నోట మాటకూడా పెగిలిరాక సన్నగా మూలుగుతున్నారు.

"నన్నొదిలిపోతివా దేవుడా ?"

"ఎవరు చూపిరిరా నాయనా ?"

హనుమంతుతల్లి కొడుకునుచూసి విరుచుకుపడిపోయింది. కాలు చేతులు కొట్టుకొంటూంది. నోట నురగలు కక్కుతూంది. ఆ దుఃఖమయ దృశ్యాన్ని చూడలేక జనం కళ్ళుమూసుకొన్నారు.

శీతారామయ్యకోసం ప్రత్యేకంగా ఏడ్చేవాళ్ళెవరూలేరు. ఆతడో అనాథుడు. ఊరందరికీ ఆప్తుడే, వారంతా ఆతనికోసం కన్నీరు పెట్టేరు.

హఠాత్తుగా బుడన్ ఇచ్చిన వర్ణన మళ్ళీ వినబడింది.

"కాలికి వెంపికడియం ఎర్రబనీను. మొలకి గళ్ళకండువా."

నూరుకళ్ళు ఆ ఆకారంకోసం వెతుక్కుంటూ దిక్కుల్ని తడిమేయి. తమ ఎదుటనే నిలబడివున్న ఆ యువకుడి ఆకారం వాళ్ళకి నిజం అనిపించలేదు. నిండుజీవంతో తమమధ్య నిలబడి చిరునవ్వులతో

రజాకార్ల దెబ్బల్ని తృణీకరించిన శీతారామయ్యేనా ఈ నిర్జీవకళేబరం? మళ్ళీ వినిపించింది.

"నుదుట కాల్చినమచ్చ, మెల్లకన్ను, పెద్ద జుట్టుముడి...సన్నగా ...హనుమంతు..."

జనం మరల ఉలికిపడింది. తిరిగి చూసింది. ఈమారు అర్థం చేసుకొని ఒక్క ఆశ్వాసం తీసుకొంది. ఈమారు బుడన్ కాదు. ఆసక్తి స్తున్నది. పక్కవూళ్ళో మాస్టరీచేసుకొంటున్న ఆచార్లు తిపాయీవద్ద నిలబడి ఏదో చదువుతున్నాడు.

"చెవినిపోగు. గళ్ళ మొలగుడ్డ. భుజాన కంబళీ...చెన్నయ్యా..."

చదువు పూర్తిచేసి ఆచార్లు ఒక్క వెర్రికేక పెట్టేడు. హఠాత్తుగా వచ్చిపడిన ప్రమాదంతో నిస్తబ్ధం అయిపోయిన మనస్సులు ఒక్కమారు మేల్కొన్నాయి. అందరికీ యథార్థం అవగతం అయింది. అందరి మనస్సులో ఒకేమనిషి మెదిలేడు.

"వెంకయ్యా."

అందరినోళ్ళూ ఒకేపేరు నుడిసేయి.

"వెంకయ్యా."

ఒక్కక్షణంలో వివిధభావాలు ప్రకటించేరు. ఎంతనాటకం ఆడేవురాయని ఆశ్చర్యపడ్డారు. ఎంతపని చేసేవురాయని పశ్చాత్తాపం కొంకేరు. నిన్ను పోనిస్తామనేనా యని గర్జించేరు.

పది పదిహేనేళ్ళ పీడన, తపన కట్టలు తెగింది. కోర్టులచుట్టూ, రోడ్లవెంబడి తిండి తిప్పలు లేకుండా తిరుగులాడుతూ కురిపించిన శాపాలు ముసురుకొన్నాయి. కన్న సంతానాన్ని బలిచేసిన క్రోధం, తమ వాళ్ళని హత్యచేసిన ఆక్రోశం, కసి పొగలు చిమ్మేయి.

గ్రామప్రజ ఎంత అజాగ్రత్తగా రజాకార్ల చేతుల్లో పడ్డారో, భూస్వామి వెంకయ్యకూడా అంత అజాగ్రత్తగానే పంది చేతుల్లో చిక్కేడు. తన పాత్రను లొసుగులు లేకుండా నిర్వహించేననే సంతోషంలో ఆతడు రానున్న ఆపదను గుర్తించలేడు. తన ద్రోహాన్ని బయట పెట్టగల సాక్ష్యం బుడన్ త్రాగి విడిచిన కప్పులక్రింద బందీగానే వుండిపోయిందన్న ఆలోచనే తగలలేదు. కసి తీర్చుకొన్న వుత్సాహం...

...నుంచి తేరుకోక పూర్వమే ప్రజ ఆతని భుజాన చెయ్యి వేసింది. తాను నటించే పాత్రకుచితంగా సానుభూతివాక్యాలు పలికే లోపున ఇనుపదుక్కవంటి పిడికిలి మూతిమీదపడింది. ఆ మాటన్నీ రెండు మూడు పళ్ళనీ నోటకూరించి.

వెంకయ్య ప్రశ్నించాడు. ఆదెబ్బ నాత డూహించి వుండలేడు. తన రహస్యం బయట పడిందనిపించింది. భయంతో సర్వాంగాలూ బిగిసిపోయేయి. ఆ భయంతో మెదడు పనిచేయడం మానేసింది. తిమ్మిరెక్కినట్లయిపోయింది.

బంధుకోటి చుట్టూ వున్నారు. రహస్యం తెలిసినవాళ్లు కొందరు, తెలియనివాళ్ళు కొందరు. పంచదారకోసం వచ్చినభర్త తొందర తొందరగా ఏదో వ్రాయడాన్ని పద్మాక్షమ్మ చూసింది. తాను పళ్ళెంలో పోసిన దానిని ఆయన ఆ కాగితంలోపోసి పట్టుకెళ్ళేడు. తానేదో అనబోయింది. అత్తగారు కోప్పడింది.

ఆమె కష్టదర్శం కాకపోయినా ఆ వ్రాతరహస్యం ఇప్పుడు చూచాయగా అర్థం అయిందనిపించింది. ఆ వ్రాత ముగ్గురి ప్రాణాల్ని తీసిందనిపించింది. ఇప్పుడు నాలుగో ప్రాణం! ఒక్కమారు గొల్లుమంది.

ముసలితల్లి ఝణ ఝణ లాడుతూ ముందుకు రాబోయింది. కాని ఒక్కతోపులోపోయి కోడలిమీద పడింది. ఇద్దరూ లుంగచుట్టుకొని నేలబడ్డారు.

బుకాయించే టందుక్కూడా వ్యవధిలేదు. పదిపిడికిళ్ళు వెంకయ్యను ఒడిసి పట్టుకొన్నాయి. మరో పదిపిడికిళ్ళు ఆతని నందుకొనేటందుకు ముందుకు వచ్చేయి. కాని మనుష్యుల వీపులమీదుగా ఆతని నందుకొనే టందుకు సాధ్యంకాలేదు. ఆతని నుద్దేశించి విసిరిన ఓ అరడజను గుద్దులు ఆతనిని పట్టుకొన్నవాళ్ళ వీపులమీద బడ్డాయి.

పట్టుదొరకని ఒక ఆడగొంతు అంగలార్చింది.

"ఈడవండి వాకిట్లోకి."

ఆమె విసిరిన పిడికెడుదుమ్ము తెరకమ్మింది. కళ్ళారుస్తూ వెంకయ్య పెదిమలాడించేడు. ఆదుమ్ము పెదిమలకూ, నోటికీ అంటిన జనం టుబుకు తుబుక్కున ఊసిన ఉమ్ములతో ఆతని ఛుజాలు జారేయి.

"నా బిడ్డని పొట్టపెట్టుకున్నావురా, నీ మొదలారా!"

హనుమంతు తల్లిదాగొంతుక. కొడుకుచావు చూసేక తెలివిగా మాట్లాడిన మాట అదే.

ఆ గొంతు వినిపించేసరికి జనం క్రోధం పొంగి పొరలింది. రాజు తున్న కసీ, ఆక్రోశమూ మంటలెగసేయి.

"లాక్కురండి."

అని జనం ఆజ్ఞ.

వెంకయ్య చేతులమీద గడపలు దాటేడు. ఇంటి గుమ్మంలోవున్న శవాలవద్ద తబుక్కున జారి నేలబడ్డాడు.

జనం భుజంమిద చెయ్యి వేసినప్పుడే ఆతని నవనాడులూ క్రుంగి పోయేయి. మనస్సు పనిచేయడం మానింది. మృతస్థితి. కళ్ళు చూస్తు న్నాయి. ప్రతి చిన్న చప్పుడికీ తిరిగి చూస్తున్నాయి. కాని ఆ ధ్వనులు మాటలు ఏమిటో తెలియవు. చెవులు వింటూనేవున్నాయి. కాని ఏం వింటు

న్నాయి ? ఆ ధ్వనులలోని లాలన, బెదిరింపు, ఆశ, నిరాశ ఏవీ మన స్సులో కదలికలు కలిగించవు. దూరాన ఎవరో, ఎవరిని గురించో ఏదో రహస్యం మాట్లాడుకొంటున్నట్లే.

జనం మీదపడిపోయారని తెలియదు. తన జాగ్రత్త విఫలమయిం దని అర్థంకాదు. అసలా భయమూ, ఆ జాగ్రత్తాకూడా గుర్తులేవు. బ్రతికి వున్నా ఏదో లోకంలో వున్నట్లే...

ఒంటిమీద దెబ్బపడ్డా మనస్సు కావార్తలేదు. అవన్నీ ఎవరికో తగులుతున్నా యనిపిస్తూంది. నరాలు కట్టుకట్టినట్లు సమ్మో చేస్తున్నాయి. నిద్రలోకూడా భయం, సంతోషం, నెప్పి, బాధ, ఆనందం అనుభూతం అవుతాయి. కాని, వెంకయ్యకీది నిద్రకూ, మెలకువకూకూడా అతీతమైన స్థితి. యోగులకు సమాధిస్థితిలో బాహ్యప్రపంచజ్ఞానం వుండను. ఇక్కడ వెంకయ్య శరీరానికీ, మనస్సుకీ లంకెతెగిపోయింది. మనస్సు సజీవం గానేవుంది. కాని శరీరానికి తగిలినదెబ్బలు దానికి అర్థంకావడంలేదు. కాగా పైనుంచికేవలం ప్రేక్షకుని స్థితిలోంచి గమనిస్తూన్నట్లుంది. కాని ఈ ప్రేక్షకుని పరిస్థితివేరు. కళ్ళూ, కాళ్ళూ, చేతులూ అన్నీ వెంకయ్య శరీ రానివే. అనుభూతి అంతా వానిదే. కాని, జ్ఞానం మాత్రం వేరైంది.

మనుష్యుల భుజాలనుంచి దిగిపోవాలనిపించలేదు. అనిపిస్తే అవ యవాలు పట్టులోవున్నాయా ? వుంటే జనం దిగనిస్తారా అనే ప్రశ్నలు వేరు. అసలు దిగాలనే తోచని మానసిక పరిస్థితి, వాళ్ళు క్రిందపడిలేసి నప్పుడు కూడా లేవాలని ప్రయత్నించలేనిస్థితి.

ఆతనికి బదులు భార్య పద్మాక్షమ్మ ఏడ్చింది. మొత్తుకుంది. మంగళసూత్రం జనానికిచూపి మాంగల్యభిక్ష పెట్టమంది. ఆతనితల్లి గర్జి స్తూంది. ఊరంతనీ మంటపెట్టిస్తానంటూంది. నోచనోక్కిన రెండోకొడుకు చేతిప్రేళ్ళు కొరికింది.

తల్లి హుంకారాలకు, భార్యఏడ్పులకూ కూడ వెంకయ్య కళ్ళప్ప గించేడు. అవి తననుగురించేనన్న సంగతి ఆతనికి అర్థం అయివుండదని ఆ చూపులే చెప్తున్నాయి.

చెన్నయ్య భార్యను ఆమె తండ్రి రెట్టపట్టుకు లేవదీసి పద్మాక్షమ్మ ముందు నిలబెట్టేడు. దుఃఖముతో చుట్టచుట్టుకుపోతున్న పెదవులతో ఆమెకు మగడు చేసిన విధవగా పరిచయం చేసేడు. పాతికేళ్ళ పడుచు; నిండుమూలాలు. ఆమె రూపు, దుఃఖం చూసేసరికి పద్మాక్షమ్మకు కాలూ, చెయ్యీ ఆడలేదు. ఆమె తన మాంగల్యాన్ని మెళ్ళోనే జారవిడిచింది. చెన్నయ్యభార్య మెడలోని పుస్తెలుతెంపి ఆమె తండ్రి వెంకయ్య మొగాన కొట్టేడు.

"ప్రాణం తియ్యడానికట్టా వూళ్ళోకి తీసుకొచ్చింది "

ఆ దృశ్యం చూడలేక జనం గొల్లుమన్నారు. మెదపడిన పుస్తెలను ఎత్తిచూస్తున్న వెంకయ్య రెండు తాపులతో దొర్లిగింతయి పెట్టేడు.

పక్కకుదొర్లి మోచేతిమీద లేచేడు. నోట ఒక్కమాటలేదు. తన్నిన వానికాలిమీదనేవుంది ఆతనిచూపు, పరోతాపు......

వెంకయ్య కొడుకులు. తమ్ముళ్ళు పరుగెత్తివచ్చారు. వాళ్ళని కూడా ఆతడు గుర్తుపట్టినట్లులేదు. తన్నుతున్నవాళ్ళనీ, ఏడుస్తున్నవాళ్ళనీ మార్చి, మార్చి వింతగా చూస్తున్నాడు. ఆ దృశ్యం చూడలేక పద్మాక్షమ్మ కళ్ళు మూసుకుంది. తల తిరిగిపోతూంటే చదికిలబడింది.

ఆమె మరల కళ్లు తెరిచేసరికి అక్కడేమీలేదు. జనం కాళ్ళమధ్య నుంచి కొడుకు ఆమెను పక్కకు లాగివేసి యుండకపోతే ఆమె మగనికిపట్టినగతిని చూసివుండేదేకాదు.

ఎవరు విసిరికొట్టేరో ఓ బండరాయి వీపున తగిలేసరికి వెంకయ్యా నేలకరిచేడు. తర్వాత తగిలినవి లెక్కలేదు. జనం కాళ్ళక్రింద ప్రాణం ఎప్పుడో పోయింది.

జనం వెళ్ళిపోయేక పద్మాక్షమ్మ మగణ్ణిచూసింది.

ఆమె చూసింది మగణ్ణికాదు. అతని శిధిలాంగాన్ని. కాళ్ళూ చేతులూ చెరోదిక్కునా వున్నాయి. గిట్టకరచిన పళ్ళతో వెక్కిరిస్తున్నట్లున్న తల అంత దూరాన పడివుంది. అంతక్రితం ఆ ప్రదేశంలో తన భర్తనిచూసి వుందిగనక పద్మాక్షమ్మ ఆ శరీరంలో భర్తను గుర్తుపట్టింది గాని అక్కడున్న మాంసంముద్దకి, అసలు వెంకయ్యకీ పోలికేలేదు.



# ఒ క టో ప్ర క ర ణ ము.

చినుకుసాగింది. తుంపరలు జల్లులై, జల్లులు జడివానయి నదులే ఆకాశం నుంచి ఉరకలేసేయి. ఎముకల్ని కొరికేస్తూ ఈదురుగాలి ఝుంయ్ మని తోలుతూంది.

ఈ గాలిలో, ఈ వర్షంలో తన మగడు ఎక్కడున్నాడో యని శశిరేఖ ఆలోచనలో పడింది. మద్దికుంటలో ముగ్గురు పడుచువాళ్ళని చంపేసేక రజాకార్లు మరింతదాడులు సాగిస్తున్నారు. వాళ్ళజోర్‌దారీ కూడా ఎక్కువయిందట. వాళ్ళకితోడు రాఘవరెడ్డి దేశముఖు బలగం కూడా వూళ్ళల్లో పేలాలు వేయించేస్తున్నారని చెప్తున్నారు. ఆ కథలు వింటూంటేనే కంపరం పుడుతూంది. అసలు జనం ఎల్లావుంటున్నారో? మగని విషయం తలచుకొంటే ఒకేబాధ అనిపిస్తూంది. ఎక్కడుంటు న్నాడు? తిండి ఎవరు పెడుతున్నారు? అన్నింటికన్నా పెద్ద దిగులు ఇల్లా ఎంతకాలం?—అని.

ఒక్కమారువెళ్ళి ఏం చేస్తున్నాడో చూసివద్దామను కొంటున్న సమయంలో సత్తెమ్మ పాకలో అడుగుపెట్టింది. ఆమె చెప్పిన వార్త విన్నాక ఒక్కక్షణం ఉండబుద్ధికాలేదు. గబ గబా ఇల్లుసర్దేసి తలుపు తాళం పెట్టబోతూంది.

బయలుదేరబోయే వేళకి సత్తెమ్మ మళ్ళీవచ్చింది. ఆమె ఒత్తిడి మీద గొంతు దిగకపోయినా నాలుగుమెతుకులు కొరికింది. ఆమె సలహా మీద ఇంతఅన్నం మూటగట్టుకొని బయలుదేరింది. అక్కడికెళ్ళేక తనకి

తిండెవరు పెడతారు ? ఇదేం ఏ బంధువుల ఇంట్లోనో పెళ్ళో, పేరంట మూనా ? అసలు భానుడిపేటవాళ్ళే చెట్టుకొకరూ పుట్టకొకరూగాపోతే !

ఆ వూరుమీద పడ్డది దేశముఖు రాఘవరెడ్డి బలగమట. ఒక గ్రామదళ సభ్యుణ్ణి చంపేసేరనీ, వూరిజనం అంతా చిట్టడివిలో పడ్డారనీ వార్త. ఆ చచ్చిపోయిన దళసభ్యుడెవ్వరో ఎవరూ ఎరుగరు. శశిరేఖ గుండెలదిరిపోతున్నాయి. తన భర్తవున్న దక్కడేనాయె. ఏ క్షణంలో ఎవరొచ్చి ఏం చెప్తారోయని హడలిపోతూంది. సత్తెమ్మకుకూడా ఆ అను మానమే బాధిస్తూంచేమో, లేకుంటే ఇదివరకు జరిగిన ఘటన తర్వాత రాసాహసిస్తుందా? తనను కూడా వాళ్ళ పనుల్లోకి ఈడవాలని చూసేరు. వూళ్ళో మురికీ అవీలేకుండా శుభ్రంగావుంచుకోడం ఎల్లాగో నలుగురికీ నేర్పాలన్నారు. దొడ్లల్లో నాలుగు కూరపాదులు పెంచుకోవడం నేర్పాలట. ఏమిటేమిటో, వూరునంతా వుద్ధరించెయ్యాలన్నారు. శుభ్రంగా వుండాలని మనం చెప్పాలేమిటి ? లేకుంటే పురుగులోడి చచ్చిపోతారు. కూరలు పెట్టుకోవడం చేతగాకపోతే కారంవేసుకుతింటారు. ఇల్లాంటివన్నీ ఒకరు చెప్పేదేమిటి ? చింతచిగురు దొరికేరోజుల్లో చింతచిగురూ పప్పూవేసు కొంటారు. వాక్కాయలు దొరికితే అవి పప్పులో వేసుకొంటారు. వీటి కోసం ఒకరు నేర్పడమూ ఒకరు నేర్చుకోవడమూనా ? తాను నిరాక రించేసింది.

"మాకిల్లాంటి పోకిళ్ళేంచేత కావమ్మోయ్."

ఆ మాటకి సత్తెమ్మ ఏమీ అనలేదు. నిశ్శబ్దంగా వెళ్ళిపోయింది. ఓ వారం రోజులు తన వేపుకూడా తొంగిచూడలేదు. "బ్రతికేనురా, జీవుడా" అనుకొని తల తడిమిచూసుకొంది.

కాని, ఆమెకాసంతృప్తి ఎన్నో రోజులుండనేలేదు. ఓ రోజున తెల్లవారేసరికి హాజరయింది. అప్పుడే తాను కూరాటికుండలో గంజితీసి

ఎసరుపెట్టబోతూంది. అల్లాపెట్టడం ఆరోగ్యంకాదని సత్తెమ్మ వాదంవేసుకొంది. మరిగిపోయిన బియ్యపుకడుగూ, వార్పూలేనిరోగాలుతెచ్చి పెడతాయని బెజవాడలో ఆమెకు చెప్పేరు. అవేపట్టుక్కూర్చుంది. తమరేమన్నా కుండని అపరిశుభ్రంగా వుంచుతారా ఏమన్నానా? నాలుగురోజులకోమారు తీసేసి, కుండకడిగి కొత్తకడుగూ, గంజీపోస్తారు. పులియదాని కోముంతెడు పులిపేస్తే ఏమైపోతుందేం? అన్నం చిమిడిపోను. బిరుసుగా వుంటుంది. మరో ఆధరువు ఏమీలేకపోయినా పుల్లపుల్లగా వుంటుందేమో ఇంతకారప్పచ్చడి వేసుకుంటే ఆ పూటగడిచిపోతుంది. వాసనేస్తుందిట! మళ్ళీ తాను అంటించింది.

"నాకీ పోకళ్ళు కుదరవమ్మోయి."

ఇంక తనతో లాభంలేదని సత్తెమ్మ వూరికుంది. కాని ఆవిడే ఇప్పుడొచ్చి ఘానుడిపేటకు రమ్మంటూందంటే ఏదోమనస్సులోవుండే వుండాలి. కాని, తాను ఎంత తరచితరచి అడిగినా ఏమీ చెప్పడంలేదు. "మేమందరం వెడుతున్నాం. మొగుణ్ణేనా చూస్తావని రమ్మంటున్నాం"— అంటుందేగాని ఏమీ తేలడంలేదు...అయినా ఆదుర్దాగానే వుంది.

ఆ ఆదుర్దాతో హడావిడిగా వేసిన ప్రతిఅడుగూ ఆమెనడకను ఆలస్యమే చేస్తూంది.

ఆమెతో వస్తున్న సత్తెమ్మా, కోటమ్మా ఆమె ఆదుర్దా పోగొట్టడానికై ఎన్నోకబుర్లు చెప్తున్నారు. దాడి జరిగినా దళసభ్యుడు చావడం జరిగి ఉండదన్నారు. ఊరుకుచుట్టూ రాదారిపక్కల్నే దళసభ్యుల్ని కాపలావుంచుతున్నారనీ, అల్లంత దూరాన లారీచప్పుడు వినబడ్డా పది మంది వస్తున్నట్లు కనబడ్డా వెంటనే ఊళ్ళోకి ఉప్పంది పోతుంది. వెంటనే నిల్చున్నవాళ్ళు నిల్చున్న పాటున బయటికి వచ్చేస్తారు. జనం ఉన్నవైపున దళం కాపలా నిలబడుతుంది. పెద్ద తుపాకులు లేకపోయినా వాళ్ళభర్మార్లు చూస్తేనే రజాకార్లు హడిలిపోతారు.

"వట్టి పుకారు."

శశిరేఖ వాళ్ళమాటను కాదనలేదు. కాని ఓ నిమిషంపోయేక ప్రశ్న వేసింది, "కాపలాదారు నిద్రపోతే ?".

అసంభవంకాదు. దళసభ్యుల్లో ఉత్సాహంవున్నా ఇల్లాంటి బద్ధకస్తులు లేకపోలేదు. ఈ మధ్యనే తాము ఒకణ్ణి దళంలోంచి పంపేసేరు కూడా, శశిరేఖకు ఆ సంగతి తెలుసు. తెలిసే ఆప్రశ్న వేసింది. సత్తెమ్మ కూడా కాదనలేదు. కాని, తనమాట వదలలేదు. ఏమాత్రం ఏమరివున్నా చచ్చిపోతామని పద్దికుంట దాడితర్వాత అందరూ జాగ్రత్తగానే వుంటున్నారంది. తమవద్ద ఆయుధాలూ గట్టివిలేవు. అజాగ్రత్తకూడాఅయితే చంపేస్తారని పక్క బెదురుండనేవుంది. దళాలుకూడా బద్ధకస్తుల్నీ, నిద్రపోతుల్నీ పంపేసి కట్టుదిట్టం చేసుకొంటున్నారని శశిరేఖను ఓదార్చింది.

కాని, ఖానుడిపేట సమీపానికి వెళ్ళేసరికి చచ్చిపోయింది ఒకరుకాదు, ఇద్దరనివార్త. మరికాస్తదూరం వెళ్ళేసరికి చచ్చిపోయినవాళ్ళల్లో ఒకరు ఆడది అన్నారు. ఖానుడిపేట వాళ్ళనే కలుసుకొనేవరకూ శశిరేఖ ఆదుర్దా తగ్గలేదు. అస్పష్టంగా అయినా భర్తక్షేమంగా వున్నాడనే సంగతి తెలిసేక దీర్ఘమైన నిట్టూర్పు విడిచింది. అంతవరకు రెండుమూడు గంటలుగా మనస్సును వేధిస్తున్నవ్యధ ఒక్కమారు బ్రద్దలయి బావురంది.

సత్తెమ్మ, కోటమ్మ తమతో దారిలో కలిసిన మరొకరిద్దరు స్త్రీలూ జాలీ, సానుభూతీ చూపుతూంటే క్రమంగా సర్దుకుంది. భర్తని చూడకపోయినా, ఆతని క్షేమం విన్నాక మనస్సు తేరుకుంది. అప్పుడు గాని, చుట్టూరావున్న జనంస్థితి గుర్తురాలేదు. గుర్తువచ్చేక ప్రశాంతంగా వుండనూలేకపోయింది. తనతో తెచ్చిన అన్నాన్ని ఓ చెట్టుక్రింద చేరిన పిల్లగాళ్ళకు నలుగురికీ పంచిపెట్టింది.

ఆ చెట్టుక్రిందా, ఈ రుప్పమాటునా, ఓ రాతిబండ ప్రక్కనా తల దాచుకొంటున్నజనం వర్షంలో తడిసి ముద్దయిపోతున్నారు. దాడికిముందు

జాగ్రత్తపడేటందుకు వ్యవధి వున్నవాళ్ళు, గుండెనిబ్బరం కోల్పోని వాళ్ళు కొద్దిమంది హెచ్చరిక వినగానే చటుక్కున ఓ కంబళీ అందుకుని ఊరు దాటేసేరు. అవి ఇప్పుడుపయోగించేయి. వాళ్ళకేగాక మరో పదిమందికి వాటిక్రింద ఆశ్రయం దొరికింది. కాని, హెచ్చుమందికి ఏ ఆశ్రయమూలేదు. పిల్లా జెల్లాతో ఆలాగే తడిసిపోతూ వణికిపోతూ నిలబడిపోయేరు. పిల్లా, తల్లీ, భర్తా, భార్యా, తండ్రీ, కొడుకూ ఒకరిపోబడి ఒకరు వెతుక్కుంటూ తిరుగుతున్నారు. అజాగ్రత్తగావుండి, సకాలంలో తమకు కబురందించలేకపోయిన గ్రామ రక్షణదళాన్ని కసిదీరా తిడుతున్నారు. తాము ఇస్తున్నడబ్బు మధ్యాన్నంకూడా పెళ్ళాలదగ్గిర పడకెయ్యడానికా అని గొణుగుతున్నారు. నిలేసి అడగమని పక్కవాళ్ళని ప్రోత్సహిస్తున్నారు.

ఆ రోజున హెచ్చరిక ఇచ్చింది దళంవాళ్ళు కూడా కాదు. దేశముఖు రాఘవరెడ్డి తుపాకి చప్పుడే ముందు వినబడింది. తర్వాత పది నిమిషాలకిగాని దళంవాళ్ళు ఇవ్వనేలేదు. అప్పటికే లారీలు ఊరుపక్క దాపులకి వచ్చేసేయి. వెనకనున్నవి కూడా వచ్చి, కమ్ముకొనేసరికి ఆలస్యం అయిపోయింది గనకగాని, కన్నంలో ఎలకల్లాగ అందరూ చిక్కిపోయేవారే.

మొదటి జీప్ వచ్చేసరికి ఆ దిక్కున కాపలావున్న వాడెవరో ఆ వైపుగా పుల్లలేరుకో వచ్చిన గవరమ్మతో సరాగాల సందట్లోవున్నాడు.

హఠాత్తుగా రజాకారు దళం నాయకుడు రాఘవరెడ్డి పొదమాటు నుంచి ప్రత్యక్షం అయ్యేడు. అతడు తమ వెనకవైపునసే నిలబడివున్న సంగతి వాళ్ళెరగనే ఎరగరు. అదోలోకం. రాఘవరెడ్డి ఒక్క గుండు దెబ్బతో ఇద్దరినీ కూలగొట్టేడు.

ఆ ధ్వనే ప్రమాదాన్ని గురించి ఉప్పందించింది. అసలు సంగతి ఏమిటో తెలుసుకొని దళం గంటబజాయించడం ప్రారంభించేసరికి ఆలస్య

మయింది. కాని, అదీ మేలే. మద్దికుంటమీద దాడినాటినుంచీ రజాకార్లకి రక్తదాహం ఎక్కువయింది. దానికితోడు వెంకయ్య మరణంతో మరీ తెగబడ్డారు. చేతికందితే చంపడం, చచ్చేటట్లు కొట్టడంతప్ప అంతకు తక్కువ హింసలేనేలేదు. ఎవరు దొరికినా అంతే. నేరం, గీరం, అప కారం, ఉపకారంతో నిమిత్తం లేదు.

గ్రామాలలో ముసిలివాళ్ళు తమ పెద్దవాళ్ళు చెప్పిన పిండారీ దండుల బాధల్ని తలచుకొన్నారు. నూటపాతికేళ్ళ పైగా అయినా ఆ నాటి చిహ్నాలు ప్రతిగ్రామంలోనూ వున్నాయి. ఆ నాడు కట్టుకొన్న బురుజులు ఇప్పటికీ దిబ్బలల్లే ఊరు నాలుగుమూలల్లో కనిపిస్తున్నాయి. ఇప్పుడూ ఊరుగవన్లు కనబడుతున్నాయి. వానికి పెద్దపెద్ద బరువైన తలు పులుండేవట. గడెమానుతో వానిని మూసేవారట. ఆ తలుపులూ గడె మానులూ లేకపోయినా రాతితోకట్టిన ద్వారాలు అలాగేవున్నాయి. వాటికీ కాపలాపెట్టేవారుట. రజాకార్లు లారీలూ, జీపుల్లో వస్తున్నారు. వాళ్ళు గుర్రాలమీద వచ్చేవారట. అంతే తేడా. ఇద్దరి దౌర్జన్యాలూ ఒక్క విధంగానే వున్నాయని ముసలివాళ్ళు పోలికలు తెచ్చేరు.

ఆ రోజుల్లో వూళ్ళల్లో కాపలాదార్లని పెట్టేవారు. తలార్లు, వెగా రీలూ, సేత్సిందీలు ఆ పనుల్లో వుండేవారు. దూరాన గుర్రపు డెక్కల తాకిడికి లేచిన ధూళి కనిపించేసరికి బురుజుల మీదున్న నగారాలు మ్రోగేవి. పొలాలలోవున్న జనం పరుగు పరుగున ఊరగవని లోపల చేరేవారు. గడెలు బిగించి కత్తులుతీసేవారు. పిండారీల గుర్రాలు వచ్చే దారుల్లో లగసముళ్ళు పడేసేవారుట. ముసలివాళ్లు చెప్పిన లగస్‌ముళ్లు ఏమిటో పడుచువారుకు అర్థంకాలేదు. అవేమన్నా లారీల్ని, జీపుల్ని కదలకుండా చేసేందుకు పనికివస్తయ్యేమో.

సేతుసిందీలూ, వెగార్లూ, వూళ్ళల్లో పడుచువారూ కాపలాచేస్తు న్నారు. నగారాలులేవు. వాటిస్థానంలో జేగంటో, డప్పోచేరింది. కాని,

అదిప్పుడు జనాన్ని వూళ్ళోకి రప్పించేటందుకు మోగడంలేదు. వూళ్లోంచి పారిపొమ్మనడానికి ఓ హెచ్చరిక అయింది.

హెచ్చరికలో వినిపించిన ఆదుర్దాగమనించి ఎవరికివారే తొందర పడ్డారు. వండుకొంటున్న వంటలూ, వండుకొన్న అన్నాలూ, తింటున్న కంచాలూ ఎక్కడివక్కడవదిలేసి జనం చేతికందిన పిల్లగాళ్ళ రెక్క పట్టుకొని, ఈడ్చుకుపోతూ ఊరునానుకొనివున్న చిట్టడవిలోపడ్డారు. తలో మూలకీ చెదిరిపోయేరు.

చెదిరిపోయిన వాళ్ళందర్నీ ఏదో ఆశ్రయానికి చేర్చేటందుకు సత్తెమ్మా కోటమ్మా మిగిలినవాళ్ళూ బయలుదేరుతున్నారు. శశిరేఖతో ఇదివరలో మాట్లాడిన అనుభవంలో సత్తెమ్మ ఆమెను రమ్మనలేదు, తానూ వస్తానని ఆమెయే చెప్పినప్పుడు కూడా సందేహం ప్రకటించింది. కాని, ఆమె ఆగలేదు.

కురుస్తున్న వర్షం మూలంగా రజాకార్లగుంపు వూళ్ళోనే చిక్కడి పోయింది. వాళ్ళలారీలు కదలవు. వానితోపాటే రజాకార్లూనూ. ప్రజలు ఖాళీచేసిన ఇళ్ళూ, వండివదలిన అన్నాలూ వాళ్ళకి స్వాగతం ఇచ్చేయి.

రాఘవరెడ్డి స్వయంగా మల్లారెడ్డి కచేరీసావట్లో కొలువుతీర్చేడు. వర్షంవచ్చినా, పగగళ్ళపడ్డా వాళ్ళకి దోపిడీ వేంప్పుంటుంది?

మొదట అజాగ్రత్తగావున్నా గ్రామదళం వెంటనే సర్దుకొంది. గ్రామంచుట్టూ కాపలానిలబడ్డారు. మధ్యమధ్య ఫర్మార్లుకాల్చి రజాకారు మూక ఇళ్లువిడిచి రాకుండా బెదరకొడుతున్నారు. రక్షణదళం మాటున గ్రామప్రజ చిట్టడివిలో చేరింది. కాని, ఈ వాతావరణం?

వర్షంలో తడిసి కాళ్ళూ చేతులూ కొంకర్లు పోతున్నాయి. ఆ రోజంతా ఇంచుమించు అందరూ ఉపవాసమే. మొదట ఆకలి తెలియ లేదు గాని క్రమంగా ఆ అదురును అణచివేసి ఆకలి తలఎత్తుతూంది.

ప్రాణాలు కళ్ళల్లోకి వస్తున్నాయి. వారినిచూస్తేనే బాధగావుంది. కాని, ఏమిటి చేయడం? రక్షణదళసభ్యులు ఈ పరిస్థితినింతవరకు ఎదుర్కో లేదు. రజాకార్లూ, పోలీసులూ వచ్చినా గంటో, రెండుగంటలో వుండ డమూ పోవడమూ జరుగుతూంది. వాళ్ళటుపోగానే జనం ఇళ్ళల్లోకి చేరు తున్నారు. మధ్యలో ఆగిపోయిన నిత్యకృత్యాలు ఏమీ జరగనట్లే సాగి పోతాయి; కాని, ఈవేళ పరిస్థితివేరు. రజాకార్లు వూళ్ళో బైఠాయించేరు. జనం వూరిబయట వర్షంలో వుండిపోయేరు; నెత్తిన ఆకులేదు. తినడానికి తిండిలేదు. ఇదో నూతనస్థితి.

ఈ పరిస్థితి ఏర్పడిన ఘట్టమేవాళ్ళకి ఎంతో చిన్నతనంగా వుంది. తుపాకీతో గ్రామదళసభ్యు డొకడు కాల్చివేయబడడాన్ని ఎవ్వరూ చూడ లేదు, అయినా అందరికీ అసలుసంగతి తెలిసిపోయింది. ఆ వళ సభ్యు డితో ఒక ఆడది కూడా వుందన్నారు. వాళ్ళు ఏ స్థితిలోవుండగా చంపి వేయబడ్డారో కూడా అందరికీ తెలిసిపోయింది. ఇటువంటి వార్తలకు కళ్ళూ, కాళ్ళూ వుండవు. ఉండేవల్లా రెక్కలే.

తమలోని ఒకడు చచ్చిపోయిన బాధకన్న, ఆతడు చచ్చిపోయిన పరిస్థితే దళంవాళ్ళందరికీ ఎక్కువ బాధాకరం అయింది. అసహ్యం ఉట్టి పడే చూపులు ఆ లోపాన్ని గుర్తుచేస్తూంటే, వారు ప్రజలకి మొగంచూప డానిక్కూడా సిగ్గుపడుతున్నారు.

సాయంకాలం అవుతూంది. వర్షం వెలిసేట్లులేదు. ఇంకోఘడియ గడుస్తే కొండలు, గుట్టలు, చెట్లు, చేమలు, వాగులు, వంకలు చీకట్లో గుర్తుకూడా తెలియడం కష్టం. అడుగు మెదపడానికి వుండదు.

ఇప్పుడే తా మున్నచోటు వదలడానికి వీల్లేదు. రజాకార్లు విరు చుకువచ్చి మీద పడిపోకుండా వుండాలంటే తా మక్కడనుంచి కదల కుండా వుండడం అవసరం. కాని జనం మాటేమిటి? నిరుత్సాహపడి చీకాకుతో జనం తా మేమన్నా చెప్పినా వినిపించుకొనే స్థితిలో లేరు.

ఆ సమయంలో సీతారాంపురందళం సాయం రావడం వాళ్ళకి పెద్దబరువు దిగిపోయినట్లయింది.

భాగ్యరెడ్డి తన స్థానం వెంకటయ్యకు వప్పచెప్పి తన దళాన్ని వెనక్కి పిలిచేడు. ఆ గుట్టలూ మిట్టలూ వాళ్ళకైతే కొట్టిన పిండి. చీకటీ, వాకటీ సమస్యరాదు. "ఊరివాడికి కాటి భయం, పొరుగు వాడికి నీటి భయ్యం." వర్షపు నీటిలో మునిగి ఎత్తు పల్లాలు తెలియని చోట్లో కొత్త వాళ్ళకి అడుగడుగునా అనుమానమే.

వెళ్ళిపోతున్న భాగ్యరెడ్డిని పిలిచి వెంకటయ్య తమతోపాటు శశిరేఖకూడా వచ్చిన సంగతి చెప్పబోయేడు. ఆ మాటచెప్తే ఇంకా ఎవ రెవరు వచ్చేరో చెప్పవలసి వస్తుందనుకొన్నాడు. అందులో సత్తెమ్మ పేరూ, పాత్రా చెప్పాలి. సిగ్గుపడ్డాడు. ఇంక ఉమ్మడిగా అనేసేడు.

"మనూరునుంచి చాలమంది ఆడవాళ్లుకూడా వచ్చేరు".

భాగ్యరెడ్డికి అందులో విశేషం కనబడలేదు. కోటమ్మ పుట్టినిల్లు ఆ వూరే. సత్తెమ్మ, చాకలి మంగమ్మ దళంతో వాళ్ళే, దళంలోసభ్యులు కాకపోయినా వాళ్ళను గురించే వెంకటయ్య చెప్తున్నాడనుకొని భాగ్య రెడ్డి తలవూపి వెళ్ళిపోయేడు. తనభార్యకూడా వాళ్ళతో వచ్చి వుంటుం దనే ఆలోచనే అతనికి తగలలేదు. కాని, హఠాత్తుగా పదిమంది ఆడ వాళ్ళనీ, పిల్లల్నీ వెంటబెట్టుకుపోతూన్న శశిరేఖను చూసి అతడు విస్తుపోయేడు.

మొదట ఆమెను గుర్తు పట్టనేలేదు. వర్షానికి తల తడవకుండా చీరచెంగు లాగి నెత్తిన కప్పుకొంది. జల్లు మొగాన కొట్టకుండా తల వంచుకు నడుస్తూంది. హఠాత్తుగా ఎదురై తలఎత్తేసరికి శశిరేఖ ముఖం: విస్తుపోయేడు.

ఆతనిని చూడగనే శశిరేఖ చిరునవ్వు నవ్వి తల వూపింది.

"కోటమ్మ పిన్నీ, సత్తెమ్మక్కాతో కలిసి వచ్చేను".

ఆ మాటలు విన్నప్పుడు భాగ్యరెడ్డి ఆశ్చర్యానికి మేరలేదు. దండు ముండా, మగాడి మొగుడూ అని ఈసడించిన వాళ్ళతోనేనా ఈ బంధు ప్రీతి ?

మగని ఆశ్చర్యాన్ని చూసి శశిరేఖకు వినోదమే కలిగింది. ఆ మార్పు కారణం వూహించుకోమన్నట్లు కనుబొమ్మ లెగరేసింది.

భాగ్యరెడ్డి మారుమాట అడిగేలోపునే ఆమె ఆ మసక చీకటిలో కనుమరుగై పోయింది.



## రెండో ప్రకరణము.

సత్తెమ్మను ఒంటరిగా చిక్కించుకొని, తమ వివాహ సమస్యను తేల్చేసుకోవాలని ఊహలపై ఊహలు అల్లుకొంటున్న వెంకటయ్య తీరా ఆమె ఎదుట నిలబడేసరికి—"నువ్వా : నువ్వా !" – అని నోరు తెరిచేడు.

హఠాత్తుగా అలని స్వరం విని పరధ్యానంగావున్న సత్తెమ్మ వులికి పడింది. తాను వెంకటయ్యను కలుసుకోబోతున్నానని ఆమె అనుకోలేదు. కాపలావున్న దళంవాళ్ళకి తిండి పట్టుకెళ్ళాలన్నారు. ఏనుగుబండదగ్గర ఓ జట్టు వుందన్నారు. వాళ్ళకి జొన్నరొట్టెలు మూటగట్టుకొని బయలు దేరింది. తీరా బండదగ్గిరికెళ్ళి ఎవ్వళ్ళూ కనపడక అటు ఇటు చూస్తూంటే వెనకనుంచి వెంకటయ్య గొంతు.

మొదట ఆమె ఆ కంఠాన్ని గుర్తుపట్టలేదు. ఫలానా అని చెప్ప లేని భయంతో గుండెలు పట్టుకుపోయేయి. మనిషిని చూడగనే తేరు కుంది. వెంటనే సర్దుకుంది.

"నువ్వా ఇక్కడున్నది ?"

ఆతన్ని చూడగనే సత్తెమ్మను పూర్వస్మృతులు చుట్టుముట్టేయి. ఉద్వేగపడింది. మరోవేపున భయమూ అనిపించింది. ఆతనిని కలుసుకొనేటందుకే అన్నం పట్టుకు బయలుదేరిం దనుకోరుగద! ఇదివరలో లేని ప్రజాపవాద భయం ఇప్పుడామెను అతిమాత్రంగా పట్టుకొంది.

సర్కిలు రమణారెడ్డినుంచి విడిపడ్డాక చాలమందితోపాటు సత్తెమ్మ కూడా ఇల్లు వదిలింది. దళంతోనే జీవిస్తూంది.

ఇంక తమ వివాహానికి ఆటంకం వుండరాదని వెంకటయ్యా సంతోషపడ్డాడు. కాని పైవాళ్ళ పేచీ లేదనుకొన్నాక తమ మధ్యనే అడ్డుగోడలు లేచినట్లనిపించేయి. గోడ అవల, వీధి ప్రక్కన ఒకరి గొంతు ఒకరు విన్నప్పుడు పరవశులైపోతారు. ఒకరి గొంతుక మరొకరు వినడానికీ, వారేం చేస్తున్నారో వూహించడానికీ నిశ్శబ్దంగా వుండిపోతారు. ఇద్దరి మధ్యనా కొత్తగోడలు లేచేయి. ఆ గోడల్ని తోసెయ్యలేరు. వీధిలో నిలబడలేరు. ఆ నిశ్శబ్దాన్ని భంగించనూలేరు.

సత్తిరెడ్డి ఇచ్చిన హెచ్చరిక వాళ్ళకి అనుల్లంఘనీయం. ఆయనయినా పెళ్లికి అభ్యంతరం చెప్పలేదు. చేసుకోమనే అన్నాడు. వితంతువు పెళ్ళిచేసుకోవడం తప్పేంకాదన్నాడు. కాని, పెళ్ళి చేసుకొనే వరకూ అపవాదులు పుట్టేలాగ ప్రవర్తించ వద్దన్నాడు.

"మిరిప్పుడు పట్టివెంకటయ్యా, సత్తెమ్మా మాత్రమేకాదు. ఆంధ్ర మహాసభ కార్యకర్తలు, రక్షణదళసభ్యులూను. మీ ప్రవర్తననుపట్టే ప్రజలకు మీ మీద ఆదరం, నిరాదరం కలుగుతుంది. ఒక్కసారి ప్రజల హేళనకు గురిఅయ్యేరా మరి మీ రాజకీయ జీవితం ఆఖరయినట్లే."

సత్తిరెడ్డి కమ్యూనిస్టు నాయకుడు. ఆయనంటే వాళ్ళకెంతో భక్తీ అభిమానమూను. అయినా వెంకటయ్య తమ వివాహం జరక్కుండా

ఆటంకపరచడానికై తీసుకొచ్చిన కొత్తవాదంకాదు గదాయని ఓ నిము షం మనస్సులో బాధించకపోలేదు. కాని, ఏమీ అనలేదు.

సత్తిరెడ్డి వివాహసమస్యను కొంతకాలంవాయిదా వెయ్యమన్నాడు. ఈ గంద్రగోళం రోజుల్లో వివాహంచేసుకొనేకన్నా కొంతకాలం ఆగడం మేలు అన్నాడు. ఈ లోపున ప్రపంచం చూస్తారు. మంచిచెడ్డలు అర్థం చేసుకొంటారు. తర్వాత ఆ నాడు కూడా ఒకరిమీద ఒకరికి ఈనాడున్న ప్రేమాభిమానాలు నిలబడివుంటే పెళ్ళిచేసుకొందురుగాని,—అని ఆయన అన్నాడు. ఆ అభిప్రాయం కూడా వెంకటయ్యకు అనుమానమే కలిగిం చింది. తాను పాలేరు నవడం మూలంగా తమ వివాహానికి సత్తిరెడ్డి ఈ అభ్యంతరం తెస్తున్నాడేమో ననిపించింది. తన అనుమానం గురించి సత్తెమ్మతో మాట్లాడాలనుకొన్నాడు. కాని, సందుదొరకడం లేదు.

గఢీలోని బందిఖానానుంచి తప్పించుకొన్నాక అతడించుమించు ప్రతిదినం ఆమెనుచూస్తూనే వున్నాడు. అవసరం వచ్చినప్పుడు మాట్లా డుతూనూవుంది. కాని, ఎప్పుడూ వంటరిగా తారసిల్లకుండా వుంది.

ఇన్నాళ్ళకి ఒంటిపాటుగా దొరికింది. కాని, అతడామెను పలక రించడానికే బ్రహ్మప్రళయం అయ్యింది.

సత్తెమ్మే ముందు ఆ నిశ్శబ్దాన్ని భంగపరచింది. కాని. ఆమె అన్నమాట అతనికి బాధేకలిగించింది.

"నువ్వున్నావనుకో లేదు."

"అనుకొనుంటే అన్నం తెచ్చేదానివే కావేమో."

ఆమె బుద్ధిపూర్వకంగా తన్నుతప్పించుకు తిరుగుతూందని అతడూ ఎరుగును. అందుకే ఆ మాట అప్రయత్నంగా వచ్చేసింది. తీరా అన్నాక పశ్చాత్తాపం కలిగింది. పేచీతో సంభాషణ ప్రారంభిస్తున్నానే అను కున్నాడు.

వెంకటయ్య అన్నమాట సత్తెమ్మకు కష్టం అనిపించింది. నిజానికి ఆతని మాట అబద్ధంకాదు. తెలిసివుంటే వచ్చేదికాదు. కాని, ఆ మాటను ఒప్పుకోలేదు. కనక వూరుకొంది.

వెంకటయ్య కూడా ఏమీ మాట్లాడలేదు. చేతిలో తుపాకీ ఆమె చేతికిచ్చి అక్కడ నిలవబెట్టేడు. ఆమె తెచ్చిన మూటతీసుకొని తన దళ సభ్యుల కివ్వడానికై వెళ్ళిపోయేడు.

పుల్లవిరుపుమాట అని మనస్సు కలతపెట్టేనే అనుకొంటూ వెంకటయ్య విచారపడ్డాడు. మరల సంభాషణ ఏలా ప్రారంభించాలో అర్థం కాలేదు.

సత్తెమ్మ కూడా ఇంక కదిలించలేదు. వెంకటయ్య మనస్థితిని ఆమె ఎరుగును. ఏ మాత్రం కదిలించినా తమ పెళ్ళి సమస్యనే తెస్తాడని ఆమె ఎరుగును. ప్రస్తుతం దానిని పైకి రానివ్వడం ఇష్టంలేదు. కనక ఆతడు తిండితింటున్నంతసేపూ దూరం వెళ్ళి నిశ్శబ్దంగా నిల్చుంది. ఆమె కళ్ళు ఖానుడిపేట వూరుకేసీ, పుంతకేసీవున్నా మనస్సంతా తన వెనక అంతదూరంలోవున్న వెంకటయ్య మీదనేవుంది. ఎన్నో పర్యాయాలు ఆతడేం చేస్తున్నదీ తిరిగి చూద్దామనిపించింది. చీకట్లో ఏమీ కనపడనిమాట నిజమే. అయినా మనస్సులో ఆ కాంక్షతప్పలేదు. అతి కష్టం మీద మనస్సును నిగ్రహించుకొంది. ఆతడు భోజనం పూర్తిచేసేక తుపాకీ తిరిగి ఇచ్చేసి బయలుదేరింది.

ఒక్కమాటా, ఒక్కపలుకూ కూడ లేకుండ ఆలాగ విడిపోవడం ఇద్దరికీ బాధగానేవుంది. కాని, వెంకటయ్యే ముందు బయటపడ్డాడు.

"నడు. నేనూ అందాకావస్తా."

అది కేవలం మాటకలపడానికన్నమాట. దానికి సత్తెమ్మ ఇచ్చిన సమాధానం చురుక్కుమనిపించింది.

"ఈ వేళ ప్రొద్దున్న ఒకడు అందాకవస్తేనే కథ ఇంతవర కొచ్చింది. ఇప్పుడు మళ్ళీ నువ్వా......"

వెంకటయ్య సిగ్గుపడ్డాడు. కాలికి ఎదురుదెబ్బ తగిలినట్లయింది. ఆగేడు. కోపంవచ్చింది. మనస్సు బిగపట్టేడు.

సత్తెమ్మ రెండడుగులు వేసింది.

"ఒక్కమాట విను."

వెనక్కి తిరిగిచూడకుండానే సత్తెమ్మ నిలబడింది. వెంకటయ్య వచ్చి ఆమె ఎదురుగా దారిలో నిలబడ్డాడు.

"ఒక్క మాటకు సమాధానం చెప్పు."

సత్తెమ్మ గుండెలు గుబగుబలాడేయి. ఇంతవరకూ తాను తప్పించుకుతిరుగుతున్న ప్రశ్నరానే వచ్చింది.. సమాధానం దాటెయ్యాలని ప్రయత్నించింది.

"ఇప్పుడు కాదు. మరోమాటు......"

కాని, వెంకటయ్య ఎన్నాళ్ళగానో ఇటువంటి అవకాశం కోసం ఎదురు చూస్తున్నాడు. ఇంతకాలానికి సమయం దొరికింది. ఈ అవకాశం జారవిడవదలచుకోలేదు. ఆరునెలలక్రితం తనవిషయంలో సత్తెమ్మకున్న అభిప్రాయాల్ని మార్చుకొన్నదేమో తెలుసుకోవాలి. అడిగేడు.

కాని, అతడు తెలుసుకోదలచిందేది? పెళ్ళిచేసుకోదలచిన అభిప్రాయాన్నా? వద్దనుకొన్నదా?

ఆమె ప్రశ్నకు వెంకటయ్యకు చిరాకనిపించింది. ఎరిగివుండి హాస్యమాడుతూoదని గ్రహించేడు. ఆమె భుజంమీద చెయ్యివేసేడు.

"నీకు నిజంగా తెలియదా?"

తన కొంటె ప్రశ్నకు సత్తెమ్మ నవ్వుకుంది. తుపాకీ పుచ్చుకొని యుద్ధానికి సిద్ధం అయిన మనిషి తన ముందు మాటలకు తడుముకోవడం

చూస్తే ఆమెకు నవ్వూ, జాలీకూడా కలిగేయి. తన భుజంమీద పడిన చేతిని చేతితో నొక్కిపెట్టింది.

"సత్తిరెడ్డిగారితో మాట్లాడలేదా ?"

వెంకటయ్య ఆమె స్పర్శలో సంతృప్తి పొందేడు. ఆమె ప్రశ్నకు తల తిప్పేడు.

"ఆయన మాట నాకు నచ్చలేదు."

ఆ సంగతి సత్తెమ్మకూ తెలుసు జీవన్మరణ సంగ్రామంలోవున్న వాళ్ళు బాదరబందీలు పెంచుకోకూడదన్న అభిప్రాయం ఆమెకు నచ్చింది. వెంకటయ్య తన దృష్టిని ఏకాగ్రంగా దళాల నిర్మాణంమీద కేంద్రీకరించకుండా పెళ్ళాం, పిల్లలు, కుటుంబం ఓదికి దారి మళ్ళించడం మంచిది కాదన్నాడు...

సత్తెమ్మ ఆ వాదాన్ని ఒకదాని తర్వాత మరొకటిగా మళ్ళీ అందుకొంది.

కాని, వెంకటయ్య అభిప్రాయం రెండింటినీ ప్రత్యాఖ్యానంచేసింది.

"యుద్ధాలు జరుగుతున్నా కరువులూ, కాటకాలూవచ్చినా ప్రపంచం ఆగిపోతుందేమిటి ?"

కాని, ఆమె అభిప్రాయాలు వేరు.

"పోలీసుల గొడవా, రజాకార్ల గొడవా, అల్లరీ ప్రపంచాన్ని నడవనిచ్చేటట్లేవుందంటావా ?"

ఆ రోజున వుదయమే ఒక దళసభ్యుడు ప్రపంచం సరిగ్గానేవుందనుకొన్నాడు. కాని, మరుక్షణంలో తల ఎగిరిపోయింది.

వెంకటయ్య ఒప్పుకొన్నాడు. దృష్టిని నాల్గింటిమీదకి మళ్ళించే సమయం కాదని ఆతడూ అంటాడు. కాని, ఈ కారుచిచ్చు మధ్యనే ఎందుకుండాలని ఆతని ప్రశ్న. ఏలడానికి వూళ్ళులేక పోవచ్చు. కాని

కూలి చేసుకోడానికి లేవా? బెజవాడపోతే సరి. ఏ పనీ దొరక్కుంటే రిక్షా లాక్కు బతకొచ్చు. పనే దొరక్కపోతుందా? తనకు రావలసిన జీతం క్రింద రంగయ్య మూడొందలిచ్చేడు. అంతక్రితానిదో రెండువందలుంది. అదీఇదీ పెట్టుకొని సుఖంగా రోజువెళ్ళ దీయొచ్చు.

సత్తెమ్మ ఆ ప్రతిపాదనకు చక్రుమంది. బెజవాడ ప్రయాణంలో తనను లేచి రమ్మన్న అర్థం స్ఫురించింది. వూళ్ళోవుండి నిగ్రహించి పెళ్ళిచేసుకొని బ్రతకడం వేరు. ఇల్లువిడిచి పారిపోవడం వేరూను. అది ఆమెకు అసహ్యకరంగా కనిపించింది. కాని, నిగ్రహించుకొంది.

పైగా బెజవాడ వెడితే సర్వం భద్రమే ననుకొనే ఆతని అమాయికపు ఆలోచనలకు ఆమె విచారపడింది. అక్కడ మాత్రం పోలీసులు లేరా? వాళ్ళు మాత్రం తక్కువ తిన్నారా? అక్కడ వారిగిస్తున్న దేముంది? అన్నింటికీ ధరలు పైసాకి పైసా పెంచేసేరట. అక్కడి కెళ్ళినవాళ్ళని అడిగింది. రిక్షాలాక్కు బ్రతుకుదామంటే మాత్రం బ్రతకనిస్తారా? కూలి వచ్చినా రాకున్నా రూపాయిన్నర రోజుకి రిక్షాదొడ్డివానికివ్వాలి. పోలీసువాళ్ళు కేసులు పెట్టకుండా మామూళ్ళు, ఊరికే మొయ్యడమూ తప్పదు. ఈ లోపున రిక్షా కట్టించుకొని ఏదో ఇంటిదగ్గర దిగుతారు. వీధిలో తననువుంచి దొడ్డిదారిని వెళ్ళిపోతాడు. ఆ డబ్బులూరావు. మరోపనీ చూసుకోకుండా పడిగాపులు పడివుండడం, అదో దండుగ. మోసగాళ్ళూ, పీక్కుతినేవాళ్ళూ ఎక్కడ మాత్రం తక్కువ?

ఆ సత్యం ఆమెకు గోచరించి ఎన్నో రోజులు కాలేదు. ఆ మాటచెప్పింది.

తాను ఒకనాడు పెళ్ళిచేసుకోవడమే జీవితానికి గమ్యం అనుకుంది. ఆ ఎగలో అయితే బెజవాడే కాదు ఢిల్లీ పోదామన్నా బయలుదేరేదే. అంతకు పూర్వం తమ్ముడి ఆస్తి కాపాడడం, ఆతనిని చదివించడం,

ఓ యింటివాడిని చెయ్యడం ఓ పరమార్థంగా వుండేది. ఇప్పుడున్న అభిప్రాయాలు వేరు.

ఇల్లూ, పొలమూ తప్ప ప్రపంచం ఎరగని అమాయకురాలుకాదు. ఈ ఆరేడు నెలలలో ఆమె నూరేళ్ళ అనుభవాల్ని చూసింది. చూడడం అయితే ప్రతివాళ్ళూ చూస్తున్నారు. కాని, ఆ చూచినవాని అర్థం ఏమిటో కమ్యూనిస్టుపార్టీ చెప్పింది. వాళ్ళమాటలు తెరతీసినట్లు సర్వం చూపేయి.

ఈవేళ తెలంగాణా గొంతు నులమడానికై నాలుగువేపులనుంచీ చేతులు సాగుతున్నాయి. తరతరాలుగా చేసుకొంటున్న భూములనుంచి తరమడానికై దేశముఖులు కత్తికట్టేరు. ఒంట్లో బలం, ఆలోచించేశక్తీ లేకుండా చెయ్యడానికి రజాకార్లూ, నిజామూ తలపెట్టేరు. ఒకరికొకరు వత్తాసు. ఇద్దరిచేతుల్లో నలిగి చావకుండా ప్రజసర్వశక్తులూ కూడదీసుకొంటూంది. ఈ యుద్ధంలో తామంతా చిక్కుకున్నారు. దీని ఫలితాన్ని తామంతా అనుభవించాలిసిందే. అందులో కలియనీ, మాననీ దాని కష్టనష్టాలు అనుభవించక తప్పదు.

ఇవి చూసేక ఆమె మనస్సుండబట్టిందికాదు. ఈనాటి పరిస్థితులలో బ్రతుకు దుర్భరం అనుకొంది. అయితే గతంలో బ్రతుకు బాగుండేదనీ, ఇప్పుడు చెడిందనీకాదు. గతంలోకూడా జీవితం ఏమీ బాగులేదు. అయితే ఆసంగతి తమకు తెలియదు. ఇప్పుడు తెలిసింది. తెలుసుకొన్నాక సుఖజీవితంకోసం ఆతురత ఎక్కువయింది. అక్కడే ప్రమాదం వచ్చిపడింది.

ఈ ఆదుర్దా ఎందరికో ఇంకా వ్యాపించలేదు. కొద్దిమందిలోనే వుంది. వాళ్ళని నలుగుర్నీ నలిపేస్తే పీడాపోతుందని నిజామూ, దేశముఖులూ ఆలోచిస్తున్నారు. వాళ్ళకి దొరికితే చంపేస్తారు. వాళ్ళకి చంపాలనేవుంది. కాని ఆమెకు చావాలనిలేదు. బ్రతకాలనుంది. బ్రతకాలంటే వాళ్ళమీద కత్తి దుయ్యాలిసిందే. అది తానొక్కర్తే చెయ్యగలపనికాదు.

తనలాంటివాళ్ళని పదిమందినీ చేర్చుకోవాలి. వాళ్ళల్లోకూడా సుఖం ఎక్కడుందో ప్రచారంచెయ్యాలి. జ్వాలలమధ్యే నిలబడాలి. వాటినార్పి, చల్లార్చుకొని సుఖమయజీవితాన్ని కల్పించుకోవాలి.

ఆవాగ్ధోరణికి వెంకటయ్య నిరుత్తరుడయ్యేడు.

బెజవాడవెళ్ళినా, చాందావెళ్ళినా, తెలంగాణాలోనేవున్నా పోలీసులస్వభావం ఒక్కలాగేవుంది. బ్రిటిష్‌వాళ్ళనాటి పోలీసుల్నే కాంగ్రెసువాళ్ళూ వాడుకొంటున్నారు. కుక్క గౌరీకళ్యాణం పాడదు. అక్కడ సమస్య పాడగల్గుతుందా అనేదికాదు. అసలు పాడదు. మరి ఆతనికా ఆశ ఎందుక్కలిగింది ?

సత్తెమ్మ ఆశ విషయంకూడా ఆలోచించడంలేదు. అవసరం ఏమిటనే ఆమె ప్రశ్న.

పోలీసులసంగతి వొదులుదాము. వెంకటయ్య చెప్పినట్లు బెజవాడే పెడతాము. రిక్షాలాగే బ్రతుకుతాము. ఏవో తంటాలుపడతాము. కాని, అక్కడి సమాజంలో తమస్థానం ఏమిటి ? తమకు గౌరవం ఏముంటుంది ? అదీ తెలుగుదేశమేకావచ్చు. తమ పొరుగురాజ్యమేకావచ్చు తమమాట ఒకటేకావచ్చు. కాని, అక్కడ తామెవరు ? తమవూళ్ళో తమరినందరూ ఎరుగుదురు. తామూ అందర్నీ ఎరుగుదురు. పేచీలలో వున్నా ఏదో కొంత్రవుంది. అదికూడా లేకపోయినా తామాగడ్డమీద పుట్టేరు, పెరిగేరు, పనిచేసేరు. మర్యాదో, అమర్యాదో తామూ ఆవూళ్ళోవాళ్ళల్లో ఒకళ్ళు. తమకు బెజవాడలోలేని స్థానబలం ఇక్కడుంది.

వెంకటయ్య నిరుత్తరుడయ్యేడు. సమాధానం అనవసరం అన్నట్లు సత్తెమ్మ చరచరా నాలుగడుగులు వేసింది. మరల ఏదో గుర్తువచ్చింది. ఒక్క క్షణం ఆగి తిరిగి వచ్చింది.

"భయంగావుందా ?"

ఆ ప్రశ్నకు వెంకటయ్య కష్టపెట్టుకొన్నాడు. పౌరుషం అనిపించింది. ఏదో అనబోయేడు. సత్తెమ్మ వారించింది.

"తప్పేంలేదు. ఒక్కటిమాత్రం గుర్తుంచుకో, దళాలలో వుండలేకపోతే వదలిపోవడంమేలే. కాని, ఒక్కటి; ఇక్కడ నిన్నెవరూ ఇబ్బందిపెట్టరు. పోయేముందు చెప్పివెళ్ళు. అవసరమైన సర్దుబాట్లు చేసుకొంటారు."

ఆమాత్రం సలహాఇచ్చి సత్తెమ్మ చరచరా వెళ్ళిపోయింది.

వెంకటయ్య నిస్తబ్దుడై ఆమె పోయినవైపే చూస్తూ చాలసేపటి వరకూ అక్కడే నిలబడి పోయేడు.

---

# మూఁడో ప్రకరణము.

రజాకారుమూక లారీలెక్కగానే ఆ వార్తని దళం అందించింది. చిన్న చిన్న పిల్లగాళ్ళు తలోచెట్టు చాటునుంచీ చూచి ఆ వార్తని ధృవపరుస్తున్నారు. ఇంక ఇరుగు పొరుగూళ్ళల్లోనూ పేటల్లోనూ పది పన్నాలుగు గంటలుగా తలదాచుకొంటున్నవాళ్ళు ఒక్కొక్కళ్ళే లేచేరు.

గత దినం మధ్యాహ్నం సిద్ధాన్నాలు వదులుకొని లలోడారీ అయ్యేరు. ఈ ఇరవై నాలుగ్గంటల్లో ఏది ఏమయిందో ఎవ్వరూ ఎరగరు. ఇళ్ళూ వాకిళ్ళూ స్వహపాలన్నా మిగిల్చేరాయని ఆదుర్దా. ఆ ఆదుర్దాతో పరుగెత్తుకొని వచ్చారు. వచ్చిచూచిన దృశ్యాలకు కడుపులోంచీ తెపు ల్చుకు వచ్చింది. అదే విసురున వీధిలోపడి ఓకన్నారు.

ఇళ్ళన్నీ అస్తవ్యస్తంగావున్నాయి. కొన్నిచోట్ల తలుపులపేళ్ళాడదీసేరు. కొన్నింటికి పెణకలు పీకేసేరు. అన్నిచోట్లా చట్లూ, కుండలూ

పగలేసేరు. ఇత్తడివస్తువన్న దొక్కయింట్లోనూ కనబడ్డంలేదు. అన్నీ లారీలకెక్కినట్లే కనిపిస్తుంది.

గ్రామరక్షణ దళంలో చేరినవారి ఇళ్ళమీద రజాకార్ల కసి బాగా కనబడింది. వాళ్ళ యిళ్లు ఒక్కటీ కనబడ్డంలేదు. అన్నీ నేలమట్టం చేసేరు. ఇతర యిళ్ళల్లో వస్తువులు పోయినా వాటికి ఆకారాలున్నాయి. ఇక్కడవీలేవు. ఆ యిళ్ళమీదున్న ఆకులుతెచ్చి వీధిమధ్యనపడేసి తాము చంపిన వాళ్ళిద్దర్నీ వానితో తగులబెట్టేరు.

ఆ దృశ్యం భయానకంగావుంది. తాటాకుల మంటల్లో సగం సగం కాలిన శవాలచుట్టూ దుఃఖకాతర నేత్రాలతో గ్రామప్రజ యావన్మందీ నిలబడ్డారు. వర్షంలో తడిసి వణుకుతున్నప్పుడూ, ఆకలికి అలమటిస్తున్నప్పుడూ తిట్టిపోసినా ఆ మందభాగ్యుల శవాలముందు తాము పడిన కష్టాలన్నింటినీ మరచిపోయేరు.

నవనవలాడుతూ ఎక్కివస్తున్న జీవలతలు మొదలంటాకోసి మంటేసేరు. ఆఖరుసారు గ్రామస్థులకు కనబడ్డప్పుడు జీవం తొణుకుతున్న ఆ యువతీయువకు లిప్పుడు ఉబ్బి వికృతాకారాలతో కుళ్ళుకంపు కొడుతున్నారు.

గవరమ్మ తల్లి గర్భశోకంతో ఏడుస్తూనేవున్నా ఆ చావు సంభవించిన అప్రతిష్ఠాకర పరిస్థితుల్ని మరచిపోలేకుండావుంది. నోరు నొక్కుకుంటూంది.

"ఎంత అప్రతిష్ఠ తెచ్చేవేతల్లీ !"

ఆమెను తప్పుదారి పట్టించిన దళసభ్యుణ్ణీ, ఆతనితోపాటు దళాన్నీ కలిపి తిడుతూంది.

చచ్చిపోయిన నారాయణయ్యా తల్లి తన కొడుకు అర్ధాంతరం చావుకు గవరమ్మే కారణంఅంటుంది. ఆ అమ్మవారు తల్లి ఆ దిక్కుగా

వెళ్ళకపోతే తన కొడుకు పదికాలాలపాటు బ్రతికేవాడేనని ఆమె నమ్మకం.

ఆ తిట్టుబోతుతనం అందరికీ అప్రతిష్ఠేనని జనం చెప్పుకొనేరు. కాని ఏ కుటుంబానికా కుటుంబమే ఆ అప్రతిష్ఠకూ, అకాల మరణానికీ కారణాన్ని ధృవపరచేటందుకు చేసిన ప్రయత్నాలు వినేవాళ్ళకి చెవులు తడకలు కట్టించేయి. విసుగేసింది. శవాలు అప్పటికే వాసనపట్టేయి. వాటికి వెంటనే సంస్కారం చేసేస్తేతప్ప వూళ్ళో మరోపని చెయ్యడానికి వీలులేదు. ఆ వీధిలోవాళ్ళు అసలు పొయ్యి వెలిగించడానికే వీలు లేదు. కనక ఆ కార్య కారణసంబంధాలేవో వాళ్ళనే నిర్ధారణ చేసుకోమని వదలిపెట్టి, మిగిలినవాళ్ళు దహనసంస్కారం జరిపేసేరు.

వీధిలో కనబడినది భయంకరదృశ్యమయితే ఇళ్ళల్లో కనిపించినవి పరమాసహ్యకర దృశ్యాలు. ఆ ఇళ్లు కాపురం వుండడానికి పనికి రాకుండా చేసేటందుకు రజాకార్లు పోటీపడ్డట్లు తోచింది. అయితే వారి సంఖ్య పరిమితం. దానితో వారు చేయగల అసహ్యమూ పరిమితమే. వీలయినంత వరకు చేసేరు.

తల్లి వెనక్కాలనే కోటమ్మ ఆయింట్లో అడుగుపెట్టింది. కాని, దుర్వాసన భరించలేక వీధిలోకి పారిపోయివచ్చింది. అన్నపుకుండ నడి వాకిట్లో పగలేసివుంది. మెతుకుల్ని కాకులు ఏరేసేయి. పెంకుల్ని కుక్కలు నాకేసేయి. వాకిలి, పంచా పరమాసహ్యంగావున్నాయి. కనీసం ఓ అరడజను మందికైనా కలరావచ్చి వుండాలనిపించింది.

తల్లి నిశ్చేష్టురాలయింది. ఇల్లు కావాలంటే అశుద్ధాలు ఎత్తుకోవాలి. ఏంగతి తెచ్చిపెట్టేవురా భగవంతుడాయని వలవల లాడింది.

మేనల్లుళ్ళూ, మేనకోడళ్ళూ తిండికి గోలచేస్తూంటే కోటమ్మ వాళ్ళని సముదాయిస్తూంది. తమ్ముడిభార్య మూలలు వెతుకుతూంది. గదిలో ఓ మూల కడవ పాతేసివుంది. లేవీపసూళ్ళకొచ్చినవాళ్ళ కళ్ళల్లో పడ

కుండా కొద్దిగానైనా ధాన్యం దాచేవారు. అందులో ఏదున్నా మిగిల్చేరేమోనని తోయి చేయిపెట్టింది. గింజలున్నాయి. కాని, వాటినికూడా పాడు చేసేరు. తేలుకుట్టినట్లు ఆమె వెర్రికేకపెట్టి దొడ్లోకి పరుగెత్తింది.

కోటమ్మ రజాకారు మూకల అసహ్యాకర ప్రవర్తనకు వుడుకెత్తిపోతూంది. ఇంకోవేపునుంచి శశిరేఖకూడా ఏ యింట్లోనన్నా గింజలు దొరుకుతాయేమోనని వెతుకుతూంది. కనీసం చిన్నబిడ్డలకేనా ఇంత తిండి పెట్టాలని ఆమె ఆలోచన.

ఒక్కగంట పరిశీలన అనంతరం తేలిందిది. వూరుమొత్తంమీద చారెడుగింజలుకూడా పనికిరావు. పట్టుకుపోయినన్ని పట్టుకుపోయేరు. కొన్నిచోట్ల వాటిని అసహ్యం చేసేరు. చాలచోట్ల అన్నిరకాల గింజల్నీ కుప్పగాపోసి కిరసనాయిలుతోతడిపి పుల్లగీసేరు.

ఉన్నబాధ అదొక్కటేకాదు. ఎక్కడన్నా చారెడుగింజలు దొరికినా గంజికాచుకొందామన్నా ఏమీలేదు. అన్ని కుండలూ, చట్లూ పగలకొట్టేసేరు. ఊళ్లో కుమ్మరివున్నాడు. ఆ యింటి పడుచువాళ్ళల్లో ఒకడు గ్రామదళంలో వున్నాడు. ఆ కసితో ఆ యిల్లుపీకేసేరు. ఆవంలాగేసేరు. కాల్చినవి, తయారవుతున్నవి, పచ్చివి, అన్నీ నలగ్గొట్టిపారేసేరు. కనీసం వారంరోజులేనా శ్రమపడితే తప్ప ఆ యింటివాళ్ళొక్క పిడత కూడా ఇవ్వలేరు.

ఇంచుమించు మగవాళ్ళంతా చచ్చిపోయినవాళ్ళకి దహనసంస్కారాలు జరిపించడానికి శ్మశానానికెళ్ళేరు. కొందరు పీకేసిన ఇళ్ళని మళ్ళీ నిలబెట్టడం ఎల్లాగయని ఆలోచనలో పడ్డారు.

తంద్రులదగ్గర చనువున్న పిల్లలుకూడా ఆకలివేసేటప్పటికి తల్లిని అంటిపెట్టుకొనే ఏడుస్తారు. వాళ్ళెరిగివుండేది ఆకలొకటే. ఆ ఆకలి తీర్చేది ఎప్పుడూ అమ్మే. అందుచేతనే తల్లి ఏమీ చెయ్యలేని స్థితిలో

వీపు చిట్లగొట్టినా వాళ్ళామె కొంగు వదలరు. కొంప లంటుకొన్నంతగా ఏడుస్తారు. ఎక్కడో ఇంత మేతతెచ్చి పడేస్తేతప్ప వాళ్ళపోరు అణగదు.

ఘానుడిపేట ఆడవాళ్ళు ప్రస్తుతం అదే విముక్తిమార్గం వెతుకుతున్నారు. కాని, ఏమీ ఆధారం కనబడ్డంలేదు. పటేల్ మల్లారెడ్డి సత్యాగ్రహం చేసేక ఆయనకుటుంబం బెజవాడకు కాపురం ఎత్తికట్టేసింది. కాస్త జరుగుబాటున్న మరో రెండు మూడు కుటుంబాలు వరసగా సర్దుకొన్నాయి. పట్వారీ పక్కవూళ్ళోకెళ్ళేడు.

రామచంద్రయ్య ఇంటినికూడా రజాకార్లు వదలలేదు. ఆయనకూడా వాళ్ళరాకతో ఊరు దాటేసినవాడే. ఇప్పుడే తిరిగి వచ్చేడు. చూసుకొంటే ఇల్లంతా ఖాళీ.

గబగబ పక్కవూళ్ళోవున్న నందయ్య షావుకారువద్దకు పరుగెత్తేడు. నందయ్య గింజలు లేవని గునిసి గునిసి రెట్టింపుధర తీసుకొని కావాలన్నదాంట్లో సగం గింజలిచ్చి పంపేడు.

ఈవార్త వినేసరికి అంతా భయపడ్డారు. చివరి ఆశగా నందయ్యాసేవారు అట్టే చూస్తున్నారు. ఆతడే గింజలు లేవన్నాడంటేనూ, హెచ్చు ఖరీదు చెప్పేడంటేనూ, అందరికీ గుండెల్లో రాయిపడింది.

వాళ్ళందరికి నిన్నరాత్రి తిండి పెట్టించడంలో నందయ్యకూడా సాయపడ్డాడు. ఓ బుడ్డెడు గింజలు పంచేడు. తన యింట్లో నలుగు రైదుగురికి అన్నం పెట్టేడు. అన్నింటికన్నా ఎక్కువగా వాళ్ళకష్టాలలో సానుభూతిని తెలిపి, ఓదార్చేడు.

కాని, అమ్మకం విషయం వచ్చేసరికి ఆతడు ధర ఎక్కువ చెప్తున్నాడనీ, అసలే లేవంటున్నాడనీ వినేసరికి శశిరేఖ ఆశ్చర్యపడింది. కోటమ్మ మండిపడింది.

"లేవేం ?"

"ధాన్యంవుంటే ఎందుకు లేవంటాడులే."

గతరాత్రి అంత మంచితనం చూపినవాడు దగ్గర గింజలుంటే లేవం టాడా ? జనం పడుతున్న కష్టాలకి అంత సానుభూతి చూపినవాడు సమ యం వచ్చిందికదాయని ధర ఎక్కువచెప్తాడా?—అని శశిరేఖ అనుమానం.

కాని, నిజంగా గింజలుంచుకొనే నందయ్య లేవన్నాడనీ, ఆ అబద్ధం ఎక్కువధర లాగడానికేననీ ప్రత్యక్షంగా కనిపించేవరకూ శశిరేఖ నమ్మ లేదు. తాను స్వయంగా చూసేక నందయ్య నంత సులభంగా పోనివ్వ డానికి వీలులేదని గంద్రగోళం చేసింది.

గ్రామంలోవున్న ఆడవాళ్ళనీ, పిల్లల్నీ కోటమ్మ కదిల్చింది.

"లేకపోవడం ఏమిటో, ధర ఎక్కువచెప్పడం ఏమిటో కను క్కుందాం, రాండి."

ఆమె హుషారుతో జనం కదిలేరు.

గ్రామంలోని ఆడవాళ్ళనీ, పిల్లల్నీ తీసుకొని కోటమ్మ గుమ్మం ముందు హాజరయ్యేసరికి నందయ్య కంగారుపడ్డాడు. తనవద్ద పిడికెడు గింజలుకూడా లేవని నందయ్య ఏడ్పుమొహం పెట్టేడు. గత దినం తూమెడు గింజలిచ్చేనని తన నిజాయితీకి నిదర్శనలిచ్చేడు.

"నువ్విచ్చింది బుద్దెడే. తూమెడెక్కడయ్యా!"

తన అబద్ధం పట్టుబడినందుకు నందయ్య సిగ్గుపడలేదు.

"ఆ బుద్దెడుమాత్రం ఇవ్వడం మాటలా ?"

కోటమ్మ వొప్పుకుంది. "మంచివాడి వంటున్నాంగా, అల్లాంటిది చెడ్డపేరెందుకు తెచ్చుకోడం ?"

కోటమ్మను వదల్చుకోవడం అంత సులభం కాదని ఆతడెరుగును. చిన్నప్పుడు తన కొట్టుమీద పరుకులు కొనేటందుకువచ్చేది. ఆమెకు ఏ

బెల్లమ్ముకోక, బల్లిగుడ్డో లంచం పెడితేగాని, కదిలేదికాను. పెట్టనని కసిరితే వినిపించుకొనేదికాదు. లేదంటే ఎక్కడేంవుందో తనకన్న ఆమెకే బాగా తెలిసినట్లు అదిగో అదక్కడుంది, ఇదిక్కడుందని చూపించేది.

సరిగ్గా చిన్ననాటి కోటమ్మనే నందయ్య నేడు చూసేడు. ధాన్యం తాను లేవంటే, ఇంట్లో జొరబడి వెతకమని జనాన్ని పిలుస్తూంది.

నందయ్య పెళ్ళాం ఆమె మొండితనానికి మండిపడింది.

"ఎవరబ్బ మూటన్నా దాచిపెట్టేవా ?"

అబ్బమూటలూ, అయ్యమూటలూ వరకూవస్తే కోటమ్మముందు నిలబడ్డం అంత సులభంకాదు. కంచు జేగంటలా ఆమెకంఠం మ్రోగుతూంటే మరో గొంతు వినబడ్డం సాధ్యంకాదు.

గుగ్గిళ్ళమ్మకు బ్రతికిన రోజుల్లో వూరివాళ్ళదగ్గరా, చుట్టపక్కల వాళ్ళదగ్గరా నీ యబ్బమూట దాచిపెట్టేవనే చుట్టూ తిరిగేవాయని కోటమ్మ అంటూంటే నందయ్య భార్య నోరు తెరిచింది.

నలభయ్యేళ్ళనాడు నందయ్య పైగుడ్డతో ఖానుడిపేటవచ్చేడు. ఆతని వెనకనేవున్న పడుచుపెళ్ళాంచేతిలో రెండో బట్టకూడాలేదు. పటేల్ అను మతితో సెనగగుగ్గిళ్ళ అమ్మకంతో ప్రారంభమైన ఆతని వర్తకం పదేళ్ళలో చిల్లరకొట్టు అయింది. పాతికేళ్ళకి ధాన్యం, వ్యవసాయ పంటలు కొనుగోలు చేయడంవరకు వచ్చేడు. పెద్దరెడ్డి పక్కనే కాపురంచేస్తూ వర్తకం పెంచడం సాధ్యంకాదనిపించి కాపురం పక్కవూళ్ళోకి మార్చేడు. కాని ఖానుడిపేట కంతకూ ఏ సరకు కావలసినా నందయ్య కొట్టేగతి.

నలభయ్యేళ్ళనాటి గాధల్ని తవ్వుతూంటే నందయ్య భార్య తలుపుకు జేరగిలబడిపోయింది.

కోటమ్మదృష్టి నందయ్యమీదకు మళ్ళింది. "మామా ! ఇంత పొట్టపెంచేవు. ఆశ తీరలేదా, పూటకు తికానాలేని వాళ్ళగొంతులే నుల మాలా ?"

—నందయ్య బొజ్జమీద చూపుడువేలుతో ఒక్కపోటు పొడిచింది. ఆ చనువుచూసి నందయ్య దిగ్భ్రమచెందేడు. ఆమెతో వచ్చినవాళ్ళు కిల కిల నవ్వేరు.

గింజలు బయట పడెయ్యనిదే కదలనని కోటమ్మ లోగుమ్మంలో చదికిలబడింది. బయిట కూర్చుండే నందయ్య లోపలదూరి తలుపేసు కోనచ్చు.

కోటమ్మ మొండితనంకన్న వాకిట్లో రక్షణదళ సభ్యుల సాక్షాత్కారం నందయ్యని త్వరగా ఒక నిర్ణయానికి వచ్చేటట్లు చేసింది.

భాగ్యరెడ్డి నిలిపెడు బాణాకర్ర తీసుకొనివచ్చి వాకిట్లో నిలబడ్డాడు. పిడిలో బుట్టలూ, చిరుగుల గుడ్డలూ తీసుకొనివున్న జనంవంకా, అరుగు మీదవున్న నందయ్యవంకా మార్చి మార్చి చూసేడు.

ఆతనిని చూడగనే నందయ్యకు ధైర్యం సడలింది. కాని, బింకం మానలేదు.

"అరుగో రెడ్డిగా రొచ్చేరు. వీళ్ళూ, వీళ్ళ దళమూలేకపోతే ఈ దురదృష్టంకూడా వుండేదికాదు. అడగండి, ఆయన్నే."

కోటమ్మ ఒక్క గదుముగదిమి ఆతనినోరు కట్టేసింది.

భాగ్యరెడ్డి ఘోటిక ఎక్కేడు. అదివరకే పురమాయించిన పనిని గురించి అడిగినట్లు మూట ఎక్కడుందో చూపిస్తే బయట పడేస్తా నన్నాడు.

"ఎందుకు ఆలస్యం ?"

నందయ్య ఇంక మాట్లాడలేదు. అసలేలేవన్నమాట మానేసేడు. కొద్దిగానే వున్నాయన్నాడు. తలో శేరూ, రెండు శేర్లూ కొలిచేడు. గత దినం అమ్మినరేటునే డబ్బు చేతిలో పెడుతూంటే ఎంతోఆస్తి కొల్లపోయి నట్లు విచారించేడు. చేతిలోపడిన డబ్బులకేసీ, ఇచ్చిన మొగాలకేసీ మార్చి మార్చి చూసేడు.

"ఇల్లాఅయితే వర్తకం చెయ్యలేను."

భాగ్యరెడ్డి ఆ బెదిరింపు నర్థంచేసుకొన్నాడు. రజాకార్లు ఎక్కడ పడితే అక్కడ విజృంభిస్తూండడం, ధాన్యం రవాణాలమీద ప్రభుత్వపు నిషేధాజ్ఞతో, గ్రామాలలో కరువు పరిస్థితులు ఏర్పడ్డాయి. వాటిని చూపించి వర్తకులు ధరలు పెంచేస్తున్నారు. వాటిని కొంతవరకయినా అదుపులో పెట్టేటందుకు దళాలు ఆలోచనలు ప్రారంభించేయి. ధాన్యం తెమ్మని భాగ్యరెడ్డి నందయ్యను ప్రోత్సహిస్తూ రెండు మూడు మార్లు మాట్లాడి వెళ్ళేడు. నందయ్య ఆ చర్చలనే జ్ఞాపకం చేస్తున్నాడు కాని, భాగ్యరెడ్డి ఏమీమాట్లాడలేదు. ఇది చర్చలకు సమయంకాదు, పద్ధతీఇదికాదు.

పొద్దుటినుంచి జనాన్ని ఏడిపించినందుకు నందయ్యకు తగినశాస్తి చెయ్యాలని శశిరేఖ సలహా ఇచ్చింది.

"రేపు మళ్ళీ ఇంతరభస జరగవలసిందేనా ?"

అందరికీ ఉన్నంతవరకు తలో బుడ్డెడూ, తూమెడూ కొలిపించేస్తే వదిలి పోతుంది_అని ఆమె అభిప్రాయం.

డబ్బులా ? వున్నవాళ్ళు ఇచ్చేస్తారు. తరవాయి ఏమున్నావుంటే నాలుగు రోజుల్లో ఇచ్చేస్తారు......

కాని, ఆమె సలహా ఎవరినీ ఆకర్షించలేదు. ఆ మాటలు గట్టిగా అని జనాన్ని కదలించే ధైర్యమూ, శక్తీ ఆమెలో లేవు. గొణిగితే ఎవ్వరూ వాటిని పట్టించుకోలేదు.

కోటమ్మకూడా ఆ సలహాను నిరాకరించింది.

ఇదేదో ఈ ఒక్కరోజుతో అయ్యేపనికాదు. నందయ్య ధాన్యం తీసుకురాక మానడు. జనం కొనకతప్పదు. ఈవేళో బుద్దెడు గింజలు తీసుకొంటే బ్రతుకు వెళ్ళమారిపోదు. ఇప్పుడే నందయ్యని బెదరగొట్టి లాభంలేదు......

కోటమ్మ సర్దుబాటు విని శశిరేఖ అశ్చర్యపడింది. తాను ప్రొద్దుటి నుంచీ చూస్తున్న మనిషికీ ఈమెకూ పోలికలే కనబడలేదు. జనానికింట్లో తిండిగింజలు లేవన్న క్షణంనుంచి కోటమ్మ రాకాసిలా ఎగిరి పడిపో తూంది! ఇదెక్కడి ఆడది? దీనితో ఆ మొగుడు పీనుగ ఎల్లా వేగ గలడోయని ఆమె మంగసతి విషయంలో అనేకమార్లు జాలిపడింది.

కాని, నిన్నటినుంచీ తనకు ఏర్పడిన అభిప్రాయం మాత్రం ఆమె మనస్సును పూర్తిగా వదలడంలేదు. చెట్టు కొకరూ, పుట్ట కొకరూగా వున్న జనాన్ని సురక్షిత స్థానాలకు చేర్చడంకోసమూ, వాళ్ళకి తిండి తిప్పలు చూడడం కోసమూ సత్తెమ్మా కోటమ్మా పడుతున్న కష్టాన్ని కళ్ళతో చూసేక వాళ్ళ విషయంలో తనకున్న అభిప్రాయానికి శశిరేఖ సిగ్గుపడింది. సత్తెమ్మ తాను ఈసడించినా అసహ్యించుకోకుండా మళ్ళీ వచ్చి తన విషయంలో చూపిస్తున్న శ్రద్ధకు చాల కృతజ్ఞత చూపింది.

వాళ్ళు తనకేకాదు, ఖానుడిపేట వాళ్ళల్లోకూడ జీవంపోసేరు. అంతవరకూ దిగాలుపడి నిరుత్సాహంతోవున్న జనంలో వాళ్ళు ఆవేశం పుట్టించేరు. కదిలించి పక్కవాళ్ళని కదిలించేలాగ చేసేరు. ఒక్కొక్క రినే పక్కనున్న పల్లెలలో సద్దేరు. బియ్యం, జొన్నలూ ఏవీ కంటబడ కుండా వున్న దశలోకూడ ఎక్కడెక్కడికో మనుషుల్ని పంపేరు. ఏవో ఇన్నిగింజలు తెచ్చేరు. అందరికీ గంజి పోసేరు.

తమతోపాటు సీతారాంపురంనుంచి ఓఅరడజనుమంది దళసభ్యులు కూడా వచ్చేరు. ఖానుడిపేటవాళ్ళకి సాయం నిలబడ్డారు. కాని, శశిరేఖకు

అక్కడిజనాన్ని నిజంగా అనుకొన్నది తాను దండుముండలుగా జమకట్టిన ఈ ఇద్దరే అనిపించింది. వారియెడ తనకుగల అసహ్యభావాన్ని మరచింది.

కోటమ్మ ఆర్భాటం మరల మొదటి అభిప్రాయాన్ని పూర్తిగా పునరుద్ధరించలేకపోయింది. ఇప్పటి సమాధానం వినేసరికి ఆమెలో ఆ రాకాసి స్వభావం ఏమీ కనబడలేదు.

తమ మాటలు వింటున్న భాగ్యరెడ్డి చిరునవ్వుతో తన ముఖం వంక చూస్తూంటే శశిరేఖ సిగ్గుపడింది. ఆనవ్వు అంతరార్థం స్పష్టమే. దానికి సమాధానమా అన్నట్లు శశిరేఖ కోటమ్మచేయి పట్టుకొని బయలుదేర తీసింది.

"లే, పిన్నీ!"

---

## నాలుగో ప్రకరణము.

ఇంతదూరం వచ్చేనుగనక ఓమారు మంగళంపల్లివెళ్ళి పుట్టింటివాళ్ళను చూసి వస్తానని శశిరేఖ భర్తతో చెప్పింది.

మంగళంపల్లి వరకూ దిగబెట్టడానికి భాగ్యరెడ్డి ఏర్పాటుచేసేడు. కాని, ఆమెకు హఠాత్తుగా పుట్టింటికి వెళ్ళాలనే అభిప్రాయం ఎందుక్కలిగిందో ఆతనికి అర్థంకాలేదు. ఖానుడిపేటమీద దాడిచేసింది మంగళంపల్లి జాగీర్దారు కొడుకు రాఘవరెడ్డేనని తాను చెప్పినమాట ఆమె ప్రయాణానికి కారణమై వుండొచ్చుననికూడా ఆతనికి తోచలేదు. ఆలా తోచే అవకాశంలేదు.

కాని, రాఘవరెడ్డి ఫలానా అని తెలుసుకొన్నాకనే శశిరేఖ మంగళంపల్లి ప్రయాణమైంది. రెండురోజులుగా ఆ హత్యాకాండ సాగిం

చినవాని పేరు వింటూనేవున్నా అతనిని గురించి ఆమె శ్రద్ధచేయలేదు. రెండోరోజున మగడినోట హత్యల కథ వింటూంటే ఆ హంతకుడి విషయం గుర్తువచ్చింది.

అతడి సవతితల్లి తన పినతల్లికూతురే. జాగీర్దారు చంద్రారెడ్డి వృద్ధాప్యంలో ఏం దుర్బుద్ధిపుట్టిందో ఒక రోజున ఆమెను తీసుకుపోయి పెళ్ళి చేసేసుకున్నాడన్నారు. అప్పటికి తాను పెళ్ళయి అత్తవారింట్లో వుంది. బీదవాళ్ళతో సంబంధం పెట్టుకొనడం ఇష్టంలేక ముసలి జాగీర్దారు కొత్తపెళ్ళాన్ని పుట్టింటికి పోనివ్వడంగాని, పుట్టింటివాళ్ళొచ్చి ఆమెను చూడడంగాని ఇష్టపడదని వింది.

తర్వాత తన పినతల్లికూతురు సరళనుగురించిన కథలనేకం ఆమె వరకూ వచ్చేయి. తన సవతికొడుకుతో సంబంధం పెట్టుకొన్నదని ఆమె విన్నది. ఆమె సవతికొడుకు ఈ రాఘవరెడ్డే.

రాఘవరెడ్డిని శశిరేఖ ఎరుగును. ఒకటి రెండు మార్లాతడు సరళగారింటికి వచ్చేడు. అప్పుడాతనిని తాను చూసింది. అతడెందుకు వచ్చినదీ తన పినతల్లి యింటివాళ్ళెరుగుదురు. సరళకోసమేనని వాళ్ళకి తెలుసు. కాని జాగీర్దారుబిడ్డను అవమానించగల శక్తిలేదు. అవసరం కలగలేదు. రాఘవరెడ్డి చాల మర్యాదగా మెలిగేడు. అతనిని గురించి శశిరేఖకు సదభిప్రాయమే కలిగింది.

కాని, తర్వాత జరిగిన ఘటనలేవీ ఆమెకు అర్థంకాలేదు. సరళ చాల అందగత్తె. ఆమెనుచూసి రాఘవరెడ్డి మర్యాద తప్పితే తప్పివుండ వచ్చుననుకొంది. కాని, అంత మంచిగా కనిపించినవాడు ఇంత రాక్షసానికి ఏలా తలపెట్టేడో ఆమె కెంతమాత్రం అర్థంకాలేదు.

"తానోమారు సరళను కలుసుకొంటే......"

ఆ అభిప్రాయం ఎందుకు కలిగిందో ఆమె చెప్పలేదు. కలుసుకొని ఏం చేయదలచింది ?—అదీ అర్థంకాదు.

కాని, ఒక్కటిమాత్రం నిశ్చయించుకొంది. సరళను కలుసుకోవాలి. రాఘవరెడ్డిని ఇటువంటి ఘోరంతాలకు దిగకుండా ఆపగలదేమో చూడాలి.

నారాయణయ్య, గవరమ్మల కుటుంబాల దుఃఖం, రజాకార్ల దుర్మార్గం వలన ఘానుడిపేటవాళ్ళు పడుతున్న బాధలు ఆమె అభిప్రాయానికి దోహదం ఇచ్చేయి; పెంచి, పోషించేయి.

* * * *

పుట్టినింటికి వెళ్ళేక ఆమె విన్న కథలతో సరళను చూడాలనిపించలేదు. ముసలి జాగీర్దారు వూళ్ళో వుండడంలేదు. కొడుకు అతనిని తుపాకీచూపి వీధిలోకి నెట్టేసేడు. ఆయనపోయి హైదరాబాద్‌లో మకాం పెట్టేడు. ఇక్కడ వీళ్ళిద్దరూ ఇష్టారాజ్యంగా వున్నారన్నారు.

శశిరేఖ పినతల్లి తన కూతురుపేరు వినడానిక్కూడా ఇష్టపడలేదు. అంత అప్రతిష్ఠతెస్తున్న కూతురు బతికివున్నా చచ్చినట్లేనంది.

"ఓమూరెప్పుడన్నా వెళ్ళొచ్చేవా?"

"ఆ బుద్ధికి మన రాకపోకలు నామర్దా అయ్యేయి. వాళ్ళ బతుకులు నాకు నామర్దా అనిపిస్తున్నాయి."

శశిరేఖ మరి మాట్లాడలేదు. కాని ఆమెకు ఏంచెయ్యాలో తోచలేదు. అలా రోజులు గడిపేసేదే కాని, పఠాను పాలెంలో రాఘవరెడ్డి ఏడుగురిని ఒకే గుండుతో కాల్చి చంపేడన్నవార్త ఊరంతా గుప్పుమంది.

పఠానుపాలెం చంద్రారెడ్డి స్వంత జాగీరుగ్రామాలలో ఒకటి. అక్కడి రైతులు సంగం పెట్టుకొన్నారు. ఓ రోజున రాఘవరెడ్డి ఊరిమీద పడిపోయేడు. చేతికందిన ఆడ, మగా ఓ పదిమందిని పట్టుకొన్నాడు.

హఠాత్తుగా రాఘవరెడ్డికి ఒక ఆలోచన తట్టింది. తనపేరింటి వాడు ఒక్కబాణంతో ఏడు తాళ్ళను కూలగొట్టేడు. ఒక్క గుండుతో ఏడుగురిని చంపగలనా ?

ఆ ఆలోచన కలగడానికీ దానిని అమలు జరపడానికీ ఆట్టేవ్యవధి ఇవ్వలేదు. తనకు పట్టుబడ్డవాళ్ళల్లో ఆరుగురేమగాళ్ళు. అందుచేత ఒక ఆడదానినికూడా వాళ్ళతో చేర్చేడు. ఆతని ఆజ్ఞప్రకారం ఆ ఏడుగురినీ ఒకరివెనక ఒకరిని నిలవబెట్టేరు. దగ్గరగా అంటదీసి గట్టేరు.

రాఘవరెడ్డి ఆ మనుష్యుల కట్ట కెదురుగా రెండు గజాలదూరంలో నిలబడ్డాడు. ఒక్క గుండుదెబ్బతో ఏడుగురూ కట్టగా నేలబడ్డారు.

కాని ఆఖరువాళ్ళు ముగ్గురూ చావలేదు. ఎత్తు హెచ్చుతగ్గుల మూలంగా దెబ్బ ఆయువుపట్టుల్లో తగలలేదు. గాయపడి గోల ప్రారంభించేరు.

రాఘవరెడ్డి ఈమారు మరొక భయంకర కృత్యానికి తలపెట్టేడు. ఆతని ఆజ్ఞతో భృత్యులు గడ్డీ కంపా తెచ్చేరు. చచ్చిన వాళ్ళనీ, చావని వాళ్ళనీ కలిపి కట్టగా దానిమీద పడేయించి తగులపెట్టించేడు.

ఆవార్త రాఘవరెడ్డి దళంకన్న ముందే మంగళంపల్లి చేరింది. ఊరంతా ఉద్రోలం అయింది. జాగీర్దారు వెంటవెళ్ళిన రౌడీముఠాల వాళ్ళ కుటుంబాలుకూడా తలలు దించుకొన్నాయి. ఆ ఉద్వేగంలో శశిరేఖ సరళను కలుసుకొన బోతున్నానని ఇంట్లో ప్రకటించింది.

తండ్రి ప్రశ్నార్థకంగా తలెత్తి చూసేడు. భాగ్యరెడ్డి దళాలలో వున్నాడని ఆయనెరుగును. అటువంటివాని భార్యకు జాగీర్దారు దేవిడీలోకి ప్రవేశం దొరుకుతుందా ? దొరికినా క్షేమం వుంటుందా ? అసలామె ఆ సమయంలో పుట్టింటికి రావడమే తప్పని అనుకొంటూంటే......

"సరళ వుండగానే భయమా ?"

ఆమె తండ్రి ఏమీ మాట్లాడలేదు. కాని, సందేహం తీరలేదు. మరల బయలుదేరబోతూంటే అభ్యంతరం చెప్పేడు.

"శశిరేఖా ! నువ్వు ఎందుకు వెడుతున్నావో, నీ సాహసం ఎందుకో నాకు తెలియడం లేదు. ఆ రావణుని చేవిడీకి బయటే నీకు క్షేమం లేదు. ఆ రోజున జాగీర్దారు మనుష్యులువచ్చి సరళని తీసుకుపోతూంటే మే మందరం అక్కడే వున్నాం. నోరప్పగించి చూసేమే తప్ప ఒక్కళ్ళం ఇదేమనలేకపోయేం. ముసిలాడు ఏ కళనున్నాడో దాన్ని పెళ్ళిచేసుకు నింట్లో పెట్టుకొన్నాడు గనక కాస్త తలఎత్తుకొని తిరుగుతున్నాం. కాని, సివలాయన కోడల్ని తీసుకుపోయి వదలినట్లు ఓ నెల్లాళ్ళు పెట్టుకొని వదిలేస్తే మాత్రం మనం చెయ్యగల దేముంది? గుడ్డిలోమెల్ల. అదో మంచి. కాని......"

శశిరేఖ తండ్రి వదిలిపెట్టిన వాక్యభాగాన్ని వూహించుకొంది.

"చిన్నదొర చిన్నప్పుడు చాల మంచిగావుండేవాడు, ఇప్పుడిల్లా ఎందుకు తయారయ్యేడో......"

రాఘవరెడ్డి విషయంలో తన కూతురు సదభిప్రాయం ప్రకటించడం ఆమె తండ్రికి అసహ్యమయింది, విసుపూ కలిగింది.

"వాళ్ళయిల్లు వల్లకాడయిరి. లంకలో పుట్టినవాళ్ళంతా రాక్షసులే."

శశిరేఖ తండ్రి మాటను ప్రత్యాఖ్యానం చేయలేదు. ఆగనూ లేదు.

* * * *

శశిరేఖను చూసి సరళ మహానందపడింది. మాటా, మొగమూ ఎరగని పరాయిదేశాలలో తిరిగి, తిరిగి ఇంటికి వచ్చినప్పుడు పొందినంత ఆనందం సరళ ముఖంలో దీపించింది.

సరళనుచూసి శశిరేఖ ఆశ్చర్యముగ్ధురాలయింది. పుట్టింట వున్న ప్పటిలాగే నిరాభరణగానేవున్నా ఆమె అంగాంగాలలో గాంభీర్యం,

హుందాతనం వెల్లివిరుస్తూంది. కళ్ళల్లో కనిపిస్తున్న విచారరేఖలు నిసర్గ సుందరమైన ఆ ముఖానికి మరింత రమణీయత కలిగిస్తున్నాయి. నిండు యౌవనంలో మిసమిసలాడుతున్న ఆమె శరీరం వరదలలోవున్న గోదావరి నదిలా ఆకర్షిస్తూంది.

సరళ శశిరేఖను చేయిపట్టుకొని తీసుకెళ్ళి సోఫాలో కూర్చుండబెట్టింది. అందరూ మరచిపోయిన సమయంతో తన్ను గుర్తుచేసుకొన్నందుకు సంతోషం తెలిపింది.

"ఎప్పుడొచ్చేవు ?"

"ఒక వారమయింది."

అంతతో సంభాషణ ఆగిపోయింది. అక్కచెల్లెళ్ళిద్దరూ ఒకరి మొగం ఒకరు చూచుకొంటూ చాలసేపటివరకు అలాగే కూర్చుండిపోయేరు. ఏ విషయం కదపడానికీ శశిరేఖ సందేహిస్తూంది. చివరకు సరళే మాట్లాడింది.

"నిన్ననే తెలిసింది, నువ్వువచ్చేవని. ఇక్కడికి వస్తావనుకోలేదు."

"మా అత్తవారివాళ్ళు సామాన్యులే. అంతకళ్ళు నెత్తికొచ్చేయనుకొన్నావటే."

సరళ మ్లానహాసం చేసింది.

"అయిష్టానికి కళ్ళేనెత్తికి రానక్కర్లేదు. మనుష్యుడు తన అసమర్థత కప్పిపుచ్చుకొనేటందుకు అనేక మార్గాలున్నాయి, తన చేతకానితనానికి బలిఅయిన వాళ్ళమీదనే కసితీర్చుకోవడం కూడా ఒకటి......"

సరళ చెప్తున్న విషయాన్ని శశిరేఖ గ్రహించింది. ఆమె చేస్తున్న ఆరోపణలో అబద్ధం ఏమీలేదు. తన తండ్రే ఒప్పుకొన్నాడు. జాగీర్దారు తన మనుష్యుల్ని పంపి తీసుకుపోతూంటే తామంతావుండి చూస్తూ వూరుకున్నామన్నాడు.

కాని, పినతల్లి అభిమానం కూడా తోసిపారెయ్య తగిందేమీకాదు. ముసలో ముతకో కట్టుకొన్న మగడితో కాపురం చెయ్యాలి_అది సాంఘి కాచారం. కాని, సరళ ఆ ఆచారానికి కట్టుబడలేదు.

పూలపాన్పునాటి ఘటనలు వూళ్ళో బహుముఖాలుగా వ్యాపించి వున్నాయి. చంద్రారెడ్డి బలాత్కారం చెయ్యబోయేడు. మంచం దగ్గరికే రావడానికి నిరాకరిస్తున్న సరళను రెండు చేతులలో బొమ్మనెత్తుకొన్న ట్లెత్తుకొని మంచంమీద పడేసేడట. బలిమితో మగతనం చూపబోయేడు. ఆమె ఊతంగా ఒక్క తన్ను తన్నింది. ఆ దెబ్బ గుండెల్లో తగిలి ముసి లాడు మంచంమీదనుంచి వెల్లకిలా బడ్డాడు. హఠాత్తుగా పందిరి మంచం స్తంభందొరికి ఆపుకోగలిగేడుకాని చచ్చేవాడేనని వూళ్ళోవాళ్ళు ఒక్కటే నవ్వు.

ఆ నవ్వుకొంటున్న మొగాల్నిచూస్తే చచ్చిపోతే బాగుండునని పిస్తూందేయని సరళతల్లి కన్నీరుపెట్టింది. మొగుణ్ణి ఎదిరించి, అల్లరి చేసేఘటన వాళ్ళయింటా, వంటా లేదని ఆమె వాపోయింది.

ఒక రోజున చంద్రారెడ్డి ముఖంనిండా బరుకులే. అది చూసేక నఖక్షత, దంతక్షతాల ప్రసక్తి వ్యాపించింది. ఊళ్ళో నిరక్షరాస్యులకి కూడా కొక్కోకం, రతిరహస్యం, అనంగరంగం వగైరా గ్రంథాలలో నఖక్షతాలకు సంబంధించిన భాగాలు కంఠస్థం అయ్యేయి.

ఇంకో రోజున చేతివేళ్ళకి కట్టు కట్టుకొన్నాడు జాగీర్దారన్నారు. ఆ వెనకటి రాత్రి ఆయన మళ్ళీ ఇంకోప్రయత్నం చేసేడట. కాని, సరళ పోట్లగొడ్డులా బుస్సుమంది. అంతమనిషినీ గుండెలమీద చెయ్యేసి గది వెలుపలకి ఒక్కత్రోపులో నెట్టేసింది. పడిపోకుండా ఆయన ద్వారబంధం పట్టుకొన్నాడు. ఆమె ఛళ్ళున తలుపులు మూసింది. ముసిలాడు వేళ్ళు నలిగి మొర్రో అన్నాడు.

ఈ కథలన్నీ వింటూంటే తల్లి కూతురిని అభినందించడం అల్లా వుంచి, అభిమానించనుకూడా లేకపోయింది. ఫలానా ఆమె కూతురు గయ్యాళిదనీ, మొగుడితో కాపురం చెయ్యలేదనీ అంటారని ఆమె భయం, విచారం, బాధ.

"మనుష్యుడి అసమర్థతకూ, సాంఘిక ఆచారాలకూ సంబంధం ఏమిటి ?......"

శశిరేఖ ఎవ్వరికీ నొప్పికలగకుండా జాగ్రత్తగా సర్దిచెప్పాలని ప్రయత్నించింది. కాని, సరళ నవ్వేసింది. అంతలోనే తన దుస్థితి మనస్సులో కలకవేసి టక్కున ఆగిపోయింది.

ఆమె ముఖంవంక చూసేక శశిరేఖకు మాట తొణకలేదు. కొద్దిసేపటికి సరళే సర్దుకొంది.

"తన మానాన్ని కాపాడుకోడం సాంఘిక ఆచారాలకి వ్యతిరేకం ఎల్లా అవుతుందో మా అమ్మను అడక్కపోయేవా ?"

శశిరేఖకు ఆ ప్రశ్న అర్థం కాలేదు.

"మగడినుంచి మానం కాపాడుకోవడం ఏమిటే ?"

సరళ చప్పరించింది.

"ఎవడక్కా మగడు ?"

శశిరేఖ ఆమె ముఖంవంక విస్తుపోయి చూసింది.

"పెద్దదొరా ?"

చంద్రారెడ్డి 'పెద్దదొర' అనీ, అయన కొడుకు 'చిన్నదొర' 'చిన్నబాబు' అనీ గ్రామంలో చెప్పడం పరిపాటి. సరళ ఆ ధోరణిలోనే మాట్లాడింది.

శశిరేఖ ఆ ప్రశ్నకు సమాధానం ఇవ్వడం అవసరంగా భావించలేదు. బలవంతంగా నైతేనేం తాళిగట్టినవాడు అయనే !

సరళ ఒక్కనిముషం వూరుకొంది. మనస్సులో అనేక వ్యధలు కొట్టుమిట్లాడుతున్నాయి. వాటిని అతికష్టంమీద అణిచిపెట్టుకొంది.

"అక్కా !"

శశిరేఖ ఆమె ముఖంవేపు చూసింది. సరళ ఆమె కళ్ళల్లోకి చూడలేక తలవంచుకొంది.

"మా యింటికి చిన్నబాబు ఒచ్చేవారు జ్ఞాపకంవుందా ?"

శశిరేఖ తలవూపింది.

"ముసిలాడు చేసినట్లు ఆయన నన్ను ఎత్తుకుపోదాని కెప్పుడూ ప్రయత్నించలేదు."

శశిరేఖకు ఆ మాటకు సాక్ష్యం పనిలేదు.

"ఎందుచేత ?"

సరళే దానికి సమాధానం ఇచ్చింది.

"ఆయన పెద్దమనిషి."

... ... ...

"నన్ను పెళ్ళిచేసుకొంటానన్నారు. నేను ఒప్పుకొన్నా."

శశిరేఖకిది కొత్తవిషయం.

"మరెందుకు ఈ ఉప్పలాయొచ్చింది ?"

"మావాళ్ళే అడ్డం చెప్పేరు."

ఆశ్చర్యమే. జాగీర్దారుబిడ్డ ఒక సామాన్యసంసారి పిల్లను పెళ్ళి చేసుకొంటానంటే వాళ్ళే అభ్యంతరం చెప్పడం......

శశిరేఖ కళ్ళల్లో "నమ్మమనే అంటున్నావా ?"-అన్న ప్రశ్న కనిపించింది.

"ముసలాడు రావణాసురుడు. ఆపెళ్ళి ఇష్టంకాదు. తన కుటుంబాన్ని సర్వనాశనం చేస్తాడని భయం."

"ఇంతవరకు వచ్చిందా ?"

సరళ ఆ ప్రశ్నకు సమాధానం ఇవ్వలేదు. తన తల్లిని అడుగుతుంది. ఆమే చెప్తుంది. తాను సమాధానం ఇవ్వనక్కర్లేదు.

ఒక్కనిమిషం సరళ వూరుకొంది.

"తండ్రి లాక్కువచ్చినట్లు కొడుకూ లాక్కుపోతే మానాన్న పేచీ పెట్టగలిగివుండేవాడుకాదు. ఆయన పెద్దమనిషి. అందరి ఇష్టం మీదనే చేసుకొంటానని వ్యవధి పెట్టేరు."

గడిచిపోయిన రోజుల్లోకి చూస్తున్నట్లు సరళకళ్ళు ఎక్కడికో చూస్తూంటే శశిరేఖకు తాను వినివుండని గాధలన్నీ అర్థం అయ్యేయి. ఏమిచెప్పాలో అర్థంకాలేదు.

బలవంతంగా లాక్కుపోయి పెళ్ళి చేసుకొన్నా తాలికట్టిన మగణ్ణి తన్నెయ్యడం మంచిదాయని శశిరేఖ మనస్సునే బాధిస్తూంది. సరళ తన మగణ్ణి దరి చేరనివ్వకపోవడం మంచిదే ననడానికీ, ఆమె చర్యను సమర్థించడానికి హిందూమహిళా మనస్తత్వం ఒప్పడంలేదు. కాని, ఇటువంటి సందర్భంలో ఏం చెయ్యాలి ? మొదట ప్రేమించిన చిన్నదొరతో వుండడమా ? తరవాత తాలిగట్టిన ముసిలాడిదగ్గిర పడుండడమా ?

"సారంగధరుడి కథలావుందే."

సారంగధరుడిపోలిక వినగానే సరళ పులికిపడింది. కడుపులోంచి దుఃఖం తెర్లుకువచ్చింది. సోఫా వీపున తల దాచుకొని వెక్కి వెక్కి ఏడ్చింది.

చెప్పుకొనేటందుకుకూడా ఎవరూలేక ఇన్నాళ్ళూ బిగపట్టుకొని వున్న బాధ ఒక్కమారు కట్టలు తెంచుకొన్నదని శశిరేఖ అర్థం చేసుకొంది. సానుభూతితో తల నిమురుతూ నిశ్శబ్దంగా కూర్చుంది.

చాల సేపటికిగాని సరళ తేరుకోలేదు.

"నేను చిత్రాంగనీకాను. సీతా, సావిత్రుల్లాగా వుండదలచలేదు."

శశిరేఖ చాల బెదురుతూ ఒకప్రశ్న వేసింది. కాని ఆ ప్రశ్నకి వచ్చిన సమాధానం తల్లక్రిందులు చేసింది.

"చిన్నబాబు......"

సరళ ఏదో లోకంలోంచి మాట్లాడినట్లు మాట్లాడింది.

"...నేడో పిచ్చివాడు."



## ఐదో ప్రకరణము.

ఈ కొత్తసంగతి చాల సేపటివరకూ శశిరేఖకు అర్థంకాలేదు. ఆమాటను ఒక అలంకారంగా మాత్రమే తీసుకొంది. కాని, సరళ చెప్పిన వివరాలు విన్నాక ఆమెలో భయమూ, జాలీ, దుఃఖమూ పెనవడ్డాయి. సరళస్థితి ఏమిటో ఆమెకు అర్థంకాలేదు.

"నా మర్యాదనుగురించి నేను బాధపడ్డంలేదు. కుటుంబానికేదో అప్రతిష్ఠ తెస్తాననే విచారంలేదు. కాని, చిన్నబాబుకు ఏమీ సాయంచేయలేకపోతున్నాను. సాంఘికాచారాల్ని దాటలేకుండా వున్నాడు. మనస్సును నిగ్రహించుకోలేకుండా వున్నాడు. తండ్రి నాకు తాళిగట్టేడన్నది మరువలేడు. తానే నన్ను పెళ్ళిచేసుకోదలచిన సంగతీ మరవలేడు."

ఎంతో మంచివాడనుకొన్న మనిషి ఇంత ఘోరహత్యలు ఎందుకు చేస్తున్నాడో శశిరేఖకు అర్థమయింది. అయితే ఆ పిచ్చివాడి విషయంలో సరళ కెలాంటి అభిప్రాయంవుంది ? అనూచే అడిగింది.

"బావగారిని విడిచిపెట్టి ఇక్కడెన్నాళ్ళుండగలవు ?"

మొగుణ్ణి విడిచి సవతికొడుకుతో వుంటున్నది తనతో పోల్చ కోవడం శశిరేఖకు కష్టం అనిపించింది. కాని, పైకి తేలలేదు.

"అంతేనా ?"

"మనస్సు ముఖ్యమా, తాళి గట్టడం ముఖ్యమా అక్కా ?"

అక్క దానికి సమాధానం చెప్పగల స్థితిలోలేదు. తానైతే తాలి గట్టినాకనే భాగ్యరెడ్డిమీద మనసు పెంచుకుంది. తా నెరిగి వున్నంతవరకు తమవాళ్ళంతా తాలి గట్టడానికే ప్రాముఖ్యం ఇచ్చేరు. ఎవరన్నా మనసు పెట్టుకోవడం తటస్థపడితే అది బయటివాళ్ళ మీదనే. అందుచేత గడు స్తనంగా సమాధానం ఇచ్చింది.

"మన సంఘంలో కొన్ని అలవాట్లూ, ఆచారాలూ, పద్ధతులూ అంటూ వున్నాయిగా ?"

సరళ ఏమీ మాట్లాడలేదు. శశిరేఖ కొద్దిసేపు వూరుకొని మరల తాను వచ్చిన పని జ్ఞాపకం చేసుకొంది. సావధానంగా అన్నీ సరళ విని ఒక నిట్టూర్పు విడిచింది.

"చిన్నబాబు వెనకటి మనిషికాడు."

శశిరేఖకు చిరాకు కలిగింది.

"ఇదేమిటీ దురన్యాయం, ఇంత రాక్షసత్వం ఎక్కడ నేర్చు కొన్నావని ఒక్కమాట అన్నావా ?"

సరళ తల వంచుకుంది.

"ఆడదానికి దేవుడిచ్చింది మనస్సొక్కటే."

శశిరేఖ విచారం, జాలి ప్రకటించింది.

"దురదృష్టవంతురాలా !"

ఇద్దరూ ఒక్కనిముషం నిశ్శబ్దంగా కూర్చున్నారు.

"ఆప్రతిష్ఠ నెత్తినేసుకోడం ఒక్కటేనా నీ పని? ఆడదానికి మనస్సొక్కటీ చాలదు. జ్ఞానంకూడా అవసరమే. సంఘాన్ని కాదన డానికి సిద్ధమైన దానవు నీవాడనుకొన్నవాడినేనా కాపాడుకోలేకపోతే నీ బ్రతుకు బండారం ఏమిటి? ఏడుపా? నూటికి తొంభయి తొమ్మిది మంది చేసేపనే అది."

ఒక్క వారంరోజుల మధ్యలో తనలో వచ్చిన పెద్దరికానికి శశి రేఖ ఆశ్చర్యం, సిగ్గూ పడింది. తన కీ మాటలు ఎల్లా వచ్చేయో! ఆఖరున వెళ్ళిపోతూ చిన్నబెదిరింపు విసిరింది.

"చేసిన పాపం కట్టి కుడుపుతుం దంటారు. ఘానుడిపేటలో నా కళ్ళతో చూసేను. ఆ దుఃఖానికీ, కడుపుకోతకీ ప్రతీకారం లేకపోతే ప్రపంచంలో దుర్మార్గంతప్ప జీవించలేదని అర్థం. అయితే మన పెద్ద వాళ్ళుచెప్పే మాటలకి విలువేలేదు."

సరళ నీరసంగా ఒక్కసలహా ఇచ్చింది. కాని, దానిమీదకూడా ఆమెకు నమ్మకంలేదని ఆ గొంతుకే చెప్తూంది.

"ఆయనను దారిలోకి పెట్టగలశక్తి ఒక్కరికే వుంది. మీ వూరు పెద్దరెడ్డి కొడుకు రఘునందనుడు ఆయనకు చాల దగ్గర దోస్తని తోస్తుంది. రెండు మూడు మార్లు ఆయనకు వ్రాయడం, వాటిని చింపె య్యడం జరిగింది. ఆయన నిక్కడకు వచ్చే ఏర్పాటు చెయ్యగలవా"?"

శశిరేఖ సందేహంగా ఆమె ముఖంలోకి చూసింది.

"బావగారిని పంపు."

తన మగని ప్రస్తుత స్థితి ఈమెకు తెలియదన్నమాట. రాఘవ రెడ్డి ఎరగడా? తెలియచెప్పడం అనవసరం...

"నీ కోసం మీ యింటికి వచ్చినప్పుడు చూసేను. చిన్నబాబు చాల యోగ్యుడని తోచింది. ఆయనే వూళ్ళమీదపడి జనాన్ని చంపుతున్నా రంటే నమ్మశక్యం కాకపోయింది. ఈ వేళ ఆయనకు బలం వుంది గనక వూళ్ళమీద పడ్డారు. అదెన్నోరోజులు సాగదు. మద్దికుంట వెంకయ్య సంగతి విన్నావా? ఇంక ఆవేశం పుడితే తర్వాత నువ్వా యన్ని రక్షించలేవు. నీ ప్రాణం ఇచ్చినా ప్రయోజనం వుండదు."

సరళ చీరకొంగు వేలికి చుట్టుకొంటూ, దీర్ఘాలోచనలో పడిపో యింది. మళ్ళీ ఒక నిమిషం నిశ్శబ్దం.

"సరళా!"

తల తిప్పింది.

"చిన్నబాబుమీద......"

సరళ వెక్కి వెక్కి ఏడ్చింది. శశిరేఖ ఒక నిముషం వూరుకొని ఒక సలహా ఇచ్చింది...

"ఇద్దరూ మరోచోటికిపోయి పెళ్ళిచేసుకు సుఖపడండి. ఇక్కడి నుంచి తీసుకుపో. ఇక్కడుండగా, ఈ పరిచితులైన జనంమధ్య ఆయ నకు మనశ్శాంతి వుండదు......"

సరళ వెక్కుతూనే భయం వెలిబుచ్చింది...

"లోకం..."

"మాయదారిలోకంలే. కోడల్నిలాక్కొచ్చి పెళ్ళి చేసుకొంటే ఏం చేసింది. ఆ తండ్రిని తరిమేసి కొడుకు నిన్ను దగ్గరపెట్టుకుంటే..."

సరళ కన్నీళ్ళమధ్యనే శశిరేఖ భ్రమను సరిదిద్దింది.

"మా యిద్దరికీ ఏమీ సంబంధం లేదక్కా!"

ఆమెగొంతు తనమాట నమ్మమంటూంటే శశిరేఖ అనుమానంగా చూస్తుంది.

"నేవిన్నదంతా..."

"అబద్ధం !"

ఒక్కక్షణం వూరుకొని సరళ సమాధానం చెప్పుకొంటున్నట్లు నెమ్మదిగా ప్రారంభించింది.

"లోకాన్ని మోసగించాలని నేనిల్లా అనడంలేదు. నిజానికి చిన్న బాబు భార్యనేయని నావూహ. భార్యగానే జీవించాలనికూడా కోరిక. నన్ను భార్యగా తీసుకో గలిగే మనోదార్ఢ్యంవుంటే చిన్నబాబు వెనకటి వాడే అయివుండేవాడు. తనతండ్రి నన్ను పెళ్ళి చేసుకొన్నాడనే సంగతిని మరవలేక పోతున్నాడు......"

... ... ...

"తెల్లవార్లూ నా మంచాని కెదురుగా పడకకుర్చీలో కళ్ళప్పగించి చూస్తూ కూర్చుంటాడు. నన్ను ముట్టుకోలేడు. విడిచి మాలంగా పోలేడు. "నా పెళ్ళాన్నే నా కుంపుడుక త్తెను చేసేవా ?"-యని తలుచుకు తలుచుకు ఏడుస్తాడు. అటువంటి సమయాల్లో గుండెలు బద్దలయిపోతాడేమో ననిపిస్తూంటుంది. ఆయనతోపాటు నేనుకూడా ఏడవడంతప్ప నే నేమి చెయ్యలేను......"

సరళ మళ్ళీ ఏడ్చింది. శశిరేఖ ఆమె దుఃఖంలో సానుభూతి చూపుతూ కళ్ళు తుడుచుకొంది.

"వీళ్ళ దొరతనం నాశనంకాను......"

---

## ఆ రో ప్ర క ర ణ ము.

తన అమూల్య సంపదలను పరీక్షించి ఆనందపడే పిల్లకాయలాగ రాఘవరెడ్డి వీధిలోంచిరాంగనే ఒక్కమారువచ్చి సరళ ముందు నిల్చుండ

డం అలవాటు. కాని, ఈ వేళ అతనికి ఆమె ముఖం చూడడానికే వెళ్లింది కాదు. ఫకీరు పాలెంలో ఆ ఏడుగురినీ పట్టుకొన్నప్పుడూ, కాల్చి చంపేటప్పుడూ అతని మనస్సులో తలఎత్తి వుండనిబాధ సగంకాలి కమురు కంపు కొడుతున్న ఆ నగ్నదేహాల్ని చూసేసరికి నములెయ్యడం ప్రారంభించింది. భయపడుతూ ప్రాణభిక్షకోసం దేబిరిస్తున్నప్పుడు కొట్టడం కాల్చెయ్యడంలో కలిగిన ఉత్సాహం, ఉద్రేకం ఏమైపోయేయో. నవనవలాడుతున్న పువ్వుని గిల్లి, నలిపేస్తూంటే కలిగే సన్నని బాధతో వొళ్లు జలదరించింది. చచ్చిపోయిన వాళ్ళెవరో వాళ్ళ ముఖాలుకూడా గుర్తు రావడంలేదు. కాని, చచ్చిపోయేక వాళ్ళముఖంలో కనబడ్డ వికారాలు మాత్రం అతడిని వెంటాడుతున్నాయి. వాళ్ళుచేసిన ఆర్తనాదాలు ఆలోచన లన్నింటినీ అణిచివేస్తున్నాయి. జీప్ దిగి కచేరీ సావిట్లో అడుగు పెడుతూనే అక్కడున్న సోఫాలో చతికిలబడిపోయేడు. సోఫామెత్తల్లో శరీరం దిగబడిపోతూంటే ఎక్కడికో కుంగిపోతున్న ట్లనిపించింది. కళ్ళు మూసికొని ఒక్కక్షణం కూర్చుండి పోయేడు. అతని మనస్థితిని ఎరుగని పరివారం అంతా చెప్పుకొంటున్న కబుర్లు ఎక్కడినుంచో తేలి వస్తున్నట్లు వినిపిస్తున్నాయి.

హఠాత్తుగా గదిలో అందరూ ఒక్కమారు మాట్లాడ్డం నిలిపేరు. వర్షం కురిసి వెలిసినట్లుంది. రాఘవరెడ్డికి కారణం తెలుసుకోవాలనికూడా అనిపించలేదు. కాని ఒక్కక్షణం పోయేక వినిపించిన సన్నని గొంతుక మనస్సుని తట్టి లేపింది. ఉలికిపడి లేచి కళ్ళు విప్పేడు.

ఎదురుగా సరళ.

ఆమె దూరాన వీధిలో జీప్ నిలబడిన ధ్వని వినబడగానే అంతః పురం విడిచి పెట్టింది. ఆ ధ్వనికోసమే ఆమె కనిపెట్టుకొని వుంది. ఒక్కక్షణం నిలబడలేదు. కచేరీ సావడి గుమ్మంలో నిలబడేవరకూ ఆమె రాక నెవ్వరూ గమనించలేదు. గమనించినప్పుడు ఆమె యెవ్వరో

ఎవరికీ అర్థంకాలేదు. ఒక సుందర గంభీరమూర్తిని తమ ఎదుట చూడ గనే అందరినోళ్ళూ టక్కున మూతబడిపోయేయి. కాంతారావు విప్పు తున్న మంగలిరాముడితో తలవంచుకొని తమ దాడి వివరాలు చెప్తూన్న శంకరరావు తన మిత్రులందరూ ఒక్కమారు మాటలు నిలిపినట్లనిపించి తల ఎత్తి చూసేడు.

సరళ చూపులో వివిధ భంగిమలలోవున్న ఆ కూటాన్నంతనూ ఒక్కనిముషం పరిశీలనగా చూసింది.

"పకీరుపాలెం వెళ్ళిన యోధాగ్రేసరచక్రవర్తులనుకొంటా ... "

ఆ కంఠస్వరంలో వినబడుతున్న అసహ్యభావం కొరడాతో ఛెళ్ళు మనిపించినట్లు తగిలింది. శంకరం పళ్ళు బిగించేడు. సన్నగా అనేసేడు.

"ఎవత్తెరా"

ఆ మూర్తిఎదుట ఆ మాటను గట్టిగా అనగల ధైర్యం ఆకంఠంలో వినబడడంలేదు. అయినా ఆ నిశ్శబ్దస్థితిలో ఆ మాట అందరికీ ఖంగు మన్నట్లు వినిపించింది. ఆమాటలోవున్న అమర్యాదకర ధోరణికి రాఘవ రెడ్డి ఉలికిపడ్డాడు. చరాలునలేచి సోఫాలో పక్కనేవున్న హంటరు తీసుకొన్నాడు. సరళ చటుక్కున దానిని లాగేసుకొని వుండకపోతే శంకరరావు వీపు చిట్లిపోయివుండేది. ఆ విషయాన్ని శంకరరావుతోసహా గదిలోవున్న అందరూ గ్రహించేరు. రాఘవరెడ్డికి తన సన్నిహిత మిత్రుడి మీద అంతకోపం రావడానికి కారకురాలైన ఆ యువతి ఎవరో అప్పుడు లీలగా మనస్సులకు తగిలింది. రాఘవరెడ్డి మాటలు ఆ అను మానాన్ని ధృవపరచేయి.

సరళను గురించి తన మిత్రుడు అవమానకరమైన సర్వనామం వుపయోగించడం రాఘవరెడ్డికి తలకొట్టేసినట్లనిపించింది. ఆ ఆవేశంలో అతనివొళ్ళు హూనంచేసేసేవాడే. కాని, సరళ తనచేతిలోని కర్రలాగే సింది. తనకూ, మిత్రుడికీ మధ్య అడ్డుగానిలబడింది. శంకరరావు వుప

యోగించిన ఆ సర్వనామానికి ఆమె అడుగు పెదవి కంపిస్తూంది. కాని, ఆమె ఓర్చుకోల్పోలేదు. ఆమె ముందు తన నిస్సహాయస్థితిని చూచి రాఘవరెడ్డికి ఎంతో బాధ కలిగింది.

"ఇల్లా ఎందుకు వచ్చేవు, సరళా! నిన్నేవిధంగా పరిచయం చెయ్యను ?"

ఆ పేరు వినగానే గదిలోవారంతా అభివాదనచేసేరు. దొరసాని ముందర వంగి వంగి అదబ్‌లు తెలిపేరు.

శంకరరావు కూర్చున్నవాడల్లా గభీమనిలేచి నిలబడి వందనం చేసేడు.

"మరిదిని క్షమించండి."

సరళతో తనకున్న బంధుత్వపు అసమంజస స్థితినిగురించి బాధ పడుతున్న రాఘవరెడ్డికి మిత్రుని క్షమాభ్యర్థనంలో కూడా అవహేళనం కనబడింది. మండిపోయేడు.

"శంకరం..."

సరళ ఆతనిని చేసంజ్ఞతో నివారించింది. మిత్రుని కంఠం వినబడ గానే శంకరరావుకు తన పొరపాటు అర్థం అయింది, తన మరిదితనం వారిరువురి మధ్యావున్న అవివాహితస్థితిని గుర్తుచేస్తూందని గ్రహించేడు. తాను బుద్ధిపూర్వకంగా అన్నమాటకాదది. కాని, అది గందరగోళం తెచ్చి పెడుతూంది. సిగ్గుపడ్డాడు. తాను ఏమనివుండవలసింది ? అర్థంకాలేదు. సరళ ఆ సమస్యను వెనక్కునెట్టేసింది. మనస్సు కూరటకలిగింది. కాని, ఈ మారు ఆమెనోటవచ్చిన మెత్తని ధిక్కారం నెత్తిన పేడనీళ్ళుపోసి నట్లనిపించింది. పకీరుపాలెంలో తమరు రాక్షసులల్లే ప్రవర్తించేరని ఆమె అనడం అతనికి నచ్చలేదు. శత్రువు విషయంలో దయతలచగూడ దని అతని ధృఢవిశ్వాసం. ఆ మాటే అన్నాడు.

సరళ ఆతనివేపు తీక్ష్ణంగా చూసింది.

"ఎవరు శత్రువు? మీ పొలంలో రైతు మీకు శత్రువా?"

ఆ ప్రశ్నకు శంకరానికి సమాధానం తోచలేదు. కంగారుపడ్డాడు, మాటల సర్దుకొన్నాడు.

"సంఘం గురించి నేనన్నాను."

ఒక్కమారాగి మరల తన మాటను సమర్థించుకొంటూ విన వించేడు.

"మన కుటుంబాల పెద్దరికం, మన సంపదలూ, మన ఆస్తులూ, దేవిడీలూ అన్నింటికీ ఈ వేళ ఒకపెద్ద ఆపదవచ్చుకొంటూంది. సంఘాలు తలఎత్తినచోట మనం ఇంకవుండం."

శంకరం స్వయంగా ఓ జాగీర్దారు వంశంవాడు. ఆ జాగీరు పోయినా ఆ అహంకారం ఆతనిలో ఉడ్తంకాలేదు. మరోనాటికైనా తన ఆస్తి తనకు చేటుతుందనీ, దానిని కాపాడుకోవాలనీ ఆతని ఆలోచన.

శంకరరావు ఆస్తిపరిస్థితుల నెరిగిన సరళ ఆతని మాటలకు చిరు నవ్వు నవ్వింది. కాని ఆతడు రక్షించాలనుకొంటున్న పెద్దరికం, ఆస్తులు, దేవిడీలు తనకుచేసిన అన్యాయాన్ని గుర్తుచేసేయి. ఆ హాసం మ్లానమై పోయింది.

"మనుష్యుల ప్రాణాల కెసరుపెట్టే పెద్దరికాలు మంటగలవనీ."

శంకరరావు మరల సమాధానం చెప్పేలోపున సరళ రాఘవరెడ్డిని ఇంట్లోకి నడవమంది. తన వెనుకనున్న దాసీలతో కచేరీసావడి తలుపు లకి తాళాలువేసెయ్యమని ఆజ్ఞాపించింది. గుమ్మంలోకివెళ్ళి ఏదో జ్ఞాప కం వచ్చినట్లు వెనక్కి తిరిగింది.

"ఎవరి ఆస్తుల్నివారు జాగ్రత్తపెట్టుకోవడంమేలు, మరదిగారూ! మంగళంపల్లి జాగీర్దారు దేవిడీరక్షణకి మీరింతవుత్సాహపడడం బదులు తమరిజాగీరుగ్రామాలు ఏమవుతున్నాయో చూచుకోవడం అవసరంకాదా?"

# ఏడో ప్రకరణము.

శశిరేఖ గుమ్మానున్న తాళం తెరుస్తూంటే ఆ చప్పుడు విని ప్రక్క యింట్లోంచి కేక వినబడింది.

"శశిరేఖమ్మా!"

మరునిముషంలో కౌసలమ్మ ముంగిట్లో హాజరయింది.

"కన్నారింటికెళ్ళివటగా ?"

కౌసలమ్మను చూడగానే శశిరేఖకు సరళ విజ్ఞప్తి గుర్తుకొచ్చింది. పెద్దసెట్టి చిన్నకొడుకన్నా రాఘవసెట్టికీ నిజంగా అంత దోస్తీ వున్నదేమో. చిన్నబాబును చూడడానికి పంపిస్తే రఘునందనుడు ఆయనను దారిలో పెట్టగలడేమో.

"గోవిందు ఇంటికి వస్తున్నాడా ?"

కౌసలమ్మ చెప్పింది గోవిందు భార్య. ఈ మధ్య వూళ్ళల్లో గండ్ర గోళాలు ప్రారంభమైనాక గోవిందు రాత్రీపగలూ దొరలయింటవద్దనేవుండి పోవలసివస్తూంది. ఎప్పుడన్నా పూటో ఏపనన్నా తగిలివస్తే తప్ప ఆత డింటికి రావడానిక్కూడా వీలులేకుండావుంది. సంసారంలోనూ, నౌఖరీ ఈనాం పండించుకోవలసినపనీ కౌసలమ్మమీదే పడింది. పనికి అందుకో లేక, ఇంట్లో సర్దుకోలేక ఆమె తల్లక్రిందులయి పోతూంది. మధ్య మధ్య దొరల పొలం పనులొస్తే అసలు కాలూ, చెయ్యీకూడా ఆడ్డంలేదు. వెట్టి చెయ్యమనడంలేదు. కాని దొరలపనిచేసే మిగతాపనులు చేసుకోవాలనే నియమం ఎక్కడికిపోయింది ? ఆ కష్టాలన్నీ చెప్పుకొని కౌసలమ్మ తరచుగా శశిరేఖవద్ద నిరాశపడిపోతూంటుంది.

"మొన్నొక్కరోజున ఓ మారొచ్చేడంతే. పదిరోజులయింది. నేటి దాకా రాలేదు. ధాన్యపుకొట్లదగ్గరే రాత్రీ, పగలూ వుంటున్నాడంట."

"ఊళ్ళో పోలీసాళ్ళు లేరూ. ఎందుకంత కాపలా ?"

కూనలమ్మ ఆ ప్రశ్నకేం సమాధానం ఇవ్వలేకపోయింది. ఆమెకేం తెలుస్తుంది ? ధాన్యపుకొట్లు గఢీ లోపలేవున్నాయి. వూళ్ళో పోలీసు నాకా వుంది. ఎన్ని గరిసెలుండేమాత్రం తీపు తీసిందా ?

శశిరేఖ ఓ నిముషం వూరుకుంది.

"పోనీ ఎల్లావున్నాడో చూసిరాకపోయినా ?"

"ఓలమ్మో ! ఆడకెళ్ళకేం ?"

గఢీకెళ్ళడం పని వాళ్ళకి పెద్దపులిబోనులో కెళ్ళడమే. మరి తిరిగి ఇంటికొచ్చే పనుండదని వాళ్ళ వూహ.

"పోనీ, నడు. నేనూవస్తా దొరసానినోమాటు దర్శనం చేసుకుంటా."

పెదరెడ్డి పెద్దకోడలు పార్వతే ఇప్పుడు గఢీలో ఆడపెత్తనం. భర్తతో చెడినతర్వాత ఆమె ఆయనపద్దను పోలేదు. మాదుగామా, మారాముపాడూపాడ శివరామిరెడ్డే. ఆయన ఇంట్లోనే వుండిపోయింది.

కూనలమ్మ ఆశ్చర్యంతో శశిరేఖ ముఖంలోకిచూసింది. ఎప్పుడోరాపు రానికొచ్చినకార్తిలో ఆచారంప్రకారం గఢీలో ఒతాయించవానికి వెళ్ళిందేదో అంతే. తర్వాత ఇన్నాళ్ళకి మళ్ళీ వెళ్ళాలనుకోవడం కూనలమ్మకు వింతగానేవుంది. అందులో భాగ్యరెడ్డి దళంలో చేరినాక,...ఆయనో నాయకుడంటున్నప్పుడు...

శశిరేఖ ఆమె ఆశ్చర్యాన్ని అర్థంచేసుకొన్నా అసలదేమి ఎరగనట్లే మాట్లాడింది.

"దొరలు బెజవాడ పోతుండారటగా ?"

శశిరేఖకా విషయంఏమీ తెలియదు. గుడ్డివానిచేతి రాయిలా ఓ ప్రశ్న వదిలింది. అందరూ వెడుతున్నారు. శివరామిరెడ్డి వెడరాదేమో ఎవరు చెప్పగలరు ?

ఆమాట కూనలమ్మకు చాలసంతోషం కలిగించింది. దొరలు వూరొదిలిపోతే తన మగడింక గఢీలోనే మగ్గిపోవలసిన అవసరం వుండదు.

కాని, మరో అనుమానం కలిగింది. ధాన్యపుకొట్లకీ, గఢీలోనూ కాపలావుండమని మరీ వెడితే...

“అప్పుడు నువ్వుకూడా పిల్లలతో అక్కడే వుండొచ్చు లెమ్మా.”

కూనలమ్మకు శశిరేఖ ఆలోచన నచ్చింది. మారు మాట్లాడలేదు.

ఇద్దరూ మొక్కజొన్న పొత్తులు మంచివి ఏరి విరిచి తెచ్చేరు. వాటిని పళ్ళెంలోపెట్టి కూనలమ్మ కూడా తెస్తుంటే ఆ మధ్యాహ్నమే శశిరేఖ గఢీలోకి బయలుదేరింది.



## ఎనిమిదో ప్రకరణము.

శశిరేఖ రాక పార్వతికి ఆశ్చర్యమే కలిగించింది. ఆరోజున కచేరీగది బద్దలుకొట్టి తగులబెట్టేసేక, వూరి వాళ్ళెవరూ ఆ ఛాయలకూడా రావడంలేదు. ఈవేళ శశిరేఖ వచ్చింది. ఊరికే రాలేదు. కొత్తకాపురంలో పండించుకొన్నామంటూ ఇన్ని మొక్కజొన్న కండెలు తెచ్చింది. వెనకటి రోజుల్లో అయితే అలాగతేవడం ఆశ్చర్యంకాదు. తీసుకురాకపోతే ఆశ్చర్యంకాని. ఆ రోజుల్లో కొత్తపంటలో వాటా అడగడం దొరలకో

హక్కు. కాని ఈ వేళ ఆ హక్కు చెల్లడంలేదు. చెల్లాలని తాము కోరే స్థితిలోలేరు. ఆ హక్కు కోల్పోయేమన్న విచారమూలేదు.

పార్వతి శశిరేఖను ఎంతో స్వాగతంఇచ్చింది. పుట్టినింటికి వెళ్ళి వచ్చిన వార్తవిని వారి యోగక్షేమాలు తెలుసుకొంది.

అంతకన్న ఏప్రసంగం తేవడానికీ సాహసించలేకుండా వున్నారు.

అనుజ్ఞ తీసుకొని కూసలమ్మ భర్తను చూడడానికై గరిసెల పెరట్లోకి వెళ్ళింది. ఆమె వెళ్ళినాక ఏదో మాటల సందర్భంలో కదిలించి నట్లు వాళ్ళ తిండికి పడుతున్న కటకటను శశిరేఖ వర్ణించింది.

"జిల్లాలుదాటి తిండిగింజలు తర్లించకూడదని ఘానూసున్నదిట వర్తకులు తేవడంలేదు. జనం మాడిపోతున్నారు."

తన ప్రసంగం తీవ్రతను తగ్గించేటందుకు తన కన్నవారివూళ్ళో జనం తిండికి పడుతున్న కష్టాల్ని వర్ణించింది. పనిలోపని శివరామరెడ్డికో నమస్కారబాణం పడేసింది.

"అప్పుడూ, అప్పుడూ తమరు ఇంతకూడో, గింజలో పంపు తున్నారు. మీ పేరు చెప్పుకొని పిల్లల్ని సాకుకుంటూంది. ప్రొద్దుటేలేచి కోటిదండాలు మొక్కుకుంటూంది."

పార్వతి ఆ అభివందనలను స్వీకరించింది.

అటుతర్వాత శశిరేఖ పని సులువే. తాను వచ్చినపని వచ్చినట్లు చెప్పకుండా రఘునందనుడికి కబురందేటట్లు వంచమాటలు చెప్పింది.

శశిరేఖ వుద్దేశాన్ని తాను నెరవేరుస్తున్నట్లు తెలియకుండానే పార్వతి మరదికి రాఘవరెడ్డిని గుర్తుచేసింది. ఆతనికి రఘునందనుడిమీద గల విశ్వాసం, సద్భావం వర్ణించింది. ఒకటి, రెండు మార్లు జాబు వ్రాయ డానికి ప్రయత్నించినట్లుకూడా చెప్పింది.

రఘునందనుడు సాలోచనగా తనకేం జాబులురానట్లు చెప్పేడు.

"నువ్వు దేశంలోకి వచ్చేక ఓమారన్నా కలుసుకొన్నావా ?"

రఘునందనుడు తల అడ్డంగాతిప్పేడు. రెండేళ్ళపాటు ఆరడు దేశంలో లేడు. వచ్చేసరికి కుటుంబం అంతా అస్తవ్యస్తంగావుంది. భార్య చనిపోయింది. ఆమె విడిచిపోయిన పిల్లవానితోపిదే ప్రపంచ మయింది. పైగా ఈ భూముల గంద్రగోళాలు, ఈ మధ్యదళాలూ, రజా కార్లూ, సత్యాగ్రహాలూ ఇల్లుకదిలేలావుందా ? మరోమాట తోచనిస్తూందా ?

పార్వతి మరిది కష్టాలకు సానుభూతి తెలుపుతూ చనిపోయిన తోడికోడల్ని తలుచుకొని కన్నీరుతుడుచుకొంది.

"వదినా !"

"రాఘవుణ్ణి గురించి ఈ మధ్య నేనూ ఈ కధలు విన్నాను. కాని నాకు నమ్మకం కలగడం లేదమ్మా ! ఆతన్ని నేనెరుగుదును."

తన మిత్రుడి మంచితనాన్ని గురించిన కధలు చెప్పేడు. సంగంలో చేరేరని ఏడుగుర్ని ప్రాణాల్ని తుపాకితో కాల్చేడనీ, కొన ప్రాణంతో బ్రతికివున్నవాళ్ళని కూడా మంటల్లో పారేసేడనీచెప్పే రాఘవ రెడ్డి ఓ మారు ఓ దొంగతనంచేసిన కుర్రవాణ్ణి తప్పించబోయి తన్నులు తిన్నంతపనయింది. తిండిలేక దొంగతనంచేస్తారనీ, పనిచూపిస్తే దొంగ పనికెవ్వరూపోరనీ ఆ కుర్రాడిని సమర్థిస్తూంటే ఆ రోజున అటీషాప్స్ వద్దనున్న వాళ్ళంతా పేచీకితయారయ్యేరు. ఆ రోజున పోలీసునాకాలో పడిపుండక్కర్లేకుండా ఆతనితండ్రిపేరు నుపయోగించుకో వలసి వచ్చింది.

ఆ రాఘవుడేనా ?

తాను ఎరిగిన ఆ మనిషి దయాదాక్షిణ్యాలు కలవాడు. ఒకరికి నొప్పి కలుగుతుందంటే ఎంతోబాధ పడతాడు. ఎంత మర్యాద. ఎక్కడి

గౌరవం. వీధినపోయే గుడ్డివాడు కంగారుపడుతూంటే చేయిపట్టుకొని రోడ్డుదాటించి మరీవదిలేవాడు. ఎప్పుడూ నవ్వుతూ సౌమ్యంగా మాట్లాడే వాడు. అతడంటే అందరూ అభిమానించేవారు. అతనిని చూసినవాళ్ళూ, ఎరిగినవాళ్ళూ అతనితండ్రి మంగళంపల్లి జాగీర్దారు చంద్రారెడ్డి అని విని విస్తుపోయేవారు. అల్లాంటివాడు అవలీలగా, గుత్తులు గుత్తులుగా మను ష్యుల్ని కట్టి కాల్చేస్తున్నాడంటే నమ్మడం ఎల్లాగ? తన ప్రియమిత్రుణ్ణి ఓ మారు చూసి రావాలనుకొంటున్నాడు. ఆ సమయంలోనే ఈ వార్త. వెంటనే బయలు దేరేడు.

కొడుకు ప్రయత్నం చూసి శివరామిరెడ్డి నిరుత్సాహంతో తల పంకించేడు.

ఆయన చెప్పిన మహోగాథ విన్నాక రాఘవరెడ్డిని గురించినకథ లేవీ నమ్మకూడదనే నిర్ణయానికి వచ్చేడు రఘునందనుడు.

సవత్తల్లికోసం వుద్యోగం వదులుకు వచ్చేడని తండ్రిఅంటూంటే మొదట అతనికి అర్థంకాలేదు. అర్థం అయ్యేక నమ్మలేనని తోసేసేడు.

---

## తొమ్మిదో ప్రకరణము

కాని, తీరా వచ్చేసరికి తన మిత్రుడి నోటనే తండ్రిమాట అబద్ధంకాదని తెలుసుకొన్నాడు.

రఘునందనుడి రాకకు రాఘవరెడ్డి మహోత్సాహం తెలిపేడు. ఆర్భాటంచేసేడు. ఆ పనివాళ్ళనీ, ఈ పనివాళ్ళనీ పిలిచి పనులు పురమా యించేడు.

అంత సంతోషమూ, హడావిడీ మధ్యకూడా ఆతని మనస్సులో ఏదోబాధవున్నట్లే ఆ కళ్ళుచూపిస్తున్నాయి. ఆ వింతచురుకుదనం ఏమిటో అర్థంకాలేదు. ఒక అడవి జంతువుకళ్ళల్లా వున్నాయవి.

రఘునందనుడు ఒంటరిగాచూసి మిత్రుణ్ణి కదిలించేడు.

"ఏమిటల్లావున్నావు ?

ఆ ప్రశ్నకోసమే కనిపెట్టుకొనివున్నట్లు రాఘవరెడ్డి రెండుకళ్ళూ శ్రావణమాసాకాశాన్ని చూపించేయి.

"నా పెళ్ళాన్నే నాకు ఉంపుడుకత్తెను చేసేడురా, ముసిలాడు."

రాఘవరెడ్డి భోరునఏడుస్తుంటే రఘునందనుడు విస్తుబోయి చూసేడు. మిత్రుని ప్రణయగాథ నెరగని ఆతనికి ఆ మాటలు అర్థం కాలేదు.

క్రమంగా సంగతులన్నీ తెలిసేయి. ఆతడో పడుచును పెళ్ళిచేసుకోవాలనుకొన్నాడు. కాని, వాళ్ళు బీదవాళ్ళు. తన తండ్రికి కుటుంబ మర్యాదల పట్టుదల కూడా వుంది. దానికీ వాళ్ళు నిలబడలేరు. అందుచేత ఆలోచనలో పడ్డాడు. తండ్రి ముసిలాడయ్యేడు. కొద్దికాలంచూచి నెమ్మది మీద వొప్పించాలనుకొన్నాడు. ఆ అమ్మాయి కూడా వొప్పుకొంది.

ఆతడు తండ్రిని దుఃఖపెట్టడం ఇష్టంలేక తన మనస్సు నణచుకొన్నాడు. కాని తండ్రి ఆతడిని దుఃఖపెట్టడానికి సందేహించలేదు.

ఆ ఘట్టం చెప్తూంటే రాఘవరెడ్డి కళ్ళు పిడుగుల్నీ వర్షాన్నీ కూడా కురిపించేయి.

హఠాత్తుగా ఓ రోజున అతని తండ్రి ఆ అమ్మాయిని తెప్పించి బలవంతంగా పెళ్ళిచేసుకొన్నాడు. అటువంటి పరిస్థితి ఏలవచ్చిందో ఆతడెరగడు.

ఆ వయస్సులో పెళ్ళిచేసుకోవాలని బుద్ధి ఎందుకు పుట్టింది? భార్యచనిపోయిన పదిహేను ఇరవయ్యేళ్ళ ఈ మధ్య ఆయన మనిశికట్టు తప్పలేదు. కాని, పిల్లనెవరినో చూచి కట్టుకోమని సలహా ఇచ్చిన వారినెవరినీ ఆయన ఈ మధ్యకాలంలో దరిచేరనివ్వలేదు. అల్లాంటివాడి కిప్పుడీ బుద్ధి ఎందుకు పుట్టింది? పెళ్ళిచేసుకోవాలంటే మరే పడుచులూ దొరకలేదా? ఈమెనే పెళ్ళిచేసుకోవాలని ఎందు కనిపించింది? ఈ ప్రశ్నలు దేనికీ అతనివద్ద సమాధానంలేదు.

ఒక శుభముహూర్తాన కోడలు కావలసిన పడుచు భార్యగా గడపలో కాలుపెట్టింది.

తన తండ్రి తాను ఏరుకొన్న పడుచుకే తాళికట్టేడన్న వార్త తెలిసేక రాఘవరెడ్డికి భూకంపం అనుభవానికి వచ్చింది. అతడు కల్పించుకొన్న ఆశాసౌధాలు నేలమట్టుగా కూలిపోయాయి. చేస్తూ చేస్తూవున్న వుద్యోగానికి రాజీనామా యిచ్చేసేడు. రెక్కలు కట్టుకొని యింటివద్ద వాలేడు.

గుమ్మంలో కొడుకును చూడగనే చంద్రారెడ్డి గదితలుపులు మూసేసుకొన్నాడు. అతని చేతిలో రివాల్వరు తనవేపు తిరగగానే ముఖాం ఎత్తికట్టేసి, హైద్రాబాదు వెళ్ళిపోయేడు. కొత్తగా కట్టుకొన్న పెళ్ళాం వూడువదలనంది. రాఘవరెడ్డి కదలనియ్యనూ లేదు.

ఈ దుఃఖగాథను విన్నాక తన పుత్రుడి కళ్ళల్లో కనబడుతున్న వింతచూపు అర్థం అయిందనిపించింది. ఆ చూపులూ, మాటలూవింటే అతడసలు మనలోకంలో వున్నాడా అనిపించింది.

"ఎటువంటి వాడెల్లా అయిపోయేడు."

రఘునందనుడి కళ్ళల్లోనీళ్ళు తిరిగేయి. పెద్దరెడ్డిమీద మనసులోనే ఛూత్కరించేడు.



# పదో ప్రకరణము.

రఘునందనుడు మిత్రునితో మాట్లాడిన మరో ఘంటకు ముసలిరెడ్డి హైద్రాబాద్‌నుంచి వచ్చేడు.

చూడీదార్ పైజామా, నల్లనికోటు, రూమీటోపీలోవున్న చంద్రా రెడ్డిని మొదట గుర్తుపట్టలేకపోయేడు. గుర్తుతెలిసేక ఆశ్చర్యంవేసింది. రావణాసురుడని పేరుపడ్డ కర్కోటకుడు ఈయనేనా అనిపించింది.

తర్వాత ఆయన కబురుపెట్టగా రఘునందనుడు వెళ్ళేడు. తన మిత్రుడిని నాశనంచేసిన ఆక్రోశం, అసహ్యం మనస్సుని దహిస్తున్నా మర్యాదను అతిక్రమించడం అతనిచేతకాదు. తీరావెళ్ళేక తన ఎదుట కనిపించిన జీర్ణశిథిలమూర్తిని చూసి కోపం మరచిపోయేడు. తనకు ఎదురువచ్చి మర్యాదచేస్తున్న ఆ వృద్ధుడి రెట్ట పట్టుకొని సమర్యాదగా తీసుకెళ్ళి సోఫాలో కూర్చుండబెట్టేడు. తన సోఫాలో ఆయన కెదురుగా కూర్చుండి ఆయన వయస్సుయెడ ప్రత్యేకమర్యాద చూపేడు.

చంద్రారెడ్డి కుశలప్రశ్నలు వేసేడు. శివరామిరెడ్డి యోగక్షేమాలు ప్రశ్నించేడు. రమణారెడ్డి ఉద్యోగఫాయాను ప్రశంసించేడు. రఘునంద నుడి విధురత్వానికి విచారంతెలిపేడు. చిట్టచివర తన దురదృష్టానికి దుఃఖపడ్డాడు.

"మా సంగతి ఇల్లావుంది నాయనా ! చూస్తున్నావుగా !"

రావణాసురుడనిపేరు తెచ్చుకొన్ననాటి శారీరకస్థితీ, మానసికస్థితీ కూడా ఆయనలో రఘునందనుడికి కనబడలేదు. కుశలప్రశ్నలడుగుతూనే వేలపడిపోయేడు. తన తండ్రితో ఆయనకు పరిచయంవుండొచ్చు. కాని, తాను కొత్తవాడు. వయస్సులో బాగాచిన్న. కాని, ఆయనకా సంకోచమే

లేదు. కుటుంబసంగతులు, భార్యాభర్తల రహస్యాలుకూడా చెప్పుకొని భోరున ఏడ్చేడు.

ఏకమాత్ర పుత్రుడి సమస్య, ఆరోజున వుద్యోగంమాని ఇంటికి పరుగెత్తుకొని వచ్చిననాడే తాను కొడుకు మనస్సు నెంతగా గాయపర చేడో గ్రహించేడు. కాని, చేయగలది ఏముందంటాడు. తక్కువజాతి వాళ్ళకి తక్కువ బుద్ధులేవుంటాయి గాని మానం, మర్యాద ఏం తెలుస్తా యని తాను కట్టుకొన్న పడుచు వంశాన్ని నిందించేడు.

ఇప్పుడు స్పష్టంగా వొప్పుకోడంలేదు గాని, ఆయన మాటలధోరణి వింటే కొడుకు ప్రణయ వ్యవహారం ఆయనకు ముందే తెలుసుననిపిం చింది, అది తెలియడం చేతనే తాను పెళ్ళి ప్రయత్నానికి దిగే డేమో! వాళ్ళు బీదవాళ్ళు. కుటుంబ సంబంధాలు చాలా చాలా సాధా రణం. తన కొడుకు భవిష్యత్తునుగురించి ముసిలాడు బోలెడాశలు పెట్టు కొన్నాడు. ఆస్తి బోలెడుంది, తినేవాళ్ళెవరున్నారు? ఈ కొడుకొక్కడే. కాని, ఆతనికి ఏ జమీందార్లో పిల్లనిస్తారు. కాని రాజవంశాలమీదవుంది ఆయనచూపు. ఆ ఆశలన్నీ ఈ సంబంధంతో ధ్వంసధూళి అవుతాయని ఆలోచించి తాను అడ్డం వెళ్ళేడేమోనని పించింది.

ఆ పడుచు తనను అంగీకరించలేదని ఆయనే వొప్పుకొన్నాడు. ఆమెను కట్టుకొనలేక పోవడం కొడుకు అదృష్టమే నన్నాడు. మొదటి రోజునే ఆమె ముసిలాడిని గదిలోకి చేరనివ్వలేదు. "అదెక్కడి ఆడ దిరా బాబూ! బ్రహ్మ రాక్షసిరా"—అని ఆయన గుండెలు కొట్టుకొన్నాడు.

చండశాసనుడని పేరుపడ్డ చంద్రారెడ్డి ముసిలితనంలో ఒక్క తప్పటడుగు వేసేడు. దాని ఫలితంగా ఆయన కాళ్ళూ చేతులూ కట్టు బడిపోయేయి. పెళ్ళి చేసుకోవడం తాను చేసినతప్పు అని ఆయన వాపోయేడు.

కాని, ఆ దుఃఖం తన పెళ్ళివలన కొడుక్కి బాధ కలిగిందనికాదు. ఆమెమీద కసి దీర్చుకొనేటందుకు వీలులేకపోయిందని.

ఆయన దుశ్శాసనసబలం ఆమెముందు సాగలేదు. బలాత్కారంగా మగతనం చూపబోతే ఒక్క తన్ను తన్నింది. మరొకడూ, మరొకడూ అయితే మంచంమీదినుంచి పిల్లిమొగ్గలేసి క్రిందపడి, మెడలు విరుచుకొనేవాడేనని ఆయన తన చురుకుదనాన్నీ, సమయస్ఫూర్తినీ, బలాన్నీ నిరూపించుకొన్నాడు. ఆ మాటలు వింటూంటే రఘునందనుడికి నవ్వు ఆపుకోవడం చాల కష్టం అయిపోయింది. నవ్వు ఆపుకొన్నా కొంటె తనాన్ని ఆపుకోలేక పోయేడు.

"మంచం బాగా ఎత్తుగాబోలు."

ముసిలాడు గడుగ్గాయ.

"మన సత్తాఎరిగి మామగారు ఇక్కడి కిక్కడ చేయించి ఇచ్చేరు."

రఘునందనుడు ఉలికిపడి నాలుక కరుచుకొన్నాడు. కాని, ఆపదు చును తానే కట్టుకోవడంవలన కొడుకు కెంత ఉపకారంచేసేడో నిరూపించాలనే ఆదుర్దాలో ఆయన ఆ పడుచువాడి ఎగతాళిని లెక్క చేయలేదు.

ఓ రోజున తానామెను ఆప్యాయంకొద్దీ ముద్దు పెట్టుకోబోతే ముఖంఅంతా బావురుపిల్లిలా రక్కింది. మరో రోజున గదిలో అడుగు పెట్టబోయేసరికి గుండెలమీద ఒక్క గుద్దు గుద్దింది. "అయినా, చిన్నది. దారిలోకి రాకపోతుందాయని సహించేను. కాని..."

తర్వాతమాటను ఆయన చెప్పలేకపోయేడు.

తనసంత అవమానించి అల్లరిపెడుతున్నది తన భార్యే అయింది గనక గాని ముసిలాడు ఏమి చేసేవాడో వూహించుకోవడం రఘునంద

నుడికి కష్టమేంకాదు తనను వ్యతిరేకించిన ఆడవాళ్ళను పెట్టిన బాధలు జిల్లాలకు జిల్లాలు మార్మోగేయి. కథలుగా ప్రచారంలో వున్నాయి. కొరడా దెబ్బలు తినలేక లొంగిపోయిన ఆడవాళ్ళ కథలెన్నో ఆయన పేరున చలామణీలో వున్నాయి. ఒక మాలపడుచు ఆయనను కండవూడివచ్చేలా కరిచింది. ఆ బాధకి ఆయన మండిపడ్డాడు. కాళ్ళుచేతులుకట్టించి తనదగ్గరున్న రౌడీలచేత చెరిపించేడు. ఇల్లాంటి కథలు దోసెడు. రావణాసురుడనేపేరు వూరకేవచ్చిందికాదు. కాని, ఇక్కడేం చెయ్యడానికీ వీలు లేకుండావచ్చింది. ఆమె మెడలో కట్టినతాళి తన చేతులకే సంకెళ్ళయింది. పెళ్ళాన్ని తన రౌడీలచేత కొట్టించలేడు. మానభంగముచేయించలేడు. తనకే అప్రతిష్ఠ. ఇంక తానుచెయ్యిచేసుకోవాలి. అదక్కడ సాధ్యంకాలేదు. తాను కొట్టాలనుకోకుండానే ఆవిడ కొడుతూంది. తన అవస్థచూసి నవ్వుతూందనిపించి ఆఁపాప నొకత్తెను కుక్కలునాకేలా కొట్టించగలిగేడేగాని, తననీ చిక్కులోపెట్టిన పడుచును ఏమిచెయ్యలేకుండావున్నాడు.

మాటలలో అంత అక్కసు, కసి వెళ్ళబోస్తున్నా మనసులో ఆమెమీద మమకారంపోలేదని రఘునందనుడు గ్రహించేడు. ఇప్పటికేడెనిమిది నెలలనుంచి తానిక్కడుండడంలేదు. తాను తాళిగట్టినపడుచు తన కొడుకు ఇక్కడేవుంటున్నారు. వాళ్ళు ఒకేగదిలో పడుకొంటున్నారు. ఊళ్ళన్నీ ఈ వార్త పాకింది. కాని, ముసిలాడు ఏమీ జరగనట్లే ఆమెను స్వీకరించడానికి సిద్ధంగావున్నాడు. ఆమెను త్రోసిపుచ్చగలశక్తి ఆయనకు లేదు. అనుభవించినా, అనుభవించకపోయినా ఆమె తనది. ఆమెను తాను అక్కర్లేకపోయినా మరొకరిసొత్తు కావడానికి వీలులేదు.

అన్నిటికన్నా ముఖ్యం ఆయనకు సరళమీద మమకారం. అది ప్రతి మాటలోనూ బయటపడుతుంది. దగ్గరకు చేరనివ్వడంలేదనే కసివుంది. పైగా ముసిలితనం వొకటి. శారీరకబలం వుడిగినకొద్దీ మానసికవాంఛ బలీయంగా వుంటుంది. చంద్రారెడ్డి పరిస్థితియిదే. అనుభూతిలోకి రాగల

అవకాశంలేని ఆమెమీదివాంఛ ఆయన శక్తిని తినేసింది. గాంభీర్యాన్ని హరించింది. వయస్సు పెద్దరికం, ఆస్తిపెద్దరికం అన్నీమరచిపోయేడు.

ముసలివాని దుఃఖంచూసి జాలిపడాలో, కోపపడాలో రఘునందనుడికి అర్థంకాలేదు. అయినా మనిషి వెలితిపడ్డాడు. కనక, సానుభూతి రూపంలోనైనా ఆయనచేసిన తప్పును చూపించడం పెద్దకష్టమేంకాదు.

"మీకీబుద్ధి ఎందుకు పుట్టింది ?"

ముసలిరెడ్డి ఒక్కనిట్టూర్పు విడిచేడు. కర్మసిద్ధాంతం జ్ఞాపకం చేసుకొన్నాడు. నుదుటిపై అడ్డంగా చూపుడువ్రేలితో గీతగీసుకొన్నాడు.

"లలాటలిఖితారేఖా-"

అంతటితో ఆగలేదు; తన పొరపాటును స్వీకరిస్తూ మరోశ్లోక పాదం చదివేడు.

"వినాశకాలే......"

కాని, ఇంకిప్పుడు చేసేదేముంది ? అనుభవించాలి. తనకొడుక్కి నచ్చచెప్పమంటాడు.

"మహాఘోరం. వంశనాశనకరమైనపని జరిగిపోతూంది. అది వాడితల్లి."

## పదకొండో ప్రకరణము.

"అమ్మగారు తమరినోమారు జ్ఞాపకం చేసుకొంటున్నారు."

దాసీమనిషి తెచ్చిన ఈ ఆహ్వానం తనకేనని చాల సేపటివరకూ రఘునందనుడికి అర్థంకాలేదు. ఆ జ్ఞాపకం చేసుకొంటున్నామె సరళ అని

కూడా అతనూహించలేక పోయేడు. సరళ పేరునుకూడా ఇంతవరకు ఎరగడు.

దాసీ ముందు దారి చూపుతూంటే ఆతను వెంట నడిచేడు. మేడ మీది సావిట్లో సోఫాలో కూర్చుండబెట్టి లోనికి వెళ్ళింది. మరుక్షణంలో గాజుల గలగలలతో పచ్చనిచేయి గుమ్మానవున్న తెర తప్పిస్తూంటే రఘునందనుడు లేచి నిలబడ్డాడు. ఆ గడపలలో పూర్ణిమ వెన్నెలలా సరళ గదిలో అడుగుపెట్టింది.

"తమకు శ్రమ ఇచ్చేను. చిన్నబాబు ప్రాణమిత్రులు, నాకు గౌరవ నీయులు. కాని, అడుదానినికదా. తమ దర్శనం చేసుకోడానికై శ్రమ పెట్టవలసి వచ్చింది."

పుస్తకంలో మాటలు వప్పచెప్తునట్లు మాట్లాడుతున్న ఆమెవంక రఘునందనుడు ఆశ్చర్యంతో చూసేడు. అగ్నిశిఖలాంటి ఆమె సౌంద ర్యానికి ఆతనికళ్ళు మిరిమిట్లు కొల్పేయి.

రఘునందనుణ్ణి ఆమె కూర్చుండమని అర్థించింది. ఆమె ఆజ్ఞపై దాసీ తిపాయీ అమర్చి చా దానిపై రప్పతో పెట్టింది.

పాశ్చాత్యభాషా, పాశ్చాత్యదేశాల పరిచయంతో ఒక స్త్రీ అలా నిలబడి వుండటం, తాను కూర్చుండడం ఏదో ఎబ్బెట్టుగా కనబడింది.

"తమరుకూడా కూర్చుండండి."

సరళ చిరునవ్వు నవ్వింది. ఫర్వాలేదంటూ సోఫా వీపు నాను కొని ఎదురుగా నిలబడింది.

మగవాళ్ళముందు, తమకన్న పెద్దవాళ్ళముందు భారత స్త్రీ కూర్చుండలేదు. అది అమర్యాదగా భావిస్తారు.

ఆ విషయం గుర్తుతెచ్చుకొని రఘునందనుడింక ఆమెను ఒత్తిడి పెట్టలేదు. దాసీ తెచ్చియిచ్చిన పాన్ తీసుకొన్నాడు. తాను సావధానుడనే యన్నట్లు సోఫాకు జేరబడి కూర్చున్నాడు.

ప్రాధమికాలతో నిమిత్తంలేకుండా సరళ సరాసరి రాఘవరెడ్డి సమస్య నెత్తుకొంది.

"చిన్నబాబుగారి విషయంలో దారి తోచడంలేదు......"

ఆతడూ అదేస్థితిలో వున్నాడు. తాను వచ్చిన కొద్ది క్షణాలలోనే సాధకబాధకాలు అర్థం అయ్యేయి. తన మిత్రుడి మనస్సులో సరళ ఆలోచనతప్ప మరొక వూహలేదు. ఆమెను పెళ్ళిచేసుకొని దూరం పోతే తప్ప ఈ ఊబిలోంచి బయట పడలేడు. కాని అదెంతవరకు సాధ్యమో అర్థంకాలేదు. సరళకు తన మిత్రుడిమీద ప్రేమ వుండడం ఎంతవరకు నిజమో. జమీందారు బిడ్డగదాయని ఆశపడిందేమో.

పెళ్ళి అయినదానిని తీసుకుపోయి మళ్ళీ పెళ్ళి చేసుకొమ్మని సలహాయివ్వడం నీతికాదని ఆతని అభిప్రాయం. కాని, ఇది పెళ్ళేనంటే? పెళ్ళికి మిత్రుణ్ణి ప్రోత్సహించడంలో తప్పులేదని నిశ్చయించుకొన్నాడు. స్నేహితుడికి జరిగిన అన్యాయం చూసేక పరిపాటిలోవున్న నీతినియమాల విషయం పట్టింపు నిలబడలేదు.

కాని.......

...ఆ సలహా ఇచ్చేముందు ఆమె ధోరణి ఏమిటో తెలుసుకోవాలి. అదెల్లాగో అర్థంకావడంలేదు. ఇప్పటికే జరిగిపోయిన పెళ్ళికి ఆమె కట్టుబడి వుంటుందా? దానిని త్రోసిపుచ్చి రాఘవరెడ్డితో మరోప్రాంతంపోయి, ఆతనివృష్టిని మళ్ళించగలదా?

పెళ్ళి చేసుకోవడం అని తాను అనదలచినా, అదేవిధంగానూ సంఘంవృష్టిలో పెళ్ళికాదు. పెళ్ళికి ముందు ఆమె ఎవరినో ప్రేమించినదన్న సంగతి సమాజానికి పట్టదు. వివాహం తాళికట్టడం భార్యాభర్తలుగా జీవించడానికై సంఘంవేసిన ముద్ర. దానిని విడగొట్టడానికి హిందూసంఘం అంగీకరించదు. ఆధునాతన సంఘాచారాల ఆమో

దం వుంటుందనడానికేనా ఆమె వింతంతువుకాదు; వివాహిత. సజీవ భర్తృక. పెళ్ళిచేసుకొంటున్నానన్న పేరుపెట్టినా దానిని సంఘం అంగీకరించదు. ఆమె ఏమనుకొంటుందో...

"రాఘవుడు స్థానం మారుస్తేతప్ప దారిని పడగలడనే నమ్మకం లేదు..."

సరళ ఆ మాటలోని సూచనను అర్థంచేసుకోలేనంత అమాయికురాలుకాదు. రఘునందనుడు అడగలేకదాచిన ప్రశ్నలు దానిలో కనబడ్డాయి.

నిజానికామె తన వివాహాన్ని గుర్తించడంలేదు. రాఘవరెడ్డిని పెళ్ళిచేసుకొన్నా సంఘం గుర్తించవన్నా, ఆమోదించదన్నా ఆమెకు విచారంలేదు. కాని, రాఘవరెడ్డి తనను పెళ్ళిచేసుకోలేదు, భార్యగా స్వీకరించలేదు. తన ఆశల్ని కోసేసినందుకు తండ్రిమీద మహాద్వేషంవుంది. కాని, చిన్ననాటినుంచీ ఆయన యెడ అలవరచుకొన్న భక్తితాత్పర్యాలు ఏదో రూపంలో అంటిపెట్టుకొనేవున్నాయి. సరళ తన భార్యే అంటాడు. కాని, ఆమెను ముట్టుకోలేడు. తండ్రి ఆమెకు తాళిగట్టేడు. తమ మధ్య వావి ఏర్పడింది. దానిని అతిక్రమించలేడు. అసమర్థునికోపంతో తెల్లవార్లూ ఆమె మంచంవద్దనే కూలబడి జాగరంచేస్తాడు. ఏడుస్తాడు. ఆతనిని ప్రకృతిలోకి తేవడానికై ఆమెచేసిన ప్రయత్నాలన్నీ విఫలమైనాయి.

రఘునందనుడు ఈ గాథ చాలవరకు విన్నాడు. కొంతవరకు వూహించుకొన్నాడు.

ఉన్నట్లుండి సరళ ఒక ప్రశ్న వేసింది.

"శంకరరావు మీకూ మిత్రుడే ననుకొంటా."

"ఏం ?"

ఆ ప్రశ్న ఎరిగివున్నట్లే తోపిస్తున్నా, హఠాత్తుగా ఆ మనిషి నాతడు గుర్తుచేసుకో లేకపోయేడు.

సరళ చాలసేపటివరకూ ఏమీ సమాధానం ఇవ్వలేదు. ఇచ్చి నప్పుడుకూడా అదాప్రశ్నకు సరాసరి సమాధానమూకాదు.

"దుర్యోధనుడి విధ్వంసానికి కర్ణుడితోడి స్నేహం ఒక ముఖ్య కారణం."

ఈ మారు శంకర్రావు రఘునందనుడి మనస్సులో మెదిలేడు. ఆతడూ తనకు సహాధ్యాయుడే. జాగీర్దారీ కుటుంబాల పెద్దరికం నాశనంచేస్తున్నారని తమరిని నిందించేవాడు. క్రింది తరగతుల్ని నిర్దాక్షిణ్యంగా మెడమీద కత్తిపెట్టి అణచివుంచాలనేవాడు. వెట్టిచేయించు కోవడంవలన నష్టపడుతున్నామేగాని లాభంలేదని తానోమారు అంటే తనను కమ్యూనిస్టు అని ఈసడించేడు. కమ్యూనిస్టులు ఖతంచేసిన జార్ కుటుంబంకోసం ఎవళ్ళూ ఏడవకపోయినా ఆతడు ఏడ్చేవాడు. జార్ కూతుళ్ళలో ఆఖరామె అనాస్టాయా తానేనని ఒకతె ప్రకటించిందని విని వెంటనే ఆమెకు సానుభూతి లేఖవ్రాసేడు. అలాంటి పుత్తమ కుటుంబీకులను హింసించిన కమ్యూనిస్టుమూకల్ని నిర్మూలిస్తానని బయలుదేరిన హిట్లరు నభినందించేవాడు.

"హిట్లరును గురించి ఇప్పుడేమంటాడో"...అనుకొన్నాడు ఆ నాటి కథలన్నీ గుర్తువచ్చి, రఘునందనుడు.

అయితే ఆతని ప్రసక్తి ఎందుకొచ్చింది ?

సరళ ఆ శంకర్రావు ఇక్కడేవుండి రాఘవరెడ్డి మనస్సుని పాడు చేస్తున్నాడని చెప్పింది.

"రెండు రోజులక్రితం నేనాయనను నిలబెట్టి అడిగేను. ఖానుడి పేటలో ఇద్దర్ని చంపడానికి ప్రోత్సహించినది తానేనని ఒప్పుకొన్నారు. ఫకీరుపాలెంలో ఒక తుపాకీగుండుకు ఎందరు చస్తారో చూద్దామనే ఆలోచన కలిగించినదీ తానేనని చొప్పుకొన్నాడు."

రఘునందనుడు ఆశ్చర్యపడ్డాడు.

"వాడికా క్రౌర్యము ఎందుకు ?"

సరళ దానికేం సమాధానం చెప్పగలను ? చెప్పలేకపోయింది.

"నే నాయనను దేవిడీలోంచి పంపేసేను."

రఘునందనుడు ఆశ్చర్యపడ్డాడు. లంకలాంటి ఇంతదేవిడీ వ్యవహారాలను సర్దుకొనేపాటి ధైర్యం, మెలకువా ఈ పడుచులో వున్నాయా అనిపించి, ఆమె ముఖంలోకి చూసేడు. సరళ దానిని గమనించకుండానే చెప్పుకుపోయింది.

"ఆడది తీసుకోగల జాగ్రత్తలు చాల పరిమితం. ఇంటిబయట ఆ శంకరరావు చిన్నబాబుతో కలుసుకోకుండా చెయ్యగలశక్తి నావద్దలేదు. ఈయనను వూళ్ళమీదికి ఎగతోలడంవలన లాభంపొందేవాళ్ళు చాలా మందున్నారు. ఇతరులు ఏమైపోయినా వాళ్ళకక్కర్లేదు. ఈ సమయంలో మీ సహాయం కోరాలనితోచింది. మీయందు చిన్నబాబుకు గల గౌరవం, అభిమానం నాకు తెలుసు."

ఇప్పుడేం చెయ్యాలని సరళ సలహా అడుగుతూంది. తాను వూహిస్తున్నదానికన్న మంచివుపాయం మరొకటి అతనికి తోచడంలేదు. వారిద్దరూ ఇక్కడినుంచి దూరంగా, ఆఖరుకు సముద్రాంతరాలకు వెళ్ళిపోయి అయినాసరే ఈ దుష్టప్రభావాలకు దూరంగా వుండడం ఉత్తమం. కాని, దానిని, చెప్పడం ఎల్లాగ ?

ఆలోచించడానికి వాగ్దానంచేసి రఘునందనుడు ఆమెవద్ద సెలవు తీసుకొన్నాడు.

# పన్నెండో ప్రకరణము.

రఘునందనుడు ఏవేవో ఆలోచనలలో కొట్టుకొనిపోతూ నెమ్మదిగా లివింగ్ రూమ్‌లోకివచ్చి కూర్చున్నాడు. రాఘవరెడ్డి తన్ను పలకరించే వరకూ ఆయనక్కడున్నట్లెరికేలేదు. ఆ పలకరింపులోనే తానెక్కడికి వెళ్ళినదీ ఆతనికి తెలుసునని అర్థం అయింది.

"మేముద్దరం పోగడి ఆమె జీవితాన్ని నాశనం చేసేం."

"బాగు చెయ్యగల అవకాశం నీ చేతుల్లోవుంది."

రాఘవరెడ్డి నిశ్శబ్దంగా తల అడ్డం తిప్పేడు. ఆ మాటలో ఆతనికేమాత్రం విశ్వాసంలేదు.

"హిందూ ధర్మం నష్టపడుతుందనే విచారం నాకులేదు. మరే మతమన్నా అంగీకరిస్తుందాయన్న ఆలోచన నాకులేదు. కొడుకుకు ఈ విధంగా గొంతుకోసే తండ్రుల్నిసహించే సంఘం నాశనంకానీ, వాళ్ళ పెద్దరికాన్ని అంగీకరించే ప్రజలు నాశనంకానీ."

"కాని......"

రాఘవరెడ్డి మాటమధ్యంలో ఆగిపోయి ఒక్కక్షణం ఆలోచించేడు.

"రఘూ! బ్రతుకుభారం అనిపిస్తూందిరా. కాని, నాచేత్తో ప్రాణం తీసుకోవడం మన సొప్పలేదు."

"అనుక్షణం కాలికో వేలికో పెద్దవో చిన్నవో దెబ్బలు తగులుతూనే వుంటాయి. తగిలిన ప్రతిదెబ్బకీ ప్రాణం తీసుకోవడం ప్రారంభిస్తే ప్రపంచం ఒక్కరోజులో నిర్మానుష్యం అయిపోతుంది."

"తనకు తగిలే దెబ్బల్ని మిగిలిన జనం ఎల్లా తట్టుకుంటున్నారో నా కర్థంకాదు. వాళ్ళ మనస్సులు పాషాణాలా? ఇంతవరకు ఒక్కరు నామీద కసి తీర్చుకోడానికి ప్రయత్నించడంలేదు. ఏ వేపునుంచైనా ఒక్క తుపాకీగుండు ఈ బాధల్ని అంతం చేస్తుందని ఎదురుచూస్తున్నా. ఆంధ్ర మహాసభ దళాలు పేరుచెప్తే శంకరం ఉలికిపడుతున్నాడు. వాళ్ళ నారు టికట్టేస్తాననుకున్నా..."

రఘునందనుడు తాను తెలుసుకో దలచిన విషయాలు బయట పడు తున్నాయని సావధాను డయ్యేడు. ఎంతో సౌమ్యుడనుకొన్న మిత్రుడీ మధ్య వినబడుతున్నంత క్రూరంగా ఎందుకయ్యేడో, కాగలిగేదో అతని ఆలోచనల కందనేలేదు.

"అక్కడ దళం వుందన్నారు. వాళ్ళకు తుపాకు లున్నాయన్నారు. లారీకంటె ముందు నా జీప్ పెట్టేను. ఊరు దగ్గరున్న తోట్లదగ్గర జీప్ దిగేను. శంకరం ప్రమాదం జాగ్రత్తరా అంటాడు. నేను ప్రమాదాన్నే కోరేను. కాని ఆ నిర్భాగ్యుడు తన పని నక్కనెట్టి ఎవరో పిల్లకో కిందా మీదా పడుతున్నాడు. నాకు ఏడుపొచ్చింది. విసుపు, కోపం ముంచు కొచ్చేయి. ఒక్క గుండుతో ఇద్దరినీ చంపేసేను. ఆ రాత్రి తెల్లవార్లూ ప్రతీకారం తీర్చుకోడానికి దళం వస్తుందని అక్కడే ఆగేను. రాత్రంతా ఊరు వెలపలకు ఒంటరిగా వస్తూ పోతూనేవున్నా. కాని, ఒక్కడు రాలేదు."

రఘునందనుడికి ఆ మాటలలో విశ్వాసం కలగలేదు.

"చేసినపని సమర్థించు కొనేటందుకు చెప్తున్నావా? నీకు కోపం వస్తేమాత్రం రెండుప్రాణాల్ని తీసే అధికారం నీ కెక్కడుంది?"

రాఘవరెడ్డి తన మిత్రునినోట ఆ ప్రశ్నను ఆశించలేదు. నోరు తెరిచేడు.

"ఫకీరుపాలెంలో ఏడుగురిని చంపడానికి ఏం కారణం చెప్తావు ? నీకు చావాలని ఉంటే మీ తండ్రిచేతికే రివాల్వరివ్వకపోయేవూ ? నీ కేదో జరిగిందని వాళ్ళన్నింటినీ తల్లక్రిందు చేయడం ఒక సమర్ధనా ?"

"మా తండ్రీ చంపలేకపోయేడు. లోకానికి రావణుడైనా నా విషయంలో కాలేకపోయేడు. ఒక్క ఈ విషయంలోతప్ప ఆయన తండ్రినన్నమాట, నేను కొడుకునన్నమాట మరిచిపోలేక పోయేడు."

ఉన్నట్లుండి రాఘవరెడ్డి ఏదో గుర్తువచ్చినట్లు ఇంట్లోకి పరుగెత్తేడు. ఆ అకారణావేగం చూసి, మిత్రుని మనస్థితిమీద రఘునందనుడికి విశ్వాసం పూర్తిగా పోయింది.

"వీడిని ఇక్కడినుంచి పంపెయ్యాలి."

మరునిముషంలో ముసలితండ్రిని రివాల్వరుతో నెట్టుకొంటూ రాఘవరెడ్డి గదిలో ప్రవేశించేడు.

లోగుమ్మంలోకి వచ్చేక ఒక్కతోపు తోసేసరికి ముసిలాడు తూలిపోతూ సోఫాలో పడిపోయేడు. రాఘవరెడ్డి పళ్ళు కొరికేడు.

"నా పెళ్ళాన్నే నాకు ఉంపుడుకత్తెను చేసేవు. ఈమారు వీధి లంజను చేయాలను కొంటున్నావా ?"

రివాల్వరు రాఘవరెడ్డి పళ్ళతోపాటు పట పట లాడింది.

చంద్రారెడ్డి సోఫాకు కరుచుకుపోయేడు. రఘునందనుడు నోరు తెరిచేడు.

"ఏం పని చేసేవు ?"

రాఘవరెడ్డి తండ్రివంక అసహ్యం కక్కుతూ చూసేడు. రివాల్వరు గదిమూలకు పారేసేడు.

"ఆ పనే చెయ్యగలితే ఎంత బాగుండేది ? కాని చెయ్యలేక పోతున్నా."

రఘునందనుడు సోఫావంక చూసేడు. ముసిలాడు ఒత్తు కను బొమ్మల్లోంచి చూస్తున్నాడు. రివాల్వరుతో కాల్చేదనుకొన్నప్పుడు జాలి అనిపించినా ఆ ముఖం చూడగానే అసహ్యం అనిపించింది.

"నువ్వామెనెందుకు అవమాన పరుస్తావు. నీ మాటలతో నువ్వే ఎందుకు బాధ కల్పించుకొంటావు ?"

రాఘవరెడ్డి క్షీణస్వరంతో మిత్రునివంక తిరిగి తప్పు నొప్పు కొన్నాడు.

"నిజమే, నాకు మతి పోతూంది."

మిత్రుడిదగ్గర కొడుకు పిల్లిలా తగ్గిపోవడంచూస్తే చంద్రారెడ్డికి ధైర్యం కలిగింది. తన కొడుకును దారిలోపెట్టి, తన సంసారాన్ని కుదుట పరచగలుగుతాడనిపించింది.

"చెప్పు నాయనా ! అల్లా చెప్పు. ఏం చెయ్యాలో..."

రఘునందనుడు అసహ్యం ఉట్టిపడేలా గదిమేడు.

"ఉండండి."

చంద్రారెడ్డి వూరుకున్నాడు.

"పో. సరళని తీసుకు ఎక్కడికేనా పో. ఆమెను పెళ్ళిచేసుకో. సుఖపెట్టు. నువ్వు సుఖపడు..."

"ఆమె నా తండ్రి పెళ్ళాంరా !"

"చాలించు. మెళ్ళో తాడుగట్టిన ప్రతిఆడదీ పెళ్ళామే అయిపోతే ఆయన చాలమంది పెళ్ళాల్ని సంపాదించగలడు. వెర్రివేషాలెయ్యక ఆమెను పెళ్ళిచేసుకో. ఇక్కడనుంచి దూరంగాపోయి బ్రతుకు."

ఆ మాటలు వింటూంటే ముసిలాడికి కంగారుపుట్టుకొచ్చింది. తాను సాయంకోరిన వ్యక్తి ఇస్తున్న సలహాకు రెండుచెవులూ మూసు కున్నాడు. ఒక్క విసురుసలేచి గదివదిలి పరుగెత్తేడు.

"శివశివా ! మాతృద్రోహం."

# పదమూడో ప్రకరణము

గఢీనుంచి తిరిగివస్తూ, దారిపొడుగునా కూనలమ్మ ఏదో ఆలోచనలోనే వుంది. శశిరేఖ తాను మంగళంపల్లి వెళ్ళింది మొదలు నేటివరకూ నడిపిన రాయబారాలను గురించి ఆలోచిస్తూంది. అసలు తానీపని ఎందుకెత్తుకుందో ఇప్పుడామె ఆలోచనలోపడింది. రాఘవరెడ్డిని మార్చాలనీ, మార్చగలననీ అనిపించే ఆమె ఈ ప్రయత్నంచేసిందా ? ఆతడు మారక పోవడంవలన తనకేమన్నా అపాయంవుందనిపించి ఈపనిచేస్తూందా ? అవి రెండూ కూడా మంగళంపల్లి బయలుదేరేటప్పుడు ఆమె మనస్సులో లేవు. ఏదో ఆక్రోశం. గవరమ్మ నారాయణయ్యల కుటుంబాల శోకం చూసింది. రాఘవరెడ్డిని తానిదివరకెరుగును. ఏమిటయ్యా ఈ దురంతం అని అడిగెయ్యాలనుకొంది. తీరా వెళ్ళిందేగాని. ఆయనను అడిగేసేపాటి చనువు తనకు లేదని గ్రహించింది. తనకు చనువున్న సరళను అడ్డం పెట్టుకోదలచింది. ఇప్పుడు రఘునందనుణ్ణి ఎక్కతోయడానికి ప్రయత్నించింది. రాఘవరెడ్డిని తిట్టించడం తన ప్రయత్నమా అని అడిగితే ఆమే కాదనంటుంది. కాని, తానీపనికెందుకు పూనుకొందో, అసలా ఆలోచనే ఎందుకు కలిగిందో ఆమెకే అర్థం కాలేదు. అనుకోకుండానే తాను కూడా రాజకీయాలలోకి దిగేనని ఆమె కర్థం అయింది. నవ్వు వచ్చింది. కాని, ఇల్లా దిగడంలో తప్పేమీలేదనే అనిపిస్తూంది. రాఘవరెడ్డిని ఇల్లాంటి దుర్మార్గాలు చేయకుండా దిగతీస్తే ప్రజలకు సుఖం, ఆయనకు మర్యాదా దక్కుతుందనిపించింది.

ఆ ఆలోచనా ధోరణితోనే ఇంటికిచేరిన కూనలమ్మతో మాట్లాడేక వెంటనే రంగయ్యవద్దకు బయలుచేరింది.

పెద్దరెడ్డి తాను వసూలు చేయించిన లెవీధాన్యం సర్కారు గొదాములకు తోలిపెట్టించే ప్రయత్నంలో వున్నాడని గోవిందు కబురు.

ఘానుడిపేటలో లెవీకొలిచినవాళ్ళకి ఆ ధాన్యం తిరిగిఇచ్చేసేరట. ఇక్కడ కూడా ఆ పనిజరిగితే ఎంత బాగుండును !_ తమ ఇంట్లో రెండు నెలలు సుఖంగా తిందురుగదాయని గోవిందు వాపోయేడు.

"పెద్దరెడ్డి ఆ సత్యాగ్రహం ఏదో తానూ చేయకూడదూ ?"

సత్యాగ్రహం చెయ్యడానికీ, ధాన్యం పంచడానికీ సంబంధంలేదనీ, ధాన్యం పంచాలంటే సత్యాగ్రహమే చేయనక్కర్లేదనీ గోవిందుకు తెలియదు. ఆతనికి రంగయ్యంటే మర్యాద. చదువుకొన్నవాడనే సద్భావం వుంది. ఆతడు చెప్తే పని అవుతుందనే ఓ విశ్వాసం. అందుకోసం ఇంటికి వెళ్ళగానే రంగయ్యని కలుసుకోమని భార్యకు పుథమాయించేడు.

ఇంటికి రాంగనే కూనలమ్మ శశిరేఖతో రహస్యంగా ఆ మాట చెవినేసింది.

"లెవీ ధాన్యం తోలిపెట్టేస్తున్నడంట దొర."

శశిరేఖకా సమాచారం ప్రాముఖ్యత అర్థం కాలేదు.

"ఉహూ."

కాని, కూనలమ్మ దొరగారు సత్యాగ్రహం తలపెడితే బాగుండేదన్నప్పు డామెకు నవ్వు వచ్చింది. దొరచేత సత్యాగ్రహం చేయించడానికి గాక, ధాన్యం పంచేసేటట్లు మాట్లాడడానికి రంగయ్యను పంపిస్తే.

ఆ మాటతోచేక శశిరేఖకు మరో ఆటంకం అర్థం కాలేదు. వెంటనే బయలు దేరింది.

గతంలో ముఖపరిచయం లేకపోయినా రంగయ్యతో మాట్లాడడానికి శశిరేఖకు పెద్దగా బిడియం కలగలేదు. తమ సాటివాడు. పైగా ఆతని భార్య సూరమ్మ కూడా ప్రక్కనుంది. ఇంక బిడియం ఏంవుంది ? పైగా, ఈ రాజకీయాలు నెత్తినేసుకొన్నాక ఆమె మునపటల్లే బిడియపడడం లేదు. అసలా సిగ్గు కలగడమేలేదు.

గోవిందు సందేశం చెప్పినప్పుడు ఆతని అమాయకత్వానికి రంగయ్యతోపాటు ఆమె కూడా నవ్వింది.

కాని, ధాన్యం మాటేమిటి ?

ఆ విషయంలో రంగయ్యకూడా ఏమీ సలహా ఇవ్వలేక పోయేడు. వూళ్ళో పోలీసు స్టేషనుంది. నిజాము పోలీసులూ, మిలిటరీ, వాళ్ళవద్ద నున్న తుపాకులూ, రజాకార్లూ, లెవీ ధాన్యం కాపలాకు ఎంతో బలగం వుంది. ఖానుడిపేటలో పంచిపెట్టించిన లెవీధాన్యాన్ని వాళ్ళేపాటి అనుభవించేరు. ఆ విధంగా చేయించే అవకాశం కూడా ఇక్కడలేదు.

కాని, ఊళ్లో గింజ దొరకడం గగనమైపోయింది. కొనడానికే దొరకడంలేదు. పోనీ నందయ్య అమ్మినట్లు దొర అమ్మితే ?

శశిరేఖ ఆలోచన రంగయ్యకు నచ్చింది.

"పెద్దరెడ్డి చేయదలచుకొంటే జరుగుతుంది."

"మీరు మాట్లాడండి."

రంగయ్యకు తన రాయబారంయెడ విశ్వాసమేలేదు.

"చూద్దాం."

"పని అవుతుందా, అవదా అనే ఆలోచన పెట్టుకుంటే ఏ పనీ చెయ్యలేము. చెయ్యడమే. జరిగిందా, పదిమంది సుఖపడతారు. లేదా, ఇంతకన్న చెడేదేంవుండదు."

ఒక సాధారణురాలైన పల్లెటూరి పడుచుచేస్తున్న ఉపదేశాలు విని రంగయ్యకు ఆశ్చర్యం కలిగింది. ఆమె ముఖంవంక చూసేడు. శశిరేఖ కప్పుడు తన ఉపదేశవాక్యాల అర్థం గుర్తువచ్చింది. సంకోచపడింది.

"ఒకపనిచేస్తే సుఖం, జరిగే అవకాశం వుండొచ్చు కాని, అది అన్నిచోట్లా చెల్లదు. అందరి విషయంలోనూ చెల్లదు. ఒక పరిస్థితిలో ఒక మనిషి వెడితే జరిగేపని మరొకరువెడితే ఎదురుతిరగొచ్చు."

శశిరేఖ ఆ మాటల అర్థం ఆలోచిస్తూంది.

"అందుకే ఆలోచించడం."

రంగయ్యనుంచి వచ్చేసేక సూరమ్మ అతని మాటలను ప్రకృతానికి అన్వయించి వివరించింది.

"బోళ్ళ పొలం గొడవ ఒకటయిందిగా, దొర దానిని మరచిపోయేరంటావా? వీరు ఏ పనిమీదవెళ్ళినా ఆయన దానిని మనస్సులో పెట్టుకొని ఎదురెత్తుగానే ఆలోచిస్తే?"

శశిరేఖ—"ఔనౌను."

---

## పద్నాలుగో ప్రకరణము.

వెనకటి పర్యాయంలా కాకుండా పెద్దరెడ్డి తనకీమారు కూర్చునేటందుకు ఆసనంచూపించడం రంగయ్యకు ఆశ్చర్యమే కలిగించింది. ఈమధ్య జరిగిన గంద్రగోళాలు తన ప్రతిష్ఠని పెంచేయనుకోడానికి కారణం కనబడ్డం లేదు. అయినా శివరామిరెడ్డి కుర్చీ చూపించేడు. కుశలప్రశ్నలు వేసేడు. దేశంలో వ్యాపిస్తున్న ఆంధ్ర మహాసభ వుద్యమమూ, కాంగ్రెసు వుద్యమమూ ఈ మార్పును తెచ్చివుండాలి. రంగయ్యకు హుషారే కలిగింది.

కుశలప్రశ్నలూ వగైరాల అనంతరం శివరామిరెడ్డి ఒక్క నిముషం ఆగేడు. ఆయన చూపుల్లో ఏం వచ్చేవన్న ప్రశ్న కనబడింది.

రంగయ్య లోకాభిరామాయణం ప్రారంభించినట్లు తాపీగా నడిపేడు.

"గ్రామంలో ఎక్కడా గింజన్నమాల కనబడ్డంలేదు."

శివరామిరెడ్డి దానికి అంగీకారం తెలిపేడు.

"చాల కిచాటుగానే వుందని వింటున్నా."

తనను ఆశ్రయించుకొని వున్నవారూ, పాలేర్లు, కూలీలూ గింజలే అడిగి తీసుకొంటున్న సంగతిని ప్రసంగవశంలో చెప్పినట్లు ఆయన ఏకరువు పెట్టేడు.

"కాని, ఎన్నాళ్లు జరుతుందిల్లాగ? అసలే మనది పంటపండే దేశం కాదు, పైనుంచివస్తే తప్ప ఇక్కడి పంట మనకి చాలదు. వచ్చేది రాకుండా ఈ గంద్రగోళాలు. ఏం రోజులో, పాడో."

పెద్దదొర అభిప్రాయం ఏమిటో రంగయ్య కర్థంకాలేదు. ఆ గంద్రగోళం అన్నమాట రజాకార్లనుగురించి వుపయోగించేడో, ప్రజలవిశాల్ని గురించి అన్నాడో.

రంగయ్య నీళ్ళు నమిలేడు.

"చిత్తం. అంతా గొడవ గొడవగా వుంది. మధ్యన బీదా, బిక్కీ మాడి నలిగిపోతున్నారు.

శివరామిరెడ్డి ఈమారు తన అభిప్రాయాన్ని సందిగ్ధంగా వుంచలేదు.

"మీబోటి చదువుకొన్న పడుచువాళ్ళైనా కలగ చేసుకొని 'ఇదేం పన్రా'—అనకపోతే, ఇల్లాగేవుంటాయి. విన్నావుగా. నందయ్య గోల పెట్టేసేడు. అదేమన్నా మంచిపద్ధతా? మళ్ళీ గింజలు ఎవరన్నా లేవాలా?"

నందయ్య వ్యవహారం విషయంలో దళం తప్పేం చెయ్యలేదనే రంగయ్యభావం. వాళ్ళింకాసరయిన పనేచేసేరని ఆతని అభిప్రాయం. ఆమాటే నసిగేడు.

"నందయ్య దగ్గరకొన్న ధాన్యానికి డబ్బు ఇప్పించేరనే విన్నాను. ఆయనెందుకు గోలపెట్టవలసి వచ్చిందో..."

శివరామిరెడ్డి కనుబొమ్మల మీఁదుగా గుచ్చిగుచ్చి చూసేడు.

"మీరంతా తమాషా మనుష్యులు తయారయ్యేరయ్యా. మీ అభిప్రాయాలు అర్థంకావడమే కష్టం. మీరు చెప్పే సిద్ధాంతాల్ని ఆచరణలో పెట్టమంటే వెంటనే పనికి రాదంటారు. ఎల్లాగ మిమ్మల్ని అర్థం చేసుకోవడం ?"

యంత్రాల సాయంతో పెద్ద పెట్టున వ్యవసాయం దేశోపయోగకరమని తనచేత చెప్పించి, తన నెత్తినే చెయ్యి పెట్టడానికి చేసిన ప్రయత్నం జ్ఞాపకంవచ్చి రంగయ్య ఆలోచనలో పడ్డాడు.

"మీరు...అంటే నువ్వనికాదు. మా రఘునందనుడివీ ఇదే ధోరణి. అతగాడూ వ్యాపారులకి స్వేచ్ఛా, రక్షణా వుండాలంటాడు. ప్రస్తుతం గ్రామాలలో మా బోటి పెత్తందార్ల మూలంగా వర్తకులకవి రెండూకూడ లభ్యం కావడంలేదంటాడు. నువ్వేమంటావు ?"

ఆ సూటిప్రశ్నకు రంగయ్య తట్టుకోలేక పోయేడు.

"తమరిని అల్లా అనడానికి..."

శివరామిరెడ్డి చిరునవ్వుతో అడ్డు తగిలేడు.

"మొగంమీద అనడానికి నీకు సందేహం. నా మాటనే నే చెప్పుకొన్నాకదా !"

"చిత్తం."

"తెలంగాణంలో పెత్తందార్లు షావుకార్లనుంచి తీసుకొన్న వస్తువులకి ఒక రేటు కట్టి ఇస్తారు. ఎక్కడో ఎవ్వడో బండ, మొండి తప్ప ఖరీదు ఎగబెట్టడు."

శివరామిరెడ్డి వాదన ధోరణి అర్థం అయింది. నందయ్యకు ఒక రేటుకట్టి ధర ఇప్పించడం అటువంటిదేనని ఆయనవాదు.

రంగయ్య అభిప్రాయం అల్లాలేదు. ఈ మధ్య జరిగిన, జరుగుతున్న ఘటనలలో నందయ్యచేత ధాన్యం అమ్మించడం చాలనిరపాయమూ, అతి సామాన్యమూను, మంగలి నరసయ్యవద్ద భర్మారు లాక్కోవడం, వెంకయ్యను చంపడంవంటి వేవో ఎత్తుకొని సంగం అల్లర్లు చేస్తూం దంటాడని రంగయ్య అనుకొన్నాడు. ఆ సంగతులకు సమాధానం ఎల్లా చెప్పాలో ఒద్దికలు వేసుకొని తయారయి వచ్చేడు. కాని, ఆయన వాటి మాటనే తలపెట్టకుండా నందయ్య దగ్గర గింజలు తీసుకొని ధర ఇప్పించడం ఒక పెద్దఅశంగా చెప్తూంటే అతనికి ఏం చెప్పాలో అర్థంకాకుండా పోయింది.

కాని, ఆ రహస్యంకూడా ఎంతోసేపు గోప్యంగా వుంచలేదు పెద్దరెడ్డి.

వెంకయ్యనో, మరొకరినో ఏకసితోనో పదిమందీ పట్టుకు కీళ్ళు విప్పేసేరంటే అర్థం చేసుకోవచ్చు. అది తాత్కాలికావేశం. ఆ ఆవేశంలో మనిషి ఎంత పనేనా చేస్తాడు.

మంగలి నరసయ్య చేలిలో భర్మారు లాక్కోవడంలో ఓ ఆలోచన వుంది. కాని, ఆ మనుష్యలికి వీధిలోకివచ్చి నిలబడగల ధైర్యం లేదు. అదేవుంటే నరసయ్యదగ్గర భర్మారు లాక్కుపోవడానికి అంత ప్రయత్నం అక్కర్లేదు. కాని, నందయ్యచేత దళం దగ్గరుండి ధాన్యాన్ని అమ్మించింది.

"అన్నింటికన్నా పెద్దవిషయం డబ్బిప్పించేసింది. ఇప్పించిన డబ్బుకూడా తమ ఇష్టం వచ్చినంతకాదు. బజారుధేటున ఇప్పించింది. ఇది ముఖ్యం."

పెద్దరెడ్డి ఈ వివేచనకు రంగయ్య చాల ఆశ్చర్యపడ్డాడు. అంతకంటె దిగ్భ్రమ చెందేడనడంసరి. నందయ్యచేత ధాన్యం అమ్మించడంలో అంత అర్థం వున్నదని ఆతని కెన్నడూ తోచలేదు.

"అది ప్రజల తిరుగుబాటు స్వభావాన్నీ, ప్రభుత్వానికి పోటీగా తమ జనాన్ని నిలబెట్టుకొనే నిశ్చయాన్నీ తెలియపరుస్తుంది. అటువం టప్పుడు ప్రభుత్వాన్ని నెపం పెట్టడంలో అర్థం ఏవుంది ?"

చివర ఇంకోమాటకూడా చేర్చేడు.

"నే నిందులో తల దూర్చ తలచుకోలేదు."

ఆ వివరణనంతా విన్నాక తనకూ అటువంటి అభిప్రాయం ఏమీ లేదని రంగయ్య చెప్పుకొన్నాడు.

కాని,...

మరోమాట వినిపించుకోకుండా పెద్దరెడ్డి సలహా ఇచ్చేడు.

"నీ స్వభావం నాకు తెలుసు. అమీన్ ఒకటి రెండు మార్లు ఏవో మాటల సందర్భంలో నిన్నుగురించి ప్రస్తావించేడు. అదేం లేదనీ, నువ్వు చాల పెద్దమనిషివనే చెప్పేను. ఊరుకొన్నాడు. లేకపోతే సత్యాగ్రహం గొడవల్లో నీ పేరూ బయటకు వచ్చేదే. ఇప్పుడేనా ఇవన్నీ నెత్తివేసుకోకు. నీ యింట్లో గింజలేమా, పట్టుకెళ్ళు. అంతేగాని, లెవీ ధాన్యం అమ్మమనీ పంచమనీ బయట పడ్డావా నీకు నష్టం."

అమీన్ తనపేరు ఎత్తేడనగానే రంగయ్యకు గాభరా పుట్టింది. తన విషయాన్ని సర్దేసినందుకు పెద్దరెడ్డిమీద కృతజ్ఞతా కలిగింది, సత్యాగ్రహం రోజుల్లోకలిగిన వుత్సాహం ఆ మరునాడే చల్లారింది. ఆ తర్వాత జరిగిన ఘటనలన్నీ కంగారు పుట్టించేయి. చల్లగా దూరంగా వుండడానికే ప్రయత్నించేడు. కాని, నందయ్య ధాన్యం అమ్మకం...అవాతనికి బాగుందనిపించింది. ధాన్యం దోచుకుపోతే, కొలిపించుకొని అణో, బేడో చేతిలో పెడితే అడిగేవాడెవడు ? ఆలా జరగలేను. ఖచ్చితంగా బజారురేటు ఇప్పించేసేరు. ఆలా ఖచ్చితంగావుంటే దళాల విషయంలో ప్రభుత్వానికికూడా తీవ్రవ్యతిరేకత వుండదనుకొన్నాడు. అందుకే తానీ

రాయబారానికి అంగీకరించేడు. కాని, శివరామిరెడ్డి చెప్పిన వ్యాఖ్యానం విన్నాక ఆతనికి తన అనుభవ శూన్యతకు విచారమే కలిగింది.

మళ్ళీ ఇంకోమారు తానిల్లాంటి గందరగోళాలకు దూరంగా వుండ దలచేనని చెప్పుకొన్నాడు.

రెడ్డి హఠాత్తుగా ఓ ప్రశ్న వేసేడు.

"రెవీధాన్యం తోలిపెట్టాలని ఇంకా గట్టిగా అనుకోనేలేదే, నీదాకా ఎల్లావచ్చింది ?"

కూనలమ్మద్వారా తనకు తెలిసిందంటే దొర గోవిందుమీద పడి పోతాడు. ఆమాట గుర్తువచ్చి అబద్ధంఆడేడు.

"రెండు రోజుల్నించి ఊళ్ళో చెప్పుకుంటున్నారు."

కూనలమ్మ ఆరోజు మధ్యాహ్నమేవచ్చి వెళ్ళిందని ఎరిగివున్న పెద్దరెడ్డికి మొదట ఈ అనుమానం గోవిందుమీదికి పోయింది. కాని, రెండు రోజులనుంచి వింటున్నాననగానే ఆ అనుమానం తొలగింది. తన ప్రశ్నలో ఏమీలేదని సర్దివేయడానికి ప్రయత్నించేడు.

"ఏమీ లేనిదే చూడు, అసలు వార్త లెల్లాపుడతాయో! అదిగో తోకంటే ఇదిగోపులి. మొన్న యాధాలాపంగా మంగపతిని బండి కడ తావా అన్నా. ఇంతగొడవ చేసేడన్నమాట."

శివరామిరెడ్డి ఆ ప్రవాదం ఎంత అసత్యమో చెప్పడానికి పక పక నవ్వేడు.

తనవద్ద సంజాయిషి చెప్పుకొంటున్నట్లున్న ఆ మాటలతో అసలు విషయం నిజమేననిపించింది రంగయ్యకు. పెద్దరెడ్డి చాల గంభీరుడు. తనవద్ద సంజాయిషీ ఎందుకు చెప్పుకోవాలి ? అయినా తనకెందుకు అనిపించింది.

"అంతే ! అంతేనండి."



# పదిహేనో ప్రకరణం.

లెవీగల్లా తీసుకొని బళ్లు బండిబాట వదలి దండుబాట ఎక్కేయి.

తెలతెల్లవారుతూంది. బళ్లప్రక్కనే నడుస్తున్న సేతుసిందీ గోవిందు బస్తాలనెట్టు మధ్యన కూర్చున్న జమేదారును పిలిచేడు. కాలు మడికి కూర్చుని రావడానికై అనుమతి కోరేడు.

రంగయ్యవచ్చి వెళ్ళేక శివరామిరెడ్డి లెవీ ధాన్యం తోలిపెట్టడానికి తొందర పడసాగేడు. ఈ మారు ఆయనకు దళం భయం గట్టిగా పట్టుకొంది. వెంటనే సబినస్పెక్టరును కలుసుకొన్నాడు. ఇద్దరూ ఆలోచించేరు.

జమేదారు గంగారామ్‌ను రైఫిల్‌తో బళ్ళకు కాపలాపంపేరు.

గోవిందు ఆ ధాన్యం పంపకంమీద పెట్టుకొన్న ఆశలన్నీ వ్యర్థమయ్యేయి. తన భార్య ద్వారా రంగయ్యకి కబురుపెడితే దళం వాళ్ళకి అందుతుందనీ, వాళ్ళు ధాన్యం పోకుండా ఆపి, పంచి పెడతారనీ వూహించేడు.

కాని, పెద్దరెడ్డి వద్దకెళ్ళి లెవీ ధాన్యం తోలిపెట్టకుండా నచ్చచెప్పడానికి రంగయ్య మాట్లాడేడనేసరికి గోవిందుకు ముచ్చెమటలుపోసేయి. ధాన్యం తోలిపెట్టే ఏర్పాట్లు అతిగుప్తంగా జరిగిపోతున్నాయి. అది రంగయ్యకెల్లా తెలిసిందని ఆరాతీస్తే? రంగయ్య తనకీవార్త ఫలానివాడి ద్వారా తెలిసిందంటే? ఇంక రెడ్డి మందర బ్రతకదానిఉందా?

కాని, రంగయ్య చెప్పినట్టులేదు. అదోమేలు. అయినా మరోబెడద వచ్చింది. అతడువచ్చి మాట్లాడి పోయేకనే బళ్ళవెంట పోలీసు జమేదారును పంపడానికి ఏర్పాటుచేసేరు. వాళ్ళకీ భయం పట్టుకొందన్నమాట. దళం ధాన్యం బయటకుపోకుండా అడ్డుపడొచ్చునేమో.

జమేదారు రైఫిల్ సిద్ధంచేసుకొని బండిమీద బస్తాలమధ్య కూర్చు న్నాడు. మంచిఅనువైన మదుగు. వాడక్కడుండగా దళంవాళ్ళు బళ్ళ దరిమానాలకు కూడా రావడం సాధ్యం కాదు. అది దళానికి తెలియక వచ్చేరా నిష్కారణం చచ్చిపోతారు. ఇంతవరకూ ధాన్యం బళ్ళతో రైఫిల్ మనుష్యుల్ని పంపడం అలవాటులేదు. అందుచేత వాళ్ళకా అను మానం తగలడానిక్కూడా వీలుండదు. ఈ వార్త చెప్పడానిక్కూడా వ్యవధిలేదు. అంతా బయలుదేరేకగాని తనకీసంగతే తెలియదు.

నిష్కారణం తన మూలంగా రక్షణదళంవాళ్ళు చచ్చిపోతారేమో నని గోవిందుకు దిగులు పట్టుకొంది. ఆ దళంతోగాని, వుద్యమంతోగాని తనకు సంబంధంలేదు. కాని, అందులోని వాళ్ళంతా తాను ఎరిగున్నవాళ్ళూ, స్నేహితులూను, తాను అసహ్యించుకొనేవాళ్ళంతా దళంపేరుచెప్తే హడలి పోతున్నారు. అందుచేత దళం అంటే ఆతని కభిమానం. విషయం ఎరు క్కుండా, కేవలం కల్పనాబలంతో పెంచుకొన్న అభిమానం చాల బల యం. గోవిందు ఆలాంటి అభిమానంతోనే ఆరాటపడి పోతున్నాడు. వాళ్ళు బళ్ళను ఆపాలనుకొన్నారోలేదో అతనికెరిక లేదు. తన ఆదుర్దాలో దళం రావడం నిర్ణయమై పోయినట్లే భావిస్తున్నాడు. వాళ్ళు దారిలో దాగ డానికి వీలుగావుంటుందని ఒక మదుగును తానే నిర్ణయించేసుకొన్నాడు. దిండుబాట ఎక్కేక రెండు మైళ్ళలో రోడు ఒక కొండనుచుట్టి మోచేతి మలుపుగా తిరిగి వెడుతుంది. ఆ మలుపులో అన్నీ పెద్దపెద్ద బండలు, తంగేడు మొక్కలు, శీతాఫలచెట్లు జీబుగావున్నాయి. అక్కడే ఒక కొండవాగుమీద చిన్నకల్వర్టుకట్టేరు. మలుపువద్ద ఆ వాగు క్రిందుగావున్న బోళ్ళలోకి ప్రవహిస్తూంది. అటూ ఇటూ నాలుగు మూడు మైళ్ళలో వూరులేదు. ఆ చోటుమంచి అనుకూలమని గోవిందు అభిప్రాయం. అందు చేత అక్కడ వాళ్ళు మనుగుకాస్తారని భావించేడు. దళం ఒకవేళ బళ్ళను

ఆటకాయించదలచినా అంతకన్న వేరేచోటు చూసుకొనవచ్చునేమోనని కూడా అతనికి తోచలేదు. అది తమ వూరికీమారం. దగ్గరలో వూళ్ళు లేంపోతే ఆ ధాన్యం ఏమిచేస్తారు? ఎక్కడికి మోస్తారు? ఆ బళ్ళల్లోనే ఏవోవూరు చేరుస్తారనుకొంటే ఎక్కడనుంచి ఏ వేళప్పుడు పోలీసులు వచ్చిపడ్తా నిలబడ్డం ఎల్లాగ? అందుచేత వాళ్ళు మదుగు వెతికేటన్న బహిరంగంగా వూళ్ళల్లోనే బళ్ళునిలుపుతారేమోననే ఆలోచన గోవిందుకు పుట్టలేదు. ఆతడొక కల్పన కల్పించుకొన్నాడు. ఆ కల్పనలో కొట్టుకు పోయేడు. బళ్ళు మదుగు దగ్గర్లోకివస్తున్నాయి. ఏమైనాసరే గంగారామ్ రైఫిల్ పని చెయ్యకూడదు. మలుపు దగ్గరకొచ్చేలోపునే గంగారామ్‌ను బండిలోంచి దింపాలి. తుపాకీ బస్తాలమీదవదిలేశా మాజాగు. కూడా తెచ్చేడా తనచేతిలో గుడుకర్ర వుండనేవుంది.

ఆ ఎత్తులోనే తాను కాలుమడికి పోతానన్నాడు. తెల్లవారిందిగనక జమేదారు కూడా బండి దిగుతానన్నొచ్చు.

సరిగ్గా గోవిందు అనుకున్నట్లే జరిగింది. గోవిందు దరఖాస్తు వినగానే గంగారామ్ బస్తాలమధ్యలేచి కూర్చున్నాడు. ఒళ్లువిరిచి ఆవలించేడు. తనకు కనబడుతున్న దానినే ప్రశ్నరూపంగా వర్ణించేడు.

"అప్పుడే బాగాతెల్లారిందే."

చాలసేపు ముడుచుక్కూర్చుంటే కాళ్లు తిమ్మిరెక్కేయి. కాలు ఝాడించి పదడుగులు వెయ్యాలనిపించింది.

"ఉండు నేనూ దిగుతా."

బండి ఆగింది. వసికర్రలు పట్టుకొని చక్రంమీదనుంచి దిగేడు. దిగేక బండిలోని రైఫిల్ అందుకొన్నాడు. ఆతడు దిగేటప్పుడు గోవిందుకి కలిగిన సంతోషం మాయమయింది. తుపాకీ కూడా తెచ్చుకొంటున్నాడే అనిపించింది.

"అదెందుకు కూడా?"

గంగారామ్ ఆ మాటను లెక్క చేయలేదు. తెల్లవారితే మాత్రం రైఫిల్‌ను చేయివదలడం పద్ధతికి విరుద్ధం.

"కొట్టనీ, కొట్టకపోనీ, బిజ్ లోడ్ భుజం మీదుండాలి."

ఆఖరున అనుమానం తగిలింది. తుపాకీ బండిలో వదలమంటున్నాడేం అనిపించింది. ఓరచూపులు చూస్తూ చేతిలో కర్ర బండిమీద పడెయ్యమన్నాడు.

జమేదారు చూపుల్లోనే గోవిందుకు తన పొరపాటు అర్థం అయింది. వెంటనే ఏమీ ఎరగనట్లు తన చేతిలో కర్ర బస్తాల మధ్య దూర్చేడు.

జమేదారుతో కబుర్లుచెప్తూ నడుస్తున్నా గోవిందు ఆలోచనలన్నీ ఆతడు తుపాకీ కాల్చకుండా చెయ్యడం ఎల్లాగనే. మొదట అనుకొన్నట్లు ఇప్పుడు తన చేతిలో కర్రకూడాలేదు. హఠాత్తుగా తట్టింది. రైఫిల్ లాక్కుంటే?

ఆ ఆలోచన గోవిందు ఆశలకు రెక్కలిచ్చింది. దళంవాళ్ళవద్ద మంచి తుపాకులు లేవు. ఆలోటు తీరుతుంది. ఏ ప్రమాదమూలేకుండా ధాన్యాన్ని వాళ్ళు తీసుకుపోతారు. పదిమందీ ఇంత తిండి తింటారు.

అయితే ఎల్లాగలాక్కోవడం? జమేదారు గంగారామ్ మంచిబలమైనవాడు. బల్లచెక్కలా వెనుపట్టెచూస్తేనే భయంవేసేలా వున్నాడు. ఆతని చేతిలోంచి ఆయుధం లాక్కోవడం మాటలా? తన చేతిలో కర్ర కూడా లేకుండాచేసేడే. గోవిందుకు నిరాశే కలిగింది. తనఅసామర్థ్యాన్ని తలచుకొని మనస్సులోనే జమేదారును బహువిధాల ఆశీర్వదించేడు.

లంజకొడుకన్నా, మరొకటన్నా ప్రస్తుత సమస్య పరిష్కారం కాదు. ఇంతవరకూ గంగారామ్‌ను బండిదింపడం ఎల్లాగనీ, తుపాకీ

దూరంగా పెట్టించడం ఎల్లాగనీ ఆలోచించేడు. ఇప్పుడా తుపాకీ లాక్కోవడం ఎల్లాగనికూడాకాదు. జమేదారును ఖతంచెయ్యాలి. ఎల్లాగ? గోవిందు ఓ మారు తన చేతుల్నీ, జమేదారు గొంతునూ చూసుకొన్నాడు. నిరాశే కలిగింది.

బళ్ళు కొండవాగుమీది వంతెనెక్కాయి. ఆ బరువుకి గండేరాలు ఝుణఝుణ లాడుతున్నాయి. గోవిందు నెమ్మదిగా పెళ్ళినడకలు ప్రారంభించేడు. వీలుగావున్న చెట్టుకోసం నిలబడి పరకాయించేడు. డాగా పల్లంలోవున్న ఈతరుప్పకాని అతనికి నచ్చలేదు. రోడ్డునల్లందిగి గబగబవెళ్ళి రెండుపుల్లలు విరిచేడు. కాని, అవి లేతవి ఏదేదేమో సాగేయి కాని విరగలేదు. ఒక్కొక్క క్షణం ఆలస్యం అయినకొద్దీ బళ్లు ఓ అడుగు వేస్తూ పోతున్నాయి.

అంతసేపు విరుస్తున్నావేంరా యని జమేదారు గదమాయించేడు. పుల్లవిరగడంలేదు. పైగా ఈతముళ్లు చేతిలో గుచ్చుకొంటున్నాయి. గంగారామ్ పిలిచి మొలనున్న కైజాచలీసి చేతికిచ్చేడు.

"త్వరగా తే. బళ్ళుపోతున్నాయి."

గోవిందు వెళ్ళి రెండు జువ్వలు విరిచి తెచ్చేడు. ఆకులు రలిచి ఒకపుల్ల జమేదారు కిచ్చేడు. రెండోది తాను బాగుచేసుకొన్నాడు.

ఇంక కైజారు నిచ్చెయ్యాలి. అప్పుడే జమేదారు చెయ్యి జాపుతున్నాడుకూడా. గోవిందు ఏదో నిర్ణయించుకోవలసిన సమయం వచ్చింది.

బళ్ళు చాలదూరం వెళ్ళేయి. రోడ్డుమీద కనుచూపు మేరలో మనుష్యులు లేరు.

"ఏమిట్రా అల్లా దిక్కులు చూస్తావు. బేవకూఫ్"

దూరంనుంచి వినిపించిన లారీచప్పుడు గోవిందును కాపాడింది.

"ఏమిటా చప్పుడు?"

జమేదారు చెవిఒగ్గి ఆలకించేడు. నిర్జనంగా వున్న ఆ రోడ్డుమీద లారీ ఒకటి శరవేగంతో వస్తూంది. బిళ్లు దూరంలో మలుపులో అదృశ్య మైనాయి. ఈ మూలనుంచి లారీ వచ్చేసింది. అది వస్తున్న వేగానికి ఇద్దరూ అప్రయత్నంగానే పల్లంలోకి దిగేరు. గండేరామెద కూడ లారీ వాడు వేగం తగ్గించలేదు. వూసలా మాసుకుపోయింది. తమరిని దాట గానే దుమ్ము తెరలో అదృశ్యం అయింది.

లారీ పోయింది దాని ధ్వనికూడా వినిపించడంలేదు. కాని, అది లేపిన దుమ్ముతెరమాత్రం పొగమంచులా రోడ్డును అంటిపెట్టుకొని ఆలాగే చాలసేపటివరకూ నిలిచిపోయింది.

ఆ దుమ్ముతెర విడేసరికి జమేదార్ గంగారామ్ రోడ్డు పల్లంలో బొక్కబోర్లా పడున్నాడు. ఆతని భుజాన వుండవలసిన రైఫిల్‌కు బదులు పలుదోంపుల్లలు కోయడానికి తీసిన ఖైజారు వీపున దిగబడివుంది.

పక్కనే వుండవలసిన గోవిందు అక్కడలేడు. రైఫిలూలేదు.



## పదహారో ప్రకరణము.

ఒకరోజు చీకటి పడేవేళకి దేవిడీలో శంకరరావు హాజరయ్యేడు. వదినగారు దేవిడీ మన్నాచేసినా—అంటూ క్షమార్పణలతో ప్రారంభించి శివరామిరెడ్డి పంపించిన లెవీధాన్యాన్ని అడ్డంకొట్టి నాలుగైదూళ్ళవాళ్ళు పంచేసుకొన్నారంటూ వార్త అందించేడు.

జమేదారును చంపేసి, గోవిందు రైఫిల్‌తో పరారీ అయ్యేడన్న వార్త రఘునందనుడికి ఆయన ద్వారానే తెలిసింది. ఆ వార్తకు దిగ్భ్రమ చెందేడు. గోవిందు అటువంటిపని చెయ్యగలడని కలలోకూడ అనుకో

లేని విషయం. వట్టి మేక, సాధుజంతువు. అలాటివాడు తోడేలు అవ్వే డంటే నమ్మడం ఎల్లాగ?

జమేదారును చంపెయ్యడంకన్న రైఫిల్ పట్టుకుపోవడం ఆయనకు చాల ఆశ్చర్యం. ఆతడు రైఫిలేం చేసుకొంటాడు? పోయి దళంలో చేరుతాడు. దళానికో రైఫిల్‌దక్కిందన్నమాట. మంచి ఆయుధాలు లేక పోవడంచేతనే వాళ్ళు పక్క పక్కల తప్పుకు తిరుగుతున్నారు గాని, ఇంక......

శంకరం ఆ భయాన్ని ఖాతరు చెయ్యలేదు. ఆతని దృష్టిలో అది చాలా చిన్న విషయం. "తమ వూరిమీదుగా ధాన్యంతో బళ్ళు వెడుతుంటే ఆపేసి పంచేసుకోడానికి సాహసించేరంటే......"

శంకరం ఆవేశంలో వాక్యాన్ని పూర్తి చెయ్యలేదు.

రాఘవరెడ్డి విని ఊరుకున్నాడు. మండిపడి ఎగురుతాడని రఘునందనుడి అభిప్రాయం. అటువంటిదేమీ జరగలేదు. అయితే తన ప్రయత్నం ఫలించిందా? ఇక్కడ జరుగుతున్న విషయాలను వేటినీ మనసుకు పట్టించుకోకుండా, అన్నీ మరచి దేశం వదలిపొమ్మని తాను చెప్పేడు. దాని ఫలితం వుందనడానికిది సూచనఏమో.

కాని, సరళ కటువంటి ఆశ లేదు. శంకరం మళ్ళీవచ్చేడంటే ఆమెకు భయంగానేవుంది.

రాత్రి భోజనానంతరం మిత్రులు ముగ్గురూ కూర్చుండివున్నారు. రఘునందనుడు ఏదో దీర్ఘాలోచనలో వున్నట్లు శంకరానికి కనిపించింది. భోజనంవద్దకూడా ఆతడాట్టే మాట్లాడినట్లు లేదు. రాఘవరెడ్డి కూడ ఒక సోఫాలో జేరగిలబడిపోయి, సిగరెట్టు వెలిగించి మిద్దెవేపు చూస్తూ కూర్చుండి పోయేడు.

శంకరానికి ఆలాకూర్చుంటే తోచడంలేదు. అతనినోరు వూరుకో లేదు. చివరకు తానే ఎత్తుకొన్నాడు.

గోవిందు రైఫిల్ పట్టుకుపోయేడంటే నేను లెక్క చేయక పోవడం నీకు ఆశ్చర్యమయింది. కాని నిజం చెప్పాలంటే నీకు నన్ను చూసి ఆశ్చర్యం కలగడంకన్న, ఆ రైఫిల్‌ను ఏనాడో లాక్కుపోవల సింది లాక్కుపోనందుకు ఆశ్చర్యం కలగాలి.

రఘునందనుడికి మిత్రుడి అభిప్రాయం అర్థంకాలేదు. శంకరం చిరునవ్వుతో తన అభిప్రాయాన్ని వివరించేడు. ప్రజలలో కొంతమందికి ఆయుధాలు సేకరించాలనే ఆశ, కోరికా వుంది. ఎందుకంటే వాళ్ళే చెప్పలేరు. తమకు కక్షవున్నవాళ్ళమీద వుపయోగించడానికి కావచ్చు; ఎప్పుడేనా అవసర పడితే ఆత్మరక్షణకు వుపయోగపడుతుందనే భావం కావచ్చు. కొంతమందికి వాటిని చూసుకొని ఆనందించడం సరదా.

ఆయన వుద్దేశంలో వూళ్ళకి వూళ్ళు ఎగబడి ధాన్యాన్ని పట్టు కోవడం, సంఘం కట్టుబాట్లను తొక్కి పారెయ్యడం నేడు తమరి నెదు ర్కొంటున్న ప్రధాన ప్రమాదం.

"ప్రజలు సుఖంగా వుండాలనేదే నా కోరికా, కాని, సుఖం ఎందులోవుంది ? ఎవరిపని వాళ్ళు చేసుకోవడంలోనేవుంది. "స్వధర్మే నిధనం శ్రేయః" కాని, ప్రతివాళ్ళకీ తమరు తప్ప మిగతాఅందరూ ఎవరి పనివాళ్ళు చెయ్యాలనివుంది, అక్కడే వస్తూంది చిక్కు.

"గాంధీజీనే తీసుకో. ఆయనేమన్నారు ? సమాజం ఆస్తులకి తమ రందరినీ ధర్మకర్తలన్నాడు. కాలేజీలో ఆ విషయంమీద ఎంత తర్జన భర్జనలో జరిగేయి. జ్ఞాపకంవుందా ? ఆ రోజుల్లో గాంధీజీమీద ఈగ వాలితే చెప్పు తీసుకొన్న సత్తిరెడ్డి..."

శంకరం మధ్యలో మాట నిలిపి సత్తిరెడ్డి విషయం ప్రశ్నించేడు.

"అతడిప్పు డేం చేస్తున్నాడో తెలుసా ?"

ఆ విషయంలో రాఘవరెడ్డికూడా ఆసక్తి ప్రకటించేడు.

"రావి నారాయణరెడ్డి వాళ్ళతో స్టేట్ కాంగ్రెసు స్థాపించిన వాళ్ళల్లో ఒకడుకాదు ?"

రఘునందనుడు ఔనన్నట్లు తల వూపేడు.

"లెనిన్‌లాంటివాళ్ళు పుట్టాలనేవాడు."

శంకరం కంఠంలో ఈసడింపు ప్రతిధ్వనించింది.

"వాదే పుట్టేడుగా ఓ లెనిన్."

రఘునందనుడికి ఆ స్వరంలోని హేళన నచ్చలేదు.

"ఎవరు చెప్పగలరు ? వాళ్ళు పిడుగుల్లాంటివాళ్ళు. తీరా మీద పడ్డాకగాని తెలియదు. ఏ వురుములో ఏంవుందో."

శంకరం అసలువిషయంలోకి మారేడు.

"అతడేం చేస్తున్నాడో తెలుసా ?"

రఘునందనుడు తెలుసునన్నట్లు తల వూపేడు. శంకరం వివరించేడు.

"పెద్దపులి పేరంటాలుకి పెట్టుకోదు-ఎవడన్నా పిచ్చిబ్రాహ్మడు అల్లా అనుకొన్నా సంగతి అర్థం అయ్యేసరికి చెయ్యి జారిపోతుందనే వాడు. గుర్తుందా ? వాడూ, వాడిలాంటివాళ్ళూ ఈ వేళ నాయకులయ్యేరు."

గాంధీజీ చెప్పినట్లు సమాజానికి ధర్మకర్తలన్నమాటను శంకరం మళ్ళీ గుర్తుచేసేడు.

"ఆ రోజుల్లో నువ్వా మాటలు అంగీకరించలేదేమో."

రఘునందనుడి ఎత్తిపొడుపును శంకరం లెక్కచెయ్యలేదు.

"మనకు చదువుంది. సంస్కారంవుంది. యుక్తాయుక్త పరిజ్ఞానం వుంది. ఆస్తులు, హోదాలున్నాయి. సమాజంలో ఓ వున్నతస్థాయివుంది. అందుకే గాంధీజీ ధర్మకర్తలం అన్నది."

తమ హక్కుల్నీ, ఆధిక్యతలనూ కాపాడుకోవడం అవసరమని రఘునందనుడూ వొప్పుకొన్నాడు. కాని అదెల్లాగ ?

అక్కడే ఎప్పుడూ అభిప్రాయభేదం వుంటూంది.

"సంఘం ఇల్లాగేవుంటే నీకుమాత్రం ఏం లాభం ? నాకో వెయ్యి ఎకరం పైగావుంది. కాని, మా ఆస్తి ఆదాయం ఎంత ? కృష్ణాజిల్లాలో నూరెకరాలపాటి ఆదాయంరాదు. అమెరికాలో వాళ్ళ సంగతులు తెలుసు కున్నా. బానిసలద్వారా పని జరిగినంతకాలం వాళ్ళ వ్యవసాయాలూ ఇల్లాగే నీళ్ళు కారేయట. క్రూరంగా బాధించేరన్న అప్రతిష్ఠేగాని వాళ్ళ వలన పని జరిగేది కాదట. బానిసత్వం రద్దుఅయ్యేక స్వతంత్రులమనే భావంతో వాళ్ళు గట్టిగా పనిచేసేరట. బానిసలుగావున్నప్పుడు పనిముట్లు రోజూ విరగ్గొట్టి కూర్చుండేవారనీ, అందుచేత మోటుపనిముట్లేతప్ప సున్నితమైనవి తేవడం సాధ్యంకాలేదనీ అన్నారు."

శంకరం ఆమాట వొప్పుకోలేదు. సమాజంలో వచ్చేమార్పులన్నీ ఉత్పత్తి విధానంలో వచ్చే మార్పులమీదనే ఆధారపడి ఏర్పడతాయంటూ ఓమారు సత్తిరెడ్డి ఈ వుదాహరణనే ఇచ్చినట్లాతనికి జ్ఞాపకం.

"నీకు గురువు సత్తిరెడ్డి అనుకుంటా."

రఘునందనుడా మాటలోని ఎత్తిపొడుపును అర్థం చేసుకొన్నాడు.

"సత్తిరెడ్డి తెలివిగలవాడు."

"లేకపోతే నిన్ను కమ్యూనిష్టును చేయగలడా ?"

రఘునందనుడి కీమారు చిరాకుపుట్టింది.

"చదువుకొన్నవాళ్ళ మైనందుకు కనీసం మనం మన చుట్టు ప్రక్కల పరిస్థితులన్నైనా చూసుకొంటూ వుండాలి. కృష్ణా గుంటూరుల నుంచి రైతులువచ్చి మన జిల్లాల్లో అక్కడక్కడ వ్యవసాయాలు చేస్తున్నారు. ముఖ్యంగా బోధన్ ప్రాంతంలో వున్నారు. పోయిచూడు. వాళ్ళ వ్యవసాయాలకీ మన వ్యవసాయాలకీ తేడాచూడు. కూలివాడు అక్కడ పనిచేస్తున్న పద్ధతిచూడు. మనకి చేస్తున్నపద్ధతిచూడు. నువ్వు అమెరికా వెళ్ళక్కర్లేదు; కమ్యూనిష్టువూ కానక్కర్లేదు."

శంకరం తన వాదంలో ఓటమిని అంగీకరించ తలుచుకోలేదు.

"వాళ్ళు వచ్చాకనే అలగా జనానికి మరీ కొమ్ములొచ్చేయి. ఇంత సంకటి పడేసి చేడడబ్బులు చేతులోపేస్తే కళ్ళకద్దుకొని రాత్రీపగలూ కుక్కల్లా గుమ్మంలో వుండేవాళ్ళు. వాళ్ళకి రోజుకి రూపాయీ, రూపాయిపావలా ఇవ్వడం మొదలెట్టేక మరి మన మాటెందుకు వింటారు? ఎందుకు పనిచేస్తారు?"

రఘునందనుడు ఆ వాదనకు సమాధానంఇవ్వడం అనవసరం అనుకొన్నాడు. రాఘవరెడ్డి నవ్వేడు.

"తెలివిలేనివాళ్ళకి డబ్బుమీది ఆశతో, అధికారదర్పంకూడావుంటే చాలా ప్రమాదం."

శంకరానికి ఆ మాట చాల అవమానకరంగా వినిపించింది. సరళ దేవిడిలోకి రావద్దని మనాచేసిన ఘటన నాతడింకా మరవలేదు. కేవలం రాఘవరెడ్డికోసం ఆతడిక్కడికివచ్చేడు. ఇప్పుడు రాఘవరెడ్డికూడా అవమానకరంగా మాట్లాడడం సహించరానిదిగా తోచింది.

"తెలివిగలవాళ్ళ మనుకొంటూ జీవితానికోఆశా, బ్రదుకులో ఓ దర్పం లేకపోతే వాళ్ళు తమకే కాదు సమాజానికే ప్రమాదకరం అవుతారు.",

రఘునందనుడు మిత్రులిద్దరిమధ్యా కాలుష్యం ఏర్పడకుండేటట్లు సర్దుతూ మాట్లాడేడు.

"అతి ఏదయినా ప్రమాదమే. మోతాదు తప్పనీయకూడదు. కాల మాన పరిస్థితుల్ని చూస్తుండాలి. దానికి అనుగుణంగా సర్దుకోవడం నేర్చుకోవాలి."

దేనికోసం ఆ మాటలంటున్నాడో ఇద్దరికీ అర్థంకాలేదు. కాని, శంకరరావు ఆ మాటల్ని ప్రత్యాఖ్యానం చేయడం మానలేదు.

"బహుశా మల్లారెడ్డి నీఆదర్శం అనుకొంటా. కాని, నువ్వు ఒకటి చూడడంలేదు. నువ్వంటున్న నూతన పరిస్థితులకు అనుగుణంగా సర్దుకోవడం కోసం ప్రయత్నించేడు. ఇదివరకు వూరుమీద తనకున్న పట్టు జారవిడిచేడు. చాకలి మంగప్పనీ, మంగలి రామప్పనీ సర్కారు మీదికి ఎగతోలేడు, ఫలితం ఏమయింది? మల్లారెడ్డి వూరొదిలిపోయేడు. ఆ మంగప్పా, రామప్పా ఈ వేళ వూళ్ళోపెద్దలు. సర్దుకోవడం వలనవచ్చే ఫలితాలివే అయితే మనం తుపాకీ క్రిందపెట్టనేవద్దు."

రఘునందనుడు శంకరరావు ముఖంవంక చూచేడు.

"ప్రతి ఒక్కటీ మనం అనుకొన్నట్లు జరగదు. కార్యకారణ సంబంధాలు మన వూహల ప్రకారమే నడవ్వు. నువ్వు తీసుకునే తుపాకీ నువ్వు నిరోధించదలచుకొన్న పరిస్థితుల్ని వేగిరంగా తెస్తుందేమో ఆలోచించేవా? నిజాముసర్కారు పెంచిన రజాకార్లు ఇల్లావిజృంభించకపోతే గోవిందుకు తుపాకీ తనకుండాలనే ఆలోచన కలిగేదేనంటావా?"

శంకరం తనవాదనలో పసలేదని ఒప్పుకోలేకపోయేడు.

"నేనూ, నావంటి వాళ్ళూ చేస్తున్నపనులకు జనం మొండికెత్తిపోతున్నారంటావు. పంటలమధ్యనున్న తేలుకుమల్లే ఆత్మహత్యతప్ప మారుదారిలేకుండా చేసుకుంటున్నామంటావు. నేనదేమేలంటాను,సంస్కా-

రం. మర్యాద, విజ్ఞానం మొదలయిన ఉత్తమమానవలక్షణాలకు మర్యాద నివ్వలేని సమాజాన్ని గౌరవించడం కష్టం. వానిరక్షణకు నిలబడడం అపచారం అంటావూ ? ఆ అపచారం చేస్తాను ! ఇది మానవుని ఔన్నత్యాన్ని కాపాడేందుకుచేసిన ఆత్మార్పణంగా భావిస్తాను."

అందరూ ఒక్కక్షణం నిశ్శబ్దంగావుండి పోయేరు.

శంకరరావే చివరకు నోరువిప్పేడు.

"నీ అభిప్రాయాలు మారినట్లున్నాయే ?"

ఆ హేళనను రాఘవరెడ్డి ఖాతరుచేయలేదు. అంతసరకూ తేల్చుకోలేకపోయిన సమస్యకు దేనికో సమాధానందొరికినట్లు చటుక్కునలేచేడు.

"నేనెవరి ఔన్నత్యాన్ని కాపాడ్డానికిఆత్మార్పణచెయ్యాలి ? సంఘం కుటుంబం, తండ్రి, ఎవరికోసం నా ఆత్మార్పణం ? ఈ అగ్నిహోత్రంలో నా సరళ నుసికావడాన్ని చూడలేను. రఘూ !"

రఘునందనుడు తిరిగి చూసేడు.

"నే నిక్కడుండను."

శంకరం చిరునవ్వు నవ్వేడు.

"నువ్వు పనిచేసినవాళ్ళు అంతసులభంగా విడిచిపెట్టరేమో ? నీవు చేసిన పనులబాధ్యతను నిజామ్ సర్కారు నెత్తినపెట్టుకొని. నిన్ను స్వేచ్ఛగా బయటకు పోనిస్తుందను కొంటున్నావు."

"అంటే ?"

"ఒక విధంగా నువ్వు నిజాం సర్కారు పరిరక్షణకు పనిచేస్తున్న అసంఖ్యాక సైనికులలో ఒకడవు. ఆ విధంగా నీవేంచేసినా నీకు రక్షణ వుంది. కాని. ఆ రక్షణనుంచి బయటకు పోదలుస్తే......"

"ఈ పనులకు..."

రాఘవరెడ్డి ఆ పనుల స్వభావం నోట వుచ్చరించలేకపోయేడు.
శంకరరావు జ్ఞాపకం చేసేడు.

"హత్యలకు..."

"కేసు పెడతారంటావు"

"ఇదివరకే పెట్టకుంటే."

రఘునందనుడు "అంటే" అన్నాడు.

"ఘానుడిపేట, పకీరుపాలెం ఘటనలు పోలీసు స్టేషన్లలో రికార్డయి వున్నాయి. అవి కేసులు కాకుండా కొన్ని శక్తులు అడ్డునిలబడి వున్నాయి. వారు తప్పుకుంటే మరుక్షణంలో నువ్వు బయట వుండవు."

"ఆ అడ్డు నిలబడినవారిలో నువ్వొకడవనుకొంటా."

"కావచ్చు;"

మారుమాటకు సందివ్వకుండా శంకరరావు చటుక్కున గదివదలి పోయేడు.

మిత్రులిద్దరూ ఒకరి మొగం ఒకరు చూచుకుంటూ నిలబడి పోయేరు.

---

## పదిహేడో ప్రకరణము.

జమేదారు ప్రాణంతోపాటు రైఫిల్ కూడా పోయిందనే వార్త ప్రభుత్వాన్ని వూపేసింది. పైనుంచి క్రిందికీ, క్రిందినుంచిపైకీ తెలిగ్రాములు ఉరకలేసేయి. హర్కారాలు పరుగులెత్తేరు. గ్రామాలమీదికి లారీలతోలేరు. వర్షాలలో కొన్నిరోడ్లు దిగలేదు. దిగినవి మరి ఎక్కలేదు.

వారం రోజులు కాళ్ళువిరగ తొక్కుకొని, కంగారు తిన్నాక ఉద్యోగుల మనస్సులు కొంచెం నిలతొక్కుకున్నాయి. కంగారు లాభం లేదనీ, ఒక పద్ధతీ, వరసా చూచుకోవాలని నిర్ణయానికి వచ్చేరు.

అప్పటికే వరంగలు, నల్లగొండ, కరీంనగరు జిల్లాల్లో ఒకవేపున 'సంగం' కార్యకలాపాలు తీవ్రం అవుతున్నాయి.

రాష్ట్రమంతటా కాంగ్రెసు సత్యాగ్రహోద్యమాన్ని నడిపిస్తూంది.

రెండు వుద్యమాలూ వేర్వేరుగాను, పెనపడీ విజృంభిస్తున్నాయి.

ప్రభుత్వం కాలూ, చెయ్యీ ఆడడంలేదు. ఒక చోటికి పోలీసుల్ని పంపిస్తే పదిచోట్లు మిగిలిపోతున్నాయి. పదిచోట్లు రజాకారు దళాల్ని ఏర్పాటుచేస్తే నూరువూళ్ళు ఇంకాపైనే వుండిపోతున్నాయి. నూరు వూళ్ళకీ బలగాల్ని సర్దితే నూటఒక్కోవూరికి వచ్చేదారీ, పోయే దారీ లేదు.

* * * *

గోవిందు రైఫిల్‌తో అదృశ్యంఅయ్యేక సీతారాంపురం పోలీసుస్టేషను లోబందోబస్తు ఎక్కువయింది. ఒక్క ఇల్లుకూడా విడిచిపెట్టకుండా ఒకటికిరెండు మార్లు సోదాలుచేసేరు. అయినా వాళ్ళకి తృప్తికలగడం లేదు. ఏ క్షణంలోనైనా ఘెరావ్ వేస్తున్నారు.

రాత్రి పది గంటలయింది. ఊరంతా తలుపులుబిగించి పక్కలు సర్దుకొంటున్నారు. హఠాత్తుగా సోదాలు ప్రారంభమైనాయి.

నిశ్శబ్దంగావున్న వీధిలో వున్నట్లుండి బరువుబూట్లు లయవేస్తూ వినిపిస్తాయి. ఇంట్లో వున్నవాళ్ళు నిస్తబ్ధంగా ఎల్లావున్నవాళ్ళు అల్లా నిల బడి పోతారు. చీకటినీ, గోడల్నీ, వీధిలోవున్న మనుష్యుల్నీ చీల్చుకొని, ఆ వచ్చినవాళ్ళ మానసిక ప్రవృత్తిని తెలుసుకొనేటందుకు వారి ఆలోచ నలు ఏకాగ్రంఅవుతాయి. మన ఇంటికే వస్తున్నారా? ముందుకు పోతు

న్నారా ? ఈ రాత్రి ఇంట్లోవుండేయోగం వుందా ? పోలీసు స్టేషనులో తన్నులు తినాలా ? తమ భవిష్యదాలోచనలో వర్తమానం మరిచిపోతున్నారు. మంచినీళ్ళకై కడవదగ్గిర వొంగినమ్మ వొంగినట్లే వుంటుంది. తల్లి ప్రక్కన లేనందుకు ఏడవాలని నోరు తెరిచిన పిల్లగాళ్ళు నోరు తెరిచే వుండిపోతారు.

తలుపో, తడకో...కర్రతో పొడిచినట్లు చప్పుడవుతుంది. తిట్టు మాటలకు ఉర్దూలో వచ్చేగాంభీర్యం అప్రయత్నంగానే అర్థంఅవుతుంది. సమ్మోహనం ప్రయోగించినట్లు ఆ మాట వినబడగానే చేతులు అప్రయత్నంగా తలుపులు తెరిచేస్తాయి. ఒక్కుమ్మడిగా ఓ అరడజనుమంది ఇంట్లో జొరబడతారు.

వాళ్ళకేంకావాలో, ఎవరు కావాలో అర్థంకాదు. మనిషిపేరు అడుగుతూ గంపక్రిందవున్న కోడిని చంకనెడతారు. వాళ్ళ వ్యవహారం చూస్తే తాము అడుగుతున్న పేర్లు మనుష్యులవో వస్తువులవోకూడా ఎరగనట్లు అనిపిస్తుంది. వెంకటయ్యరాలేదా ? సత్తెమ్మ నెక్కడదాచేవు? గోవిందు ఇల్లావస్తూంటే చూసేము. చెప్పు. ఎటుపోయేడో ?—ఇల్లాగే ప్రశ్నలుంటాయి. కాని వాళ్ళకళ్ళన్నీ వంటకుండలమీదా, మంచినీటి కడవలమీదా వుంటాయి.

ఏభయ్యిరవయి ఇళ్ళున్న అంతవూళ్ళోను పోలీసులకు ఒక్క మగవాడున్నట్లుకూడా కనిపించదు. అమీన్ ముకుందరెడ్డికి మహా కోపంగావుంది.

ఒక్కళ్ళూ ఇంట్లో మగాళ్ళున్నట్లే చెప్పరు. తీరా వెతకడం ప్రారంభిస్తే కళ్ళూ, కాళ్ళూ లేని రోగిష్టివాడొకడు మంచందిగి, వణికిపోతూ నిలబడతాడు. ఆ వణుకు భయంచేతనో, వయస్సు మీరడం చేతనో ఆ చీకట్లో కనబడదు. వాడికేమీ కనిపించదు కొత్తవాడెవరేనా అయితే ఈ వూళ్ళో అంతా గుడ్డివాళ్ళూ చెవిటివాళ్ళూ అనిపిస్తుంది.

వీధిలో నిలబడ్డ ముకుందరెడ్డికి ఈ చెవిటి గుడ్డివాళ్ళని చూస్తూంటే అంతకోపంలోనూ నవ్వొచ్చింది. నవ్వుతూనే చేతిలోవున్న కర్రతో రెండు కొట్టేడు. వాడు అంతవరకూ, మూగివాడుగా నటిస్తున్న సంగతి మరచిపోయి "కొట్టకుదొరో, నీ కాల్మొక్కుతా" ననేసేడు. మరోరెండు దెబ్బలు తగిలేసరికి కుంటడంకూడా మానేసేడు. కాని, ముకుందరెడ్డికి కావలసిన ఆ చోకీఏదీ వానినుంచి రాదు.

ముకుందరెడ్డి ఒక్కొక్క యింటివద్దనే నిలబడుతున్నాడు. ఆ యింటి మగాళ్ళనుగురించి ప్రశ్నలు వేస్తున్నాడు. చేటరీస్తొట్లు మొగాన వేస్తున్నాడు. మగాడు పక్కలోలేకుండా ఎల్లా కాలక్షేపం చేస్తున్నారని పడుచుపిల్లల యోగక్షేమాలు కనుక్కొంటున్నాడు.

అమీన్ తలుపు తట్టగనే రంగయ్య వీధిలోకి వచ్చేడు. ఆ రాక అప్రత్యాశితం. ముకుందరెడ్డికి సోదాభయంతో మగాళ్ళంతా వూరుపిడిచి పోయేరనే దొక్కటే మనస్సులోవుంది. హఠాత్తుగా రంగయ్య ఎదుట కనబడగానే తాను సోదాకు వచ్చినసమాట మరిచిపోయేడు.

"ఏం నువ్వు పారిపోలేదేం ?"

తన యిల్లుకూడా ఇదివరకు రెండు, మూడు మార్లు సోదాచేసేరు. ఒకమారు తనను స్టేషనుకి తీసుకెళ్ళి ఓగంట కూర్చోబెట్టి వాఙ్మూలం తీసుకొని వదిలెయ్యడం జరిగిపోయింది. ఇంక తానెందుకు పారిపోవాలో రంగయ్యకు అర్థంకాలేదు.

"ఎందుకు పారిపోవాలి ?"

ఎందుకో ముకుందరెడ్డికీ అర్థంకాలేను. ఓ నిముషం ఆలోచించేడు.

"ఉహూ,"

భర్తకి ఏం ప్రమాదం వస్తుందో అర్థంగాక, పోలీసుల ప్రశ్నలకి బిత్తరపోతూ లోగడపలో ముసలి అత్తగారిచాటున సూరమ్మ నిలబడి

వుంది. ముకుందరెడ్డి చేతిలోని బేటరీలైటు వెలుతురురేకలో ఆమె ముక్కునున్న బేసరి ఒక్కమారు తళుక్కుమంది. మర్యాదహీనంగా తన భార్య ముఖంమీద లైటువేస్తున్న అమీనును ఏమనాలో రంగయ్యకు తోచలేదు.

"ఆమె నా తల్లి, వెనకనున్నది నా భార్య."

ముకుందరెడ్డి లైట్ ఆర్పేసేడు. సూరమ్మ ముఖంచూసేక ఆతడికి తాను ఒక వ్యక్తికోసం సోదా చేస్తున్నానన్నమాట గుర్తువచ్చింది.

"గోవిందు నీ స్నేహితుడుకాడూ ?"

ఆ విషయంగురించి ఓమారు తనను ప్రశ్నించడమూ, తాను సమాధానం చెప్పడమూ జరిగిపోయింది.

"చిన్నప్పుడో బళ్ళో చదువుకోవడంతప్ప ప్రత్యేకంగా మా ఇద్దరికీ దోస్తీ ఏమిలేదు."

ముకుందరెడ్డికా సంగతి ఇదవరకే తెలుసు. కాని, ఆమాట కోసమేనా ఈ అర్ధరాత్రి ఇంతప్రయత్నం చేస్తూన్నది ? అనేక విధాలుగా తిప్పి తిప్పి ప్రశ్నలు వేసేడు.

"చిన్నప్పుడు బళ్ళోచూడ్డంతప్ప మరెప్పుడూ చూడలేదంటావు?"

"నేనామాట అనలేదే, ఒక వూళ్ళోవాళ్ళం ఒకరినొకరు చూడకుండా వుండడం సాధ్యమా ?"

"అయితే, రోజూ కలుసుకొంటూనే వుంటారన్నమాట."

"నేనల్లాగా చెప్పలేదు. పెద్దవాళ్ళయ్యేక ఎవరిబ్రతుకులు వాళ్ళవి."

తాను చదువుకొన్నవాడు కావడమూ, పెద్దవాళ్ళతో స్నేహాలు, బంధుత్వాలు వుండడమూచేత అమీన్ తనమీద చెయ్యి చేసుకోవానికి అబద్ధపుకేసులు పెట్టడానికీ జంకుతున్నాడని రంగయ్య గ్రహించేడు. లేక

పోతే తా నిన్నాళ్ళు వూళ్ళో వుండలేదు. ఆ ధైర్యంతోనే అమీను ప్రశ్నలకి పెంకెసమాధానా లిస్తున్నాడు. ముకుందిరెడ్డి ఆ సంగతి గ్రహించేడు. తాను ఎందుకు వదులుతున్నదీ తనకు తెలుసు. సత్తెమ్మ వెంకటయ్యలను దొరకపుచ్చుకోడానికి రంగయ్యను ఎరగా వాడుతున్నాడు. ఆప్రయత్నం ఇంతలో మానదలచుకోలేదు. ప్రశ్నలు సాగించేడు. సంతృప్తిలేక ఒక బంట్రోతును పిలిచి రంగయ్యను నాకాకు తీసుకెళ్ళి కూర్చోపెట్టమని పురమాయించేడు.

"నేనూ ఇప్పుడేవస్తున్నా."

ఈమారు రంగయ్యకు భయంవేసింది. ఇది సరాసరి జైలుకే ప్రయాణం; రంగయ్యగుండెలు దడదడ లాడిపోయేయి.

జైళ్ళూ, జైళ్ళబాధలూ కళ్ళముందు మెదిలేయి. సరియైన తిండి పెట్టడంలేదని ఈ మధ్యనే వరంగలు జైలులోవాళ్ళు అసలు భోజనం చెయ్యమన్నారని వార్తవచ్చింది. తానూ ఉపవాసం వుండాలి కాబోలు. మళ్ళీ ఎన్నేళ్ళకి రావడం పడుతుందో?

కొన్నేళ్ళపాటు తానుఇంటిమొగం చూడదనిపించింది. దుఃఖమూ, భయమూకన్న ఏదో కొత్త జీవితంలో అడుగుపెడుతున్నట్లు ఉత్కంఠ కలిగింది. భార్యకీ, తల్లికీ చెప్పవలసినది చెప్పవచ్చేస్తానన్నాడు.

అమీను మందహాసంచేసేడు. వప్పగింతలకు వేళలేకపోలేవని ఆయన దిలాసా.

రంగయ్యను తీసుకొని పోలీసు జవాను కదిలేడు.

---

# పద్దెనిమిదో ప్రకరణము.

అమీన్ ఈ మారు ముసలమ్మను పిలిచేడు. వీరమ్మ భయంతో వొణికి పోతూ వీధిలోకి వచ్చింది. అంతవరకూ ఆమె చాటునవున్న సూరమ్మ ఈ మారు స్పష్టంగా కనబడింది.

మసక వెలుతురులో అస్పష్టంగా కనిపిస్తున్న ఆ సౌందర్యాన్ని అమీన్ ఓరగంట గుర్తించడానికి ప్రయత్నిస్తూనే వీరమ్మమీద ప్రశ్నల వర్షం కురిపిస్తున్నాడు.

"సత్తెమ్మ ఇప్పుడెక్కడుంటూంది ?"

"వెంకటయ్య ఎప్పుడన్నా వస్తుంటాడా ?"

ముసలమ్మ వెంకటయ్యపేరు చెప్పేసరికి ఎగిరెగిరి పడుతూంది.

"ఆ సచ్చినోడి సంగతి నాకే మెరక ?"

సత్తెమ్మ, వెంకటయ్యలు పెళ్ళిచేసుకో దలచిన విషయాన్ని గుర్తుచేస్తూ అమీన్ ఆమెను రెచ్చగొట్టేడు.

"అల్లుడి సంగతి నీకు తెలియకుండా వుంటుందా ?"

"నా అల్లుడు చచ్చిపోయేడు."

"చచ్చిపోయినవాడు సరే, వెంకటయ్య బ్రతికేవున్నాడు గదూ."

"వాడు నాకల్లుడేమిటి ?"

"అల్లుడవాలంటే పెళ్ళికావాలేమిటి ? కాకపోతే నీ కూతురేదీ ?.."

వీరమ్మ అమీన్ మాటలకి రెచ్చిపోతూంది, తిడుతూంది; తన కేమీ తెలియదని ప్రమాణాలు చేస్తూంది. అమీన్ కర్రమా పేసరికి హడలి పోయి నేలనంటుకుపోయింది. ఆమె సంగతి తరువాత చూస్తాను—అని

అమీను ఆమెను ఒక పోలీసువానికి వప్పచెప్పేడు. ఆ ఇశారాను వాడు గ్రహించేడు.

"రా ముసిల్దానా !

ఈ మారు అమీన్ పరీక్షకు మిగిలింది సూరమ్మ. మసకమసకగా వున్నా ప్రమిదదీపం వెలుతుర్లో ఆమె వెక్కి వెక్కి ఏడుస్తూందని అమీన్ చూసేడు. ఆమెను సమాశ్వసిస్తూ ఆయన ద్వారంలో కొచ్చేడు.

తన భర్తకేమీ తెలియదని ఆమె చెప్తూంటే అమీన్ తలపంకిస్తూ మీసాలు సవరించుకొన్నాడు.

"మేము ఆయనను గిరఫ్తార్ చేయలేదే."

ఆ మాట వినగానే సూరమ్మ ఏడ్పుమానింది. తన భర్త నిరప రాధి యని రుజువు అయితే వదలివేస్తామని అమీన్ అన్నప్పుడు కలిగిన సంతోషంలో ఆ అపరాధం ఏమిటని అడగడం కూడా మరచిపోయింది.

అమీను మనసాలలో సవిలాసంగా అడుగుపెట్టేడు. అక్కడున్న కుర్చీలో కూర్చుంది, ప్రక్కనున్న బల్లమీద టోపీవుంచేడు. చేతిలోని హంటరుతో బూటుమడమను తాటిస్తూ ప్రశ్నల కుద్యమించేడు.

"నీ భర్త అరెస్టవడమో, విడుదల కావడమో నీ చేతిలో వున్నాయి."

సూరమ్మ తనకు తెలిసినదంతా చెప్తానంది. అంతవరకూ తన భర్తనూ, అత్తగారినీ ప్రశ్నించిన సంగతి గమనించిన సూరమ్మ తననూ ప్రశ్నించమంది. తెలిసినంతవరకు సరిగ్గా సమాధానం ఇస్తానని హామీ యిచ్చింది.

కాని, మొదటి రెండు మూడు ప్రశ్నలలోనే వానికి సమాధానం ఇవ్వడం తనశక్తి కతీతమైన పనియని ఆమె గ్రహించింది.

గోవిందు ఇప్పుడెక్కడున్నాడో చెప్పాలంటే అసలు గోవిందెవ్వరో తెలియాలి. అమీనుకు గోవిందు ఎలావుంటాడో తెలీదు. ఆతడు చెప్పిన ఆనవాళ్ళ ప్రకారం ప్రపంచంలోని మనుష్యులంతా గోవిందులే కావచ్చుననిపించింది, సూరమ్మకి,

అమీను ప్రశ్నలను మార్చేడు. ఆమె ఎప్పుడైనా రైఫిల్ చూసిందేమో తెలుసుకో గోరేడు.

సూరమ్మ అనేకమార్లు రైఫిల్ చూసింది. వాళ్ళనాన్నగారి యింట్లో వుండేది. కాని, తన భర్తకు రైఫిల్ లేదు.

"అయితే జమేదారు రైఫిల్ ఏమయినట్లు?"

"తప్పకుండా గోవిందు దగ్గరే వుంటుంది."

తన్ను హేళనచెయ్యడం లేదుగదా యని అమీనుకు అనుమానం కలిగింది. ఎర్రబారి చూసేడు. కాని, సూరమ్మ ఆ భావాన్ని గమనించలేదు. ఇంకా ప్రశ్నలేం వేస్తాడోనని ఎదురుచూస్తూంది.

అమీనుకు విసుగుపుట్టింది. తన ప్రశ్నల కామె చూపుతున్న ఆతురతను చూసి ఆమె సుముఖురాలే ననుకొన్నాడు. కాని, సమాధానాలిస్తున్న ధోరణీ, పద్ధతీ చూసి ఇదోపట్టి మొద్దు అనుకొన్నాడు. "విగ్రహపుష్టి, నైవేద్యనష్టి." విసుగేసింది. కాని కాలుపెట్టేక వెనక్కిపోవడం ఇష్టంలేదు. ఏ మొద్దో ఓ మొద్దు. కానీ అనుకొన్నాడు.

మళ్ళీ ప్రారంభించేడు.

రంగయ్య రైఫిల్ దాచివుంటాడు. అది ఆతని భార్యకు తెలియకుండా వుంటుందా? తెలియదే అందాం, ఇంట్లోగాక మరెక్కడ పెడతాడు? ఎక్కడా లేదూ? సోదాచేసి అనుమానం తీర్చుకొంటేగాని.....

సూరమ్మ నిర్భయింగా ఇల్లు సోదాచేసుకోమంది. కాని, ఆమెను అక్కడ వదలి తానుగా గదులు సోదా చెయ్యడానికి ఆతడు ఇష్టపడలేదు.

కూడావస్తున్న జమేదారునుచంపి రైఫిల్ పట్టుకుపోయినవాళ్ళు ఎంత పనైనా చేయగలరు. తీరాచేసి తాను గదిలోవుండగా తలుపు గొళ్ళెంపెట్టి ఇంటికి నిప్పుపెడితే? ఉహు. ఆమె ముందుండవలసిందే.

సూరమ్మ అయిష్టంగానే నడచింది. రైఫిల్ జాడ తెలియనంతవరకూ రంగయ్యమీద అనుమానం తప్పదంటూంటే ఆమె వణికిపోయింది. ఆ భయంలో తాను ఇంట్లో అసహాయురాలుగా వున్నాననే ఆలోచనగాని, అమీన్ మాటలలో మారుఅర్థాలుకాని తోచలేదు. మగడు బయటపడడానికి తాను చేయగల సహాయం తప్పకుండాచేస్తుంది. లేకపోతే జమేదారును చంపినందుకు 'ఫాంసీ' పడిపోతుందంటాడు. ఆ దురవస్థను తలుచుకొని ఆమె వణికిపోతూంది. చేతిలాంతరు తీసుకొని అమీనుముందు నడిచింది.

తన భర్త విడుదల కావడంలో తాను చెయ్యగల సహాయంఏమిటో మొదట్లో సూరమ్మకు తెలియకపోయినా. అది అర్థంకావడానికి ఎంతో సేపు పట్టలేదు. భర్తకు జరుగుతుందనుకొంటున్న ప్రమాదంకన్నా తనకు ప్రమాదం సత్యం అయింది. చేతిలో లాంతరు క్రిందపారేసి పారిపో బోయింది. కాని, అప్పటికే తప్పించుకుపోగల అవకాశాలు బంద్‌అయి పోయాయి. ప్రమాదం అమీన్ రూపంలో ముంచుకొచ్చేసింది. ఒక వెర్రి కేక పెట్టింది. అది సద్దుమణిగిపోకుండా గొంతెత్తి అరుపులు సాగించింది.

అమీన్ ఆమెకు భరోసా ఇవ్వడానికి శాయశక్తులాప్రయత్నించేడు. మగడు ఓ మైలుదూరంలోవున్న పోలీసుస్టేషన్‌లోనూ, అత్తగారు పోలీసు వాడి కాపలాలోనూవున్నారు. ఇంక భయం ఎందుకంటాడు ముకుందరెడ్డి.

భయం అక్కర్లేదనేటందుకు అమీనుచెప్పిన కారణాలే సూరమ్మకు మహాభయకారణం అయ్యేయి. ఆమె కంఠంస్థాయి మరింత హెచ్చించింది. అడ్డంవస్తున్న అమీనును తోసివేసి తలుపుతీయడానికై గుమ్మంవైపు ఉరికింది.

మాటకుముందు కొట్టడమూ, కొట్టడానికిముందు తిట్టడమూ అల వాటున్న ముకుందరెడ్డి సూరమ్మ విషయంలో అమితమయిన వోర్పు చూపించేడు. గంతులువేసి ఆయాసపడుతుందనేమో ఎత్తి తీసుకొచ్చి మంచంమీద కూర్చోబెట్టేడు. మీసాలు రెండుచేతులతో పీకేస్తున్నా ముద్దుపెట్టుకోడానికే ప్రయత్నించేడు. అపకారిక్కూడా ఉపకారమేచేసే నేర్పరితనం చూపించేడు.

సూరమ్మ కేకలు గదిగోడల్ని, ఇంటిపెణకల్నీదాటి వీధి పొడు గునా ప్రతిధ్వనించేయి.

మొదట కేకకి ప్రక్కయింట్లోనుంచి ముంతాజూ, ఆవలవీధిలోని కోటమ్మా, ఇంటి గుమ్మంలో పోలీసు వాని నిగరానీలో చదికిలబడ్డ ముస లమ్మా ఒకేమాటు వీధిలోకి వచ్చేరు. కాని ముసలమ్మను పోలీసువాడు కదిలేవంటే ప్రక్కలు విరుగదంచుతానన్నాడు. భుజమ్మీద చెయ్యేసి నడివీధిలో అదిమి కూలేసేడు.

ముంతాజ్ వీధిలో పోలీసువానిని చూసి దొడ్డిదారిని పరుగెత్తింది. గొంతు సూరమ్మదని ఆమె కర్తం అయింది. పోలీసుల సోదా ప్రారంభ మైనప్పటినుంచీ తొంగిచూసి, పరిస్థితులు గమనిస్తూనేవుందేమో ఆమెకు అసలు సంగతి అర్థంకావడం కష్టంకాదు. అమీన్ ఇంట్లోవున్నాడని తెలి సేక కేకలకి కారణం ఏమిటో చెప్పనక్కర్లేము. రెండోకేక వచ్చేసరికే ఆమె వెర్రిఎత్తినట్లు పెరటితలుపులు బాదేస్తూంది. అవి లోపల గడియ పెట్టివున్నాయి. నాలుగుగుద్ది చేతులు నొప్పిపుట్టేకగాని ఆ దారి ప్రయో జనంకాదని గ్రహించలేదు. గ్రహించేక ఒక్కనిమిషం ఆగలేదు. వారా, వీరాఅంటూ అరుస్తూ వీధినపడింది.

కోటమ్మ వీధిలోకివచ్చి ఎవరమ్మా కేకలని ప్రశ్నించింది. ఆమె పిలుపుతో అంతవరకు పోలీసుల హడావిడికి తలుపులు మూసుకొన్న

ఆ వీధిలో యిళ్ళవాళ్ళంతా గుమ్మాలలోకి వచ్చేరు. నలుగురూ చేరగానే నడవండి చూద్దాం అన్నారు. బయలుదేరబోయే వేళకి వీధిమూలలో కాపలా వున్న పోలీసువాడు గద్దించేడు. వాని నెవ్వరూ లెక్క చెయ్యలేదు. కేకలు పెడుతూ పరుగెత్తివస్తున్న ముంతాజ్‌నుచూసి ఆమెవేపు తామూ కదిలేరు. ఆమెను. అడగించబోయిన పోలీసువాడు నలుగురాడవాళ్ళూ నాలుగు వేపులనుంచీ గదిమేసరికి చెవులు మూసుకొని పారిపోయేడు.

ముంతాజ్ మాటలతో అక్కడున్న ఆడవాళ్ళు పదిమందీ వంద మంది చేయగలంత గోలచేస్తూ రంగయ్యఇంటివేపు కదిలారు. వాళ్ళం దరూ వస్తూంటే ముసలమ్మ లేచింది. కాపలావున్న పోలీసువాడు ఆమెను గదమడం సాధ్యంగాక రెండు మొత్తేడు. మూడో అణుపు వెయ్యక పూర్వమే శశిరేఖా కోటమ్మా చెరో జబ్బా పుచ్చుకొని వాణ్ణి లాగేసేరు. ముసలమ్మ వాళ్ళమధ్యనుంచి ఇంట్లోకి దూసుకొంది.

ఇంతమంది ఆడవాళ్ళమధ్య ఒంటరిగా చిక్కుకున్న పోలీసువాడు పారిపోవడంతప్ప చేయగలదిలేదని గ్రహించడానికి వీపుమీదపడ్డ మెత్త మెత్తని గుద్దులు చాల సహాయపడ్డాయి. తన్నుపట్టుకొని లాగుతున్న వాళ్ళ నుంచి వదుల్చుకోవడం కోసం ఒక్కవూపూపి చేతులు లాక్కున్నాడు. పట్టుజారి శశిరేఖా, కోటమ్మా క్రిందపడ్డారు. మరో రెండుచేతులు పట్టు కొనేలోపున వాళ్ళమీదుగా దూకేసి రెండు లగువుల్లో వూరుదాటి పోలీసు స్టేషన్‌వైపుగా అదృశ్యం అయిపోయేడు.

ముసలమ్మవెంట సగంమంది ఆడవాళ్ళు ఇంట్లో జొరబడ్డారు. కాని ఎదురుగా రివాల్వరు తీసుకొని గదుముతున్న అమీనును చూడగానే ఒక్కరికీ నోటమాటరాలేదు. అందరికీ వెనకనున్న కోటమ్మ రుబ్బుబండ తీసింది.

అమీను పారిపోయే ప్రయత్నంలో వున్నాడు. ఎదురుగావున్న వాళ్ళనుంచి కన్ను తిప్పలేదు. అదమాయిస్తునే వెనక్కి, వెనక్కి

జరుగుతున్నాడు. క్రిందనున్న ముసలమ్మను చూసుకోలేదు. అడుగు తప్పింది. వెల్లకితలా పడిపోయేడు.

పడిపోయిన వాడింక లేవలేదు. కోటమ్మ చేతిలోని బండనుపారేసి మీదపడి వాడేసి పట్టుకొంది. ఒక్కొక్కరే సాయంచేస్తుంటే అర క్షణంలో ముకుందరెడ్డి కాళ్ళూ చేతులూ కట్టుబడి బందీ అయిపోయేడు.

ఆ రోజున ఆడవాళ్ళచేతుల్లో జరిగిన అవమానాన్ని ఆతడెక్కడా చెప్పుకోలేదు. కాని బ్రతికున్నంతవరకూ మరవలేదు. క్షమించనూలేదు.



## పంథొమ్మిదో ప్రకరణము.

హఠాత్తుగా స్టేషన్‌లోవున్న ఇద్దరు పోలీసులూ వున్నట్లుండి మేఘాల మీద పారిపోయేరు. ఎవడో పరుగెత్తికొని వచ్చినట్లూ, మరుక్షణంలోనే కొత్త సీటితో పాతసీరూ పోయినట్లు తన ప్రక్కనున్న వాళ్ళుకూడా పారిపోయినట్లూ రంగయ్యకు లీలగా అనిపించింది. తన ఆలోచనలూ, భయాలూతో కొట్టుకుపోతున్న ఆతనికి జరిగిందేమిటో అర్థంకాలేదు. శూన్యంగా వున్న స్టేషన్‌లోని నిశ్శబ్దత ఆతనిని ప్రపంచంలోనికి తెచ్చింది. లేచేడు. అటూ ఇటూ చూసేడు. గోడమూలలో రెండు రైఫిళ్ళున్నాయి. కాని, వానిని మోసే మనుష్యులు కనిపించలేదు.

ఆతడు వరాండా దిగేడు. గేటు దాటేడు. ఎవ్వరూ వద్దనలేదు. తిన్నగా ఇంటికి పరుగుతీసేడు.

ఇంటివద్ద వూరుజనం తీర్థప్రజలావున్నారు. క్షణంలో ఆతడు తిరిగి వచ్చినవార్త జనంలో పాకించి.

"రంగయ్యా, రంగయ్యా!"

ఏడుస్తూ తన అండనచేరిన భార్యనూ. వీపు నిమురుతున్న తల్లినీ ఊరడించడంకన్న ముందు అమీన్ ముకుందరెడ్డి కట్లువిప్పడం రంగయ్యకు అత్యవసరం అనిపించింది. జనం వద్దంటూంటే ఆతడు వారిని గదిమేడు. వారు ఆశ్చర్యంతో తెరిచిననోరు మూసేసరికి ముకుందరెడ్డి రొజులూ రివాల్వరుకోసం వెతుకుతున్నాడు.

"రివాల్వరు తేండి. లేకపోతే..." కాని ఎవ్వరూ తేలేదు. అమీన్ రుసరుస లాడుతూనే రంగయ్యసాయంతో వీధిలోకి చేరేడు.

"తెల్లవారేలోపున తెచ్చి స్టేషన్‌లో వప్పచెప్పాలి......"

వప్పచెప్పకపోతే తానేం చేయదోయేదీ వివరించేక రంగయ్యకు ముచ్చెమటలూ పోసేయి. నిశ్చేష్టుడై నిలబడిపోయేడు.

వెనకనుంచి ఎవరో భుజంమీద చెయ్యివేసేరు. తిరిగి చూసేడు. సిలారుసాయబు.

"ఏమిటిదిదాదా! దురన్యాయం."

సిలారుసాయబు అల్లాను స్మరించుకొన్నాడు.

తెల్లారకుండా వూరు దాటెయ్యిబాబూ!"

కాని పదిమైళ్ళ దూరంలోవున్న రైలుస్టేషన్ చేరేదెల్లాగ? తానొక్కడా? పెళ్ళాం, ముసిలితల్లి. నాలుగు బట్టలేనా తియ్యాలికదా!

సిలారు ఆలోచించేడు.

"రే, నా బండి తీస్తా. ఈ లోపున తయారుకా."

*　　*　　*　　*

రంగయ్యను స్టేషన్‌చేర్చి సిలారు సాయిబు సెలవు తీసుకొన్నాడు.

బండి రావడానికింకా చాలా వ్యవధి వుందన్నారు. చిన్నస్టేషను. ఊటసారురెవ్వరూలేరు. కూడాతెచ్చుకొన్నపెట్టెనీ. సామాన్ల మూటనీ

స్టేషన్ ప్లాట్ ఫారమ్మీదపడేసి దంపతులిద్దరూ చెరొకదానిమీదా కూర్చు న్నారు. అటూయిటూ అంతదూరందాకా తిన్నగా, రెక్కలు చాచుకొని పడివున్న రాక్షసిపక్షిలావుంది స్టేషను.

పది నిముషాలలో ముసలి స్టేషనుమాస్టరు గడ్డంనిమురుకుంటూ వచ్చి ఎదురుగావున్న భోషాణంమీద కూర్చుని సూరమ్మని పలకరించేడు. భోజనం అయిందోలేదో కనుక్కొన్నాడు. పోర్టరును ఇంటికిపంపి మూడు కప్పుల 'ఛా' తెప్పించేడు, ఇద్దరికీ చెరొకటీయిచ్చి. తానొకటి తీసుకొని నవ్వుతూ కభుర్లుచెప్పేడు. ఆ ముసలివాని మంచితనంలో ఆ దంపతులు తమ యిబ్బందుల్ని ఒక్కక్షణం మరచిపోయేరు.

ముసలివాడు కభుర్లుపోగు. నవ్వుతూ, నవ్విస్తూ ఎక్కడనుంచి వస్తున్నదీ, ఎక్కడకెడుతున్నదీ ప్రశ్నలు కురిపించేడు. బెజవాడ వెడుతున్నారు. అక్కడ ఆమెకూ, ఆయనకూ కూడ బంధువులులేరు. పుద్యోగమూలేదు.

మరి...ముసలివాని ముఖంమీద సౌజన్యం మాయమయింది.

హిందువులు నిజామును గద్దెనుంచి లాగెయ్యాలనే కక్షతో పని చేస్తున్నారని ఆయన అభిప్రాయం.

లేకపోతే ఏవేవో బాధలు పడిపోతున్నట్లు యూనియన్ లోనికి పరుగెత్తడం ఎందుకు? నిజాములాంటి ప్రభువున్నాడా!

ఉస్మానరీ జూబిలీ చేసుకొన్నప్పుడు రైతులకీ, జాగీర్దార్లకీ ఎంత శిస్తు మాఫీఇచ్చేరు? ఏడాదిదా? రెండేళ్ళదా? ఎనభయ్యేళ్ళశిస్తు. ఏ గవర్నమెంటుచేసిందల్లాగ? రైతులకా విశ్వాసంవుంది. అందుకే ఒక్క రైతువాడు బెజవాడ పరుగెత్తుతున్నాడా? ఇదంతా చదువుకొన్నవాళ్ళ మర్చుబ్ధి గాని!

రంగయ్య చదువుకొనేందుకు నిజాం గవర్నమెంటు సాయంచేసిం దని చెప్పుకొన్నాడు. చేసింది నిజామే నంటాడు ముసిలాడు.

ముసలిస్టేషన్ మాస్టరు చదువుకొనేవాళ్ళకి ఎన్నోసాయాలుచేసిన నిజామును అప్రతిష్ఠపాల్జేసి నమక్‌హరామ్ పనిచేయవద్దని విజ్ఞప్తిచేసేడు.

ఎంతో తక్కువ జీతాలు, బర్సరీలు, స్కాలర్ షిప్పులుగురించిన జ్ఞాపకాలలో పల్లెల్లో స్కూళ్ళులేనిసంగతీ, ఉన్నవాటిలో తెలుగు చదు వుకో గూడదనే వివరమూ రంగయ్యకు జ్ఞాపకం రాలేను.

తాను చదువుకోసం ఖర్చుచేసింది చాలా తక్కువ. ప్రతిఏడాదీ బర్సరీ యిచ్చేరు. స్కాలర్‌షిప్ ఇచ్చేరు. వాళ్ళిచ్చిన డబ్బుతోనే పరీక్ష ఫీజులుకూడా వెళ్ళిపోయేయి. యూని......

తాము వినోవయాత్రకి యూనియన్‌లోకి వెళ్ళినప్పుడు కాలేజీలూ, స్కూళ్ళూ కొన్నిచూసేరు. అక్కడ పిల్లలనుంచి వసూలుచేస్తున్నా౽న్న జీతాలు మొత్తం చెవిని పడేటప్పటికి తామంతా గుండెలు బాదుకొన్నారు. మిడిల్‌స్కూలులో మూడు రూపాయలు, హైస్కూలులోనైతే ఏడు. తాము స్కూల్‌ఫైనల్‌కి మూడు పావలాల జీతం ఇచ్చేరు. ఇంకా కాలే జీలో ఆ ఫీజులూ, ఈ ఫీజూలూ పేరుపెట్టి ఏడాదికి రెండువందలు లాగు తున్నారు.

ఇవిగాక బిల్డింగ్‌ఫండులనీ, మహోఫండులనీ స్కూలులో చేరా లంటే పదులూ, వందలూ ముందు దర్శించుకోవాలి. నూరు రూపాయ లిస్తే స్కూలులో సీటు.

స్టేషన్‌మాస్టరు ముసిలాడైనా ప్రపంచం తెలిసినవాడే. తానుచూసి నవీ, విన్నవీ ఆయన చెప్తున్నాడు.

కాని,......

ముసిలాడివద్ద దానికీ సమాధానం సిద్ధంగానేవుంది. ఇంచుమించు వూరూరాబడివుంది. నిజం. రెండేసిమైళ్ళకో మిడిర్‌స్కూలూ, అయిదారు మైళ్ళలో హైస్కూలూ, తాలూకాకో కాలేజీవున్న జిల్లాలున్నాయి. నిజమే.

కాని ఏం లాభమంటాడు ముసిలాడు. బీదవాడికి జీతాలు అంతంత ఇచ్చుకొనే తాహతువుంటుందా ? అసంభవం.

పోనీ అధ్లా వదలమంటాడు. ఇంత అందంగా కట్టిన యూనివర్శిటీ ఎక్కడుంది ? నాలుగు కోట్లు ఖర్చయింది. నాలుగుకోట్లు... నిజాముప్రభువుకున్న బంగారం హద్దుందా ?

ముసిలాడీమారు నిజామువద్ద ఎన్ని కోట్లున్నాయో చెప్పి మురిసిపోయేడు.

వాదన వేసుకోడం మంచిదా, కాదా యని మధనపడుతూనే రంగయ్య మొత్తంమీద తెలంగాణాలోవున్న పరిస్థితుల్ని సూచించేడు. ఇంక ముసిలాడి ఆవేశానికి మితిలేదు. ఘోషాణం దిగేసేడు, ఆవేశంతో.

శీతారాంపురంలో సర్కిల్‌నికొట్టి ఖైదీల్ని విడిపించుకు పోయేరు. అక్కడ వెంకయ్యని చంపేసేరు. దండుబాటమీద జమేదారునుచంపి రైఫిల్ ఎత్తుకుపోయేరు. "రషాన్ను మాఇదక్కన్" ఓ వారంరోజులువి తీసుకో తెలుస్తుంది. బాఖాయిదాబగావత్, ఏ గవర్నమెంటు సహిస్తుంది? అల్లాసహిస్తే గవర్నమెంటు నిలవబడుతుందీ ? యూనియన్‌లో చెయ్యడంలా ?

స్టేషన్‌మాష్టరు గబగబా తడబడుతూ గదిలోకివెళ్ళి పాత ఆంధ్రప్రభ పత్రిక తెచ్చి మునగాల పరగణాలో కలుకోవ కాల్పులమీన వ్రాసింది తడుముకుంటూ చదివి వినిపించేడు. యూనియన్ గవర్నమెంటుకూడా నిజాముకన్న తక్కువ తినలేదని చెప్పడానికి ఆ రిపోర్టు చదివేడు.

కలికోవసంగతులు రంగయ్యకి బాగాతెలుసు. హరిజనుల భూములను జమీందారు ఆక్రమించదలిచేడు. పోలీసులు ఆతనికి సహాయం.

ఆ రోజున చేలల్లో చల్లికలు పూర్తిచేసుకొని వచ్చిన రైతులపైద పోలీసులు కాల్చేరు. ఇద్దరు చచ్చిపోయేరు. చాలమందికి గాయాలు లగిలాయి. వాళ్ళల్లో ఒక స్త్రీవుంది. ఆమె పుట్టిల్లో, బంధువులేనో తమ పల్లెలోవున్నారు. ఈ భూముల గొడవ పదేళ్ళనుంచి సాగుతూంది. కనక తనకు తెలుసు.

పత్రికలో అల్లాలేదు.

"జనం రాళ్ళు రువ్వడం మొదలుపెట్టేరు......ఉద్రేకపూరితమైన నినాదాలు చేస్తున్నారు. అనేకమంది చేతుల్లో లాఠీలు, బల్లాలుకూడ వున్నాయి. అప్పుడు గత్యంతరంలేక జనాన్నివెళ్ళిపోవాలనీ, లేదాకాల్పులు చేయవలసివస్తుందనీ హెచ్చరించారు. కాని, జనం ఆయన హెచ్చరికను ఖాతరుచేయలేదు. అప్పుడు తుపాకులు కాల్చడానికి అనుమతీయబడింది. ఏడు పర్యాయాలు కాల్పులు జరిగాయి. దీనివల్ల ముగ్గురు పడిపోయేరు. గుంపులు చెల్లాచెదరయి పోయేయి."

స్వాతంత్ర్యం వచ్చిన మూడోరోజున జరిగిన ముగ్గులివి :

ఆంధ్రప్రభలోవచ్చిన రిపోర్టు తప్పు అని అసలు విషయం చెప్పడానికి రంగయ్యకి ధైర్యం చాలలేదు. ఈ అబద్ధాల్ని పట్టుకొని నిజాము అనుకొంటున్నంత చెడ్డవాడుకాదని మాత్రమే చెప్పుకో గలుగుతున్నాడు. అసలు సంగతిచెప్తే యూనియన్‌లోవున్న కాంగ్రెస్‌సర్కార్ కన్న నిజాము పాలనే బాగుందంటాడు.

వూరుకొన్నాడు. కాని, ముసిలాడు వదలలేదు. రంగయ్య చటుక్కున నోరుజారేడు. యూనియన్‌లో ఇల్లాంటివి నిత్యం జరగవు. అన్నివూళ్ళల్లోనూ జరగవు.

ముసిలాడు గట్టివాడు. వొప్పుకోలేదు. మీ వూళ్ళో పోలీసులు ఎన్నిమాట్లు దౌర్జన్యాలు చేసేరు—అని నిలదీసేడు.

దానికి రంగయ్య సమాధానం ఇవ్వలేకపోయేడు. ఆలోచించినా చెప్పడానికి తన భార్యను అవమానపరచడానికిచేసిన ప్రయత్నం తప్ప ఆతనికి తోచలేదు. పోలీసుస్టేషన్‌వచ్చేక ఇబ్బందిగానేవుంది. వూళ్ళో కోడిపిల్లల్ని బతకనివ్వడంలేదు. కాని, అది అంత చెప్పవగింది కాదు. అందరినీ తిట్టికొట్టబోతూంటారు. తిట్లో సమస్యకాదు. చచ్చిపోయేదాకా కొడితేతప్ప దెబ్బలుకూడా పెద్దచెప్పదగినవి కావనిపించింది. తనభార్యని అల్లరిపెట్టబోయేడు. ఆడవాళ్ళని ఒంటరిగాచూసి అల్లరిచేయడం మహా ఘోరం. కాని, అది చెప్పుకోవడం ఇష్టంలేదు. నువ్వుండగా ఎల్లా అల్లరి చేసేడని ప్రశ్నవస్తుంది. సోదాకొచ్చిన మాటచెప్పాలి. ఎందుకు సోదా ? తనకీ గోవిందు రైఫిల్ అపహరణకీ ముడిపెట్టేరు. అదికాస్తా బయటి కొస్తే తన్నిక్కడ అరెస్టుచేస్తారేమో.

పైగా సబినస్పెక్టరుని విడిపించుకొనేదాకా కాళ్ళావేళ్ళాపడ్డ అధి కారులు రెండురోజులనుంచీచేస్తున్న అల్లరికి అంతులేదు. స్టేషన్‌లో పోలీసులసంఖ్య పద్నాలుక్కి పెంచేరు. రైఫిళ్ళు మరో అరడజనుఇచ్చేరు. పదిమంది ఆడాళ్ళని అరెస్టుచేసేరు. సోదాచెయ్యవచ్చిన అధికారిని ఆటంక పరచడం ఓకేసు. సబినస్పెక్టరును కట్టిపారేసేక ఎవళ్ళో ఆయన చేతిలో వున్న రివాల్వరును తీసుకుపోయేరు. ఎవ్వళ్ళూ ఎరగం అంటారు. తనకి అనుమానమే, శశిరేఖో. కోటమ్మో తీసేరని. కాని, వాళ్ళిద్దరూ కూడా "అమ్మతోడు, అయ్యతోడు"—అన్నారు. తాశీల్దారు రివాల్వరుకూడా తన వద్దకే వచ్చినట్లు అనుమానం తెలిపేరు.

ఈ దశలో అక్కడుండడం క్షేమంకాదని తాను రహస్యంగా వూరు దాటేస్తున్నాడు. ఈ కథలో శతాంశంకూడా బయటపెట్టడం ఇష్టం

లేదు. మొదట వుద్యోగానికి పోతున్నాననేనా చెప్పకపోతినే అనుకొన్నాడు. కాని, చేసేదేముంది ? నెమ్మదిగా సర్దుకోవాలి.

పోలీసులు దౌర్జన్యాలన్నిచోట్లా చేస్తారు. కాని, ప్రజలు నలుగురూ ఎదురు తిరుగుతారనే భయం వున్నచోట్ల ఒళ్ళు కొంచెం దగ్గిరపెట్టుకు మసలుతారు, లేదా నల్లేరు మీద బళ్ళు. బాగా వెనకబడివున్నచోట్ల వాళ్ళ గుర్రాలకి కళ్ళేలేవుండవు. అందుచేత ప్రజలు తమ అభిప్రాయాల్ని నిర్భయంగా చెప్పగల అభివృద్ధివస్తే పోలీసుజులుం తగ్గుతుంది. ఆసంగతి అర్థం అయింది. కాని, ఆ విషయాన్నికూడా గట్టిగా వాదించి చెప్పడానికి సిగ్గేసింది. ఇన్ని సంగతులు తెలిసి చదువుతున్నవాళ్ళు వూళ్ళల్లోవుండి ప్రజలకి సంగతులుచెప్పి నడిపిస్తూంటే బాగుంటుందంటాడేమో ముసిలాడు. తాను వూళ్ళోంచి పోతున్నవార్తవిని కోటమ్మ ఆమాటే అంది. ఆమెకేమీ సమాధానం చెప్పలేకపోయేడు.

ఇప్పుడీ ముస్లిం వృద్ధుడికిమాత్రం ఏం చెప్తాడు ? దానికి సమాధానం ఏంవుంది ? తనమట్టుకు తాను బాగుండేవాడు. తన భార్యమీద ఎవ్వడూ చెయ్యి వెయ్యకపోతేచాలు, తాను రైలెక్కడానికి కారణం ఇంకేముంది ?

వృద్ధుడు ఒక్కనిముషం సమాధానంకోసం ఎదురుచూసి, నిట్టూర్పు విడిచేడు. మళ్ళీ ప్రశ్నించేడు.

"భాయిసాబ్ ! బెజవాడ వెడతావో, మద్రాసు పోతావో నీయిష్టం. కాని......"

ముసిలివాని దృష్టిలో ప్రజలు తిరగబడ్డానికి కారణంవుంది. దేశముఖులూ, పటేల్, పట్వారీలూ వాళ్ళని ఏడిపించేరు. కనక తురకాలేదు, హిందువూ లేదు. తెల్దారుపల్లి జాగీర్దారుమీదాపడ్డారు. మద్దికుంట వెంకయ్యమీదా పడ్డారు. చస్తున్నారు. చంపుతున్నారు. దానికోపద్ధతి వుందంటాడు.

కాని కాంగ్రెసువాళ్ళుచేస్తున్న గలభాకి అర్థం ఏమిటని అతనిప్రశ్న. సంగారెడ్డి తన భూముల్లో గవర్నమెంటు కివ్వాలసిన లెవీ ఇచ్చేస్తున్నాడనీ, ఇతరుల్ని లెవీ ఇవ్వవద్దంటున్నాడనీ ముసిలివాని ఆరోపణ. మిగిలిన కాంగ్రెసు నాయకులుకూడా అంతే అయి వుంటారంటాడు.

రంగయ్యనుకూడా అతడు కాంగ్రెసువాడుగానే లెక్కేసేడు. కాంగ్రెసు కేవలం ముస్లింరాజును తోసెయ్యడంకోసమే ఈ వుద్యమం ప్రారంభించిందని విశ్వాసం. ఆయన ఏదో చేస్తున్నట్లు అల్లరిచేస్తే బెదిరిపోతాడని వూహ అంటాడు. లేకపోతే ఇప్పుడు బెజవాడ పోవడానికి కారణం ఏమిటని మళ్ళీ నిలదీసేడు.

శివరామిరెడ్డి తన భూమిని ఆక్రమించుకోబోయేడు. ముకుందరెడ్డి తన భార్యను ఆక్రమించుకోబోయేడు. వీళ్ళిద్దరూ హిందువులే. ముస్లిం మతస్థుడైన సిలారూ, అతని కూతురు ముంతాజూకూడ ఈ రెండు సందర్భాల్లోనూ తన కెంతో అంతో సాయపడ్డారు. కనక తమకా ద్వేషం లేదని చెప్పాలనుంది, రంగయ్యకి; కాని, ధైర్యం చాలలేదు.

ఒకటి తనవూహా, వ్యవహారమూ బట్టబయలయి పోతుందనే భయం ఒకటీ, అంతకన్న ముఖ్యమైనది మరొకటుంది. భూమిమీదికొచ్చిన వాళ్ళని తరిమింది సత్తెమ్మ. భార్యమీది కొచ్చినవాణ్ణి కొట్టింది కోటమ్మ. వాళ్ళిద్దరూకూడా వూరొదలమన్నారు. కదలమన్నారు. ఇప్పుడు పోలీసుల కసంతా వాళ్ళమీదే వుందని వాళ్ళూ ఎరుగుదురు. అయినా సరే. కాని, తాను భూస్వామి శివరామిరెడ్డి కొడుకుతో భూమితగాదా వచ్చేకనే స్నేహం కలిసింది. ఆడవాళ్లు నలుగురు ముకుందరెడ్డిని తన్నేకపదిమందిని అరెస్టుచేసేరు. కాని, తాను రెండురోజులూ స్వేచ్ఛగానే తిరిగేడు. ముకుందరెడ్డిని విడిపించడంలో తాను అధికారుల తరఫున రాయబారాలే నడిపేడు. అధికార్లు అబద్ధాలు చెప్పరని ఆడవాళ్ళకి నమ్మకం చెప్పేడు. లేక చేసేదేమిటో తనకేమీ తెలియలేదు. ముకుందరెడ్డిమీద

కేసులు పెట్టాలి. అది ఎంతవరకూ ప్రయోజనం? పైగా తన మామగారి అనుభవం చూసేక ఆ ఆశలేదు కూడా. లాభంలేని వ్యవహారాన్ని నష్టం రాకుండా సర్దుకొంటున్నానని ఆతని నమ్మకం. ఆ విశ్వాసంతోనే అధికార్ల నోటి మాటమీద నమ్మకం వుంచమని తన వాళ్ళకు సలహాయిచ్చేడు.

ఇప్పుడు కోటమ్మా వాళ్ళూ తన మాట కొంపముంచిందని నెపం పెడుతున్నారు. అటు ఆఫీసర్లూ తనమీద నెపం వేస్తున్నారు. సోదా కొచ్చినవాణ్ణి అల్లరిచేసేరంటారువాళ్ళు. అది తనింట్లో జరగడం ఓ అపరాధం. తాను ఇద్దరికీ మంచివాడు కాకపోయేడు. ఊరొదిలి పోతున్నాడు.

తన ప్రశ్నలకి సమాధానం రాకపోవడంచూసి స్టేషన్‌మాస్టరు తన గదిలోకి పోయేడు.

---

## ఇరవయ్యో ప్రకరణం

మునసిలి స్టేషన్ మాస్టరు వెళ్ళిపోయేక రంగయ్య ప్లాట్‌ఫారమ్ మీదనే పచారుచేస్తూ తన స్థితినిగురించి ఆలోచన ప్రారంభించేడు.

నిజంగా తాను ముస్లిము ద్వేషంతోనే ఈ పనిచేస్తున్నాడా? అంగీకరించలేకపోయేడు. తను అసహ్యించుకొనేవాళ్ళల్లో ముసల్మానులున్నారు. బహుశా వాళ్ళసంఖ్యే ఎక్కువేమో. కాని, ఆ అసహ్యానికి మతం కారణం కాదు. తనకు ఆర్యసమాజంవాళ్ళ వాదాలు పట్టుబడలేదు. సిలార్ ముస్లిం. ఆతడు బంధువుకన్న ఎక్కువగా ఉంటాడు. ముంతాజ్ తన అక్కగారితో పాటిది. వాళ్ళు తనఅక్కపెళ్ళిని సమర్థించినప్పుడు కోపంవచ్చినా వాళ్ళ మీద అసహ్యం కలగలేదు.

కాక,...తాను పిరికిదనంతో పారిపోతున్నాడా? ముసిలాడు నోటితో ఆ మాట అనకపోయినా ఆయన మాటల అర్థం అంతే. నిజంగా తాను పిరికితనంకొద్దీయేనా పారిపోతున్నది? అగ్నిహోత్ర మధ్యంలో, కారుచిచ్చు అలుముకువస్తూంటే మధ్యనిలబడి చచ్చిపోవడమేనా ధైర్యానికి లక్షణం?

హఠాత్తుగా ఆతని ఆలోచనా పరంపరను భంగపరుస్తూ పిలుపు వినబడింది.

చౌకీదారొకడువచ్చి కస్టమ్సు ఆఫీసరు పిలుపు అందిచ్చేడు. పిరికిదనం, భయం ఆరోపణలతో మానసిక యుద్ధం సాగిస్తున్న రంగయ్య ఒక్కక్షణం ప్రతిఘటించాలని ఆలోచించేడు. కాని, అది అనవసరం అనిపించింది. మీ సామాను సోదాచెయ్యాలంటూంటే చేసుకోనిచ్చి వెర్రిమొహం వేస్తూంటే నవ్వుదామనుకొన్నాడు; పెట్టేబేడా, మూటా ముల్లె కస్టమ్సు నాకాముందుకు పట్టించేడు.

భర్త వెనకాలే సూరమ్మా కదిలింది. రంగయ్య అనవసరంగా ఎందుకొస్తావన్నా ఆమె వినిపించుకోలేదు. ఆమె రావడం అభ్యంతరం అనిపించలేదు. వూరుకొన్నాడు.

కరోడ్గిరీ ఆఫీసరుపెట్టెతీయించేడు. బట్టలక్రింద సూరమ్మ నగలూ, ఓ వెండికంచమూ వున్నాయి.

ఆఫీసరు వెంటనే అభ్యంతరం పెట్టేడు. వెండిబంగారాలు స్టేట్ నుంచి బయటికి పోనియ్యగూడదని సర్కారు ఆజ్ఞ, పట్టుకుపోనివ్వనంటాడు.

రంగయ్య నచ్చచెప్పడానికి ప్రయత్నించేడు. భద్రతకోసంపెట్టెలో పెట్టాంగాని, వేరుకాదని వాదించేడు. వంటినున్న నగలను ఒక దేశం నుంచి పరోదేశం పట్టుకెళ్ళినప్పుడే కరోడ్గిరీ వుండదు, ఇక్కడేమిటంటాడు.

కాని, ఆఫీసరు వినిపించుకోడు. ఈ బంగారం, వెండీ నిజామురు వ్యతిరేకంగా పుపయోగపడుతుంది. కనక తీసుకుపోనివ్వనన్నాడు.

వేళమిగులుతూంది. బండికి గంటకొట్టేరు. రంగయ్య అందుకో లేమేమోఅని ఆదుర్దాపడుతున్నాడు. ఆతని ఆదుర్దాచూచి ఆఫీసర్ నోట్ బుక్కొకటి తీసేడు.

నగలకి తాను రశీదు ఇస్తాడు, అవి గవర్నమెంటు ఖజానాలో వుంటాయి, మళ్ళీవొచ్చినప్పుడు తీసుకోమని ఆతని సలహా.

వాని రశీదుకి చిత్తుకాగితం విలువకూడా లేదు. నగలకి నీళ్ళు వొదులుకోవడమా ?

లేకపోతే యింటికిపో. కరోడ్గిరీ అభ్యంతరం లేదంటాడు ఆఫీసరు. ఇంటి దగ్గరవుండలేకనే రైలుకి వచ్చేడు. ఏమొచ్చినా ఇంటికిపోడని అతని ధైర్యం.

తానుచెప్పి ప్రయోజనంలేక రంగయ్య స్టేషనుమాస్టరును తీసుకు వస్తానని లేచేడు. ఆతనితో సూరమ్మా కదిలింది. పెట్టెలూ, నగలూ నాకామందు రక్షణలేకుండా వదలడం రంగయ్యకి ఇష్టంలేదు. ఆమె నిక్కడుండ మన్నాడు.

తాను క్షణంలోవచ్చినాసరే, ఉన్నదంతా పోయినాసరే సూరమ్మ అక్కడుండనంటుంది. పట్టపగటిపూటకూడా ఆమెకు భయమే. తమ వూళ్ళోఘటన అనంతరం ఆమె పరాయి వాళ్ళమధ్య ఒక్కక్షణంకూడా వుండడానికి భయపడుతూంది. ఆతనిని వెళ్ళవద్దంటుంది. వెడితే తానూ వస్తూంది.

ఆమె అమాయికత్వానికి రంగయ్య జాలిపడ్డాడు. తా నొక్కడు. తానుండిమాత్రం ఈ జనం తలుచుకొంటే ఏం రక్షణ యివ్వగలడు ?

నచ్చచెప్పినా వినలేదు. తన నిస్సహాయత వీళ్ళముందు బయట పడిపోతూందేయని కోపమూవచ్చింది. విసుక్కొన్నాడు. సూరమ్మ కళ్ళ నీళ్ళు పెట్టింది.

రంగయ్య జాలిపడ్డాడు. తాను కోపపడి ఏం లాభం? ఆమె పుట్టి పెరిగిన పరిస్థితులల్లాంటివి. ఎవరో ఒకరి రక్షణ వుండాలి. లేకుంటే నిల బడగలమనే ధైర్యంలేదు. ఆ ఎవరో ఒకరు చిన్నపిల్లడైనా ఫర్వాలేదు. మగాడైతే సరి. తనకంటె చిన్నవాడేగానీ, మాటలు సరిగ్గారానివాడేగానీ మగపిల్లడు కూడావుంటే ఎంతో ధైర్యం అనుకొనే వాళ్ళమధ్య పెరిగింది; దానికే అలవాటుపడింది.

గుస్సా చెయ్యవద్దంటుంది పైగా. కోపంరాక ఏమవుతుంది? ఓమూల కరోడ్గిరీవాళ్ళు ఉన్నదంతా లాక్కోవాలనే ఎత్తులోవున్నారు. తమరా పరాయిచోట వున్నారు. నిస్సహాయులు. పిలిస్తే పలికేటందుకు దరిదాపుల వూరుకూడాలేదు. వున్నవాడొక్క స్టేషనుమాస్టరు. ఆ పెద్ద మనిషిని పిలుచుకొస్తానంటే అడుగు కదపవద్దంటుంది.

ఇదేం గుదిబండరా భగవంతుడాయని ఒక్కక్షణం అనిపించింది. ఇదెక్కడి పెళ్ళాం అనీ అనిపించింది. పట్టపగలు అలా భయపడితే ఏం చెయ్యడం? పనేం జరుగుతుంది? ఆమె బెదురు చూస్తే వాళ్ళు మరింత బెదరకొడతారే......

కాని, ఆమె ఆకారంచూసి తనకే విచారం కలిగింది. తనకి మాత్రం తనవూళ్ళో వుండడం భయమనిపించలేదా? తల్లి వూరొదల నంది, అక్క ఎక్కడికీ రానంది. ఇద్దరూ ఆడవాళ్ళే. వాళ్ళకి లేనిభయం తనకెందుకు? తన అక్క ఆడదే అయినా దళంలోచేరి అన్యాయాల్ని ఎదిరించడానికి తుపాకీ చేతపట్టింది. తాను పారిపోతున్నాడు. తన భయా నికీ సూరమ్మ భయానికీ తేడాఏమిటీ?'

రంగయ్య అప్రయత్నంగా ఆమె తలమీద చెయ్యిపెట్టి నిమిరేడు. ఆతని చేతిక్రింద సూరమ్మ రెండు చేతులతో మొగం మూసుకొని వెక్కి వెక్కి ఏడ్చింది. ఆ ఏడ్పులో భయంపాలుకన్న తన అసమర్థతకీ పరాధీనతకీ కలిగిన సిగ్గుపాలు అధికం.

రెండో గంటకూడా కొట్టి ప్రయాణీకు లెవ్వరూ కనబడక అటూ యిటూ చూస్తున్న పోర్టరు వారికోసం పరుగెత్తివచ్చేడు. క్రిందనున్న పెట్టే, పెట్టెలో నగలూ, ఏడుస్తున్న ఆడపడుచునూ చూచేక ఆతనికి అసలువిషయం కొంచెం అర్థమయింది.

"సాబ్ !"

రంగయ్య తిరిగి చూసేడు.

నాలుగో అయిదో వాడి మొహాన పడేసి వదుల్చుకోబోబూ అని పోర్టరు సలహాయిస్తూంటే తనకామాట అంతవరకూ తోచనందుకు సిగ్గుపడ్డాడు.

కాని, తీరాఇస్తే ఆ అయిదురూపాయల నోటుతో ఆఫీసరు తృప్తి పడినట్టులేదు. కనీసం వెండిపళ్ళెమయినా కొట్టెయ్యాలని ఆతడిఎత్తు.

బండికి సిగ్నలు ఇచ్చేరు. ఇందాకా టిక్కట్లకోసం తొందరపడ్డ దంపతులు టిక్కట్టుకోసం రాకపోవడంచూసి స్టేషన్‌మాస్టరు బయటకు వచ్చేడు.

గేటులోకిరాంగనే పరిస్థితి అర్థంఅయింది. కోపంవచ్చింది. విస విసలాడుతూ నాకామేపు బయలుదేరేడు. ఆయనను చూడగనే ఆఫీసరు అత్యాశవదులుకొన్నాడు. జేబులోపెట్టుకోబోతున్న అయిదురూపాయల నోటును రంగయ్య చేతిలోంచి చటుక్కున లాగేసుకొన్నాడు. సామాను పట్టుకుపోవచ్చునని హుకుం యిచ్చేడు.

తానంతవరకూ వారిని నిలిపివుంచిన కారణం చెప్పుకొంటున్నట్లు అన్నాడు.

"జవాహిరీ తరలించి రియాసత్‌కి నష్టంకలిగించకుండా చూడాలని సర్కార్ హుకుమ్."

ముసలివాడు 'హూ' అని వెనక్కి తిరిగేడు.

పోర్టరు సాయంతో మూటలు తీసుకొని అంతా స్టేషన్ లోకివచ్చేరు.

ముసలివాడు రంగయ్య ఎడ సానుభూతి కనబరుస్తూ పోర్టరుతో ఖాళీగావున్న పెట్టెలో చోటుచూడమని పురమాయించేడు. టిక్కెట్లు చేతికిచ్చేడు.

"మాఫ్ కరో! భాయీ!"

తఖ్తుమీదవున్నది ఉస్మానలీ అయినా, పండిత నెహ్రూ అయినా భయపడ్డంతకాలం మనుష్యుల్ని బాధలు వెంటాడుతాయి. ఇతరుల్ని అన్యాయం చెయ్యకు. అన్యాయం చేసేవాడిని చంపినా తప్పలేదు. చంపెయ్యి. పారిపోయి తప్పించుకోలేవు నాయనా!—అని స్టేషన్ మాస్టరు హితోపదేశంచేశాడు.

రంగయ్య ఏమీచెప్పలేక శిరస్సువంచి అభివాదంచేశాడు. సూరమ్మ ఆయనకు సలాములు చెప్తుండగా రైలుకదిలింది.

రైలు ప్లాట్‌ఫారంవదలి దూరాన కనుమరుగై పోయేవరకూ దానివంకనేచూస్తూ ముసిలాడు వెనుతిరిగేడు.

---

## ఇరవై ఒకటో ప్రకరణము.

జానకిరామయ్య బిడ్డకి జబ్బుగావుందని విన్నాక ఇంక వుండబట్టలేకపోయేడు. జంకుతూనే వూళ్ళో అడుగుపెట్టేడు.

సీతారాంపురం వూళ్ళోకి పోలీసుస్టేషనువచ్చేక, ఆతడు పగటి పూట వూళ్ళోకి రావడంలేదు. ఇప్పుడు ముకుందరెడ్డి అమీన్‌కు సాయంగా రజాకారు క్యాంపుకూడా వచ్చింది. ఇక రాత్రికూడ రావడం మానేసేడు. తానుచేసినపని పోలీసులకు వ్యతిరేకంగనక బాధిస్తారేమో ననికాదు ఆతని భయం. శివరామిరెడ్డిదొర భూమిని వదలకపోవడం తప్ప ఆతను చేసిందేమీలేదు. గ్రామదళంతో చేరనూలేదు. కాని, ఇవన్నీ పోలీసులకి కావాలా? కొట్టడానికో మనిషిదొరికితే చాలు. ఆ రోజున వాళ్ళ సరదాతీరిపోతుంది. అందుకే ఆతడు ఊళ్ళోకి రావడమే మాను కొన్నాడు.

కాని, ఈ మాటు తప్పిందికాదు. ఆతనికాబిడ్డమీద వెర్రిఅభి మానం. వాడుపుట్టినాకనే పన్నెండేళ్ళుగా తానుచేసుకొంటున్న భూమి తనకు దక్కింది. ఆ బిడ్డకాలు సిరిగలకాలని ఆతని విశ్వాసం. అంతకి పూర్వం ఓ ఆడపిల్లవుండేది. ఆమె పుట్టిన ఏడాది వర్షాలు ఆలస్యంగా వచ్చాయి, వర్షం ప్రారంభమైనాక మరిఆగలేదు, రోజులతరబడి విధీవిరా మంలేకుండా ఒకటేకుండపోత. దానాదీనా ఆ ఏడాది పంట ఒక్కగింజ కూడా రాలలేదు. ఆ దుస్థితికి కారణం కూతురు పుట్టిన వేళావిశేషం అన్నాడు. అదేకోపంతో ఆ పిల్లనెన్నడూ జేరతియ్యలేదు. నాలుగేళ్ళ పిల్ల జబ్బుచేసి చావుబ్రతుల మీదవుందన్నా ఆతడు చేను వదిలి రాలేదు. బిడ్డ చచ్చిపోతే విచారించనూలేదు.

కాని ఈ మారల్లా వూరుకోలేకపోయేడు. ప్రేమపాత్రుడైన కొడుక్కి జబ్బుగా వుందంటే ప్రాణం వుండబట్టిందికాదు. తమవూళ్ళో ఓ మందా? మాకా? రోగం రాకుండావుండాలేగాని, వస్తే, బ్రతికిబట్ట కట్టేదాకా నమ్మకంలేదు. ఆ విచారం, భయం పోలీసులంటేవున్న బెదు రునుకూడా తోచనివ్వలేదు.

చీకటి పడుతూండగా పొలిమేరలో అడుగుపెట్టేడు. ఆ అడుగు సరాసరి పోలీసుస్టేషనులోనే వేసినట్లయింది.

దొరకడంతోనే అమీన్ తాను కొట్టేడు. పోలీసులచేత కొట్టించేడు. ఒక వరస తిరిగివచ్చాకనే ఆతడు ప్రశ్నలు ప్రారంభించేడు.

ఎన్నిమార్లు కబురుపంపినా, స్వయంగావచ్చినా జానకిరామయ్య దర్శనం కాలేదంటాడు ముకుందరెడ్డి.

"వ్యవసాయప్పనులుకదా, దొరా! బావి వదలడం వీలా?"

"రాత్రి కూడా నట్రా."

రైతువాడికి రాత్రేమిటి, పగలేమిటి? పెళ్ళామూ, పిల్లలూ వూళ్ళో వుంటారు, ఏమౌతారని భయం? వాళ్ళకోసం వస్తూ పోతూంటే తోటపని చెడుతుంది, అందుచేత ఏ రైతూ అన్నప్పుడూ ఇంటికి వస్తూండడం సాధ్యమే కాదు.

"ఇప్పుడెల్లా వచ్చేవు?"

"పోరగాడికి బుఖార్ వచ్చింది దొరా?"

ముకుందిరెడ్డి హుంకారం చేసేడు. జానకిరామయ్య మాటల్లో దొరకడంలేదు. అప్పుడే స్టేషనుకి వచ్చిన మంగపతి అతని మాటను ధృవపరిచేడు.

అమీను ఆలోచించేడు. అతికినట్లు చెప్తున్నాడు. ఏమనడానికీ తోచలేదు. కాని వదలలేదు.

ఉన్నట్లుండి రెండుదెబ్బలు వేసేడు. అతడికున్న భూమిని గురించి ప్రశ్నించేడు.

అతడు చేస్తున్నది కౌలుభూమి అనగానే కామందు వివరాలడిగేడు.

ఆ భూమేమో శివరామిరెడ్డి పట్టాలోది. తానో పది పన్నెండేళ్ళ నుంచిచేస్తున్నాడు. అందులో దాపరికం ఏమీలేదు.

ఒక్క విషయం దాచడానికి ప్రయత్నించేడు. ఆతడా భూమిని వదలదలచుకోలేదని చెప్పలేదంతే, కాని. అమీన్ ఆ సంగతిని మంగపతి నుంచి లాగేడు.

ఆరేడు నెలల క్రితం దొర భూమిని వదలమన్నాడు. కాని, సత్తెమ్మ తోటను ఆక్రమించినప్పుడు వచ్చిన రగడతో రెడ్డే ఆ పూసు పొదులుకొన్నాడు.

మంగపతి ఆ సమాచారాన్ని ఒక నేరంలాగాక, జానకిరామయ్యకి సాయం చెయ్యాలనే చెప్పేడు.

ఆ సంజాయిషీతో ముకుందరెడ్డికి పనిలేదు. దొరల భూములు వదలని వాళ్ళలో జానకిరామయ్యొకడు. ఆ సంగతిని తెలియచెప్పి, మళ్ళీ అటువంటి దురాచారానికి ఒడిగట్టకుండా నచ్చచెప్పే ప్రయత్నంలో ఆతనికి తెలివితప్పి పోయింది.

పోలీసులు లాఠీకర్రలతో పొడిచినపోట్లకి ఆతని పక్కటెముకలు విరిగిపోయేయి. స్వంతకాళ్ళమీద నడచివచ్చిన అంతమనిషి చేతులమీద గాని నిలబడలేని స్థితిలోవున్నాడు.

మంగపతిద్వారా కబురుతెలిసి, జబ్బుగావున్న పిల్లవాడినింటవదలి రాములమ్మ పరుగెత్తివచ్చింది, భర్తకామె రాకతెలీదు. మరి తెలివిరానూ లేదు. గుండెల్లోనొప్పివచ్చి చచ్చిపోయేడని పోలీసులు అన్నారు. కొట్టాం చచ్చిపోయేడని చెప్పుకొన్నా ఇదేమనే వాళ్ళెవరున్నారు? కాని, ఆలా చెప్పుకోడానికి వాళ్ళే సిగ్గుపడ్డారేమో......

భర్తకోసం ఏడుస్తూ ఇంటికి వచ్చేసరికి జబ్బుగావున్న బిడ్డడు కూడా పోయేడు. పిల్లవాడితోనే ఇంటి అదృష్టం పోయిందని రాములమ్మ నేలబడిదొర్లి ఏడ్చింది.

# ఇరవైరెండో ప్రకరణము.

"చాలా జాగ్రత్త తీసుకోవాలిసుమా !"—అంటూ వెంకటయ్యా వప్పచెప్తున్న వ్యక్తినిచూసి, ఏదో జ్ఞాపకం తెచ్చుకొనేటందుకు ప్రయత్నించాడు భాగ్యరెడ్డి. కాని లాభం లేకపోయింది. మాట్లాడేవరకూ ఆ వ్యక్తి ముస్లిమో, హిందువోకూడా అర్థంకాలేదు. ఆ పిల్లి కళ్లు, దట్టమైన కనుబొమ్మలు ఎక్కడో చూసినట్లుండే అనిపిస్తున్నాయేగాని అంతకన్న తోడ్పడలేదు.

వెంకటయ్యా యందున్న విశ్వాసంకొద్దీ సంతృప్తిపడ్డాడేగాని ఆతడు తమకు కావలసిన వాడౌనోకాదో తెలియలేదు. మొదట మాటలు నాలుగూ తానే మాట్లాడేడు. తమ పరిస్థితినంతా వివరిస్తూంటే ఆయన శ్రద్ధగా విన్నాడు.

నెలరోజులనుంచి దళసభ్యు లందరికీ శిక్షణ ఇవ్వడానికి భాగ్యరెడ్డి పూనుకొన్నాడు. సభ్యులమాట అటుంచి దళనాయకుడైన తనకే తుపాకీ కొత్త. అక్కడా అక్కడా నాలుగు భర్మార్లు తెచ్చేరు. గోవిందు ఓ రైఫిల్ తెచ్చేడు. కాని, ఏం లాభం. వాటి నుపయోగించగల శక్తి లేదు.

దానిని నేర్పేటందుకు ప్రయత్నం ప్రారంభించేరు. ఒక కొత్త ఆటంకంవచ్చి కూర్చుంది. తుపాకీ చప్పుడు వినబడేసరికి తామున్నచోటు బయటపడిపోతూంది. పోలీసులూ, రజాకార్లూ నాలుగు వైపులనుంచీ కమ్ముకొని వస్తున్నారు. రోజులో రెండూ, మూడూ మార్లుకూడా స్థలం మార్చవలసిన ఘటనలున్నాయి.

పోలీసులకు వైర్లెస్ యంత్రాలిచ్చేరన్నారు. వాటి సహాయంతో లారీలతో గుట్టుచప్పుడు కాకుండా కమ్ముకువస్తున్నారు. లారీలరాకపోకల

కోసం ప్రతివూరికీ రోడ్లు వేయిస్తున్నారు. ఆ పనికి ఆటంకం రాకుండా పోలీసు బందోబస్తు ఇస్తున్నారు. ఆ పనులకిప్పుడు సీతారాంపురమే ఒక కేంద్రం అయింది. సీతారాంపురం పోలీసుస్టేషన్ ఎముకొమ్ములమీద కుంపటిలా తయారయింది.

జానకిరామయ్య మరణంతో మరో చిక్కు వచ్చింది. అతడు చచ్చిపోతూ వూళ్ళోవాళ్ళదీ, దళంలోవాళ్ళదీ ధైర్యంకూడా పట్టుకుపోయేడు. దళసభ్యులలో విశ్వాసం తగ్గిపోతూంది. అప్పుడే లంబాడీ పూర్ణయ్యా, మంగలి వెంకన్నా చెప్పకుండా, పెట్టకుండా బెజవాడ పారిపోయారు. రంగయ్య వెళ్ళిపోతే ఎవ్వరికీ ఏమీ అనిపించలేదు. కాని,....

జానకిరామయ్యను చంపేసి, గ్రామంలో ఎంత నిరుత్సాహం కలిగించేడో ముకుందరెడ్డికి తెలియలేదుగాని, తెలిస్తే ఏమన్నావుందా?— అని పదిమాట్లనుకొన్నాడు. వందమాట్లు వేగిరపడ్డాడు. కాని, తన ఆనుర్గాతోపాటు ఉత్సాహాన్ని సహచరులకు అందచెయ్యలేకపోయేడు. పోలీసుదాడుల బెడద తప్పించుకొనేటందుకు అతడు సూచించిన పద్ధతికి నలుగురూ నవ్వేసేరు.

మందు దట్టించకుండా తుపాకీతో లక్ష్యంచూడడం; లక్ష్యం తప్పకుండా గుర్రం నొక్కగలగడం—ఇది నేర్చుకోమన్నాడు. మందు లేదు గనక చప్పుడులేదు. గురి సరిగా వున్నదీ లేనిదీ, గుర్రం నొక్కినప్పుడు కదిలిందీ, లేనిదీ లక్ష్యంగా పాతిన చెక్క వెనకనుంచి గమనిస్తూంటాడు.

మందూ గుండూ లేని ఉత్తుత్తి గురిమాట విని నలుగురూ నవ్వేరు. వాళ్ళకి తానేం నేర్పుతాడు?

కాని, వెంకటయ్య పంపిన శిక్షకుడు అయిదు నిముషాలలో అంతా చక్కబరిచేడు.

భాగ్యరెడ్డి తన వైఫల్యాన్నిగురించి వాపోతూంటే, ఆయన విఫలం అయిందన్న విధానానికి మహోత్సాహం ప్రకటించేడు.

"స్పెయిన్‌లో ఇంటర్నేషనల్ బ్రిగేడ్ ఇదే తరీకాలో తరిఫీదు నిచ్చింది."

ఆయన స్పెయిన్‌ను గురించీ, ఆ బ్రిగేడ్‌ను గురించీ చెప్పినవి వాళ్ళకేం తెలియలేదు. కాని భాగ్యరెడ్డి పద్ధతి చాలా మంచిదనే దొక్కటే అర్థం అయింది.

అటుతర్వాత దళాన్ని ఉత్సాహపరచడం కష్టంకాలేదు. పైగా శిక్షకుడు శీతారాంపురంలోని పోలీసు నాకాను, రజాకారు క్యాంపునూ ఎత్తించెయ్యాలనే పథకం వారిముందు పెట్టాక మరి ఉత్సాహం ఉద్వేలమే అయింది.

చుట్టుప్రక్కల గ్రామాల దళాలనుంచికూడా సహాయం వస్తూంది. కాని, ప్రధానభారమంతా శీతారాంపురం దళానిదే నంటూంటే వారారాత్రే దాడి చేద్దామని లేచేరు.

అతి కష్టంమీద భాగ్యరెడ్డి వారిని ఆపేడు. నాకాను ఎత్తించెయ్యడం అంటే ఎన్ని ఏర్పాట్లు చేయాలి! పైగా వాళ్ళదగ్గర అయిదు రైఫిళ్ళున్నాయి. తమవద్ద అన్నీ భర్మార్లే. కాల్చలేకపోయినా గోవిందు తన రైఫిలు ఎవ్వరికీ వదలడంలేదు. ఈ బలగం నాకామీదికి పోయి ఏం చేయగలరు ?

"గురి తప్పకుండా గుర్రం నొక్కడంలో ఎక్కువనేర్పు సంపాదించిన వాళ్ళకి బందూకులిద్దాం."

శిక్షకుడు కలిగించిన ఈ ప్రలోభనంతో తరిఫీదు పొందేటందుకు స్త్రీలు సహా తయారయ్యేరు. నాకామీద దాడికి సన్నాహాలు ఆరంభమైనాయి.

# ఇరవై మూడో ప్రకరణము.

తన మొగుడు స్టేషన్‌లోవుంది అడ్డంవస్తే చంపడమా, మానడమా అనే సమస్యను దళం చర్చిస్తూంటే కోటమ్మకు ఏమనాలో తోచలేదు. చంప కూడదంటే నీ మగడు కనక అంటున్నావంటారేమో. దళంలోకి వచ్చిన రోజునే చెప్పేరు. 'మనకింక బంధుత్వాలూ, స్నేహాలూ లేవు. ప్రజలని బాధించేవాళ్ళ పనిపట్టడం, వాళ్ళక్షేమం కోసం పనిచెయ్యడం మన పని' అన్నారు. ఆ రోజున ఆ మాటలకర్థం ఏమిటో ఆమెకు తెలియలేదు. కాని, ఈ వేళ......

నిజంచేత మంగపతి కాల్లోముల్లులాగే వున్నాడు. వూళ్లో మంచి నదిరయిన చోటవుంది. ఇలా ఎవడొచ్చినా ఎవడుపోయినా సులభంగా తెలుస్తుంది. తెలిసీ తెలియడంతో స్టేషన్‌కి కబురెప్పు డందించిందీకూడా రెండోవాడికి తెలియదు. పోలీసులు వచ్చినప్పుడే అతనికంట తాము పడ్డట్లు తెలియడం......

ఆతడికోపనీ పాటాఅంటూలేదు. కోటమ్మే ఆ పొలంకాస్తానున్నించీ ఇన్ని గింజలు ఇంటపోస్తే తిని తిరుగుతుండేవాడు.

వూళ్ళో గొడవలు ప్రారంభమైనదీ మొదలు తిట్టుబోతుతనం బలిసింది. దానికితోడు ఇప్పుడు ఉడుకుబోత్తనం ఒకటి బలిసింది. పెళ్ళాం ఇప్పుడు వెనకటల్లే ఇంట్లోపడివుండి వేళకింత వుడకబోయడం లేదని ఓకోపం. పిల్లల్ని పుట్టింట దిగబెట్టి ఆమె దళంలోచేరింది. అప్పటినుంచీ ఆతడు కొత్త నినాదం పట్టుకొన్నాడు. తన పెళ్ళాన్ని సంఘం వాళ్ళెత్తుకు పోయేరనేది స్టేషన్‌లో నమోదు చేయించేడు కూడా.

మంగపతి తిక్కవ్యవహారం కోటమ్మకి కొత్తేంకాదు. రెండేళ్ళ నుంచీ నా పెళ్ళాం పక్కలోకి రానివ్వడంలేదని ఊరంతా యాగీచేస్తూనే వున్నాడు.

ఇంటి చాకిరీ, పొలం చాకిరీకితోడు ఏటా పిల్లనెత్తడం తనచేత కాదని కోటమ్మ మూడేళ్ళక్రితం ఖచ్చితంగా మొండికేసింది.

మంగపతి తనఅసమ్మతిని తెలపడానికి ధుమధుమలాడేడు. చెంబూ, చేదా తన్నేసేడు. తనకో మాచకమ్మ పెళ్ళాన్ని కట్టిపెట్టినందుకు తండ్రినీ, తల్లినీ తిట్టేడు. తర్వాత ఒకటి రెండుమార్లు చెయ్యికూడ చేసుకొనేటందుకు ప్రయత్నించేడు.

కాని, కోటమ్మ దేనినీ లక్ష్యపెట్టలేదు. తిడితే మళ్ళీతిట్టింది. కొడితే చీపురుకట్ట తిరగేసింది.

ముండలతో పోయొచ్చి నానారోగాలూ తగులుస్తాననే బెదరింపు కూడా పనిచెయ్యలేదు. రోగాలుబాధ పడగలిగే చోపికుంటే వూళ్ళోవున్న ప్రశస్తమైన స్థావరం కోటమ్మే చెప్పాక మంగపతి ఆ పెంకెతనం కట్టిపెట్టేసేడు.

అంతవరకూ మొదట వాంఛగా, తరవాత పెంకెతనంగా, ఓ ఆటగా నడిపించిన సంసారసమస్య ఇంక ఓ ప్రతిష్ఠగా తయారయింది. భార్య అవసరంకన్న ఉడుకుబోతుతనం ప్రధానం అయింది. నిజం ఆలోచిస్తే కోటమ్మ పడుచువనపు ప్రథమదినాలలో ఏలావుందోగాని ప్రస్తుతం ఆమె రూపు మగాణ్ణి ఆకర్షించేటట్లులేదు. రాత్రీ పగలూ తెమిలికంటూ లేనిపని, ఆమెలోని కోమలత్వాన్ని హరించింది. ఏటాపిల్లలు పుట్టడం చావడం ఆమెలో మిగిలిన ఆకర్షణనంతనీ హరించింది. కట్టునుపట్టి చెప్పవలసించేగాని, ఆడదిఅనుకొనేటందుకవసరమయిన వంపులూ, సొంపులూ కనబడవు. కాని, మంగపతి ఆమెన్ను వదలదలచుకోలేదు. పెళ్ళాం పెళ్ళాం భాధ్యతలను నిర్వహించకపోతే ఎల్లాగ ?

ఆ పంతంతో ఆమెను అల్లరిపెట్టి, యాగీచేసి లొంగతియ్యాలని వూనుకొన్నాడు. ముందు పెద్దవాళ్ళతో, తరవాత అడిగినవాళ్ళతో, ఆఖరికి అడిగినవాళ్ళతోనూ, అడగనివాళ్ళతోనూ కూడా తనభార్య తనని దగ్గరికి చేరనివ్వడం లేదని చెప్పడం మొదలు పెట్టేడు.

కోటమ్మ మొదట సిగ్గుపడింది. తరవాత మొండికెత్తింది. పూళ్ళో వాళ్ళు పిల్లుల్లా ఇదేమిటే అని మందలించినప్పుడు నెమ్మదిగానే సమాధానం ఇచ్చింది. కష్టసుఖాలుచెప్పింది. ఆతని తరఫున మాట్లాడేరా "వోపికుంటే మీరే పడుకోండ"ని సలహాయిచ్చింది. ఆ మాట అంటుందని తెలిసేక మరెవ్వరూ ఆ విషయంలో కలగచేసుకోలేదు.

అదికూడా విఫలం అయ్యేక మంగపతి పోలీసుస్టేషన్ శరణు చొచ్చేడు. వాళ్ళు మాత్రం ఏంచెప్తారు? ముకుందరెడ్డి ఆ ఆరోపణ నిరుపయోగం అన్నాడు.

మరొకడితో సంబంధం పెట్టుకొంటే దానినీ వాడినీ చావకొట్టి తిమ్మెరి వొదులుస్తాం. నీ పెళ్ళాన్ని నీ కిప్పిస్తాంగాని, నీ పక్కలోకె రానంటే నేనేం చెయ్యగలనన్నాడు. ఓపికుంటే మంచానికి కట్టెయ్యమని సలహాయిచ్చేడు.

అది ఆతని సాధ్యంకాదు; అయితే నేను కట్టేసి గుడ్డూడదీసి నీ కప్ప చెప్పాలాయని ముకుందరెడ్డి ఘుంయ్‌మంటూ రెండుతన్నేసరికి మంగపతికి ఆ సూచనల రహస్యం అర్థం అయింది.

వెంటనే తన భార్యని సంఘంవాళ్లు ఎత్తుకుపోయేరని ఫిర్యాదు చేసేడు. సంఘంవాళ్ళంటే......

మళ్ళీ ఓ పెద్దసమస్య. కోటమ్మకి ఎవరితో ఎవరితో సంబంధం వుందని చెప్పడం? ఆడపిల్ల అదిగో అంటే తింటూన్నకంచం పక్కకు తోసి వీధిలోకొచ్చి, కనుమరుగయ్యేవరకూ నోరుతెరుచుకుచూసే వాళ్ళు కూడా కోటమ్మవేపు చూడరని అప్పుడుగాని మంగపతికి అర్థంకాలేదు. అయినా తన ప్రయత్నం వొదలలేదు. దళంలో ఏ ఒక్కడిపేరూ ఇవ్వ లేదు గనక దళంలో వాళ్ళందరి పేర్లూ ఇచ్చేడు.

"కమ్యూనిస్టులు మీ పెళ్ళాల్నందరినీ వాడవదినెల్ని చేస్తార్రాఅంటే విన్నార్రా! లంజకొడకల్లారా: ఇప్పుడేదవండి." అని ముకుందరెడ్డి

ఆ అర్జీ తీసుకొని రెండు తన్నేడు. తనభార్య వాడవదిన అయిపోయిం దేమోననే విచారంతో కాకపోయినా, అమీన్ విసరిన లాఠీ వీగ్రలమీద తగిలి మంగపతి నిజంగానే ఏడ్చేడు.

మగడి ఈ చర్యలన్నీ చూసి కోటమ్మ వెగటుపడింది. సద్భావం ఏ మాత్రమూ మిగలలేదు. ప్రేమ అనేది అసలు పుట్టలేదు. పుట్టేటందు కవకాశాలూ ఎప్పుడూ ఏర్పడలేదు. పెళ్ళిచేసుకున్నాడు గనక అతనితో వుండడం అలవాటయింది. అందరూ కంటున్నారు కనక తానూ ఇష్టం వున్నా లేకపోయినా కొందరు పిల్లల్నికంది; అంతే. అతనిమీద ప్రత్యేక మైన అభిమానం ఏమీలేదు.

కాని......

ఆతనిని చంపెయ్యడం అవసరమనే ఆలోచనతో ఏకీభవించలేక పోతూంది. జానకిరామయ్య గతిచూచేక దళసభ్యులు దొరికితే ప్రాణాలు దక్కడం అసంభవం అని అందరికీ తెలిసిపోయింది. తమ ప్రాణాల కెసరుపెడుతున్నవాణ్ణి వెనకేసుకొస్తూందని తననంటారేమోనని భయం పట్టుకొంది. సంక్రాంతిపండుక్కి ఏ కోడిని కోయాలని ఆలోచించినట్లు ఒక మనిషినిగురించి ఆలోచించడం తగునా అనిపించింది. కాని, ఆమాట అనేధైర్యం ?

భాగ్యరెడ్డే ఆ ప్రతిపాదనను ఖండితంగా వ్యతిరేకించేక ఆమెకూ ధైర్యం కలిగింది, ఆతని వాదాన్ని సమర్థిస్తూ తానూ నిలబడింది.

చేతికీ కాలికీ అడ్డంవచ్చిన వాళ్ళనందర్నీ చంపేసెయ్యడమేనా ? పనికిరాదన్నాడు భాగ్యరెడ్డి. మనని వ్యతిరేకించేవాళ్ళల్లో తెలిసీ, తెలియకా చేసేవారుంటారు. రెండువిధాలవారిలోనూ అనేక కారణాలు మూలంగా వ్యతిరేకించే వాళ్ళుంటారు. వాళ్ళకి నచ్చచెప్పి అనుకూలపరచుకోమని పార్టీచెప్పింది. నచ్చచెప్పినా విననివాళ్ళల్లోకూడా అసలు కీలకం పట్టినడి పించే వాళ్ళువుంటారు. వెనక్కాల తందానా అనే జనమూ వుంటారు.

అసలు కీలకం గాళ్ళని తీసేస్తే అంతా చక్కబడుతుందని సత్తిరెడ్డి చెప్పేడా లేదా ?

కోటమ్మ అంతేనంది. మంగపతి తనమీద కోపంకొద్దీ ఇల్లా అడ్డం తిరుగేడుగాని వానిదేముంది ?

దళసభ్యులందరూ మంగపతి దుశ్చర్యల్ని ఏకరువుపెట్టేరు.

భాగ్యరెడ్డి ఓ రోజు రాత్రి వూళ్ళోకి వస్తూంటే అరుగుమీద కూర్చుని ఎవరువారని వెంటబడ్డాడు. మరో రోజున పొరుగూరినుంచి ఎవరో వూళ్ళోకివస్తే ఆతనిని దబాయించి పోలీసుస్టేషన్‌కి తీసుకెళ్ళాడు. వాళ్ళాయన్ని చంపుతామని బెదరించి నూరు రూపాయలు తీసుకున్నారు. మంగపతి వూళ్ళో వుండడం ప్రమాదం.

చాకలిమంగమ్మ తన అనుభవం చెప్పింది. నెలక్రితం తాను బెజవాడనుంచి వస్తూంది. బట్టల మూటలో ప్రజాశక్తి పత్రికలున్నాయి. బస్సుదిగేసరికి పోలీసువాడూ, మంగపతీ కనిపించేరు. తనను చూస్తుండగనే మంగపతి పోలీసువాడికేదో చెప్పేడు. వాళ్ళిద్దరూ ఏంతెస్తున్నావు, ఎక్కడినుంచి వొస్తున్నావని పట్టుకొన్నారు. అదృష్టవశాత్తూ తానింకా మూటదించుకోలేదు. కండక్టరుకూడా సంఘంవాడే అయివుంటాడు. మూటమాట ఎత్తకుండా బస్సుతోలుకుపోయేడు. పర్నాడు ఎవరిద్వారానో అవన్నీ వొచ్చినాయి గనక బాధలేకపోయింది.

కాని, ఇవన్నీ మనిషిని చంపెయ్యవలసినంత తీవ్రమైనవికావు.

అయినా...

మంగపతి స్టేషనులోనేవుండి, ఘర్షణలోకి దిగితే......

తుపాకీ గుండుకి చంపేవాడినేరం పెద్దచిన్నలు అర్థంకావు. స్టేషన్‌లో హెచ్చుమంది లేకపోవడం అందరికీ మంచిది. మంగపతిని అటు పోకుండా నిరోధించగలిగితేమేలు. కాని...

కోటమ్మ ఆ బాధ్యతను తన నెత్తిమీద వేసుకొంది.

# ఇరవై నాలుగో ప్రకరణము.

మంగణ్ణి లాలించి, బుజ్జగించి, నెమ్మదిగాచెప్పి పోలీసులకి దూరంగా వుండేటట్లు చేయాలని కోటమ్మ పెద్ద ఆలోచనలతో వచ్చింది. తన్ను చూడగానే అతడేమంటాడో, తానేం సమాధానం ఇవ్వాలో దానిమీద మాటలు ఎల్లాపెరిగి సర్దుబాటు చేసుకోవాలో ఒకటికి పదిమాట్లు వొద్దికలు వేసుకొంది. బయలుదేరేటప్పుడు భాగ్యరెడ్డి హెచ్చరిక చేసేడు.

మంగపతి స్వభావం అందరూ ఎరుగుదురు. మనిషి కనబడగానే 'అమ్మా ఆలీ' అని లంకించుకొంటాడు. అదయినా చిన్న చిన్నగాకూడా కాదు. జంబోరాగొంతుతో, ఊడూడిపోతున్న పంచె ఎగదోపుతూ పర వళ్ళు తొక్కుతాడు. ఊరందరూ వింటారని సిగ్గుపడడు. పైగా వినాలనే గొంతు హెచ్చిస్తాడు. కనక చాల జాగ్రత్తగా గొడవ చేసుకోకుండా వెళ్ళిరమ్మన్నాడు.

కూడా సత్తెమ్మ బయలుదేరింది. ఆమె భయంవేరు. కోటమ్మ నోరువిప్పితే మళ్ళీ మూసుకోడం ఎరగదు. కొంప మునిగిపోతున్నాసరే, మెదపడ్డమాటకి వడ్డీతోసహా వప్పచెప్పేస్తేతప్ప కాలు కదపదు. మగనితో జగడంవేసుక్కూర్చున్నదా గొడవవుతుంది. ఆ విధంగా ఆమె వూళ్ళోకి వచ్చిందనేవార్త పోలీసులకి తెలియవచ్చు. ఆమెను దొరికించుకొని బ్రతికివుండగా చర్మం వొలుస్తానని ముకుందరెడ్డి ప్రతిజ్ఞ. ఆరోజున క్రిందపడ్డ ముకుందరెడ్డిని కట్టెయ్యడంలో కోటమ్మది ప్రధానపాత్ర. చేతికివేసిన తాడు ముడి కోసెయ్యడానిక్కూడా వీలులేకుండా వేసింది. పైగా ఆమె నాయకత్వాన ఆడవాళ్లు అతని మొగానికి పేడ పులిమేరు. వీధులవెంట ఈడ్చేరు. ఆ అవమానాన్ని అతడు మరిచిపోలేడు. దొరికితే చంపేస్తాడు. కనక వ్యవహారం ముదరకుండా సర్దుతూండడానికీ, బెడిసి

నస్తే తోడ్పడ్డానికి సత్తెమ్మ వెంటబడింది. కాని, తీరా వెళ్ళేసరికి ఆ భయం అకారణ మనిపించింది. వాళ్ళనుకొన్నదేదీ జరగలేదు. పైగా వుప్పెన మరో మూలనుంచి వచ్చిపడింది......

మంగపతి మూకుట్లో అన్నంపెట్టుకొని తల వొంచుకొని తింటున్న సమయంలో కోటమ్మ ఇంట్లో అడుగుపెట్టి గడపమీద కూర్చుని కుశల ప్రశ్న వేసింది. తినడం ధోరణిలోవున్న మంగపతి ఆ కంఠస్వరం ఎవరిదో అర్థంగాక తలెత్తిచూసేడు. ఆతడు భార్య ఇంటికివస్తుందని కలలో కూడా అనుకోవడంలేదు. ఎదురుగా భార్యనుచూసి ఆతనికి నోట మాట రాలేదు. ఎత్తుకొంటున్న ముద్ద మధ్యలోనే నిలిచిపోయింది. ఆశ్చర్యం భయం ప్రకటిస్తూ ఆమెకు ప్రమాదం కనిపెట్టుకు వుందన్నాడు.

"నీ తాడుతెగ! ఇల్లా తగులడ్డావేమే! కనబడితే కాల్చేస్తాడే ఆ లంజ కొడుకు."

కోటమ్మ నిశ్శబ్దంగానే నవ్వింది. ఈ పూట తాను రాకపోతే మగడి ఆశీర్వాదం ఫలించేదేమరి. గోడ ప్రక్కచాటుగా నిలబడ్డ సత్తెమ్మ ఆ మాటలువిని ఒక్క ఊర్పు తీసుకొంది. అన్ని తిట్టి జగడమాడుతున్నా పోలీసులకి చిక్కకూడదనే మంగపతి కోరుతున్నాడన్నమాట. ఇంక పేచీ లేనేలేదు.

భార్యాభర్తలను తమ పేచీలు సర్దుకొనేటందుకు వదిలి ఇరుగు పొరుగు ఇళ్ళల్లోకి వెళ్ళింది.

---

## ఇరవైఐదో ప్రకరణము.

నెలరోజులకు పైగా ఎన్నో ఏర్పాట్లు చూసుకొని, ప్రారంభించినపని రెండు నిముషాలలో పూర్తిఅయిపోవడంతో భాగ్యరెడ్డికే నమ్మకం చిక్కలేదు.

రాత్రి పదిగంటలయ్యే సరికి దళసభ్యులంతా నిర్ణీతస్థానాలకు చేరు కున్నారు. సెంట్రీ పోలీసు పదిగంటలు కొడుతున్నాడు. గంటలు కొట్టే టప్పుడుకూడా ఆతడు రైఫిల్ క్రిందపెట్టలేదని దూరాన చెట్టుచాటున నిల బడ్డ భాగ్యరెడ్డి గమనించేడు.

ముందే నిర్ణయించుకొన్న ప్రకారం పదోగంట దెబ్బపడుతూండ గానే భాగ్యరెడ్డి చేతిలో రైఫిల్ పేలింది. మరుక్షణంలో పోలీసువాని కళేబరం అరుగుమీదినుంచి ధబ్బున నేలబడింది. ఆ వ్యవధానంలో భాగ్య రెడ్డి చెట్టుచాటు వదలి రెండు వురుకులలో ఆవరణ ద్వారంచేరి మాటు తీసుకొన్నాడు.

నిద్రపోవడానికై అరుగుమీద పక్కలు పరిచిన పోలీసులు హఠా త్తుగా వచ్చిన ఈ ఉప్పెనకు ఉలికిపడ్డారు. దళం ఏదన్నా పోలీసు నాకా మీద దాడి చేయగలదనే ఆలోచనే వాళ్ళకిలేదు. కనకనే తుపాకీ చప్పు డవడం, తమ సహచరుడొకడు నేలబడడం వాళ్ళకి అర్థంకాలేదు.

"క్యాహువారే !"

పదిమందీ బిలబిలలాడుతూ లేచేరు. ఒక్క ఉరుకులో తనాబీని వ్రేలాడుతున్న లాంతరు తీసి అరుగుదిగేరు.

భాగ్యరెడ్డి ఆ అవకాశాన్ని ఉపయోగించుకొని తుపాకీకాల్చేడు. మరో శరీరం ధప్పుమంది. కాని, వానితోపాటు చేతిలోని లాంతరుకూడా నేలబడింది. రెండుమార్లు 'ఝుప్, ఝుప్' మని మలిగి పోయింది.

కటికచీకట్లోకూడ పోలీసులు ఆవరణ గోడమీదుగా వురికి పారి పోవడం చూసేడు. వారివేపుగా మరోరెండు మార్లు కాల్చేడు. వాటి ఫలితం ఏమయిందో తెలియలేదు. కాని, ఇంకెవ్వడూ ఆ రాత్రికి నాకా చాయలక్కూడా రాడని నిర్ధారణ చేసుకొన్నాడు. అంత సులభంగా పని జరిగిపోయినందుకు ఆతని పెదవులమీద హాసం చిందింది.

చప్పుడు చేయకుండా ఒక్క గంతువేసి అరుగుక్రిందికి చేరేడు. నాకాగది గుమ్మంవేపు తుపాకీతిప్పేడు. కాని. కటికచీకట్లో అక్కడేమీ కనబడ్డంలేదు. ఆలకించేడు. ముందు జాగ్రత్తకోసం గదిలోపలి భాగానికి ఒకమారు కాల్చేడు. మరోమారు ఆలకించేడు. కాని అక్కడేమీ అలికిడీ వినరాలేదు.

పదిగజాల దూరంలో గోడమాటునుంచి సన్నగా వినబడింది.

"నేను."

వెంకటయ్యగొంతు గుర్తుపట్టేడు. దాని అర్థంకూడా తెలుసు. దళం ఆవరణలో ప్రవేశించిందన్నమాట.

ఆమాట తోచేక భాగ్యరెడ్డి జాగ్రత్త మరిచేడు. చటుక్కున అరు గెక్కేడు. గది గుమ్మంలో నిలబడి లోనికి బ్యాటరీలైటు వేసేడు.

వెనకనుంచి వెంకటయ్య కేక వినబడింది.

"గోడపక్కకి..."

ఆమాట చెవిని బడుతున్నప్పుడే గదిలోంచి రైఫిల్ కాల్పుకూడా వినబడింది. వెర్రికేక పెడుతూ రెడ్డి నేలబడ్డాడు.

అరుగుక్రింద నిలబడ్డ వెంకటయ్య చటుక్కున కూర్చున్నాడు. మరుక్షణంలో అరుగుమీదనుంచి బరువుగా మీద అడుగుపడింది. ఆ బరువుకి వెంకటయ్య క్రుంగిపోయేడు. కాని, పైనవురికిన మనిషి తూలిపోయి ఆ విసురుకు బోర్లపడ్డాడు.

చిమ్మ చీకట్లోకూడ వెంకటయ్య ముకుందరెడ్డిని గుర్తుపట్టేడు. ఖాకీ యూనిఫారం తమవాళ్ళ కెవళ్ళకూలేదు.

క్షణంలో వెంకటయ్య ఆతనిమీద పడ్డాడు. సర్దుకొని లేచేలోపున పక్కల్లో రెండు గుద్దులు గుద్దేడు.

ముకుందరెడ్డికి ఊపిరి పట్టేసినట్లయింది. వీపున కూర్చున్న మనిషి తల ఎత్తకుండా నేలబెట్టి కొడుతూంటే గిజాయించుకోబోయేడు.

పట్టుకార్లవంటి చేతులు గొంతుముడి నదిమేస్తూంటే నాలిక వెళ్ళబెట్టేడు.

ఊపిరితిత్తుల కందకుండా పోతున్న గాలిని పట్టుకొనేటందుకు ప్రయత్నిస్తున్నట్లు చేతులు గాలిలో కదిలేయి. క్రమంగా జారిపోయేయి. తల వాలిపోయింది. చిట్టచివరిసారిగా మెడ నులిమేసి, తల నేలబెట్టికొట్టి వెంకటయ్య ఆతని వీపునుంచిలేచి నిలబడ్డాడు. కాళ్ళవద్ద బోర్లగిలా పడి వున్న మనిషివంక చూసేడు. చీకటి ఆ రూపంలోని వికారాన్ని దాచి పెడుతూంది.

వెంకటయ్య ఒక్క ఊర్పు తీసుకొన్నాడు. అప్పుడుగాని దళ సభ్యులెవ్వరూ తనకు సహాయం రాలేదనేమాట తోచలేను. భయంవేసింది; గట్టిగా పిలవనుకూడా లేకపోయేడు. గొణుక్కుంటున్నట్లే వినబడింది.

"రెడ్డీ."

సమాధానంలేదు. అరుగు చివరవరకూ దొర్లిన బేటరీలైటు చేతికి తగిలింది. వెంటనే చేతిలోకి తీసుకున్నాడు.

తెల్లని వెలుతురులో భాగ్యరెడ్డి కళేబరం. అనుమానం కలిగింది. రెడ్డి చచ్చిపోయేడేమోఅనే ఆలోచనకు కంఠం గద్గదికం అయింది.

"రెడ్డీ,"

బిలబిల లాడుతూ నలుమూలలనుంచీ సహచరులు పరుగెత్తి వచ్చేరు.

"ఏమయింది ?"

వెంకటయ్య వెంటనే సర్దుకున్నాడు. ఆతని ఆజ్ఞతో స్టేషనులోని ఆయుధాలు తీసుకొన్నారు,

అందరూ బయటికి వచ్చేక వెంకటయ్య వొంగి భాగ్యరెడ్డి చేతిలోని రైఫిల్ నెమ్మదిగా తప్పించి తీసుకొన్నాడు. ఆతని కంటినుంచి రెండుబొట్లురాలి గచ్చు నేలమీద చిందేయి.

సంపూర్ణం.



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA115B162 |
| పుస్తకం పేరు | మృత్యువు వీధల్లో |
| తారీఖు | 26/10/24 |
| ముందు అట్ట | no |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 317 |
| పెద్ద సైజు పేజీలు | no |
| ఖాళీ పేజీలు | 180 |
| లేని పేజీలు | no |
| తయారు చేసినది | kasimbi |
| పేజీలు విడదీసినది | kasimbi |
| స్కాన్ చేసినది | thasin |
| పరీక్ష చేసినది | pragathi |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | GOOD |